అంకితము

శ్రీ రాజా

అక్కినేపల్లి జానకిరామారావుగారికి

[ కొండగడప జాగీర్దారు ]

ఉత్తమ కాకతీయాంధ్ర పురుషుడు, సంస్కారి,

రసపిపాసి, ప్రేమపూరిత హృదయుడు

మా బావగారికి

గాఢ సౌహార్ద్రంతో అర్పిస్తున్నాను

# నవలాకాల చరిత్ర

శ్రీ శ్రీ రుద్రమదేవి ఆంధ్ర సమ్రాట్టయిన కాకతీయ గణ
దేవుని కుమార్తె. ప్రపంచచరిత్రలో పైతృకమైన రాజ్యసింహాస
అధివసించిన రాణులలో మహోత్తమురాలు శ్రీ రుద్రమదేవి. ఉత్త
చరిత్ర, నిర్మల గుణగణాలంకార, శేముషీసంపన్న, నిర్వక్రపరాక్రమ
ఈ సామ్రాజ్ఞి.

ఆమెకు దక్షిణహస్తంగా మహామాండలికప్రభువు, మహాసేనా
గోనగన్నారెడ్డి వర్ధమానపురం ( నేటి వడ్డమాని ) రాజధానిగా పశ్చిమాం
భూమి ఏలుతూఉండేవాడు. అతని కుమారుడు బుద్ధారెడ్డి రంగన
రామాయణం ద్విపదకావ్యం రచించి ప్రఖ్యాతి పొందాడు.

ఈనాడు ఆంధ్రదేశం అంతా నిండివున్న రెడ్డి, వెలమ, కమ్మ, బలి
మున్నూరుకాపు మొదలగు ఆంధ్రుల పూర్వీకులు దుర్జయకులజులు న
ఆంధ్రక్షత్రియజాతికి చెందిన గోన గన్నారెడ్డి మహావీరుడు.

## ప్ర థ మ గా థ

# పీటలమీద పెండ్లి

## ౧

పెళ్ళివారంతా యథోచితస్థానాల మహాశీనిగా కూర్చున్నారు. శ్రీ కుమార సింహ గుణార్ణవకుమార అరిభీకరసూర్య గోన వరదారెడ్డి సాహిణి కుమారుడు వరుడై, సమస్తాభరణాలు ధరించినవాడై, జరీపూవులూ ముత్యాలకుచ్చులూ కుట్టినహొంబట్టు ఉపధానాలమధ్య చెక్కిన పాలరాతివిగ్రహంలా వివాహ వేదికపై కూర్చుండి ఉన్నాడు. పట్టాలుకుచ్చిన బంగారు పీటతో నడుమున వ్రేలాడు బాకుపై ఎడమచేయి త్రిప్పియున్నది. కుడిచేయి దిండుపై అలంకరించి యున్నది.

వర్ధమానపురరాజ్యపు మంత్రిముఖ్యులూ, సేనానాయకులూ, రాజబంధువులూ, సామంతప్రభువులూ మొదలైనవారంతా చుట్టూ పరివేష్టించియున్నారు.

ఆదవోని రాజ్య పరిపాలకుడు ప్రతాపాదిత్య, ప్రచండవిక్రమ, పరగండ భైరవ, అశ్వసాహిణి శ్రీ కోటారెడ్డిదేవర మహామండలేశ్వరుడు శ్రీ విశాలాక్షీదేవీపూజానిరతురాలగు తనకుమార్తె అన్నమాదేవిని వర్ధమానమండలేశ్వరుల కుమారునికి వివాహముచేస్తూ ఉన్నారు. ఈ రెండు రాజ్యాలనూ ఏకంచేసే ఈ శుభలగ్నానికి అప్పుడే త్రైలింగ మహాసామ్రాజ్యానికి సార్వభౌములైన శ్రీ శ్రీ రుద్రదేవచక్రవర్తియు, మహామంత్రులైన శ్రీ శివదేవయ్యదేశికులును, సర్వసైన్యాధ్యక్షులైన శ్రీ జన్నిగదేవ మహారాజులుంగారును బహుమతులు, ఆశీర్వాదాలు సేనాధికారులద్వారా పంపించియున్నారు.

ఆదవోని దుర్గంలో పెద్దరాచనగరిలోనున్న నూరుస్తంభాల వివాహ మంటపమంతా ఆంధ్రరెడ్ల వైభవం వేనోళ్ళచాటుచున్నది. గోడలపైన రసవంతాలైన చిత్రాలు, దంతశిల్పం, పొదిగిన కళలూరే స్తంభాలు, చిత్రచిత్ర లతలు నగిషీ చేసిన వెండిప్రమిదల్లో కమ్మని చందనం, సంపెంగ, మల్లె, జాజి నూనెల్లో వెలుగుతూఉన్న పైడిప్రత్తివత్తుల దీపాలు, ఆ మధ్య వివాహవేదిక, బంగారు స్తంభాలతో, ముత్యాల అల్లికలతో, రంగురంగుల మణులు పొదిగిన అనల్పకల్పనలతో, పచ్చని మామిడాకు తోరణాలతో, నారికేళాలూ, అరటి గెలలతో, పట్టుగొడుగులతో, ముత్యాలతోరణాలతో ఆ మంటపం వెలిగిపోతున్నది. వివాహవేదికలో యెడమభాగాన పచ్చని పట్టుతెర సౌభాగ్యవతి యగు వధువు రాకకు నిరీక్షిస్తున్నది.

రంగురంగు పట్టు తలచీరలవారూ, బంగారు కిరీటాలవారూ, నిమ్మపండ్లు నిలిచే భయంకరమైన మీసాలవారూ, రత్నహారాలూ, భుజబంధాలూ, కంక

ణాలూ, కుండలాలూ విరజిమ్మేకాంతితో కలసిపోయే దేహంకలవారూ, పట్టుకాసెకోకలర్రేలు బంగారు ఒరలలో బంగారు పిడుల బాకులుగలవారూ, వెడద ఉరాలవారూ, వారివారి పీఠాలమీద పోతపోసిన విగ్రహాలులాగ అధివసించి యున్నారు.

వివాహవేదిక మూడుప్రక్కలా వేదవేదాంగపారంగతులునూ, పండితోత్తములునూ అయిన బ్రాహ్మణోత్తములు ఋషులవలె కూర్చుండి గంభీరస్వరాలతో వేదగానం చేస్తున్నారు. గాయకులు వారివారి విద్వత్తులు చూపిస్తున్నారు. నటీబృందం సవిలాసంగా నృత్యము చేస్తున్నది.

వసిష్ఠులవారు పెండ్లికుమారునిచేత ఆచమనాదులను చేయిస్తున్నారు. చుట్టూ కాండపటాలమధ్య దాసీజనము బంగారు చప్పరములో వధువును తోడ్కొని వస్తూఉన్నారు.

భేరీభాంకారాలు, నాదస్వరాలు, పిల్లనగ్రోవులు, ఇత్తడికొమ్ములు, కనకతప్పెటలు, మురజలు మొదలైన వాద్యాల మంగళధ్వనులు దిశలు నిండుతున్నవి.

ఆ సమయంలో నిశితకృపాణహస్తాలతో పదిమందివీరులు తన్ను పరివేష్టించిరాగా, ఎడమచేయి నూనూగుమీసమును, కుడిచేయి పట్టుదట్టీని సవరింప సన్నగా శలాకవలె పొడుగైనవాడు, శిరస్త్రాణంపై బంగారు కిరీటలాంఛనం గలవాడు, మిలమిలలాడు కుసుమమువంటి ఉక్కు కవచముపై హారాలు ధరించినవాడు, ఎడమ పార్శ్వమున బంగారుచెక్కడములపై మణులు వెలుగుతూఉండే పిడిగల దీర్ఘ కరవాలంగలవాడు, చిరునవ్వు మోమున నర్తించేవాడు, లోకభీకరుడూ, రాజుల గుండెల్లో నిద్రపోవువాడు, బీదలపాలిటి కల్పతరువు, గజదొంగ గోన గన్నారెడ్డి సాహిణి ఒయ్యారి నడకలతో మందమందముగ వివాహమంటపమున ప్రవేశించెను.

పెళ్ళికుమారుడైన గోన వరదారెడ్డి సాహిణిని గబుక్కున లేవదీయడం, విఠలనాథుడూ సూరనరెడ్డీ అనే పిట్టపిడుగుల కౌగిలింతలకు ఆ రాజకుమారుణ్ణి అప్పజెప్పటం, వారందరితోపాటు సింహద్వారాలు దాటడం, వారితో గుఱ్ఱాలపై చెంగునఉరికి గన్నారెడ్డి అధివసించడం కన్నుతెరచి మూసేలోపలే జరిగి పోయింది.

అక్కడఉండే సభికులు యావన్మందీ, రాజులు, మంత్రులు వీరవాహినీపతులు బ్రమ్మపడిపోయారు. వివాహమంటప మంతా ఒక్కసారి పెద్దసముద్ర కెరటం విరిగిపోయినట్లు మహారావంతో నిండిపోయింది. కూరుచున్న ఆసనాల మీదినుంచి ఆ వీరులు ఉరికారు. అంగరక్షకులను పిలిచి సేన లాయత్తం చేయు డన్నారు. అశ్వాలను కొనిరండన్నారు. రథాలు పూన్చుడన్నారు. ఉక్కిరిబిక్కిరిగా రణగుణధ్వనుల్లో మునిగిపోయారు వీరవరేణ్యులు యావన్మందిన్నీ.

ఎక్కడ పురరక్షకుల నక్కడే ఆపుచేసి పురసైన్యాల కేమిన్నీ తెలియకుండానే కోట తూర్పుద్వారంనుంచిఉన్న రాజపథమంతా తనవీరులతో ఆక్రమించి,

గోన గన్నారెడ్డి ఒక్కక్షణంలో వచ్చాడు. వారందరితో మరుక్షణాన మాయమై పోయాడు.

సేనలన్నీ ఆయత్తంచేసుకొని వీరశ్రేష్ఠులంతా గజదొంగ గన్నారెడ్డిని వెంబడించారు. వాయువేగంతో అశ్వసైన్యాలు తరుముతూ ఉన్నవి. ప్రచండమారుతంలా గన్నారెడ్డి సమీపారణ్యంలో ప్రవేశించాడు. మంత్రించినట్లు ఆ అడవుల్లో, కొండలలో, లోయల్లో గన్నారెడ్డి యెక్కడ మాయమైపోయాడో తన సైన్యంతోనూ, పెండ్లి కుమారునితోనూ!

సాయంకాలంవరకూ సైన్యాలా ప్రదేశాలను వెదకుతునే ఉన్నవి. కాని, ఒక్క అశ్వఖురం జాడైనా వారికి దొరకలేదు.

౨

తన వీరులతో బారులుతీర్చి వాయువేగంతో పోతూ గన్నారెడ్డి రాజకుమారుని వీపున తన బాకు ఆనిస్తూ "తమ్ముడా, తప్పుకుపోవడానికి ఏమాత్రం ప్రయత్నం చేసినా, ఈ బాకు నీ గుండెల్లో విద్రపోతుంది" అని అన్నాడు. అతని మాటల్లోని వేగము రాజకుమారుడు తినిపెట్టి భయపడినాడు. "ఒకరోజు కొంచెం మాతో ఉండాలి. ఎంతగౌరవం జరగాలో అంతా రాజకుమారుడైన మా తమ్మునకు జరుగగలదు" అని గోనవంశోదధిలో కాలకూటంలా జన్మించిన గన్నారెడ్డి మరల హెచ్చరించెను.

వెంటాడుతున్న సేనలో ఒక్క సైన్యాధికారి పర్వతశిఖరంవలె సమున్నతాంగుడైన రెడ్డివీరుడు మీసం తిప్పుకుంటూ "గన్నారెడ్డి గొప్ప వీరుడన్నారు. కత్తిపోరులోగాని, ముష్టి గదా ధనుర్యుద్ధాలలోగాని అతనికి సాటే లేదన్నారు. అతని వీరులంతా అతనికి ఉద్ది అన్నారు. మా ఏకశిలా నగరంలో గన్నారెడ్డిని గూర్చి ఆశ్చర్యంగా చెప్పుకుంటారుకదా, ఇదేమిటి? ఇలా దొంగ ఎత్తుగా పారిపోయినాడు" అని ఇంకో రెడ్డివీరునితో అంటున్నాడు.

"మీరు గన్నారెడ్డిని ఏమిన్నీ అనేందుకు వీలులేదు సుమండీ. అతడింతవరకు అధర్మంగా ఎవ్వరికీ ద్రోహం చెయ్యలేదు. ఎదురుగుండా వస్తాడు. తాను తలుచుకున్నపని చేస్తాడు. మాయమైపోతాడు. ఎదిరించిన వాడిని హతమారుస్తాడు. తన అనుచరులకూ హాని రానివ్వడు. అందుకోసమే తన్ను రూపుమాపే సైన్యం వస్తే, నేలపగిలి దారియిచ్చినట్లు, గాలికింద కరిగినట్లు మాయమౌతాడు" అన్నాడా రెండో రెడ్డివీరుడు.

"మామూలు బందిపోటులా ఊళ్ళు దోస్తాడంటూ, దార్లు కొడ్తాడంటూ ప్రజల గోలఏమి మరి?"

"అదే తప్పు. అతడు ఒక్క ఊరుదోచినట్టుకాని, దొంగలా దారి కాచినట్టుగాని ఒక్కళ్ళును చెప్ప సాహసించలేదు. గిట్టనివాళ్ళు చేప్పే విషపు మాట లివి."

## 3

దక్షకృతావమానంచే విశ్వంయావత్తూ బూదిచెయ్యాలన్న రుద్రుని కోపంతో రాజశ్రేష్ఠుడు, వయోవృద్ధుడు శ్రీ శ్రీ మహారాజాధిరాజు శ్రీ గోన లకుమయారెడ్డి మండలేశ్వరులు మంత్రాలోచనసభ చేరినారు. వర్ధమానపురంలో కోటలో రాజనగరిలో, అన్నిచోటులలోనూ వచ్చిన వార్తలవల్ల జనులు గజిబిజిపడిపోతూ ఉన్నారు.

ఆదవోనినుంచి మహారాజు రాజ్యసైన్యాలు, మంత్రివర్గం, రాజబంధువులు, సామంతలు యావన్మందీ వచ్చిచేరినారు. నేడు రాజ్యసభలో మంత్రాలోచనకై సభికులు ముందే వచ్చియున్నారు. మహారాజులు రావడంతోనే అందరూ లేచి జోహారులన్నారు. ఆయనకన్నుల్లో నిదాఘవేళాప్రచండ మార్తాండదుర్నిరీక్ష కిరణాలు వెలిగిపోతున్నవి. ఆయన వెలిగడ్డము వణకుతూ ఉన్నది. దీర్ఘమైన బాహువులు పైకీ క్రిందికీ ఆడుతూ ఉన్నవి. కుడిచేత్తో ఆయన ఇటు అరజానెడు అటు అరజానెడు ఉన్న ధవళమైన మీసాల్ని సవరిస్తూనే ఉన్నారు.

సచివాగ్రణి లేచి మహారాజులంవారి దిక్కు మొగమౌతూ "ప్రభూ! ఈ దొంగ, ఈ పాపి, మచ్చలేని దుర్జయవంశానికి అవకీర్తి తెస్తూఉన్నాడు. పాలసముద్రంవంటి గోనవంశాన హాలాహలం పుట్టుకవచ్చి నీచాతినీచుడయ్యాడు. అతని జాడతీసి అనుచరులు యావన్మందితోనున్నా హతమార్చమంటారో, జీవంతో పట్టుకువచ్చి నేలఖయిదులో పారవేయించమంటారో మహాప్రభువుల వారు సెలవియ్యాలి. సేనానాయకులవారు అరణ్యంచుట్టి, దొంగల్ని బంధించ డానికై నాలుగు సైన్యదళాల్ని పంపించి ఉన్నారు. స్వయంగా రెండు అశ్వదళాలతో, ఒక గజసైన్యంతో ఈదినమే ప్రయాణం అవుతూ ఉన్నారు. దేవరవారి ఆజ్ఞ" అని విన్నవించాడు.

సభఅంతా నిశ్శబ్దం అయింది. ఇంతలో చటుక్కున హజారం ముంగల రణగుణధ్వని వినబడినది. ప్రతీహారివచ్చి "మహాప్రభూ, దేవరకు ఎల్లప్పుడూ అఖండజయం! శ్రీ శ్రీ మహారాజకుమారులు అడవికిపోయి కొన్ని సైన్యాలతో విజయంచేస్తూ ఉన్నారు. అశ్వచారులు హుటాహుటివచ్చి వార్త అందించు కున్నారు" అని మనవిచేసెను.

మహారాజు చటుక్కున లేచినవా డాయెను. సభ అంతా లేచినది. మహారాజు త్వరితగమనంతో సభాప్రాంగణంవరకూ సభ వెనుక నడుస్తూ ఉండగా, వెళ్ళినారు. "జయ! జయ! దిగ్విజయీభవ! శ్రీకుమారమహారాజులం వారికి జయ!" అనే జయజయధ్వానాలు మిన్నుముట్టుతూ ఉండగా, శ్రీ వరదారెడ్డి మహారాజకుమారులంవారు అశ్వసైన్యాధ్యక్షుడు, దండనాయకుడు, తలవరి చమూపతులు కొలుస్తూఉండగా ఉత్తమమైన పంచకళ్యాణిగుఱ్ఱంపై అధివసించి వచ్చి, దిగి, తండ్రిగారికి పాదాభివందనం ఆచరించారు. మహారాజులంవారు ఎడమ

కన్నుకొలుకున చెమర్చ కుమారుని ఎత్తి కవుంగలించుకొన్నారు! జయజయ ధ్వానాలు మిన్నుముట్టుతూ ఉన్నవి. ముత్తైదువులు, బ్రాహ్మణులు, హారతు లర్పించేవారు ఆశీర్వదించేవారై ఎదురుగా వచ్చారు? శ్రీ సోమనాథదేవ దివ్య శ్రీపాదములకు నివేదనలు అర్పించవలసినదిగా మహాప్రభువులు ఆజ్ఞ ఇచ్చారు. ఇంతలో దౌవారికుడువచ్చి ఒక కొమ్ములో ఉన్న రక్తం కుడిచేతిలోకి వంచుకొని మహారాజకుమారునిపై చల్లి నొసటను బొట్టు పెట్టెను. నగరంలోఉన్న దేవా లయాలన్నిట ఆనాడు అర్చనలు జరిగాయి.

కొన్ని ఘటికలు గడచినతర్వాత మహారాజు మహారాజకుమారుణ్ణి చూడ్డానికి వెళ్ళినవాడాయెను. "ఆ కొండల్లోకి వాళ్ళగుఱ్ఱాలు లేళ్ళలా ఎక్కినాయి. ఇంతలో గన్నారెడ్డి నా కళ్ళకు గంతలు కట్టాలన్నాడు."

"దొంగపోటు దుండగీడు. వాడితల కోటగోపురం ఎదుట వ్రేలాడాలి గాక!" అని లకుమారెడ్డి పళ్ళు పటపట కొరికినాడు.

"నాకళ్ళకు గంతలతోనే గుఱ్ఱాలపై రాత్రేకొన్నాము, లోయలు దిగాము, కొండలు దాటాము. దండంతాఆగింది. నాకళ్ళగంతలు విప్పారు. అద్భుతమైన తోటలు, మేడలు, ఒక చక్కని సెలయేరు, చుట్టూ ఎత్తైనకొండలున్నూ."

౪

ఈ గడబిడఅంతా కొండపటాలమధ్య పల్లకిలోఉన్న పెళ్ళికుమార్తె విన్నది. కొండపటాలను పట్టుకున్న పరిచారికలు, పల్లకీమోసే పరిచారికలు 'ఆగండి!' అన్న గంభీరస్వరం విని ఆగిపోయారు. మండలేశ్వరుల ఆజ్ఞ చొప్పున ఇరువురు కంచుకులు పరుగునవచ్చి "పెళ్ళికుమార్తెను లోనికితీసు కొనిపొం" డని, అది మహారాజుఆజ్ఞ" అని, దాసదాసీజనముతోనూ, సఖులతోను రాకుమార్తెను లోనికి బంపించివేసిరి. ఇంతలో అంతఃపురాల్లోకి గజదొంగ గోన గన్నారెడ్డి వచ్చి, అందరివీరులమధ్య ఉన్న పెళ్ళికుమారుణ్ణి ఎత్తుకొనిపోయాడన్న వార్త ః ట్టపిడుగులా మారుమ్రోగింది.

పెండ్లికుమార్తెను మహారాణిగారి అభ్యంతరమందిరంలోకి తీసుకుపోయి నారు. రాజమాతయున్నూ, మహారాణియున్నూ వధువుదగ్గరకు వచ్చి చేరినారు. పదునెనిమిదేండ్లు ఎలప్రాయముగల అన్నాంబికాదేవికి ఇదంతా ఒక హాస్య నాట కంలా తోచింది. మొదటనుండీ ఏకారణంచేతనోగాని, ఈ వివాహం అంటే ఆమెకు అంత ఉత్సాహం లేకపోయెను. చుట్టుప్రక్కల చుట్టాలవారి స్త్రీజనం అంతాను, పరిచారికాజనమున్నూ ఉక్కిరిబిక్కిరిగా మాట్లాడుకొంటున్న మాటల్లో కొన్ని ఆమె చెవిని బడుతున్నాయి.

"ఈ పాడురాక్షసుడు, పెండ్లికుమారుడి పెత్తండ్రి చుట్టమేనటమ్మా!"

"ఈతని పేరుచెబితే ప్రజలు, గ్రామాలు, రాజ్యాలుకూడా గజగజ వణికి పోతాయట."

"ఎంత భయంకరంగా ఉన్నాడనుకొన్నారు!"

"కాదండీ దొరసానిగారూ! నేను తొంగిచూశానుగా, మంచి పొడుగ్గా, అందంగా, బలంగా, బంగారుచాయతో వెలిగిపోతూఉన్నాడు. ఏమి ఠీవండీ! కళ్ళు విశాలాలై మధ్యాహ్నసూర్యుడిలా ఉన్నాయి.. అబ్బో!"

ఇంకా ఈలా, ఈలా మాటలు.

అన్నాంబికాదేవికి నవ్వువచ్చింది. ఆపుకొన్నది. సంస్కృతకావ్యాలు అన్నీ చదువుకొన్నది. ఇప్పుడు శాకుంతలం ప్రారంభించింది. భరతశాస్త్రము, జాయప సేనాని నృత్తరత్నాకరము, అలంకారశాస్త్రాలు చదువుకొన్నది. కౌముది అవుతున్నది. మనుధర్మశాస్త్రం, శుక్రనీతిసారము, చాణక్యనీతి, మానసోల్లాసము, భారత భాగవత రామాయణాదులు, ఆంధ్రమున అనుభవసారము, శివతత్వసారము, పండితారాధ్యచరిత్ర, పురుషార్థసారము, నన్నయ తిక్కనకవి విరచిత ఆంధ్ర మహాభారతము, మార్కండేయ పురాణము, మొదలైనవెన్నియో చదువుకొన్నది.

అన్నమదేవికి వరవడి రుద్రదేవి. ఆదవోని మహారాజుకు ఈమె ఒక్కతే సంతానము అవడంచేత ఆదవోని ప్రభువు తన చక్రవర్తి గణపతిరుద్రదేవ మహారాజురీతిగా తానున్నూ అన్నమాంబికాదేవికి పురుషవేషం వేయించి వీరవిద్యలన్నీ నేర్పించెను.

అన్నాంబిక పొడుగరి, కోలమోము; మరీపెద్దకళ్ళు. నల్లపాపలలో ఏదో ఒక లోతు, ఏదో ఒక మహాప్రశ్న, ఏదో ఒక తీవ్రత, ఏదో ఒక గాఢమ ధుతనీలాకాశపథాల అప్సరసలలా నృత్యం చేస్తూఉంటవి.

తీర్చిదిద్దిన అవయవస్ఫుటత్వము, పసమిఎరుపుల వేణ్ణాతీరంలో దొరికే బంగారంవలె శరీరచ్ఛాయ. ఆ ఛాయకు పువ్వులోని పరిమళంలా యౌవనం ఒక అనన్యమోహనత్వం ఆమెకు ప్రసాదించినవి.

అశ్వం నడపడంలో అందెవేసినచెయ్యి. ఎంతపొగరుగల గుఱ్ఱాన్నయినా, నిర్భయంగా స్వారిచేయగలదు. అన్నిగతులా నడిపించగలదు. అశ్వారూఢయై ఖడ్గ, పరిఘ, ధనుర్యుద్ధాలు చేయగలదు.

ఆమె కోలమోములో ఆ పెద్దకళ్ళుచూసి, ఈమె పట్టి పసిబిడ్డ అనుకుంటారు! కాని ఏదీక్షయినా పూనినప్పు డాకళ్ళు వెడల్పుతగ్గి ఇంకను పొడుగై చెవులవరకూ వ్యాపించినట్లయి, శాంతంగాఉన్న మానససరోవరం లోతులు ప్రళయఝంఝూమారుతం వీచినప్పుడు పొందే భయంకరస్వరూపం పొందగలవు!

ఆదవోని ప్రభువు కోటారెడ్డిమహారాజు తన తదనంతరం తన కుమార్తెయే ఆదవోని సింహాసనం అధిష్ఠించాలని తన చక్రవర్తితోపాటు తానున్నూ ఆలోచించేవాడు.

ఆదినాల్లో ఆమె తాను బాలికన్నమాటే మరచి మగరాయుడిలా తోటి మంత్రికుమారులు, సేనానాయకులబాలురు మొదలైనవారితో సమంగా కత్తిసాము,

గుఱ్ఱపుస్వారి, ధనుర్విద్య నేర్చుకుంటూ వారందరినీ నిమిషంలో ఓడించేది. ఆ బాలిక బాలికయని రాజబంధువులకూ, ఉన్నత రాజోద్యోగులకూ తక్క మరి ఎవ్వరికీ తెలియదాయెను.

కాని అన్నమాంబకు ఈడువచ్చింది. శైశవము క్రిందటివసంతంలో కలిసి పోయింది.

ప్రభువు అన్నమాంబికను అంతఃపురవాసిని చేశాడు. "అమ్మాయీ! నా చక్రవర్తి ఏలాచేసినా చక్రవర్తిగనుక చెల్లుతుంది. నేను స్త్రీలు స్త్రీలుగా, పురుషులు పురుషులుగా ఉండాలన్న ధర్మాన్ని దాటి కొడుకులు లేనంతమాత్రాన స్త్రీని పేకివానిలా మగవాడై సంచరించమనడం అపకీర్తి, అధర్మము రౌరవాదినరకహేతువున్నూ అవుతుందని నిశ్చయానికి వచ్చాను" అని ఒకనాడు అన్నాంబికాంతఃపురంలో కుమార్తెతో అన్నాడు.

అన్నాంబిక తండ్రిభావాలు విని అత్యంతాశ్చర్యం పొందింది. ఎందుకు ఇంత విచిత్రంగా తండ్రి తన భావాలన్నీ మార్చుకొన్నాడు? లోకానికి అనేక విషయాలలో గురుపీఠము వహించిన శ్రీ శ్రీ గణపతి రుద్రదేవ మహారాజు మరణించగానే ఇంక భయములేదని, తన హృదయంలో ఉన్న ఉద్దేశాన్ని ఇపుడు బైటపెట్టినారుకాబోలు అని ఆమె కించపడింది.

ఆ వెంటనే తన పురుషవస్త్రాలు యూడ్చినదాయెను. నికుదయై జానువులవరకూ వేళ్ళాడే కేశభారాన్ని మూడుపాయల జడగావేసి, రత్నాలుపొదిగిన బంగారు కుప్పెలుగల నల్లటి పట్టుకుచ్చులు ధరించింది. తలపై మాణిక్యనాగాభరణము, వజ్రనక్షత్రాభరణము, ముత్యాలపాపటబొట్టు, గోమేధిక చేమంతిపూవు ధరించింది. ఉత్తమ రాజకన్యోచితమైన కంకణ, కేయూర, హార, మేఖల, నూపురాది ఆభరణాలు తాల్చింది. బంగారు సరిగంచుల పూల నీలపుం బట్టుచీర, ఎఱ్ఱపట్టు కంచుకము మధ్యాహ్నవేళ; ఉదయం కాశ్మీరకుసుమపుచీర, గరుడపచ్చ కంచుకము; సాయంకాలము అరుణకాంతిచీర, బంగారుపచ్చకంచుకము ఆ యా వర్ణాలు శ్రుతిని పొందే వల్లెలున్నూ ధరించుట ప్రారంభించినది.

చెంపలకు పుప్పొడి అద్ది చెలులు రచించిన కస్తూరి కుంకుమ మకరికాపత్రాదులు రత్నకర్ణికలతో వియ్యంపొందుతూఉండగా, ఆ బాల అరమూతల రెప్పలవెనుక తన అసంతృప్తి దాచుకొన్నదాయెను.

మొదటినుండీ ఆ బాలకు వివాహం ఇష్టంలేదు. బాలునివలె పెరిగిన ఆ బాల పురుషులు స్త్రీలకు పతులు అని ఆలోచించుకొనలేకపోయింది. తనతల్లి మొదలగు స్త్రీలు, తల్లులగుటకే ఉద్భవించారని ఆమె నమ్మకం.

కోటారెడ్డిమహారాజు తనకుమార్తె అన్నమాంబిక పితృభక్తి కలదని నమ్మకంకలవాడుకాబట్టే శ్రీ గోన లకుమయారెడ్డి మహారాజుసమామలైన వర్ధమాన రాజ్య యువరాజులను వివాహం చేసుకోవలసిందని ఒప్పించాడు. హృదయంలో

వివాహానికే ఇష్టంలేని అన్నమాంబిక ఈవిధంగా తనకన్న రెండేళ్ళు మాత్రమే పెద్దవాడై, విక్రమంలో తనతోకూడా సాటిగా ఏమాత్రమూ నిలువలేని వరదారెడ్డిని వివాహం చేసుకొనడానికి ఏమాత్రమూ ఇష్టపడకున్నను తండ్రి ప్రతిమాటలతో సరేనని ఒప్పుకొన్నది.

౫

పెళ్ళిప్రయత్నాలన్నీ ఎందుకో తొందరగా జరిగాయి. అశ్వచారులు అతి త్వరితంగా శుభలేఖలు చుట్టాలకు అందిచ్చినారు. ఆదవోనినగరం అంతా సైన్యాలతో నిండింది. వీరనాయకులతో, దుష్టతురగరేఖారేవంతులతో నిండిపోయింది.

రేచర్లవారు, విప్పర్లవారు, మల్యాలవారు, కోటవారు, వెలనాటివారు, సాగివారు, చాళుక్యులవారు మొదలగు ఆంధ్రక్షత్రియవంశాలవారు వివాహానికి వచ్చియుండిరి.

ఈ విషయాలన్నీ ఏప్పటికప్పుడే అన్నాంబికాదేవికి తెలుస్తూనే ఉండినవి. ఆమె తన వివాహాన్నిగురించి ఆలోచించడం మానివేసింది. తన కులదేవత విశాలాక్షీదేవి కృప ఎల్లాఉంటే అల్లాగే జరుగుతుంది అని నిస్పృహ చేసుకొని ఊరుకుంది.

ఆమెచేత ఏమేమి తంతు చేయించారో, ఆమె కేమీ గుర్తులేదు. తన్ను బంగారుస్యందనంలో ఎక్కించి కాండపటాలు చుట్టూపూన్చి చెలికత్తెలు రా, వివాహవేదికలోనికి తీసికొనివచ్చారు దాసీజనులు అన్నదిమాత్ర మామె ఎరుగును.

ఇంతలో గన్నారెడ్డి గజదొంగ వచ్చాడు. అందరు గొల్లుమన్నారు. ఆ సమయంలో ఒక గంభీరస్వరం "ఆగండి" అని వినిపించింది. ఆ కేకలో ఎనిమిది బాముల నిశితత్వంఉంది. ఆ కేకలో పదహారు ఉరుముల మహానాదముంది. ఆ కేకలో సప్తసముద్రాల లోతులున్నాయి.

చెలికత్తెలు గజగజ వణుకుతూ ఆగిపోయినారు. స్యందనంలోనుండి అప్పుడన్నమాంబిక ఒక కాండపటము ప్రక్కకు ఒత్తిగించి ఆ కేకవేసిన మహాపురుషుని చూచినదాయెను. ఆ సమయములోనే ఆ పురుషుడును తన్ను చూచు మంచుశిఖరాల మధ్య నిలిచిఉన్న అపరాజితాదేవి మోమువలె తెరల మధ్య కాన్పించిన వధూవదనము వీక్షించెను.

వారిరువురి చూపులు ఏడుక్షణములకాలం ఒకదాని నొకటి ఎదుర్కొని, సంధించి, కలిసిపోయినాయి. ఎవరుముందు కంటిరెప్పలు వాల్చినారో వారిరువురికూ తెలియదు. ఇంతలో తండ్రిగారి ఆజ్ఞవల్ల చెలులు రాజకుమార్తె స్యందనం, మహారాణి అంతఃపురంలోనికి తీసుకొనిపోయినారు.

అతడు గజదొంగా? అతడేనా గోన గన్నారెడ్డి? ఆనాటి పెళ్ళికొడుకున కాతడు పెదతండ్రి కుమారుడా? ఆమె చిరునవ్వు నవ్వుకొన్నది.

మహారాణి అంతఃపురంలో రత్నకంబళ్ళపై నున్నదంతపీఠికలపై అధివసించి ఉన్న రాజస్త్రీలు పెళ్ళికుమార్తె పల్లకి మహారాణి సింహపీఠిదగ్గర దింపగానే ఒక్కసారిగా లేచినిలిచిరి. ఆ తెరల్లోంచి అన్నాంబికాదేవి ఈవలకురాగానే, మహారాణి కూతురుకడకు రెండంగలువేసి, కుమార్తెను గట్టిగా కౌగిలించుకొన్నదాయెను.

"నా తల్లి! ఆ రాక్షసుని కంటపడలేదుకదా! దిష్టితీయించవలె" అని ఆ తల్లి కన్నుల నీరు నింపుకొన్నది.

అవరోధజనం వివాహం చూడటానికి నిర్మింపబడిన ప్రతిసీరల మరుగున నున్న మేడవసారాలలోనున్న స్త్రీజనమెల్ల ఆ గజదొంగ వచ్చిన గడబిడలో అదలిపోయి, మహారాణి మందిరంలోకి పరుగునవచ్చి ప్రాలెను. వాళ్ళందరూ మువ్వన్నె మెకము అడవి సొచ్చినప్పుడు, కురంగీలోకం వణికిపోయినట్లు వణికిపోయారు. ఏట్రింత చెట్టుమీద వాలినప్పు డా చెట్టున నివసిస్తూన్న పులుగు పదతులు భయచకిత కలకలరావాలు సలిపినట్టు ఆ రాచనెలతుక లందరూ గోలుగోలుమనిపోయిరి.

ఆ అదటు ఇంకనూ తీరనేలేదు. రాకొమరితను అచ్చటికి దాసీలు తీసుకురాగానే ఆ అంగనలందరూ కళ్ళ తడిపెట్టుతూ అన్నాంబికాదేవిచుట్టూ చేరారు.

అన్నాంబిక వారందరూ ఆశ్చర్యంలో మునిగిపోయేటట్లుగా చిరునవ్వు నవ్వుతూ ప్రక్కనున్న ఒక చెలితో "అందరినీ కూర్చోపెట్టవే" అన్నది.

ఇంకొక చెలిచెవిలో మరియేమో ఊదినది. అప్పుడు పదిమంది దాసీలు పరుగిడి రాజకుమారి వీణవాయించుకొంటూ అధివసించేపీఠము, దిండ్లు, వీణయు తెచ్చిరి. అన్నాంబిక ఆ పీఠముపై అధివసించి, వీణ ధరించి, మండలేశ్వరుల భార్యలు, సేనాపతుల భార్యలు, మంత్రి సామంతుల భార్యలు, వారి వారి బాలలు, ఆశ్చర్యంతో చూస్తుండగా, తీగలుసవరించి సారెలుబిగించి, పేరంటము సమయములో ముత్తైదువరాండ్ర నలరించుటకువలె నిట్లు పాడెను.

"విరిసినవి కుసుమాలు దరిసినవి వర్ణాలు
కురిసినట్టి దివ్యపరిమళము జాడలో!
తోట వెలుపల అడవి తోటలోపల మడవ
తోటలో విహరించు తొలిగాలి కే దారి?"

ఆ పాటలోని భావము ఎవ్వరికీ అర్థంకాలేదు. వారందరూ ఒకరిమొగమొకరు చూచుకొనిరి.

ఆంధ్రస్త్రీలు సుందరులు. వారు సన్ననికౌనుగలవారు, దీర్ఘనీలకుంతలలు, పుష్పాలంకారప్రియులు, సరిగలతలు కుట్టిన చీరలు నానావర్ణాలవి ధరింపుచు,

కస్తూరితో, చందనంతో, పునుగు జవ్వాజులతో, కుంకుమపూవుతో పాటలవర్ణ విరాజిత పీనవక్షోజములపై మకరికాదిపత్రాల రచియింతురు. పద్మాలవలె ఎఱ్ఱనైన తమ పాదాలకు లత్తుకరంగుతో లతలు రచింతురు. మనోహరంగా విన్యసింపబడిన వివిధభూషణాలను ధరింతురు. యవ్వనవతులగు బాలికలు తమ వక్షోజాలను మరుగుపరచరు. వివాహంకాగానే పట్టుకంచుకాలు ధరిస్తారు.

ఉదయారుణకాంతిలా కోలమోములవారు, చంద్రబింబాలులా గుండ్రని మోములవారు, నల్లకలువపత్రాలులా కాటుకకన్నులవారు, చకోరాలులా వాలు గన్నులవారు, పద్మములులా విశాలాక్షులు, అరమూతల మదిరాక్షులు, చూపులలో ఆర్ద్రిత ఒలికించే కామాక్షులు, గన్నేరు మొగ్గలవంటి సమనాసికలవారు, నువ్వు పువ్వులవంటి ముక్కుపుటాలవారు, చిరువంపునాసాగ్రంకల చిలుకలకొలుకులు, ఇరికపళ్ళవంటి ఎఱ్ఱటిపెదవుల చిన్ననోరులవారు, విలువంపుతిరిగిన తేనెపెరవంటి అధరోష్ఠాలవారు, సముద్రతీరాలవంటి సెలయేటినడకలవంటి కనుబొమలవారు, తామరపూరేకులవంటి చెంపలుకలవారు, మామిడిపళ్ళవంటి చిబుకములవారు, లతలవంటి చంద్రకిరణాలవంటి చేతులుకలవారు, మందారమొగ్గలవంటి పడుచువారల కోర్కెలవంటి అంగుళులుకలవారు, లేతపొన్నమొక్కలలా ఊగే సన్ననికౌనులవారు, ఠీవికలవారు, ప్రేమకలవారు, చదువుకొన్నవారు, ఆకాశమునుంచి ఒలికే ఒడగండ్లవంటి స్వచ్ఛశీలంకలవారు, ఉషస్సువంటి, రాకాపూర్ణిమవంటి, లోతైన మంచినీళ్ళ చెరువువంటి, కమలములతో నిండిన చెరువునుండి పుదయంలో వచ్చే పరిమళంవంటి సౌందర్యంకలవారు ఆంధ్రసుందరాంగులు లా మందిరములో వారికి తలమానికమైన అన్నాంబిక ఆ వల్లకిపై పలికించే మనోహర గాంధర్వము వింటూ, గణపతి రుద్రదేవమహారాజు నిర్మించిన గుడిలోని ఉత్తమ శిల్పసుందరులులా సుందరభంగిమలు తాల్చినవారయిరి.

"మరలినవి చీకట్లు వరలె పులుగులపాట
సురలతాంగి ఉషస్సు అరుదెంచె తూర్పులో
మావిలో పికియోర్తు ఏవియో స్వప్నాల
కావిరంగుల చిగురు తావులను మూర్కొనదు"

ఈ చరణాలూ ఆ వనితాలోకానికి అగమ్యగోచరాలే అయినవి. ఏదియో మధురప్రపంచంమాత్రం వారికి దృశ్యాదృశ్యంగా గోచరించింది.

అన్నాంబిక నిట్టూర్పువదలి తన పీఠంమీదనుండి లేచింది. చెలికత్తెలు దారిచూప మహారాణియు, వధువును అభ్యంతరగృహాల కేగిరి. బంధుకాంతలందరు వారి వారి విడుదులకు వెళ్ళిపోయిరి.

తల్లీ కూతుళ్ళిద్దరూ అలంకారమందిరంలో ఆసనాలపై అధివసించగానే అన్నాంబిక సవిచారంగా తల్లివిచూచి "అమ్మగారూ! విడిపోయిన పూలరేకులు

అతికించలేము. విఱిగిపోయినపాలు మరి తోడుకొనవు. ఈ పెండ్లి దైవవశాన చెడటం మేలే అయింది. ఎత్తుకుపోబడిన మనుష్యులు మరల దొరికినా, మళ్ళీ శుభముహూర్తం పెట్టవలసినపనిలేదు" అన్నది.

మహారాణి కుమార్తెను చూచి "అవునుతల్లీ! నాకూ మొదటనుండి ఈ సంబంధం ఇష్టములేనిదే! పురుషుల రాజకీయాలలో మనజోక్యం ఎందుకు అని ఊరుకున్నాను!" అని నెమ్మదిగా పలికింది.

"అమ్మా! ఈ కర్కశ యుద్ధరాజకీయాలకోసం స్త్రీలను పణముపెట్టి జూద మాడటం ధర్మమా చెప్పండి?" అన్నది.

మహారాణి లేచివచ్చి ఆ బాలికను తన హృదయాని కద్దుకొన్నది. ఆమె కన్నుల్లో సుడిగుండాలులా నీరు తిరుగుతున్నది.

ఇంతలో దాసి ఒక్కరిత పరుగునవచ్చి, మహారాజుగారు వస్తున్నారని చెప్పింది. మహారాణియు, అన్నామాంబికయు లేచి నిలిచిరి. మహారాజు లోనికి వచ్చినాడు. తల్లికూతుం డ్రిద్దరూ ఆయనకు నమస్కారం చేశారు.

మహారాజు తానొక పీఠం అధివసించి, కుమార్తెను దగ్గరకు చేరదీసుకొని, "తల్లీ, గన్నారెడ్డి రాక్షసుడు!" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

మహారాజు: మన సైన్యాలుకూడా ఆ దొంగలదండుకోసం పెండ్లికుమారునికోసం వెతుకుతున్నారు. దొంగలను ఓడించి వరదారెడ్డి మహారాజును త్వరలో తీసుకువస్తాము. ఈలోగా జ్యోతిష్కులు, పండితులు, కులగురువులు, పెద్దలు త్వరలో ఇంకొక ముహూర్తము ఉందేమో చూస్తున్నారు.

అన్నాంబిక: నాయనగారూ! ఒకసారి చెట్టునుంచి రాలినపండు మళ్ళీ చెట్టుమీదికిపోదు. గాలివానకు విరిగినచెట్టు మళ్ళీ బ్రతుకలేదు!

మహారాజు: అంటే నా తల్లి ఉద్దేశం?

మహారాణి: పోయిన ముహూర్తం పోనేపోయింది. తప్పిపోయిన సంబంధం భగవంతుని దివ్యేచ్ఛవల్లనే అలా జరిగింది. మళ్ళీ రాయబారాలూ వద్దు, ముహూర్తాలూ వద్దు.

మహారాజు: అమ్మాయీ?

మహారాణి: అమ్మాయి ఇష్టమే తమకు తెలియజేస్తున్నా.

# ద్వితీయ గాథ

## కుట్ర

### ౧

త్రైలింగ మహాసామ్రాజ్యానికి చక్రవర్తియై, మహాజగన్నాథక్షేత్రం నుండి చిదంబరక్షేత్రం వరకున్నూ శివకేశవులకు అభేదం కల్పించి, తూర్పు సముద్రం కెరటాలు పశ్చిమసముద్రం తరంగాలతో సంగమంచేయించి, సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, పరమమాహేశ్వర, అనుమకొండపురవరాధీశ, పరనారీసహోదర, ఆదిచోడకటకచూరకార, మన్నియబెండకార, విభవదేవేంద్ర, మూరురాయ జగదాళ, విదితవిక్రమశీల, సత్యహరిశ్చంద్ర, శ్రీ స్వయంభూ దేవర దివ్యశ్రీ పాదపద్మారాధక, వితరణకర్ణ, ఆశ్రితపోషక, శరధిశశౌర్యమందర, పరబలసాధక, ప్రత్యక్షప్రమథగణావతార, లాటకటకచూరకార, కదనప్రచండ, చలమర్తిగండ, చతుస్సముద్రముద్రాధికార్జితకీర్తి, సప్తమచక్రవర్తి, ఆదిరాజ చారుచరిత్ర, సుజనైకమిత్ర, సుస్థిరనిజరాజాన్వయనామాది సమస్తప్రశస్తిసహితులై మహావైభవంగా రాజ్యం ఏలుతున్న శ్రీశ్రీ కాకతీయ గణపతిరుద్రదేవ చక్రవర్తికి వృద్ధాప్యం వచ్చింది.

శ్రీ శ్రీ చక్రవర్తి ఆజ్ఞప్రకారం ఆయన పెద్దకుమార్తెను పురుషవేషంతో మహాసామ్రాజ్యానికి యువరాజుగా అభిషేకంచేసి స్వామికార్యధురంధరులై శ్రీ ప్రతాపనాయనింవారున్నూ, శ్రీ మండలేశ్వర మాణిక్యం, సర్వసేనాధ్యక్షులు మురారినారాయణ. చలమర్తిగండ, గండపెండేర, రక్కసగంగ, సిద్ధయదేవ, తలగొట్టగండ, గణపతిరుద్రదేవచరణనళినయుగళ సమారాధన, మాండలిక బ్రహ్మరాక్షస ఇత్యాదిమహాబిరుదాలతో బాహత్తరనియోగి, మహావీరుడు వృద్ధుడు శ్రీ జన్నిగదేవసాహిణి మహారాజులుంగారున్ను, మహామంత్రి అఖండరాజ్య తంత్రజ్ఞుడు, ఉభయభాషల్లో పండితుడు, పురుషార్థసార మహానీతిగ్రంథ నిర్మాత అయిన శివదేవయ్య మహాసచివులవారున్నూ, రాజభక్తిపూరితులైన మండలేశ్వరు లనేకుల సహాయంతో రాజ్యంలో రాజద్రోహంలేకుండా కాపాడుతున్నారు.

శ్రీ గణపతిదేవచక్రవర్తికి పశ్చిమాంధ్ర ప్రతినిధిగా వర్ధమానపురం రాజధానిగాచేసికొని, మానువనాటి విషయానికి గోన లకుమయారెడ్డిసాహిణి మహా రాజులంవారు అన్నగారివెనుక ఆయనకుమారునిపరంగా రాజ్యంచేస్తూ చక్రవర్తికి నమ్మకమైనబంటై, చక్రవర్తి సేనల్లో సేనాపతియై, అశ్వసాహిణియై, సమ్రాట్టు ఆజ్ఞాప్రకారం కుంతలదేశంలోనికి సేనల్ని చొప్పించుకొనిపోయి కల్యాణపుర యాదవరాజ్యప్రతినిధుల్ని ఓడించి, వాతాపినగరం పట్టుకొని ఆంధ్రసామ్రాజ్యము

పశ్చిమానికి చాలా విస్తరింపజేసెను. ఆదవోని మండలేశ్వరుడైన శ్రీ కోటారెడ్డి దేవర మహారాజులుంగారున్నూ చాలా సహాయంచేసిరి.

శ్రీ శ్రీ గణపతిదేవమహాచక్రవర్తి యువతి అయిన తన పెద్దకుమార్తెను పురుషవేషంతో శిఖండిలా మహారాజుగా యువరాజ్యభారం వహింప చేసేటప్పటికి లకుమయారెడ్డికి కోపం మిన్నుముట్టింది. డెబ్బదియేండ్ల వృద్ధుడైన ఆ మహాభిమానికి ఆడదాని చేతి కూడు తినడం వీరపురుషులకు తలకొట్టినట్లే అనిపించింది. తలుచుకొన్నకొద్దీ కోపం గాలివాననాటి మేఘంలా పెరిగిపోతోంది. దేవతప్పని ఆతని వీరరూపం వణికిపోయింది. రుద్రమదేవిని సింహాసనంమీదినుంచి లాగివేసి వంటయింటిలోనికి పొమ్మందామని అనుకున్నాడు.

అయితే శ్రీ శ్రీ గణపతిరుద్రదేవ చక్రవర్తులవెనక సామ్రాజ్యానికి సింహాసనం ఎక్కించడం ఎవరిని ? హిమాలయశిఖరంనుంచి గంగాదేవివలె వీపున ప్రవహిస్తూఉన్న ఆతని తెల్లనిజుట్టున్నూ, బవిరిగడ్డమూ ఊగిపోయాయి. ఆ మహాసమ్రాట్టుకు కొడుకులేడు. చివరకు దౌహిత్రుడన్నాలేడు. ఆడుది రాజ్యం చేయుటా? అర్జునుణ్ణి జోహారనిపించే ఈ వీరపురుషులూ, మహారాజులూ ఆడుదానికి జోహారు చేయుటా ? తమ తమభావాలు తెలుపవలసినదిగా మండలేశ్వరులకడకు తాను పంపిన తన ద్వితీయసచివుడు చిన్నయామాత్యుడు పొత్తపినాండు విషయ మహామండలేశ్వరుడు, బేడచెలుకిరాయడు, ఆదవోని మహామండలాధిపుడు కోటారెడ్డి పూగినాటి విషయాధిపతి కోట పేర్మాడిరాయుడు, కందవోలు రాజ్యాధిపతి పంది భూపాలుడు యావన్మందిన్నీ ఈ ఆడది రాజ్యం చేయడం ఇష్టంలేదన్నారని వేగు తెచ్చాడు.

"ఇక ఆవల వీరావతారుడైన జన్నిగదేవుడు, ప్రతాపనాయుడు, అసాధ్యుడు చాణక్యుడులాంటి శివదేవయ్యమంత్రి ఉన్నారు. వాండ్లకు మడపల్లె దుర్గాధిపతి, పల్లవనాటిరాజు, వెలనాటిప్రభువు, వేంగిరాజ్యాధిపతీ బాసటగా ఉన్నారు. చక్రకోట్యమండలం, కమ్మనాడు, మేడిపలి కాచయనాయుడు—ఆ ప్రభువులంతా బెల్లంకొట్టినరాళ్ళలా ఊరకొన్నారు. వీలయితే తిరగబడి తమ రాజ్యాల్ని స్వతంత్రం చేసుకోవాలనీ, లేకపోతే మేము రాజభక్తిపూరితులము అని చెప్పాలనీ, ఎవరిమట్టుకు వారికి సమ్రాట్టు అవుదామనీ ఉందనుకుంటాను" అని చిన్నయామాత్యుడు మహారాజుతో చెప్పినాడు.

"ఆదవోని మహారాజు మహాబలవంతుడు. కర్ణాటరాజు భల్లాణ భూపతిని నాలుగుసార్లు ఒక్కడే ఓడించాడా ప్రభువు. ఆ మహారాజుకుమార్తె అన్నమాంబాదేవి చాలా అందమయినది. యువరాజులవారికి ఈడు. ఈ రెండు రాజ్యాలు ఏకమైతే రుద్రమదేవికి బలం ఎక్కడ ? ఆదవోనివారికి దగ్గరచుట్టాలే కందవోలు రాజ్యాధిపతులు" అని ముఖ్యమంత్రి రుద్రయామాత్యులవారు సెలవిచ్చారు,

"యాదవమహారాజు దేవగిరి కృష్ణభూపతి వృద్ధుడైనాడు. ఆయన కుమారుడు యువరాజు ఆంధ్రదేశముపై కన్నువేసి ఉంచారు. బద్ధశత్రువులైన ఆంధ్రుల రాజ్యము యావత్తూ కబళించి తానే సమ్రాట్టుఅయ్యే ప్రయత్నాలు చేస్తూవున్నాడని వేగు" అని సేనాధిపతి కామయరెడ్డిసాహిణి వాక్రుచ్చాడు.

ఆదవోని వర్ధమాన మండలేశ్వరులకు రాయబారాలు జరిగినవి. సంబంధము నిశ్చయమయింది. ఇద్దరు ప్రభువులు కందవోలు ప్రభువును, ఇందునగర మహా మండలాధిపతియున్నూ చేరి యాదవయువరాజు మహాదేవరాజుకు శ్రీ గణపతి రుద్రచక్రవర్తి లింగైక్యంకాగానే వేగుపంపించి రప్పించుటకున్ను, రుద్రాంబను తక్తుమీదనుండి లాగివేయుటకున్ను, యాదవుడు తన రాజ్యం చేరగానే వీరంద రున్నూ తిరుగబడి స్వతంత్రం అనుభవించుటకున్ను ఏర్పాటు చేసికొన్నారు.

వృద్ధుడైన లకుమయారెడ్డిప్రభువు పూనిన పనిని అతి పట్టుదలతో నిర్వ హింపగలిగే సాహసి. రహస్యంగా చారులను పంపి, ఓరుగల్లులో సైన్యాల విష యము వేగు తెప్పించుకున్నాడు. ఓరుగల్లును దేవగిరి యాదవదేశ మహారాజు ముట్ట డిస్తే కోట ఏదెస నీరసంగా ఉండును, ఎక్కడనుంచి ముట్టడి సాగింపవచ్చును అనే విషయాలు పూర్తిగా తెలుసుకున్నాడు.

రహస్యాలోచనమందిరంలో అతడు ముఖ్యసచివునితో, సేనానితో మంతనం జరిపే సమయంలో లకుమయాధీశుని ముఖ్యచారులలో ఒకడు ప్రభువు అనుమతితో లోన ప్రవేశించి మహారాజుకు సాష్టాంగ నమస్కారములు చేసినవా డాయెను. ఆ తరువాత మహారాజుం గనుగొని "మహాప్రభూ ! హరిహరదేవ, మురారిదేవుల ఆప్తసచివులు మారయమంత్రులు వచ్చి మహారాజు ఆజ్ఞకోసం నిరీక్షిస్తున్నారు" అని విన్నవించాడు.

౨

మారయమంత్రి రహస్యాలోచన మందిరంలోకివచ్చి, ప్రభువు లకుమయా రెడ్డికీ, మంత్రులకూ నమస్కారంచేసి ఆసనమం దధివసించెను.

"మహారాజా ! మా ప్రభువులు హరిహరదేవుడు, చిన్నప్రభువులు మురారి దేవులు, పరు లెరుగకుండానున్ను, అసాధ్యులైన ప్రసాదాదిత్యనాయకులు ఏమా త్రమూ గ్రహింపలేకుండా ఉండేటట్లుగానూ, శివదేవయ్యమంత్రిగారి దూర శ్రవణాది మాయోపాయాలకు చిక్కకుండా ఉండేటట్లుగానూ సర్వ సన్నాహాలు చేస్తూఉన్నారు" అని మారయమంత్రి మనవిచేశాడు.

లకుమయ : హరిహరదేవులే కాకతీయమహారాజ్యానికి నిజమైనవారసులు. కాకతీయ మహారాజాధిరాజులైన రుద్రదేవచక్రవర్తి యాదవరాజుతో యుద్ధానుచేసి దేవగిరిపై దండెత్తి వెళ్ళినప్పుడు, ఒక మహారాష్ట్రకన్యను వలచి, గాంధర్వ వివాహమై అనుమకొండ తీసుకువచ్చారు. ఆ దేవికి హరిహర మురారిదేవుల తండ్రి సారంగధరదేవుడు ఉద్భవించాడు. రుద్రదేవమహారాజు దేవేరికి పుత్రులు లేనందున కాకతీయ సామంత మండలేశ్వర మహాసేనాపతులు, మహామండలేశ్వరులు గాంధర్వవివాహజనితులైన సారంగదేవులను కాకతి సింహాసనం ఎక్కించక, మహదేవరాజునే ఎక్కించారు. మహదేవరాజుప్రభువు కాలధర్మం పొందగానే రేచెర్ల రుద్రసేనాని గణపతి రుద్రదేవమహారాజును సింహాసనం ఎక్కించెను. సారంగదేవప్రభువు అన్నగారగు గణపతిదేవ మహాచక్రవర్తిని, భక్తితో ప్రేమతో కొలిచి, ఇప్పటికి మూడేళ్ళక్రితం లింగైక్య మందినారు. గణపతి రుద్రదేవులు ప్రేమతో కొలనుపాక విషయం పాలనకు ఇచ్చి అచ్చటినుండి, ఉత్తర రాజ్యం గోదావరీతీరం వరకూ పాలిస్తూ ఉండడానికి తమ్మునికి అనుమతి ఇచ్చినారు. ఇప్పుడు శ్రీ గణపతి రుద్రదేవచక్రవర్తికి స్వస్థత లేకున్నదాయెను. ఆయన రుద్రదేవచక్రవర్తి అన్న నామంతో నిరుడు శాలివాహనశకం 1182 రౌద్రి సంవత్సర మాఘమాసంలో తన కుమార్తెను చక్రవర్తి సింహాసనం ఎక్కించారు. అప్పటినుండీ హరిహరదేవ మురారిదేవులకు చాలా కష్టంగా ఉన్నదని వింటున్నాము.

మారయమంత్రి : ప్రభూ ! తాము నిజం తూ. చ. తప్పక, సర్వం గ్రహించారు. పురుషునకే రాజ్యార్హత ఉంది. ఏధర్మశాస్త్రంలోనూ స్త్రీ పైతృకమైన రాజ్యానికి అర్హురాలు కాదు. హరిహర మురారిదేవుల తండ్రి తన అన్నగారికి తన కొడుకులలో ఒకరిని పెంచుకోమని మనవిచేసి ఉన్నా, చక్రవర్తి వినడాయెను.

రుద్రమమంత్రి : అదంతా బలగర్వం మారయమంత్రిగారూ ! నిజంగా ఆలోచిస్తే కాకతీయ మహారాజ్యం నిలిపింది రేచెర్లవారూ, మల్యాలవారూ, గోనవారూకదా ! తూర్పున నతనాటిసీమలో, కొండతూరుపు, కొండపడమటిసీమలలో పలనాడు విషయంలో, పాకనాడు, వెలనాడు, వేంగివిషయాలలో కాకతీయులను కాపాడుతున్నది చాళుక్యులు, వెలనాటి చోడులు, కోటవారు, సాగివారు, కాయిస్థులూ కదా ! అయినా, పెద్దలను రప్పించి కుమార్తె విషయమై ఆలోచించినవాడు కాడాయెను. అది చక్రవర్తి చేసిన మహాదోషము. స్త్రీ పరిపాలన చేయదలచుకొంటే చిన్నబిడ్డలకు సంరక్షకురాలుగా చేయాలి. అంతేగాని ధర్మం అడుగంటచేస్తే ధర్మాభిరతులైన సామంతులు ఊరుకోవలసిందేనా ? అని మహారాజులవారు ఆలోచిస్తున్నారు.

మారయ: చిత్తం! వేనుని చరిత్ర మనం ఎల్లా మరచిపోగలం? కాబట్టి మా ప్రభువు హరిహరదేవులు న్యాయంగా రావలసిన తమరాజ్యం తమ కిప్పించ వలసిందని తోటి మండలేశ్వరుల నందరినీ హెచ్చరిస్తున్నారు.

లకుమయారెడ్డి: మారయప్రెగ్గడవారూ! తాము చెప్పినది మాకు నచ్చినది. తమ ప్రభువులకు బాసటగా నిలిచే ఇతర సామంతు లెవరు? ఎంతమంది?

మారయ: ప్రభూ! రేనాటిలో శ్రీపతిప్రభువు, సకిలి ఎరువలో గణపతి సాహిణి మనకు మాట ఇచ్చారు. వారు అంబయదేవుని తుదముట్టిస్తారు. విజయగండ గోపాలుడు కమ్మనాటిలో, ఎరువమాను మిలిదేవరాజు పాకనాటిలో, పొత్తపినాటిలో సిద్ధయ చోడరాజు హరిహరదేవ మహాచక్రవర్తికి సహాయం చేసితీరుతామనీ, త్రిపురాంతక, జన్నిగదేవులను నాశనం చేస్తామనీ మాటయిచ్చారు. గుంటూరులో నాగదేవరాజు మా ప్రభువుకు సర్వసహాయం చేయడానికి మాట పంపించారు.

లకుమయారెడ్డి లేచి మారయమంత్రివరునకు రుద్రయామాత్యులవారు ఆతిథ్యం నెరవేర్పవలసిందనియు, శ్రీ హరిహరదేవ ప్రభువుల పక్షాన మారయామాత్యులు, తమ పక్షాన రుద్రయామాత్యులు అగ్నిప్రమాణ మైత్రి నెరవేరపవల సిందనిన్నీ చెప్పి తమ అభ్యంతరమందిరంలోకి వెళ్ళిపోయినారు.

లకుమయారెడ్డి లోనికిబోయి దాసీజనసహాయంతో మళ్ళీ స్నానం చేసిన వారై, శుభ్రవస్త్రాలు ధరించినవారై, పూజాపీఠంముందు కూర్చుండి విష్ణుపూజ నెరవేరుస్తుండిరి. గోనవారు అద్వైతులు, విష్ణుపూజాపరులు, గోనలకుమయారెడ్డి తాతగారు బుద్ధమహారాజు పశ్చిమచాళుక్యులకు సామంతుడుగా భువనగిరిదుర్గంలోఉండి పరిపాలనం చేసే రోజుల్లో బౌద్ధమతము స్వీకరించినాడు. ఆయన కుమారుడు గోన క్షేమరాజు వైష్ణవం స్వీకరించి రంగనాథ నామం స్వీకరించి, బుద్ధదేవుడు విష్ణువునకు తొమ్మిదవ అవతారమని నమ్మి తన పెద్దకుమారునకు బుద్ధారెడ్డి అనిన్నీ, చిన్న కుమారునకు లకుమయ అని లక్ష్మణదేవర పేరు పెట్టుకోన్నాడు.

లకుమయకు భగవంతునిపై హృదయము లగ్నముకాదు. అతడు ఎంతో కళవళపడుచుండెను. ఎనుబదిఏళ్లు నిండిన గణపతిదేవ సార్వభౌముల పండువంటి రూపము ఎదుట ప్రత్యక్షమవుతున్నది. శ్రీకృష్ణదేవునికున్నట్లు అష్టభార్యలున్నా చక్రవర్తికి ఒక్క బాలుడైనా కలుగలేదు. పట్టపుదేవి సోమాంబామహారాణికి ఇద్దరు బాలికలు ఉద్భవించారు. వారైనా ఆయన ఏభైతొమ్మిదోయేటా, అరవైరెండవ యేటనూ ఉద్భవించారు. జాయపసేనాని అక్కలు నారాంబా, పేరాంబాదేవులకు ఇరువురికీ సంతానమే లేదు.

ఈ ఆలోచనలను లకుమయ దూరంగా తోలి తాను పూజించే చెన్నకేశవుని మరలమరల తలపోస్తూ ఉన్నాడు కాని ఏమిలాభము ? మనస్సు నిలువ దాయెను.

తన అన్నగారూ దెబ్బదిఏండ్లు బ్రతికి చనిపోయి పదేళ్ళయినది. అప్పటికి అన్నకొడుకులు, గన్నయ్య, విఠలయ్యాను చిన్న బాలకులు. వారి అక్క కుప్ప సానమ్మను మాల్యాల గుండయ్యప్రభువుకు వివాహం చేశారు తన అన్నగారే.

గన్నయ్య ఈలా గజదొంగ అవడం ఏమిటి ? తానూ పాడయ్యాడు, తమ్ముణ్ణీ పాడుచేసుకొన్నాడు. గోనవంశానికి తీరని కళంకమే. అయితే ఏమి ? అలాంటి కళంకాలు వస్తూనే ఉంటాయి. వీళ్లు అలా గజదొంగలు కావడం మంచిదే. తన మనస్సులోని శంకలన్నీ మాయమయ్యాయి.

ఇంక వివాహం సంగతి. ఆదవోనివారికి మళ్ళీ వేగుపంపించి ముహూర్తం నిశ్చయంచేసి నగరంచుట్టూ రిక్కసిమూకలలాంటి సైన్యాలు కావుంచి, వివాహం పూర్తిచెయ్యాలి. అప్పుడు ఇటూ, అటూ అని ఊగులాడే కోటారెడ్డి ఈ ప్రక్కకు వచ్చివేయడం జరుగుతుంది.

హరిహరదేవునికి చక్రవర్తిత్వమట ! ఎవరిస్తారయ్యా ! హరిహరదేవుడు యుద్ధంలో ఆరితేరిన బంటుకాకున్నా ప్రస్తుత కార్యవ్యవసాయానికి ఆతడు మంచి నాగలి కాగలవాడు.

రుద్రమదేవి తెలివైనది. ఆమెకై చాళుక్య వీరభద్రుడు నిట్టూర్పులు విడుస్తున్నాడు. కాని తాను పురుషుణ్ణంటుంది. పురుషునని ఆ బాలికకు పెళ్ళికూడా చేశారు ముమ్మడమ్మను. ఇప్పుడు ముమ్మడమ్మస్థితి ఏమిటి ? ఆమెను రుద్రమ్మ ఏమిచేస్తుంది ? గణపతిరుద్రప్రభువు తక్కిన సామంతులతోపాటు మూడు నెలల క్రిందట తమ్ము పిలిచినమాట నిజమే. అప్పుడి త కుమారుడైన రుద్రదేవునియెడ మేమందరము రాజభక్తి కలిగిఉండాలని మాచేత వీరప్రమాణాలు చేయించుకున్న మాట నిజమే. అయితే రుద్రమదేవి రుద్రదేవుడయినగదా, తమ ప్రమాణం నిలిచేది ? వృద్ధచక్రవర్తికి మతిపోయింది. మొన్న వివాహ ముహూర్తానికి 'సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, ప్రతిహితచరిత, వినయవిభూషణ శ్రీహనుమకొండ పురవరాధీశ్వర, చలమర్తిగండ, మూరురాయజగదాళ !' అనే బిరుదాలతో రుద్రమ్మ తండ్రీ తానూ చక్రవర్తులయినట్లు బహుమానాలు పంపించినది. ఓహో, ఆడవాళ్ళచేతలు !

తనకు రుద్రమ్మపై కోపమ లేదు కోపమేమీలేదు. ఆడదానిపై కోపమేమిటి? ఆమె పూతనా, తాటకా, శూర్పణఖా ? ఆమెను ఏ చాళుక్యునికో, ఏ ఇతర మహామండలేశ్వరునికో ఇచ్చి వివాహంచేసి పంపించివేద్దాముగాక.

లకుమయకు మనస్సు నిలువదు. "ప్రభూ ! రక్షించు. ఈదుర్భర రాజధర్మాలు భక్తుల మనస్సులుకూడా పాడుచేస్తాయి" అనుకొంటూ పూజపూర్తి చేశాడు.

## 3

ఓరుగల్లులో, రాజనగరులున్న లోపలికోటలో, అంతా నిమ్మకు నీరెత్తినట్లు ఉన్నది. వృద్ధులయిన శ్రీ శ్రీ గణపతి రుద్రదేవ చక్రవర్తి తన సౌధ నగరిలో, స్వయంభూదేవారాధనతత్పరుడై చల్లగా కైలాసేశ్వర పాదపద్మారాధనకై ఈ దేహం చాలించి ఎప్పుడా వెళ్ళడము అని నిరీక్షిస్తున్నారు.

అత్యంతావసరమైతేగాని తమతో రాజ్యవిషయాలు చర్చింపవద్దని చక్రవర్తి ఆజ్ఞచేశారు. మహామంత్రులైన శివదేవయ్యదేశికేంద్రులు శివమాహాత్మ్యం, శైవ వేదాంతం వినిపిస్తూ ఉంటారు. మహాకవులనేకులు తమ తమ రచనలు వారికి చదివి వినిపించి, ఆ సార్వభౌములవల్ల బహుమతులు, అగ్రహారాలు, ధనరాసులు పొందుతూ ఉంటారు.

కవిబ్రహ్మ, ఉభయకవిమిత్రుడు సింహపురాన్నుంచి తాను రచించిన ఆంధ్ర మహాభారత పర్వాలు, ఆశ్వాసాలు ఎప్పటికప్పుడు ఆంధ్రసార్వభౌముని కడకు పంపిస్తున్నారు. అవి పంపించడం ప్రారంభించి మూడుసంవత్సరాలైనది. విరాటోద్యోగములు, భీష్మద్రోణపర్వములు పూర్తిఅయినవి. చక్రవర్తి శ్రీ తిక్కనకవి సోమయాజి దివ్యకవితామృతంలో ఓలలాడుచూ ఎప్పుడు తదితర పర్వాలు వస్తాయా అని ఎదురుచూస్తూవుండెను.

ఒక ప్రొద్దయినను సార్వభౌమునికడకు శివదేవయ్యమంత్రి, శ్రీ శ్రీ రేచెర్ల ప్రసాదాదిత్యప్రభువు విచ్చేసినారు. చక్రవర్తి శివదేవదేశికులకు లేచి నమస్కారం చేసినారు. చక్రవర్తికి ప్రసాదాదిత్యుడు మోకరించి నమస్కరించినాడు. వారిని కూర్చుండ నియమించి డెబ్బదిఏండ్ల యా వృద్ధచక్రవర్తి తాను తన పల్యంకసింహాసనంపై కూరుచుండి, దిండులమీద ఒదిగి "గురుదేవా! ఉదయమే దయచేశారు!" అని ప్రశ్నించారు.

శివ : ప్రభూ! ఒక్కనిమేషము ఏకాంతం ఇప్పించాలి.

అక్కడ వివిధాసనములపై అధివసించి శివదేవయ్యదేశికులు రాగానే సార్వభౌమునితోపాటు లేచిన పండితాది బ్రాహ్మణులు, ఆరాధ్యులు, జంగమ గురువులు లేచి అవలికి వెళ్ళిపోయిరి. కంచుకులా మహామందిర కవాటములు బంధించి తాము వెడలిపోయిరి.

శివ : మహాప్రభూ! వివిధ దేశాలలో త్రిలింగ సామ్రాజ్యంపై కుట్ర లెక్కువౌతున్నవి.

గణ : ఎవరు? ఏలా కుట్రసలుపదలుచుకున్నారు? రెండేళ్ళనాడు సామంతులందరూ వచ్చి తమ రాజభక్తిని ప్రమాణపూర్వకంగా ప్రకటించి వున్నారుకదా!

శివ : నిజమే మహాప్రభూ, కాని శ్రీరుద్రదేవయ్యవారిని పురుషునిగానే యెంచి మనం ప్రమాణం చేయించితిమి. వారందరూ అలాగే చేసిరి. శ్రీ రుద్రదేవయ్యగారు పురుషులేనని చెబుతూ ఎంతకాలం రహస్యం దాచి వుంచగలవారం? ఏనాడో ఆ రహస్యం బయలుపడవలసిందేనని మహాప్రభువు తెలియనిదికాదు.

గణ : అవును. మేము పరమశివుని సన్నిధిని చేరినవెనుక కొంతకాలం శ్రీరుద్రదేవయ్య చక్రవర్తిగా రాజ్యపాలన సాగించి నిలద్రొక్కుకొన్న వెనుక అప్పుడు రహస్యం నెమ్మదిగా బైటపెట్టవచ్చునుగాక. ఈలోపుగా తొందరేముంది?

శివ : మహాప్రభూ! శ్రీ ప్రసాదిత్యనాయనింవారు కొన్ని ముఖ్యవిషయాలు తమకు తెలియజేస్తారు.

ప్రసా : మహాప్రభూ! గోన లకుమయ్య, ఆదవోని కోటారెడ్డి, కంపహోలు పందిభూపాలుడు, కల్యాణపుర చోడోదయుడు, వూగినాటి కోటపెమ్మాడిరాయుడు, కందూరి కేశినాయకుడు. వీరంతా కలిసి కుట్రచేస్తున్నారు. తుంబలిక, మానువ, హొయసవాళ్ళూ ఆ కుట్రలో కలవాలని వువ్విళ్ళూరుతున్నారు. దేశవెలుకి, మేడిపలి కాచయప్రభువుల నుండేకాక ఈలాటి రహస్యవార్తలు అటు తూర్పునుండి, దక్షిణదేశాలనుండి వస్తున్నాయి. వారందరికీ చిన్నచక్రవర్తుల రహస్యం తెలిసిందని అనుమానించవలసి వుంటుంది.

శివ : అందుకనే మహాప్రభువులకు నేను మనవిచేసేది, ముందుగా రుద్రదేవులు స్త్రీయే అని లోకానికి చాటడం, తర్వాత....

గణ : మహామంత్రీ! ఈ విషయంలో మీరూ, రుద్రదేవప్రభువులూ, ప్రసాదాదిత్యులూ ఆలోచించి ఏదిమంచిదైతే అదిచేయండి. ఎవరు కుట్రలో చేరబోతున్నారో వారిని ధర్మంగా శిక్షించండి. అనుమానరహితం చేసుకొని మరీ పనికి దిగండి. చూడండి, మహాకవి తిక్కన సోమయాజులవారు వుద్యోగపర్వంలో ఈవిషయం ఎంతచక్కగా వర్ణించారో! ధర్మరాజు ఆఖరకు అయిదూళ్ళడిగి అప్పుడు కాదనిపించుకొనికూడా శ్రీకృష్ణులవారి రాయబారం నడిపించారు. ఓహోహో ఏమి అద్వితీయ కవిత్వం! తమ పురుషార్థంలోని భావాలు ఎన్నో వున్నాయి ఆయన మహాగ్రంథంలో, ఇక సెలవు. విషయాలు ఎప్పటికప్పుడు తెలియజేయండి.

శివదేవయ్యమంత్రి ఏబదిరెండేండ్ల యీడువాడు చామనచాయవాడు. సన్నగా పొడుగ్గా వంగిపోయి వుంటాడు. మహామాత్యులైన చెన్నాప్రగడ గణపామాత్యుల మేనల్లుడు. ఆరాధ్యుడైన వీరశైవుడుకాడు. విష్ణుభక్తికలవాడు, అఖండ పండితుడు, వేదవేదాంగ పారంగతుడు. సకలశైవాగమవేత్త. మేనమామవలె అఖండవైద్యుడు. చక్రవర్తిచేత అనేకవైద్యాలయాలు, ప్రసూతి ఆలయాలు, వైద్యవిద్యాపరిషత్తులు ఏర్పాటుచేసిన ధర్మశీలి, సర్వతంత్ర స్వతంత్రుడు. తన

బావగారైన గోపరాజురామప్రధానిచే త్రిలింగ మహాసామ్రాజ్యంలో రాజ్యపాలన నిర్వక్రంగాజరిగేటట్లు చూస్తున్నవాడు, శివపూజా ధురంధరుడు.

ఈవల ప్రసాదాదిత్యనాయుడు కాకతీయవంశంతోపాటు వుద్భవించిన రేచెర్లవంశ ముక్తాఫలము. రేచెర్ల వారందరూ కాకతీయవంశ మూలపురుషుడైన బేత ప్రభువు కాలంనుండి కాకతీయ ప్రభువులకు దక్షిణహస్తాయిగా వుండిన మహా పద్మనాయక వెలమకులజులు. అఖండ శౌర్య సంపన్నులు. సూక్ష్మబుద్ధిశాలురు. కాకతిప్రభువులకు పెట్టనికోటలు.

శివదేవయ్యామంత్రి నాయనివంక చూచి "సేనాపతీ! రుద్రమదేవివారి మనస్సు మార్చడం ఎల్లాగు? ఆ దేవికి మీరు స్త్రీలమ్మా అనేభావం నచ్చచెప్పడం ఎలాగు?"

"గురుదేవులవారికి నేనా సలహా ఇచ్చేది! ఈపాటికి ఏదో ఎత్తువేయకుండా వుంటారూ?"

"ప్రసాదాదిత్యులవారూ! మానవప్రకృతి మనుష్యుని ఊహకుమించి నడుస్తూవుంటుంది."

"మహామంత్రీ! చాళుక్య వీరభద్రులవారికి తమరు ఎందుకు వార్తపంపి నట్లు?"

"యవ్వనహృదయాన్ని, యవ్వనహృదయమే గ్రహిస్తుంది. చాళుక్య వీరభద్రమహాప్రభువు యౌవనవంతుడు, మహావీరుడు, కామినీ జయంతుడు. ఆయనకు యువమహారాజుల హృదయం అర్థంకాకూడదా అని రప్పించాను."

"తమ అభిప్రాయం నేను తెలుసుకోలేనంటారా? పైగా రుద్రదేవ మహా ప్రభువులు, చాళుక్య వీరభద్రప్రభువు కలసి ఎందుకు వేటకు వెళ్ళడం ఏర్పాటు చేశారు?"

"ప్రసాదాదిత్యులవారూ! మీరు మన మనుకున్న మువ్వన్నె మెకాన్ని సిద్ధంచేశారా?"

"అన్నీ సిద్ధమే. నేను ఆ ప్రదేశంలోనే వారివువురకు తెలియకుండా సిద్ధంగానే వుంటున్నాను."

## ४

శ్రీ లకుమయారెడ్డి మహారాజుకు అన్నగారు బుద్ధారెడ్డి సాహిణి. ఈయన భువనగిరి రాజధానిగా ముచికుందసీమ రాజ్యంచేస్తూ శ్రీ శ్రీ సమధిగత పంచమహా శబ్ద, మహామండలేశ్వర, పరమమాహేశ్వర, పతిహితచరిత, విజయవిభూషణ, శ్రీ అనుమకొండ పురవరాధీశ్వర, చలమర్తిగండ, మూరురాయ జగదాళ నామాది సమస్త ప్రశస్తిసహితం, శ్రీ స్వయంభూదేవర దివ్య శ్రీపాదపద్మారాధకులైన

శ్రీమన్మహామండలేశ్వర కాకతీయమనుమ రుద్రదేవ మహారాజులను భక్తితో కొలుస్తూ ఉండెను.

కల్యాణి రాజైన తైలపుణ్ణి ఓడించడంలో శ్రీ శ్రీ కాకతి రుద్రదేవ చక్రవర్తికి సహాయంచేసినవాడాయెను బుద్ధారెడ్డి.

భువనగిరికి దక్షిణంగా ముప్పై గవ్యూతుల దూరంలో వర్ధమానపురం అనే పురము ఉండెను. ఆ పురము రాజధానిగా మామకోటవిషయాన్ని తెలుగు చోడులు రాజ్యం చేస్తూ ఉండిరి.

వర్ధమాన మహాపురం నాలుగు గవ్యూతుల మహాదుర్గం. అపరిమిత భోగ భాగ్యాలతోనున్నూ అనేక దేవాలయాలతోనున్నూ అనుమకొండను మించిఉండేది. ఆ పురం రాజధానిగా శ్రీ శ్రీ కాకతి రుద్రదేవ మహారాజు కాలంలో భీమచోడుడు తన సోదరుడు గోకర్ణచోడుడు మంత్రిగా, సేనానాయకుడుగా, యువరాజుగా రాజ్య పరిపాలనం చేస్తూ పశ్చిమచాళుక్య చక్రవర్తైన తైలప మహారాజుకు సామంతుడుగా ఉండెను.

ఆ భీమచోడనృపాలుడు వెనుకటి శ్రీకృష్ణుని మామైన కంసభూపాలుని యశం తన అపయశంచేత తెల్లగా కనిపింపజేసే పరమదుర్మార్గుడు. తన సవతి తల్లిని విలాసవతిగా చేసికొని ఉన్నాడు. సవతితల్లి కుమారుడు, బాలుడు చిన్న గోకర్ణుడు తిరగబడి అసహ్యించుకొని కళ్యాణికి వేగు పంపించగా, వాడు భోజనం చేస్తూ ఉండే సమయాన వాణ్ణి చంపించాడు భీముడు.

ఆ మహాపాపం భారతభూమిని గగ్గోలుపరిచింది. భువనగిరికొండల్లో మారుమ్రోగగానే రుద్రుడైన శ్రీ గోన బుద్ధరాజు అనుమకొండకు శ్రీ రుద్రదేవ చక్రవర్తులకు సహాయం రావలసి దనీ, ఆంధ్ర చక్రవర్తుల వల్లని వెన్నెలవంటి ప్రభుత్వానికి ఈలాంటి పాపిని రాజ్యం చెయ్యనీయడమే కళంకం అనిన్నీ వినతి పత్రం పంపుకొన్నాడు. పశ్చిమచాళుక్య తైలపదేవ చక్రవర్తి రుద్రచక్రవర్తి పరాక్రమంవల్ల జబ్బుచేసి గుండె పగిలి కథావశేషుడుకాగా, ఆ రాజ్యం యావత్తూ భీమచోడనృపాలుడు ఆక్రమించుకొన్నాడు. కాబట్టి చక్రవర్తిత్వానికి సంపూర్ణత్వం సిద్ధించవలసివున్నదనియు మనవి చేసుకొన్నాడా వేగులో.

శ్రీ భువనగిరిపురవరాధీశ్వర, సతిహితచరణ బుద్ధారెడ్డి సాహిణి వర్ధమాన పురం ముట్టడించగానే భీమచోడు డుగ్రుడై మహాకోపంతో సర్వబలాలతో వచ్చిన బుద్ధారెడ్డిని తాకినాడు. మూడురోజులు మహాయుద్ధం జరిగింది. భీమచోడుణ్ణి పరాక్రమవంతుడున్నూ, వ్యూహరచనాసమర్థుడున్నూ అగు బుద్ధారెడ్డి అన్నిద్వారాల దగ్గరా పూర్తిగా ఓడించేసరికి, భీమచోడుడు వర్ధమానపురం కోటలోకి పారి పోయినాడు.

ఇంతలో రుద్రదేవ చక్రవర్తి అఖండసైన్యంతో విచ్చేస్తున్నాడని వేగులు ఇరువాగులవారికినీ అందినవాయను. భీమచోడుడు ఒక రాత్రి రాత్రి ఆంధ్ర సైన్యాలు ఏమరుపాటున ఉండగా సమస్తమందితో దుర్గాంతో పర్వతాలకు పారిపోయినాడు.

బుద్ధారెడ్డి వర్ధమానపురం పట్టుకొన్నాడు. ఇంతలో భేరీ భాంకారాది వాద్యాలు మోగుతూ వుండగా పెద్ద ఉప్పెన వచ్చినట్లు అఖండంగా ఆంధ్ర సైన్యాలను నడిపించుకొని చక్రవర్తి స్వయంగా విచ్చేసి వర్ధమానపురంలో పాపం పొందిన రాజభవనాలు నేలమట్టంచేసి భీమచోడుణ్ణి తరుముకుపోయి అతనిచే జోహారనిపించుకున్నారు. భీమచోడుడు తన కుమార్తె పద్మావతిని శ్రీ రుద్రదేవ చక్రవర్తికి కన్యాదాన సమర్పించి చక్రవర్తికి మామగారై, చేసిన పాపనివృత్తికిగాను సంసారం త్యజించి వీరశైవదీక్ష తీసికొని తపస్వియై మహాబలేశ్వరం వెళ్ళిపోయ్యాడు. పెద్ద గోకర్ణచోడుని కందూరులో తనకూ బుద్ధారెడ్డికీ సామంతమండలేశ్వరుడుగా చక్రవర్తి నియమించినాడు. మానుకనాటి మహామండలానికి రాజప్రతినిధిగా, మండలేశ్వరుడుగా ఇదివరకు ఉన్న శ్రీ బుద్ధారెడ్డి సాహిణి మహారాజును చక్రవర్తి పట్టాభిషేకం చేసినాడు.

శ్రీ రుద్రదేవచక్రవర్తి అవతారం చాలించాడు. శ్రీ మహాదేవరాజు చక్రవర్తి దేహం చాలించాడు. శ్రీ గణపతిదేవ చక్రవర్తి రాజ్యపాలనం వచ్చింది.

ఆ బుద్ధారెడ్డికి ఓడ్డలు లేరు. ఆయనకు ఏబదితొమ్మిదవఏట రెండవ భార్యయైన ఎరుకసానమ్మ దేవేరియందు కుప్పమాంబ అనే కుమార్తెయున్నూ, గన్నారెడ్డి, విఠల ధరణీశుడు అనే కుమారులున్నూ రెండేళ్ళ చొప్పున తేడాలుగా పుట్టినారు. బుద్ధారెడ్డి తన తమ్ముడైన లకుమయారెడ్డిని తన యువరాజుగాను, సేనాయకుణ్ణిగాను చేసికొని ఉన్నాడు. శ్రీ గణపతిదేవ చక్రవర్తి రాజ్యానికి వచ్చిన నలుబదియేండ్లకు బుద్ధారెడ్డి తనకు ఎనుబది ఏడు ఏండ్ల వయసులో దేహం చాలిస్తూ తమ్ముణ్ణి పిలిపించి తన పెద్ద కుమారుడైన గన్నభూపతి తరపున రాజ్యం చేయవలసిందనిన్నీ, వాడు పెద్దవాడు కాగానే వాడి రాజ్యం వాడికి ఇచ్చి 'నువ్వు బుదపురి పరిపాలించవయ్యా లకుమయా!' అని సెలవిచ్చి లింగైక్యమందినాడు.

లకుమయ మహావిచారంతో రాజ్యభారం పూని అన్నకుమారునికి బదులుగా రాజ్యం చేస్తూ ఉండెను. శ్రీ గణపతిదేవచక్రవర్తికి బాసటయై పశ్చిమాన విరోధులైన రాజుల్ని హతమారుస్తూ ఆంధ్ర సామ్రాజ్యం విస్తరింపచేశాడు.

రాజ్యపరిపాలన చేసినకొద్దీ రాజ్యకాంక్ష మొలకెత్తింది. కోరలు పోయి, పంజాలకు బలంతగ్గిన సింహమైనట్లు శ్రీ గణపతిరుద్రదేవులు ముసలివాండ్రై ఉండగా ఇదే అదనని లకుమయ రానురాను అనుమకొండలో విద్య అభ్యసిస్తున్న

రాజకుమారులకు పంపించవలసిన మహారాజభూతాదికప్పులు పంపించడం మాని వేశాడు.

పద్మానపురంలో స్వామినివేదనలు, అర్చనలు గన్నభూపతిపేర చది వించడం మానివేశారు. సంవత్సరాదినాడు పట్టాభంలో వైతాళికులు, వందులు శ్రీశ్రీ గన్నభూపతి మహారాజా! అని పాడుటమాని, శ్రీ లకుమయ మహామండ లేశ్వరులపేరు పాడుతున్నారు. లకుమయ శిలాతామ్రశాసనాల్లో గన్నరెడ్డిపేరు లిఖించడం మానిపించాడు.

మహారాజ తంత్రజ్ఞులైన శివదేవయ్యమంత్రులు, మహాసేనాని జన్నిగ దేవులు, రాజభక్తిపూరితచరిత్రుడు ప్రసాదాదిత్యనాయకులున్నూ సామంతమండ లేశ్వరులు తిరగబడకుండా ఆంధ్ర మహాసామ్రాజ్యం జాగ్రత్తగా కాపాడుకోవ డంలో మునిగి ఉన్నారు. వాండ్లకు గన్నారెడ్డికి ఆలోచన చెప్పడానికి తీరిక లేదాయెను.

లకుమయ బలవంతుడు, చాలా ధనం కలవాడు. అతనివైపువాండ్లు చక్రవర్తి ఆస్థానంలో ఉండనే ఉండిరాయను. వాండ్లుపోయి వృద్ధచక్రవర్తి చెవిలో లకుమయా రెడ్డి రాజభక్తి వేనోళ్ళవర్ణిస్తూఉండిరి.

అప్పుడాలోచిస్తూ "ఏమయ్యా! ఈ విషయాలు యావత్తూ శ్రీ శివదేవయ్య దేశికులకు విన్నవించండి. గోన గన్నయ్య చాలా మంచివాడు అనుకొంటిమి. వీర విద్యలయందూ, సర్వశాస్త్రాలయందూ అతడు పండితుడవుతూ ఉండెను. మాయందూ, యువరాజులవారియందూ ఎంతో భక్తిగా ఉండెను. మీరు పలికే పలుకులు విరుద్ధంగా ఉంటున్నవేమి?" అని శ్రీ గణపతిరుద్రదేవులు అన్నారు.

మహారాజాధిరాజా! అదే గన్నయ్యలో ఉన్న విచిత్రము! అయినా, విశల నఘుడూ, అనేకులు బాలకులు ఓరుగల్లుపురంలో చేసే అల్లరి మహాప్రభువులతో విన్నవించేది ఎవరు?"

"సరేనయ్యా. మా కీ గొడవలు పట్టవు. చిన్న మహారాజులుంగారితో మనవిచేసుకోండి" అని గణపతిదేవులు లకుమయపక్షంవారిని పంపివేశారు.

వారు తిన్నగా లకుమయారెడ్డికి రహస్యచారునితో ఈలా లేఖ పంపించారు.

"శ్రీ శ్రీ ఓం నమఃశివాయ
తేయాద్దేవో ద్విరవదనః శర్మనః శైశవేయః
పాయంపాయం కరవిరళతశ్చాపలచ్ఛాత్కృతేన
ఆప్తైస్తస్య ప్రచుర వృషతై ర్వ్యాపయత్యంబికాయాః
స్తైర్యాన్మర్త్యాన్ స్త్వైరివకుచయుగం మౌక్తికై ర్ముక్తదోషః.

స్వస్తి. శ్రీ శాలివాహనశక వర్షంబులు ౧౧౮౩ దుర్మతి సం. ర ఫాల్గుణ శు ౧౦ గురువారంనాడు శ్రీ సకలగుణాలంకార, పరనారీమూర, వర్ధమానపుర పరేశ్వర, వీరలక్ష్మినివేశ్వర, దోర్బలభీమ, రణరంగరామ, వితరణకర్ణ, శౌర్య సౌవర్ణ, పతిహితాంజనేయ, శౌచగాంగేయ, సత్యరత్నాకర, దుష్టజనభీకర, స్వామిద్రోహరగండ శ్రీ శ్రీ గోనవంశాబ్ధికులచంద్రుండు శ్రీ శ్రీ లకుమయారెడ్డి మహారాజులవారికి అనేక విజయాలు ఆశీర్వదించి ఆత్రేయగోత్ర పవిత్రుడు ఈశ్వరభట్టుమనవి. ప్రభూ, ప్రొద్దుగుంకుతూ ఉండెను. అనేక శకున సంతానాలు అల్లకల్లోలంగా ఉండెను. బూరుగ చెట్టున కర్ణపక్షి, చిన్న పురుగులతో దిక్కులేకున్నది. తాము సుఖంబుండుడు. అనుష్ఠానంబులు సరిగా అవుతున్నవి" అన్న ఉత్తరం పంపించారు.

లకుమయ సర్వసన్నద్ధుడౌతూ, మంచి లోహకారులచేత ఈటెలు, భల్లాలు, శూలాలు, చురకత్తులు, సువ్వలు, బాణాలు చేయించి, కేశమునుకూడా పన్నెండు భాగాలుగా చేయగల పదును పెట్టిస్తుండెను. అనేక ఫలకాలు, శిరస్త్రాణాలు, కవచాలు చేయిస్తూ ఉండెను. తన దేశంలో వ్యవసాయంచేసే రెడ్డిపిరుల్ని, ముఖ్యంగా బోయమన్నీలను సిద్ధచేస్తూ ఉండెను. ఎప్పటికప్పుడు రహస్యచారులు వార్తలను ఆదవోనికి, కందవోలుకు, కందూరుకు అందచేస్తూ ఉండిరి.

యాదవరాజ్యానికి వార్తలు వెడుతూఉన్నవి. రుద్రయ్యమంత్రి పరివారంగా ఉత్తరంగా ప్రయాణంచేసి, దేవగిరి చేరాడు. దేవగిరి ప్రభువుల మంత్రియైన భవానీభట్టు రుద్రయ్యమంత్రిని అత్యంత స్నేహంతో ఆహ్వానించి తన భవనంలో మహారాజోపచారాలు చేయించాడు.

ఆ రాత్రి శౌణరాజ్యయువరాజు మహాదేవరాజును రుద్రయమంత్రి కలుసుకొన్నాడు. ఆ సమావేశంలో మహాదేవరాజు ముఖ్యసేనానాయకుడు పింగదేవుడు కూడా ఉండెను.

"మహాప్రభూ! ఒకలక్ష ఎనుబదివేల కాల్బలము, మూడువేల అశ్వవాహంతులు, ఏబది ఏనుగులు మా మండలేశ్వరులు సిద్ధంచేశారు. వీరుకాకుండా బోయమన్నీలెందరో సిద్ధం అవుతున్నారు ఇవిగాక మహావీరులతోకూడిన సైన్యాలతో ఇంకను పెక్కుమంది మండలేశ్వరులు మమ్ము కలుస్తారు మీరు ఎప్పుడు రాగలిగితే ఆనాడు మేమంతా సిద్ధం" అని రుద్రమంత్రి మహాదేవరాజుతో మనవి చేశాడు.

మహా : మహామంత్రీ! ఆంధ్రులందరూ సిద్ధంగా వుండవచ్చు. మేమున్నూ సిద్ధంగా వున్నాము. మా సైన్యము రెండులక్షల యాభైవేల కాల్బలము, మా అశ్వసైన్యము ఇరవైవేలున్నది. మా సైన్యంలో మూడువ దల ఏనుగులున్నాయి.

భవానీభట్టు మహామంత్రీ! మా వృద్ధమహారాజు ఆంధ్రులపైకి వెళ్ళవద్దంటారు. వారుకూడా శ్రీ గణపతిదేవులులా మోక్షానికై ఎదురుచూస్తున్నారు.

ఇప్పుడే ఓరుగల్లుపై యుద్ధానికి రావడం పీలుపడదు. మీరంతా సంపూర్ణంగా సిద్ధం కండి. మేము ఎప్పటివార్త అప్పటికి అందజేస్తూంటాము.

రుద్రమంత్రి : ఇంత సులభంగా మా రాయబారం పూర్తికాగల దనుకో లేదు. మాకీ దినము ఆనందదినము.

భవానీభట్టు : రుద్రయమంత్రులవారూ ! మేము ఏ దారిని వస్తామో ఆ దారిలో మీ సైన్యం కొంత మాకు కలవాలి. మేము ఓరుగల్లును ముట్టడించగానే మీరు మీ తక్కిన సైన్యాలతో వచ్చి మా సైన్యంలో చేరిపోవాలి.

రుద్ర : అలాగే చేస్తాము. ప్రభువులు నాకు రేపు బయలుదేరటానికి సెలవిప్పించాలి.

రుద్రయ్యమంత్రి అతిజాగ్రత్తగా శౌండదేశచారుల సహాయంతో స్వదేశం వస్తూ ఉండెను. గోదావరినిదాటి రెండుదినాలు ప్రయాణంచేసి వచ్చినాడు. రాత్రులే ప్రయాణం. పగలు ఏదో గ్రామంలో ఆగిపోతూ ఉండెను. రుద్రయ్యమంత్రి కాశీ ప్రయాణంచేసి వచ్చే ఉద్యోగివలె వేషము వేసుకొని ఉన్నాడు.

ఒకనాడు బొలినవాడ అనే గ్రామంలో విడిదిచేసి ఉన్నప్పుడు పగలు ఎవరో ఆయింటిని చుట్టుముట్టివేసినారు. "ఏడయ్యా దొంగరుద్రయ్య, రాజద్రోహి రుద్రయ్య, పాపి రుద్రయ్య !" అంటూ ఆ బ్రాహ్మణుని ఇంటిలోకి విచ్చుకత్తులు, భల్లాలు ఝళిపిస్తూ బిలబిలమంటూ విచ్చుకత్తులవారు వచ్చిపడ్డారు.

"పాపం ! ఈ రుద్రయ్యామంత్రి మహానుభావుడు. దేవగిరి కాశీనుంచి వర్ధమానపురం రామేశ్వరానికి పోతూఉన్నాడు. అహాహా ! శ్రీ శ్రీ గోన బుద్ధారెడ్డి ప్రభువుదగ్గర అత్యంత నమ్మకంతో పనిచేసిన మాధవమంత్రి కొమారులు రుద్రయ్యామంత్రులు ఆంధ్రరాజ్యాన్ని తరింపజేయడానికి అపర మహేశుడు యాదవ మహాదేవుణ్ణి తీసుకువస్తాడట !" అంటూ గజదొంగ గన్నారెడ్డి గదిలోప లికి చక్కావచ్చాడు.

గన్నారెడ్డిని చూడగానే రుద్రయ్యమంత్రి అయిదుప్రాణాలు వేసంకాలంలో సీసు ఆవిరిఅయినట్లు అయిపోయాయి.

అయినా, లేనిధైర్యం తెచ్చిపెట్టుకొని, రుద్రయ్యమంత్రి గన్నారెడ్డిని చుఱు చుఱు చూచాడు. 'ఏమి ! నువ్వెవరవు ? బుద్ధిలేదా ? శ్రీ శ్రీ అపర మహేశ్వరులు గణపతిరుద్రదేవప్రభువు రాజ్యంచేసేదేశం కాదనుకున్నావా ?" అని రుద్రయ్య మంత్రి మండిపడ్డాడు.

గన్నారెడ్డి ఫక్కున నవ్వి 'అబ్బే ! ఆడది రాజ్యంచేస్తూంది అనుకున్నా ! అవును, మరి ఆలా ఆడది రాజ్యంచేయకుండానే మనం అందరమూ ప్రయత్నం చేస్తున్నాముకాదా రుద్రమంత్రీ !' అన్నాడు.

'అన్నగారూ! ఇతడేనా మహానుభావుడు మాధవయ్యామంత్రులవారి జ్యేష్ఠ పుత్రుడు?' అని ప్రక్కనున్న బాలుడు విఠలధరణీశు డన్నాడు.

ఆరడుగుల పొడుగువాడు, వెడదఉరంవాడు. పంచె వెనక్కు విరచికట్టి, తలపాగా వయ్యారంగాచుట్టి, వక్షంమీద చేతులుకట్టుకుని నూనూగుమీసాలు ఆడుతూండగా నవ్వుతూ నిలిచివున్న గోనగన్నారెడ్డి, ఇరవై యేళ్ళ ఈడువాడు, అన్నగారికన్న ఒక అంగుళం పొట్టివాడు, భీమునివంటి బలవంతుడు, అన్నగారివలె వేషం వేసికొని, కత్తిదూసి నిలుచున్న విఠలధరణీశుని భుజంపై చేయివేసి 'తమ్ముడూ! ఆ కత్తిని వరలో ముడువవయ్యా! మన రుద్రయ్యామంత్రులవారి మీదనేనా అంతకోపం?' అంటూ పకపక నవ్వాడు.

'రుద్రయ్యగారికి భవానీభట్టు విందులు బాగాతగిలాయి. మహదేవరాజు బహుమతులు అమూల్యమైనవి ఉంటాయి. ఆ మూటలు, ఆ తోలుపెట్టె అన్నీ పట్టుకుపదండి మహారాజా!' అని సూరన్నరెడ్డి, ఒక ఏనుగుగున్నలాంటి మనిషి అన్నాడు.

సూరన్నరెడ్డి అయిదడుగుల పదిఅంగుళాలు ఉంటాడు. విఠలధరణీశుడు భీముడైతే ఈతడు ఘటోత్కచుడే! అతనిచేతిలో ఎప్పుడూ ఒక మణుగుబరువు గల ఉక్కుగద ఉంటుంది.

'అవునయ్యా సూరన్నరెడ్డీ! పద. మనం ఎల్లాగా దొంగలమే! అన్నిటికంటె అమూల్యమైనధనం రుద్రయ్యామాత్యులే! ఆయన్ని సపరివారంగా మన కోటకు తీసుకుపోదాం పద' అన్నాడు గన్నారెడ్డి.

అప్పుడా బందిపోటుదొంగలు రుద్రయ్యామాత్యులను, పరివారాన్ని, వారి పెట్టెల్ని బేడల్ని పట్టుకొని ఎక్కడికో మాయమైపోయారు.

## తృతీయ గాథ

# రుద్రదేవి

౧

ఓరుగల్లుకు ముప్పదిగవ్యూతుల దూరంలో గోదావరితీరారణ్యా లున్నవి. గోదావరితీరావివి గంభీరమైన అడవులు. కృష్ణాతీరానివి అందమైన అడవులు. హిమాలయపర్వతారణ్యాలు దివ్యమైనవి. మలయద్వీపారణ్యాలు భయంకరారణ్యాలు.

ఈ అరణ్యాలలో వెలుగెరుగని నేలలున్నాయి. నల్ల, ఎఱ్ఱ, రాతి మొదలైన ఏవిధమైన నేలా కనబడని గడ్డిజాతులు, ముళ్ళజాతులు, లక్షలకొలది తీగెలజాతులు, ఓషధులజాతులు, నేలమట్టం మొక్కలు, చిన్నజొంపాలు, నిలువెత్తు గుబురులు, నిలువున్నరఎత్తు ముసుర్లు, ఆకాశంఎత్తుచెట్లు, అడుగుమందాలతీగలు, చేయిమందం తీగలు, సాలితంతుల తిగెలు అనేకజాతులవి. అనేకజాతులవృక్షాలు. కరక్కాయ, ఉసిరిక, జీడి, తాళిక, తంగేళ్ళు, మద్దులు, రేలలు, ఊసపాలలు, మామిళ్ళు, తాడులు, ఇప్పలు, చంద్రలు ఒకదానిలో ఒకటి చొచ్చుకుపోయేవి, అన్నిదెసలూ ఆక్రమించేవి, ఆకులముళ్ళు, కాయలముళ్ళు, పూవులముళ్ళు, కొమ్మలముళ్ళుకలవి, మంచివాసనకొట్టేవి, కారపువాసనకొట్టేవి, చేదువాసన, మత్తువాసన, దుర్గంధము కొట్టేవి, రంగురంగుల పూవులవి, చిన్నపూవులవి, పెద్దపూవులవి, అడివిమల్లె, అడివిపారుజాతం, శేఫాలిక, అందాలఆకులు, రంగురంగుల ఆకులు, అనేకరూపాల ఆకులు, పొడుగువి, పొట్టివి, నీటిదగ్గర పెరిగేవి, రాళ్ళరాళ్ళమధ్య పెరిగేవి. ఈలాంటి మహారణ్యంలోకి శ్రీరుద్రదేవి యువరాజులవారు, శ్రీ చాళుక్య వీరభద్రమహారాజు, పురుషవేషంతో ఉన్న చెలులు, శ్రీ శ్రీ చాళుక్య మహాదేవరాజు, శ్రీ సత్రము బొల్లమరాజుమంత్రి, శ్రీ తంత్రపాలు మల్లినాయకుడు, రాజబంధువు శ్రీ విరియాల ముమ్మడిరాజు అనేక సైన్యాధిపులతో, వీరులతో, వేటవిద్దెపాటవం కల బోయీలతో, అడవిచెంచులతో, కోయదొరలతో వేటకు వేంచేసి ఉన్నారు.

యువరాజు శ్రీ రుద్రదేవులు వేటకు వస్తున్నారంటే, వారికి వేటకు వెళ్ళే రాజపథంలో ఉండే మండలేశ్వరులకు, విషయోద్యోగులకు, దశగ్రామాధిపులకు, గ్రామాధిపులకు, రైతులకు, కులకరణులకు రాజాజ్ఞలు వెళ్ళినవి. దారిలో సర్వసౌకర్యాలు కలిగించవలసిందని, అందుకు కావలసినధనం చక్రవర్తుల కోశాగారమునుండి అందజేయబడింది. ఓరుగల్లు మహానగరాన్నుండి వేలకొలది ఉద్యోగులు వచ్చి దారిపొడుగునా కట్టుదిట్టాలు చేశారు.

వేట నిర్విఘ్నంగా జరుగుతున్నవి. క్రూరమృగాలను వేటకాండ్లు రెచ్చ గొట్టడం, రుద్రదేవి, చాళుక్యవీరభద్రుడు, మహాదేవప్రభువు, విరియాల మల్లాంబిక బాణాలు ధనస్సుల సంధించి చెవులకంట ఆల్లె త్రాళ్లులాగి, సువ్వున ఆ క్రూర మృగాల గుండెల్లోంచి దూసిపోవేయడం, పెద్దపులులు, చిరుతలు, ఎలుగులు, అడవిపందులు, సివంగులు, అడవిపిల్లులు కుప్పకూలడం జరుగుతున్నది.

ఏ కారణముచేతనో చాళుక్యవీరభద్రుడూ, రుద్రమదేవీ తమతమ గుఱ్ఱాల మీద స్వారి అవుతూ అడవిలో ఒకభాగంలో తారసిల్లారు.

వీరభద్రుడు : ప్రభూ! మీ గురి అర్జునునికి పాఠాలు నేర్పుతున్నది.

రుద్రదేవి : మీరు విన్న సాయంకాలము పరువేసిన బెబ్బులి రెండు కళ్ళ మధ్యను జ్ఞాననేత్రం తెరువబడలేదా మహారాజా? ఆ బెబ్బులి నన్ను పగబట్టినట్లు నామీదకు ఉరకటం, మీ రా సమయంలో దగ్గరలో ఉండటం....

వీర : అలా అంటారేమి మహాప్రభూ! మీరు ఏదో యాదాలాపంగా ఉన్న సమయంలో అది మీపైన ఉరికింది. అక్కడ నేను ఉన్నానుగనుక మా ప్రభువు సహాయానికి నేను వచ్చాను.

రుద్ర : మీరు మొదటిబాణం వేయగానే, నా గుఱ్ఱంపై ఉరకబోయిన ఆ పెద్దపులి మీవైపు తిరిగింది. వెంటనే మీ రెండోబాణం దాని మెదడులో నుండి దూసుకుపోయింది! మీ ఉపకృతికి నే నేమి మారు ఈయగలను?

వీర : మహాప్రభూ! మీ స్నేహంకన్న, మీ ఆదరణకన్న నాకు కావలసి నది ఏమున్నది?

పురుషవేషంతో ఉన్న రుద్రదేవి బాలునిలా ఉన్నది. మీసాలురాని పదియా రేళ్ళ కుమారునిలా ఉన్నది. ఆమెతలపై శిరస్త్రాణం ఉంది. వెనుకవున్న ఎత్తైన కేశాలను గట్టిగా ముడివేసినప్పటికీ ధమ్మిల్లము అతిపెద్దదిగా ఉండడంవల్ల అందుపై సన్నని వుక్కుగొలుసుల అల్లికవస్త్రములు వ్రేలాడుచున్నవి.

వృత్తంగాలైన ఆమె సౌవర్ణవక్షోజాలను అదిమి స్తనవల్కలము ధరించి, అందుపై పట్టుతో రచింపబడిన పురుషకంచుకము ధరించి, ఆ కంచుకముపై ఆమె ఉక్కుకవచం ధరించినది. మెళ్ళో పురుషహారములు ధరించింది.

స్త్రీలకు, పురుషులకు ఒకేవిధములైన ఆభరణాలు ఉంటవి. తేడా వనితనంలో మాత్రం ఉంది.

రుద్రదేవి పురుషాభరణాలు ధరిస్తుంది. ఆమె అధివసించిన ఆజానేయము ఉత్తమ అరబీగుఱ్ఱము. ఈ జాతిగుఱ్ఱాలు భరుకచ్ఛం వస్తాయి. అక్కడనుంచి మెరకదారిని ఓరుగల్లు మహాపురము వస్తాయి.

ఆంధ్రులు అశ్వవీరులు కాబట్టే వారిలో అశ్వసాహిణు లెక్కువ. అశ్వ శాస్త్రం తెలియని ఆంధ్రవీరుడు లేనేలేడు. అరబ్బులకు గుఱ్ఱాలన్న ఎంత ప్రీతో ఆంధ్రులకూ అంతప్రీతి. రుద్రదేవి అశ్వసాహిణులలో మహోత్తమ సాహిణి. ఆ నాడామెను అశ్వశిక్షలో మించిన పురుషుడు ఒక్క గోన గన్నారెడ్డిమాత్రమే!

రుద్రదేవిని ప్రేమించని గుఱ్ఱంలేదు. చక్రవర్తి అశ్వశాలలో ఆమె అడుగుల చప్పుడుగూడ ప్రతిగుఱ్ఱమునకు తెలియును.

౨

"ఓహోహో! చాళుక్య వీరభద్రప్రభు వెంత యందగాడు! ఎంతటి వీరుడీయన! ఆయన ధనుర్ముష్టినిర్ముక్త శరము ఇనుపకుడ్యాలనైన భేదించుకుపోగలదు గాబోలు. ఆ పెద్దపులికళ్ళమధ్యనుంచి మెదడులోకి సువ్వన దూసిపోయింది. ఒక్క ఏటుతో గిఱ్ఱున తిరిగి, ఆ అటవిరాజు నేలకూలింది. ఈ ప్రభువెంత చదువుకొన్నాడు. ఎంత శాంతము! ఏ విషయములోనూ చెక్కుచెదరడు. కోపము వీరి జీవితములో ఎప్పుడైనా వచ్చునా? కాని, పనిపట్టినప్పుడు మెరుపువేగాన్ని తాంబేలువేగంలా కనిపింపజేయగల అఖండవేగం! ఉత్తమధర్మం అంతా ఈయనలోనే మూర్తమై ఉందా! ఎంతటి మహాపురుషుడు! సింహంలాంటి బలం కలవాడు, సింహాలను కుక్కలవలె తోలగల విక్రమంగలవాడు" అని రుద్రదేవి ఆలోచనలో చిక్కి తలవాల్చి వాలుగన్నులతో అపాంగవీక్షణాలు పరపుచు వీరభద్రప్రభువును గమనించింది.

అప్పుడా దేవి స్త్రీయైపోయినది. ఆమె కేదో వివశత్వం కలిగింది. తానిట్లా శిఖండివలె ఉండడమేనా? పురుషునికి స్త్రీ వేషంతో ఉండడం ఎంత అసహ్యమో స్త్రీకి పురుషవేషంతో ఉండడమూ అంత భరింపరానిదే! ఆమె జఘనఘనత్వమేమగును? ఆమె పురుషవేషంలో చిన్న బాలుడుగా కనిపిస్తుంది. ఆమె తొడలు తమ రంభాత్వాన్ని పురుషవేషంలో మాయం చేసుకోలేవు. పర్వతసానువువలె కర్కశమై, సౌందర్యవంతమై గంభీరమైన విశాల ఫాలంతో, రక్తపుజీరలు నిండిన విశాలమైన కన్నులతో వెడగుగొల్పె పురుషుని మోములోని పారుష్యము, నున్నగా చంద్రబింబంలా, నిశ్చలమైన చెరువునీటిలా, నీటిలోతేలు తామర పూవులా, తామరపూవులోని రేకలా, లేత జేగురు చిగురులప్రోవులా, ఉదయంలో మంచుతో తడిసిన కాశ్మీరకుసుమపు చేనులా—లాలిత్యాలు మూటలు కట్టే స్త్రీ ముఖంలో పురుషవేషం వేసినా ఎల్లా వస్తుంది?

కాని ఈ మహాభూమి, శాలివాహనులు, ఇక్ష్వాకులు, చాళుక్యులు, కాకతీయులు ఏలిన ఈ పవిత్రమహాంధ్రభూమి తాము రాజ్యం చేయకపోతే విచ్ఛిన్నమై

పోతుంది అంటారు శివదేవయ్య దేశికులవారు. బలమైన రాజు లేకపోతే సామంతులు పాలు విరిగినట్లు మహారాజ్యంనుంచి విడిపోతారట. ఎవరికివారే స్వతంత్రులు అవుతారు. ఏకత్వంలేని చిన్నరాజ్యాలు వేనకువేలు ఈ భరతఖండం అంతా నిండి ఉంటే, వారిలో వారికి సర్వకాలాలా యుద్ధాలు మండిపోతాయి. యుద్ధాలవల్ల ధర్మనాశనం అవుతుంది. అటు సింహాద్రినుండి ఇటు కంచివరకు, తూర్పుతీరంనుండి కళ్యాణకటకంవరకూ తన తండ్రిగారి దివ్యచ్ఛత్రంక్రింద వికసించిఉన్న ఈ మహాంధ్రభూమి క్రిందపడిన మృణ్మయపాత్రలా కోటిశకలాలు కావలసిందేనా ?

రుద్రదేవి ఆలోచన చాళుక్య వీరభద్రుడు గమనించాడు. ఈ బాలిక, ఈ వీరయోషారత్నము తండ్రితో సమంగా రెండుమూడు యుద్ధాలలో పాల్గొన్నది. ఎంతోకాలం ఈమె బాలుడనే తా ననుకున్నాడు. ఎందుచేతనో ప్రథమంనుండీ ఈ బాలుడు తన హృదయం చూఱగొన్నాడు అని తా నా దినాలలో అనుకొనేవాడు.

తన కామె స్త్రీ అని తెలిసినట్లు, నన్ను వీరంతా ఆమెపతిగా నిర్ణయించినట్లు ఈ మహాభాగురాలికి తెలియదు! ఇదంతా రాజధర్మమా ? చిన్నతనంలో ఈమె బాలుడనుకొన్నదినాలలో తనకు కలిగిన స్నేహవిరహవేదన నిజమైన ప్రేమవిరహవేదన కాబోలు! యువకుని జ్ఞానం నిజం గ్రహించలేకపోయినా, హృదయం గ్రహించగలిగింది!

ఆమె చక్రవర్తి, తాను సాధారణ సామంతుడు. త న్నేల ఆమె ప్రేమించవలెను ? బాలికయైనా ఆమె పరిపాలనాజ్ఞానమూ, దక్షతా వర్ణనాతీతము! బాలికయై కూడా బాలునివేషంలో ఎంత అందంగా ఉన్నది. ఈమెలో సత్యభామాదేవి అందాలన్నీ కూడుకొన్నాయి. ఈమెలో లలితాదేవి మహాసౌందర్యము మూర్తీభవించింది. ఆదిశంకరభారతీతీర్థస్వాములవారు రచించిన సౌందర్యలహరే ఈమెగా మూర్తీభవించింది. పురుషవేషంలో ఉన్న ఈ మహాదేవి తన నడకలో, తన ఠీవిలో, తన మాటలలో, తన అశ్వారోహణ నైపుణ్యంలో ఈషణ్మాత్రం ఇటు బాలికాత్వానికిగాని అటు పురుషత్వానికిగాని అపశ్రుతి కలిగించటంలేదు.

ఇద్దరూ ఈలా వేరువేరు ఆలోచనలతో గుఱ్ఱాలను నడుపుకొంటూ వస్తున్నారు.

ఈయన తన్ను బాలికఅని గ్రహించాడా అనుకున్నది ఆమె. స్త్రీ అని గ్రహిస్తే తనకు ఎప్పుడూ లేనిభయమూ, సిగ్గూ వస్తుందేమో! ఈయన అంటే తన కింత ప్రీతి ఏమి ?

ఇంతలో యువరాజు అంగరక్షకులు తంత్రపాల మల్లినాయకుడు, విరియాల ముమ్మడిరాజు అక్కడకు అశ్వాలపై స్వారిఅవుతూ వచ్చారు. భటులు, వేట

కాంగ్రడు, సైనికులు, బోయమన్నీలు, కోయిదొరలు రుద్రదేవరుహారా జున్న కడకు వచ్చారు.

అందరూ కలిసి అక్కడ దగ్గరఉన్న తమకు విడుదులు ఏర్పరుపబడిన ఒక పల్లెకు వే-చేసినారు. ఆ విడుదులలో తాటియాకుల గుడిసెలలో యువమహారాజును శ్రీ చాళుక్య వీరభద్రప్రభువు రక్షించిన సరిఘటననే చెప్పుకొనుచుండిరి.

"ఆ పెద్దపులి ఎక్కడనుంచి వచ్చింది ?"

"ఆకాశంనుంచి ఉరికినట్లు వచ్చింది."

"మనవా శ్శైవ్వరూ ఆ వైపు కాపు ఉండలేదు. ఆ వైపునుంచే అంత తీవిగా నిర్భయంగా నడిచివచ్చింది,"

"ఎదురుగుండా మహారాజులు కనపడ్డారు. గాంగ్రుమని ఆ పెద్దపులి వారి మీద ఉరికింది. బాణాలు ఎక్కుపెట్టేవ్యవధిలేక కత్తి దూశారు వారు. ప్రక్కనే ఉన్న వీరభద్రమహారాజులు పెద్దపులిపై సువ్వున బాణంవేస్తే ఆ పెద్దపులి ఒక దొర్లుదొర్లి పడింది."

"అవును ! మళ్ళీ చెంగునలేచి వీరభద్రమహారాజుపైన దుముకబోతే కళ్ళ మధ్యనుంచి దూసిపోవ నేశాడు బాణం."

ఈవిధంగా విడుదు లన్నిటిలో మహారాజును రక్షించినందుకు చాళుక్య భూపతిని పొగడినారు. గండం తప్పినందుకు భగవంతుని ప్రార్థించారు.

ఇంతలో ఎక్కడనుంచో ప్రసాదాదిత్యనాయనివారు సంరంభంగా ఊడిపడ్డారు ఆయన శ్రీ రుద్రదేవమహారాజులకు నమస్కరించి "ప్రభూ ! నేనూ తమతో వేటాడాలని అంచెలలో వచ్చాను" అని మనవిచేశాడు. రుద్రదేవప్రభువు తమ తండ్రిగారైన సార్వభౌమునిగురించి అడిగినారు. ఆ వెనక యువమహారాణి ముమ్మడమ్మనుగూర్చి అడిగినారు. ఇదివరకే రుద్రదేవమహారాజు తల్లి శ్రీ సామ్రాజ్ఞి సోమాంబాదేవి అస్తమించినది. సవతితల్లులైన మహారాణులనందరినీ కన్నతల్లికన్న ఎక్కువగా ఆయన ప్రేమించేవారు. వారందరినీ గూర్చి ప్రభువు ప్రసాదాదిత్యుని అడిగినారు.

ప్రసాదాదిత్యప్రభువు రెండు దినాలు వేట ఆనందాన్నిపొంది, అక్కడనుండి రుద్రప్రభువుతో కలిసి ఓరుగల్లు ప్రయాణమయ్యెను.

కాకతీయ మహారాజులు, వారి సామంతులు ఆంధ్రభూమిలో అనేక మహా సరోవరాలు నిర్మించారు, వ్యవసాయం వృద్ధిచేశారు.

వీరి ప్రయాణంలో అనేకమగు చెరువులు, గ్రామాలు చూస్తూ ప్రయాణం చేశారు. తమ భావిచక్రవర్తి యువరాజు శ్రీ రుద్రదేవులు వస్తున్నారని గ్రామాలకు తెలియగానే ప్రజలు ఉత్సవాలతో ఎదుర్కొనేవారు. పళ్ళు, పూవులు, కూరగాయలు, బలిసిన మేకపోతులు, పోతరించిన కోడిపుంజాలు, ముత్యాలులా మిల

మిలలాడే రాజనాలు తెచ్చి ప్రభువునకు ప్రజలు ప్రాభృతము సమర్పించు కొనేవారు.

భూమి ప్రజలది. ఆ భూమిని సంరక్షించినందుకు ప్రభువు ఆరవభాగం పన్ను తీసుకుంటాడు. ఆ పన్నైనా ప్రజలకోసమే ఖర్చు. ఆ దినాలలో వ్యవసాయం అనేకరీతులుగా చేసేవారు

ఇంక ప్రభువుకు వచ్చే రాబడి సుంకాలు, అడవులు, గనులు, స్వంత భూములు మాత్రమే।

వ్యవసాయం ఏ వరపువచ్చి పంట పండకపోయినా, ఆ పంటసగం పండినా వ్యవసాయదారులు పన్ను ఈయనవసరంలేదు. (పన్నుకోసం ఈనాటివలె మక్తాలు, జాగీరులు మొదలైనవి లేవు)

ఈ విషయాలన్నీ గమనిస్తూ రుద్రదేవులు ప్రసాదాదిత్యులను, చాళుక్య ప్రభువును ప్రశ్నలడుగుతూ అనుమానాలు అంతరించేసుకుంటూ ప్రయాణం చేస్తున్నారు.

## 3

రుద్రదేవి ఓరుగల్లు చేరింది. నగరం కోటగుమ్మందాటి, వీధులవెంట ప్రజలు జయజయధ్వానాలు చేస్తూఉండగా, గుఱ్ఱం అధివసించి చుట్టూ వీరనాయకులు పరివేష్టించిఉండగా విజయంచేస్తున్నది.

ఇంతలో రాచనగరుల కోటగుమ్మంముందర నూరుమంది బాలబాలికలు పూపుల తట్టలతో పాటలు పాడుతూ ఎదురైనారు, వారి వెనుకనే వారి గరువులు నిలిచిఉన్నారు.

"మా ప్రభువులు మారాజు మహావీరుడయ్యా
అరివీరులకు ఆజి అపరరుద్రుడు
శౌర్యాన అర్జునుడు ధైర్యాన నంది
వీర్యాన భైరవుడు వితరణ దధీచి
జయజయా జయజయా జయరుద్రదేవ
జయ కాకతీవంశజలరాశిచంద్ర"

అని పాడి రుద్రదేవిపై పూవులు చల్లినారు. రుద్రదేవి అశ్వము చెంగున దిగి ఆ బిడ్డలలో నిరువురను దగ్గరకు తీసుకొని హృదయాన కదిమికొని "ఈ బిడ్డల నందరినీ మా నగరుకు తీసుకురండి అయ్యవారూ" అని చెప్పి వారిని వదలి గుఱ్ఱ మెక్కినది ఆమెతోపాటు గుఱ్ఱాలు దిగిన వీరనాయకుల దరూ మరల గుఱ్ఱాల నధివసించి, రుద్రదేవివెంట చనినారు. రాచకార్యానికై పురముదైన యా బాల తన యువరాజు నగరగోపురద్వారంకడ చాళుక్య వీరభద్రుని, ప్రసాదాదిత్య నాయకుని వీడ్కొని అంగరక్షకులతో లోనికి వెడలిపోయెను.

అంగరక్షకులు మహాసౌధప్రాంగణంకడ యువరాజు సెలవంది చెరియొక వైపూఉన్న వారివారి భవనాలకు వెళ్ళిరి.

రుద్రదేవి ప్రాంగణందాటి బాహ్యచతుశ్శాలదాటి అభ్యంతర సౌధప్రాంగణాల గుఱ్ఱం దిగి, గుఱ్ఱాన్నితట్టి, సేవకులు పట్టుకొనివచ్చిన తాటిపటిక బెల్లం గడ్డలు తినిపించి ఆ యుత్తమాశ్వంకడ సెలవుపొంది, లోనికి వెళ్ళిపోయింది.

ఆ సౌధబాహ్యమందిరాలలో కావలిఉండునది పురుషులు. పనిపాటలు సలిపే దాస్యజనులిచ్చు సాష్టాంగ దండప్రణామాలు అందుకొంటూ అభ్యంతర మందిరంలోకి సాగిపోయినది రుద్రదేవి.

అభ్యంతర మందిరాలలో కాపుండేవారందరూ స్త్రీలే. దాసీజనులు దారి చూపిస్తూఉండగా, వైతాళికులు బిరుదులు చదువుతుండగా ప్రభువు అలంకార మందిరంలోకి వెళ్ళినారు. అలంకార శయన మందిరాలలోకి అతి నమ్మకంగల ఇరువదిమంది దాసీలు, ఇరువదిమంది అంగరక్షకులు, ఇరువదిమంది చెలిమికత్తెలు తప్ప ఇతరులెవ్వరూ వెళ్ళడానికి అధికారంలేదు. ఆ అభ్యంతరాంతర మందిరములలోనికి యువమహారాజు తల్లులు, మహారాణులుకూడ అనుమతిలేనిదే రావీలులేదు; యువమహారాజు భార్య శ్రీ శ్రీ ముమ్మడాంబికకును అధికారములేదు.

రుద్రదేవ ప్రభువు అభ్యంతరాంతరాలంకారమందిరములలోనికి పోయి, ఒక పీఠముపై అధివసించగానే దాసీలు పరుగున వచ్చిరి. వారిలో ముగ్గురలంకారిణులుండిరి. ఒక ఆమె శిరస్త్రాణం, గొలుసులవస్త్రం తీసి పక్కదాసీకి అందిచ్చింది. ఒకామె కవచకంచుకము విప్పింది. మరొకతె పాదరక్షలు ఊడ్చింది. వేరొకతె నడుముకు ధరించిన రత్నాలుపొదిగిన బంగారు మొలనూలు విప్పినది పట్టుదట్టీ తీసినది. అందున్న మణులు పొదిగిన దంతపు పిడిగల రత్నాల ఒరగల చురకత్తి తీసింది.

అప్పుడొక చెలి వచ్చి ఆమె దీర్ఘ వినీల కుంతలాల ధమ్మిల్లము విప్పి దంతపు దువ్వెనతో దువ్వ నారంభించినది. ఒకబాలిక ఆ యువరాజు పురుషాభరణాలన్నీ ఒలిచినది. స్తనవల్కలముతో ఆ దివ్యసౌందర్యగాత్రి అపరాజితాదేవివలె ఒప్పినది. ముచ్చెలు తొడుగుకొని, యా కాకతీయకుల రాకాచంద్రిక స్నానమందిరానకు నడచినది. ఆ పాదాల గమనిస్తూ మార్గనిక లిద్దరు ఆమెతో నడచుచుండిరి. ఆమెపాదాలు కమలాల మొగ్గలే, ఆమె పాదాలు పావురాలజంట, ఆమె పాదాలు పాలసముద్రంలో కెరటాల తాకుడువల్ల ఏర్పడిన అమృతంపు వెన్నముద్దలు అని మార్జ్ఞనికలైన ఆబాల లనుకున్నారు.

సుగంధతైలాలు పూసి, పరిమళపు నలుగులు నలిచి, సురభిశోష్ణోదకాల స్నానంచేయించారా బాలలు. స్త్రీ దిగంబరియై స్నానమాచరించాలట. రుద్రదేవి చక్రవర్తి నియంత్రణవల్ల బాలుదౌట కటివస్త్రంతో స్నానం కావించినది.

అయినా ఇరువదిరెండేళ్ళ ఈడుగల ఆ యోషను బంగారురంగులో కాశ్మీర కుసుమవర్ణమూ, జపాకుసుమవర్ణమూ రంగరించి, దిరిసెనపూవు మెత్తదనము కలిపినట్లున్న దేహసౌభాగ్యము చూచి ఆ మార్గనికులు ఉప్పొంగిపోతూ ఉంటారు. జవ్వనము తొంగిచూచుబాలిక కోరికలలా, వెన్నెలలోనికి నీటిలోనుండి తొంగి చూచు కొలు ఎఱ్ఱకలువ మొగ్గలులా ఉన్న ఆయమ మేలిమి పసిడివక్షోజాల శిఖరి తములైన చూచుకాలు కాళిదాస శాకుంతల నాటకంలో నాల్గవ అంకంలోని "శుశ్రూషస్వ గురూన్", "యాస్యత్యద్య శకుంతలేతి" అనే శ్లోకాలులా ఉన్నాయి.

ఆమె దేహము ప్రథిమాయుతము, లాలిత్యయుతమున్నూ. ఆమె దేహము స్పష్టాంగరేఖాసమన్వితము. మాధవీలతవలె, కల్పవృక్షశాఖవలె ఆమెచేతులు మృదులములు, పుష్టిమంతములు. శుంభ నిశుంభాదులపై చెవికంట బాణయుక్తమగు వింటి నారినిలాగు లలితాదేవీహస్తాలా చేతులు.

రుద్రదేవి అతిలోకసుందరమగు తన వనితారూప మావేళ గమనించు కొన్నది. ఇదివర కేనాడు లేనిసిగ్గు ఆమెను ఆవరించి, దేహమంతయు అరుణ మైనది. ఆ సిగ్గుతో ఆమె తన కన్నులు మూసికొన్నది. ఆమెలోని పురుషభావము, ఆమె రూపంలోని దిగంబరవనితాదేహాన్ని చూచి సిగ్గుపడి కన్నులు మూసు కొన్నది.

రుద్రాంబిక స్నానము పూర్తిగావించి, వలిపవస్త్రములు ధరించి అలంకార మందిరానకు పోయి పీఠ మధివసించగానే, చెలులు పరిష్కర్త్రికలు ఆ దేవిని అత్యంతమధురంగా అలంకరించారు.

ఇరువదిరెండేండ్ల సంపూర్ణ స్త్రీ! బాల్యం ఇసుమంతా తరుగని బ్రహ్మ చారిణి. పారిజాతపుష్పంలా నిత్యవికసితయౌవన. ఆస్వాదన కోరని పరిమళము. తుమ్మెదను కాంక్షించని దివ్యపుష్పము.

స్నానంచేసి అలంకరింపబడి ఆ దేవి దర్పణంలో ఎవరినో ఒక లాతి సుందరీరత్నాన్ని చూచికొన్నది. ఆ ప్రతిబింబంలోని బాల తా నెరుగనిది! ఆ ప్రతిబింబంలోని బాల అప్పుడే జవ్వనంపొందిన నవయోష! ఆ ప్రతిబింబంలోని మనోహరాంగి సముద్రసంగమానికి ఉప్పొంగి వరదలై ప్రవహించి వచ్చే నదీ సుందరి! ఆ ముకురంలోంచి తన్ను అరమూతకన్నులతో పరిశీలించు మధురాధర ఏదో మహానుభూతికై ఎదురుచూచు పరమహంసి.

ఆ దర్పణంలోఉన్న సముజ్జ్వలమూర్తి తన్ను చూచి "ఓ బాలికా, ఇక నువ్వు బాలుడవు కాదు. నువ్వు మహారాజువుకాదు. నువ్వు మాయా పురుషత్వం వీడిన శోభాపూర్ణ నవవధువువు! నువ్వు నీ వరునికొరకై ఎదురు చూస్తున్నావు.

నీ ఇంద్రజాలం మాని మహారాష్ట్రభూమిలో నచ్చిన పురుషుణ్ణి కోరుకో" అన్నట్లయినది.

రుద్రదేవి చిరునవ్వు నవ్వుకొన్నది. ఆమె ఆడవారిలో పొడుగైన బాలిక. కత్తియుద్ధంలో, బాణయుద్ధంలో, పరిఘ భల్ల యుద్ధాలలో దేశంలోని ఏ ఇద్దరు ముగ్గురు వీరులో ఆమె తాక కాగగలరు. యుద్ధవ్యూహ రచనంలో ఒక్క జన్నిగదేవ త్రిపురాంతకదేవు లామెకు మిన్న అవుతారేమో!

పురుషవేషము ధరించినప్పుడే ఆమెలో స్త్రీభావము మాయమౌతుంది. కవచము, ఉష్ణీషము ధరించి, ఆయుధోపేతయై ప్రియమగు అజానేయ మారోహించినప్పు డామె అతిపురుషుడు. ఏమాత్రము శంకలేని మహావీరుడగు పురుషుడు. ఆ అశ్వము ఆకాశము అంటేటట్లు ఎగిరినా, లోకాలను ఆవరించేటట్లు దుమికినా, మహావాయువుతో పందెంవేసినట్లు పరుగిడినా ఆ బాలిక చెక్కుచెదరదుకదా! ఎంతో మహానందాన్నిపొంది, ఎగురులో, పరుగులో భాగమై, ఆకాశరాజై, గ్రహాల మేటియై, వాయువే అయి సర్వవిశ్వానానికి నాయికత్వం వహిస్తుంది. అప్పు డామె విశాలమైన కళ్ళు ఆదిత్యద్వయం, అప్పుడామె మందారకుట్మలనాస పాశుపతాస్త్ర జ్వాల, అప్పు డామె బింబాధరాలు విడివడిన ప్రళయాగ్ని శిఖలు, ఆరుద్రదేవుని యెదుర్కొన సాహసించగలిగినవా డొక్క రుద్రుడే!

పురుషవేష మింటికడను ధరించుచుండును. ఆమె బాలికయని ఆ అభ్యంతరాంతర మందిరాల మెలిగే అరవై మంది స్త్రీలకు, మహారాణులకు, చక్రవర్తికి, శివదేవయ్యకు మాత్రమే యెరుక. తక్కినవారికి అనుమానము మాత్రము.

ఆమె పదునెన్మిదేడుల ఈడున అర్ధసింహాసనారూఢయై యున్నప్పుడు సభలో చాళుక్య వీరభద్రుని ఆమన తండ్రిప్రక్క చూచినది.

అప్పుడు శ్రీ శ్రీ గణపతిరుద్రదేవచక్రవర్తి జన్మదిన మహోత్సవానికి శ్రీ శ్రీ నిడుదప్రోలు చాళుక్యమహారాజా ఇందుశేఖరుడు పెద్దకుమారునితోపాటు చక్రవర్తిని దర్శించడానికి వచ్చినాడు. చాళుక్యవీరభద్రున కప్పు డిరువదియొకటవయేడు.

ఆ మహాసభలో చాళుక్యవీరభద్రుడు ఆకాశాన సూర్యదేవునివలె ఒక్కడే ప్రత్యక్షం అయినాడు రుద్రదేవికి.

ఆ రుద్రదేవుడైన రుద్రదేవికి ఒక నిమేషం హృదయస్పందన మాగిపోయినది. వెనువెంటనే యుద్ధభేరీనినాదం మ్రోగుట ప్రారంభించినది. ఆమె అన్నియు మరచి కవుల గంభీరకావ్యగానములు వినక, నర్తకీబృంద మధుర నృత్యాలు గమనించక వీరభద్రునే చూచుచున్నది. వీరభద్రుడు యువరాజును చూచుట కదే మొదటిసారి. చక్రవర్తికుమారుడు రుద్రదేవుని యందము లోకాతీత విషయంగా పండితు లాడుకొనుట వీరభద్రుడు విన్నాడు.

ఆ వర్ణనలు విజానికి కొన్ని యోజనాల దూరంగా ఇప్పుడాతనికి కనిపించాయి. మన్మథునిలో ఎక్కువ ఆడతనం ఉంది. కుమారస్వామిలో ఎక్కువ మగతనం ఉన్నది. జయంతునికి వా రిరువురిలోని తేజస్సులేదు నలకూబరుడు మనుష్యులకు దగ్గరివాడు. వసంతుడు ఒక్క ఋతుకాలమాత్ర సౌందర్యం కలవాడు. వీరందరిలో లేని ఏదో ఒక మహాసౌందర్యోజ్జ్వలత ఈ బాలునిలో ఉన్నదని చాళుక్యవీరభద్రు డనుకొన్నాడు.

కుమారస్వామి శుద్ధవటువు, మన్మథుడు శుద్ధప్రేమికుడు. వీరిద్దరిని తనలో లయించుకొని వీ రిరువురిని మించిన ఈ మహాభాగుడు చాళుక్య వీరభద్రుడా! ఆంధ్రామృతప్రవాహాలు కట్టించిన నన్నయమహాకవికృత భారతాన్ని కృతినందిన రాజరాజనరేంద్ర చక్రవర్తి వంశములోనివాడైన ఈ యువప్రభువు పురుషసౌందర్యానికి పాణినీయసూత్రమని ఆమె అనుకున్నది.

నాటినుండి రుద్రప్రభువు వీరభద్రప్రభువు స్నేహాన్ని వాంఛించాడు.

వా రిరువురు ఎన్నిసారులో కలుసుకొన్నారు. ఒక పర్యాయము వీరభద్రుడు "మహారాజా! కాకతీయవంశానికి చాళుక్యులు శివునికి శూలంలా కాగలరు" అన్నాడు. ఆ భావంలోని ఆనందంచేత రుద్రప్రభువు వీరభద్రుని రెండుచేతులు తన రెండుచేతుల పట్టుకొని తన మూర్ధాన ఉంచుకొన్నాడు. ఆ క్షణంలో వేయి విద్యుల్లత లొక్కసారి వీరభద్రుని దేహమెల్లా ప్రసరించి అతడు ఝల్లుమనిపోయినాడు. వీరభద్రుని కేదో సిగ్గువేసినది. అతడు వెంటనే కాకతీయ మహాప్రభువు చేతులు రెండూ వదలివేసినాడు.

రుద్రప్రభువునకు లోకజ్ఞానమే నశించినది. ఆ ప్రభువునకు అమృతము సేవించిన దేవతలకు కలిగిన వివశత్వము కలిగినది. అది స్నేహప్రభావమని ప్రభువు అనుకొన్నాడు. రుద్రదేవునిలో నిద్రపోవు రుద్రదేవి ఒకసారిగా ఉలిక్కిపడి లేచింది. ఆమె మోము కెంపువారింది. కన్నులుమూసికొనిపోయినాయి. ఆమె వక్షోజాలు పొంగిపోయినాయి. ఆమె పెదవులలో అమృతా లూటలూరినవి.

ఈనాడు చాళుక్యరుద్రునితో అభేదానంద మనుభవించిన రుద్రదేవి అనిర్వచనీయమగు సంతోష మనుభవించుచున్నది. కాబుననే నిట్లలంకరించుకొన్నది.

బాలికావేష మిదివర కెప్పుడును ధరించినది కాదు. ఆనాడు చాళుక్యరుద్రునితో స్నేహముకలిగిన క్షణంనుండి తాను బాలికనని ఆమెకు ఎన్నిసారులో ఆలోచన వచ్చినది. ఆ వచ్చుటకు కారణ మామె ఊహింపలేదు. ఆమెలోని స్త్రీత్వము ఆమె కీడువచ్చిన ఎంతకాలమునకోగాని గురుతు రాదాయెను. ఆమె కీడువచ్చినప్పుడు రాణివాసంలో జరుగు నెలరోజులు మహోత్సవములు జరుగలేదు. ఈడు వచ్చినదని రాణులకు, గణపతిదేవునకు, శివదేవయ్యమంత్రికి మాత్రమే

తెలియును. తర్వాత చెన్నొప్రగడ గుణపామాత్యునకు తెలిసినది. అది అంతటితో సరి.

తాను బాలకుడను భావముతోనే రుద్రదేవి తనలో కలుగు స్త్రీ చిహ్నాలు గమనించకుండ బాలక్రీడలలో మునిగియుండునది. ఈడువచ్చిన ఆనాటి సంఘట నయు అమె కంత పట్టినదికాదు. ఏదియోవంకను మహారాణి సోమాంబ రుద్రాంబ నా మూడు దినములూ అంతఃపురాన నిలిపియుంచినది. బాలికకు జరుగు వేడుక లేవియును ఈ బాలికకు జరుపలేసందుకు సోమాంబికాదేవి లోలోన దుఃఖించినది కాని, రాజకీయావసరముకాన భర్త అజ్ఞయే అమెకు పరమాజ్ఞ అయినది.

అలా ఒకయేడు గడిచింది. రుద్రమదేవిలోని యౌవనచ్ఛాయలు ఎంత మాత్రమైన ఇతరులకు తెలియకుండ మహారాణి ఎన్నియో కట్టుదిట్టాలు చేసింది.

ఒకనాడు రుద్రదేవి ఒకశిల్పము చూచినది. ఆ శిల్పము ఒక దేవీ విగ్ర హము. ఆ దేవీవిగ్రహమునకున్న ఉత్తుంగ వక్షోజాలు, సన్ననినడుము చూచాయగా ప్రదర్శింపబడిన నగ్నత చూచి ఆమె ఆశ్చర్యము పేసినది. ఆ విగ్రహమును రుద్రేశ్వరాలయమునకు బోయిన రుద్రదేవి చూచినది. రుద్రదేవి ఇదివరకెన్నడు ఆలయములు దర్శింపలేదు. నృత్యాలు చూడలేదు. ఇతరబాలికల నగ్నతల నామె యెరుంగదు.

ఆ దినము అనుమకొండ రుద్రేశ్వరాలయానికి ఆమె వెళ్ళునని ఆమెకే తెలి యదు. అనుమకొండలో జరుగు ఒక ఉత్సవానికి సామంతరాజకుమారులతో కలసి ఆమె బోయినది. ఆమె వారితో రుద్రేశ్వరాలయ ప్రాంతాలకు బోవుట తటస్థించినది.

తన తాతగారి అన్న రుద్రదేవ చక్రవర్తి నిర్మించిన మహాదేవాలయం చూడాలని ఆమె కేలనో బుద్ధిపుట్టినది. ఆమె రాజకుమారులకు తనతో రందని ఆజ్ఞ ఇచ్చి గుఱ్ఱము దిగ్గి గుడిలోనికి పోయినది. ప్రక్కనున్న శివదేవయ్య మంత్రు లెవరితోనో మాట్లాడుచుండిరి.

ఈ సమయంలో రుద్రదేవి గుడిలోనికి పోయినది. రాజకుమారులమాటలలో స్త్రీ పురుష భేదము ఆమె కప్పుడు పూర్తిగా అవగాహనం అయిపోయినది. ఆమె తాను స్త్రీనను అనుమానం ధృఢమైపోయింది. వెంటనే మహావేగంతో ఓరుగల్లు పురం చేరింది. తల్లిగారైన మహారాణి సోమాంబికాదేవికడ కామె వెంటనే వెళ్ళింది.

"అమ్మగారూ, నేను మీవంటి బాలికనై ఉంటే, నన్ను బాలకుణ్ణిగా ఎందుకు పెంచి, లోకాన్ని మోసంచేస్తున్నారు?" అని అడిగింది.

మహారాణి తెల్లబోయి "ప్రభూ! చక్రవర్తికి వార్తపంపుతాను. వారు వచ్చినవెనుక మీ అనుమానం తీరుతుంది" అని ప్రతివచనమిచ్చి వెంటనే గణపతి రుద్రదేవులకు వార్త పంపినారు.

వార్త వెళ్ళిన అరఘటికలో మహారాజు మహారాణి అంతఃపురానికి వచ్చినారు. మహారాణి వారితో అంతయు విశదము చేసినారు.

గణపతిరుద్రదేవుడును తెల్లబోయి, స్వయంభూదేవుని ఒక నిమేషం ప్రార్థించి ఒక నిశ్చయానికి వచ్చినాడు. వెంటనే మహారాణి అంతఃపురంలో చక్రవర్తిని కలుసుకొనవలసినదిగా శివదేవయ్య దేశికులకు వార్త వెళ్ళినది.

## ౪

నలభై విఘటికలలో శివదేవయ్యమంత్రి పట్టపుమహారాణి నగరానికి విచ్చేసి తనరాక లోనికివార్త పంపగా మహారాణిఅభ్యంతరసభామందిరాలలో చిన్నదానిలోనికి ముఖ్యమంత్రిని తీసుకొనిరా మహారాణి చెలికత్తెలను పంపినది. వారు దారి చూపుచుండ శివదేవయ్య లోనికి దయచేసినారు. ఆయన పాదాలకు చక్రవర్తియు, సామ్రాజ్ఞియు, రుద్రదేవియు లేచి నమస్కరించి ఉచితాసనంపై కూరుచుండ ప్రార్థించిరి. వారును వారందరిని ఆశీర్వదించి ఉపవిష్టులైరి.

శివ : మహాప్రభూ! ఎందుకు ఇంతతొందరగా నాకు వార్త పంపినారు? యువరాజుగారు తొందరలో నగరానికి రాగానే నేనున్నూ వెంటనే మా గృహానికి చేరాను. ఇంతలో మీ వార్త వచ్చినది.

గణ : మహామాత్యా! రుద్రప్రభువు తాను బాలికయై ఉండగా ఏల పురుషునిగా తన్ను పెంచినారు అని అడుగుతున్నారు.

శివ : అలానా! రుద్రప్రభువులు చాళుక్యమహావంశచరిత్ర ఎరుగుదురా అని మనవిచేసుకుంటున్నాను.

రుద్రదేవి : ఎరుగుదును బాబయ్యగారూ!

శివ : ఆ వంశంలో ఇద్దరు ముగ్గురు కుమారులు చక్రవర్తులకు కలుగుతూ ఉండడము, ఆ అన్నదమ్ములు రాజ్యానికి వారిలో వారు పోరుతూ దేశానికి అరిష్టం తీసుకువస్తూ ఉండడము జరిగినదాయెను. ఆ జ్ఞాతియుద్ధాలవల్ల సుభిక్షమైన ఈ నాడులన్నీ కాటకాలకు లోనవుతూ ఉండేవి.

రుద్ర : మహామంత్రీ! చాళుక్య మహారాజుల చరిత్రకూ నన్ను పురుషునిగా పెంచడానికీ సంబంధం ఏమిటి?

శివ : ప్రభూ, వినండి. రాజులేని రాజ్యం తలలేని దేహంవంటిది. ఒక రాజ్యానికై ఇద్దరు రాజులు పోరువడడం రాజు లేకపోవడమేగదా!

రుద్ర : మీరు నాకీ రాజనీతి చిన్నతనంలో బోధించినారు.

శివ : అలాంటప్పుడు నేనువచ్చి మళ్ళీ పాఠాలన్నీ జ్ఞాపకంచెయ్యాలా కాకతీయప్రభూ !

రుద్ర : మా నాయనగారికి మగపిల్లలు లేకపోవడంవల్ల నేను బాలిక నైనప్పటికీ నన్ను బాలునిగా పెంచారు.

శివ : చక్రవర్తికి తమ్ములన్నాలేరు. ప్రతాపరుద్ర చక్రవర్తికి ఉంపుడు కత్తెకు పుట్టిన సారంగధరదేవునకు మాత్రం ఇద్దరు పుత్రులు హరిహర, మురారి దేవు లున్నారు. వాళ్ళకీ రాజ్యం కబళించాలని ఉన్నది. ధర్మసంరక్షణార్థం ఒక్కొక్క దేశానికి ఒక్కొక్కరాజే ఉండాలి. మన తెలుగు మహాసామ్రాజ్యము అనేక చిన్నచిన్న రాజ్యాలుగా ముక్కలై ఉంటే ధర్మసంరక్షణం జరగదు. ఈ రాజ్యం కోసల విషయమనీ, కళింగమనీ, వేంగివిషయమనీ, నతవాటిసీమ, గృధ్రవాడ విషయము, మంజిష్ఠదేశము, కమ్మనాటి విషయమనీ, వెలనాడనీ, అరువేలనాడనీ, పూగివిషయమనీ, పొత్తపినాడనీ సింధనాడనీ, సింధనాడనీ, మార్జనాడనీ, మానువ నాడనీ, కొరవదేశమనీ, కొలనిపాక విషయమనీ, చక్రకోట్యమనీ, మంత్రకూట విషయమనీ ఈ విధంగా చిన్నచిన్న రాజ్యాలతో నిండిఉన్నది. వీని నన్నిటినీ ఏకచ్ఛత్రంక్రిందికి తీసుకువచ్చి, సుఖరాజ్యం స్థాపించి, ధర్మపరిపాలనచేస్తూ, శాంతిభద్రతల నెలకొల్పి పురుషార్థాలు వెల్లివిరిసేటట్లు చేయవలసిన బాధ్యత మహా పురుషులది ! చాళుక్య రాజ్యాలు రెండూ నాశనం అయ్యాయి. ఆ తర్వాత మీ పెద తాతగారైన రుద్రమహారాజు తండ్రి ప్రోలమహారాజులు కాకతీయసామ్రాజ్యం స్థాపించారు. చాళుక్యులు బలవంతులుగా ఉన్నంతకాలం, శ్రీ ప్రోలమహారాజు తండ్రి శ్రీ భేతమహాప్రభువు వారికి నమ్మకంగల మండలేశ్వరుడై సామంతుడై ఉండెను. భేతమహారాజు తండ్రి శ్రీ ప్రోలమహారాజు, వారితండ్రి భేతమహారాజు మహామండలేశ్వరులై, సామంతులై ఉండిరి.

గణపతి : తండ్రీ ! నాకు పుత్రులు కలుగలేదు. ఇందరి రాణులలో ఒకరి గర్భమూ ఫలించలేదు. స్వయంభూదేవుడు ప్రసాదించిన శక్తితో, ఈ దేశికుల సహాయంతో కాకతీయ సామ్రాజ్యము వృద్ధిచేసి దేశంలో ధర్మం నెలకొల్పాను. అలాంటి ఈ మహారాజ్యానికి యువరాజు లేడు. తల్లీ ! నువ్వు పుట్టడమే హిమ వంతుని ఇంట పార్వతి జనియించిన ట్లయింది నాకు. చిన్నవారైనా నాకు పంచా క్షరి ఉపదేశించి అర్జునునికి సారథ్యం చేసిన శ్రీకృష్ణునివలె ఈ శివదేవయ్య దేశి కులు నువ్వు ఉద్భవించగానే నాకు పుత్రులు పుట్టబోరనీ, నీ జాతకమునందు మహాసామ్రాజ్ఞీత్వము వ్రాసిఉన్నదనీ చెప్పి పుత్రుడుదయించు కట్టుదిట్టాలు చేయించారు.

మహారాణి : తల్లీ నిన్ను పుత్రునిగా పెంచడం ఎంత కష్టమైంది ? చక్ర వర్తీ, మహామంత్రీ ఆలోచించి చేసిన ఏర్పాటిది.

శివ : ప్రభూ! ఈ భూమిలో ధర్మం కొనసాగడానికే ఈ విధానం అవలంబించాము. మీరు బాలికలని చెప్పగల శుభముహూర్తం వస్తుంది. ప్రపంచంలో ఆర్యభూములలో ఇదివరకు సంభవించని ఒక దివ్యఘటన ఇప్పుడు సంభవిస్తుంది గాక! మీరు అఖండ ఆంధ్ర సామ్రాజ్య సింహాసనం అధిష్ఠించాలని మిమ్ము బాలకునిగా పెంచాము తల్లీ! వీరపురుషోచితమైన విద్యలన్నీ మీకు నేర్పినారు. మీరు ఉత్తమోత్తమ చక్రవర్తులు కాగలరు. ఇదీ రహస్యం.

రుద్రదేవి తలవాల్చికొని 'నన్ను క్షమించండి బాబయ్యగారూ, నన్ను ఆశీర్వదించండి గురుదేవా! అమ్మగారూ! మీసహజోదారహృదయంతో నన్ను మీ హృదయంలోకి తీసుకోండి. మీరు నా కర్పించిన ఈ దివ్యధర్మాన్ని నా ప్రాణాలతో కాపాడుకొంటాను' అన్నది.

* * * * *

ఆ సంఘటన అంతా ఈ రోజున అద్దంలో తన ప్రతిబింబం చూచుకొనే రుద్రదేవికి జ్ఞప్తికి వచ్చినది. తాను స్త్రీయని లోకము తెలుసుకొనవలసిన సమయమే తెంచినదా?

స్త్రీకి రాజ్యార్హత ధర్మశాస్త్రం ఒప్పుకోదు. ధర్మం ఒప్పనిదే లోకం ఒప్పదు. శ్రుతి మొదటిప్రమాణ మన్నారు. శ్రుతికి వ్యాఖ్యానం స్మృతి కాబట్టి శ్రుతికన్న ఎక్కువ ప్రమాణం స్మృతి అన్నారు. లోకాచారం శ్రుతినిబంధనాచరణలో పెట్టడమే కాబట్టి, లోకాచారము పరమప్రమాణ మన్నారు. ఒక ఉత్తమపురుషుడు ప్రారంభించిన పనిని తక్కిన సర్వలోకమూ నెమ్మదిగా ఆచరిస్తుంది. అదే ఆచారము. ఆంధ్రాచారమైన మేనరికం అలాంటిదేకద!

తాను చక్రవర్తి అవును. అయిన తనకు భర్తకావలెనా? ధర్మము స్త్రీని వివాహము చేసికొనితీరవలె నంటున్నది. భర్త పోయినచో సన్యాసినిగా ఉండవచ్చును గాక!

అప్పు డామెకు పందొమ్మిదవఏట తనకు జరిగిన వివాహ విషయము జ్ఞాపకమునకు వచ్చినది. ఆమె వదనమంతట చిరునవ్వులు ప్రసరించినవి. ఆమె అధరాంచలాల అమృతప్రస్రవణాలు మిలమిలలాడి ఉబికిపోయినవి.

ముమ్మడమ్మ కమ్మనాటి నాయకుడైన జాయపమహారాజు కుమార్తె. శ్రీగణపతిరుద్రదేవునకు జాయపసేనాని బావమరిది. ఆయన కుమార్తె ముమ్మక్కదేవి అందాలరాణి. ఆ బాలిక మేనత్తలైన శ్రీ గణపతి చక్రవర్తి రెండవ, మూడవ మహారాణులైన నారాంబా, పేరాంబా దేవులకడనే పెరుగుచుండెను. ఆమె కుమారరుద్రప్రభువుకన్న రెండేండ్లుమాత్రమే చిన్నది. ఆ బాలిక గానసరస్వతి, నృత్యవిశారద, విద్యాభారతి, సౌందర్యలహరి. ఆమె ఇంతబాలిక యైనప్పటినుండి యువరాజైన రుద్రదేవుని ప్రేమించినది.

"బావగారూ, ఇవాల మనం ఇద్దరం ఏమి ఆడుకొందాం ?"

"ఏమిటి ఆడుకొందాం ముమ్మక్కదేవిగారూ ?"

అప్పుడు ముమ్మక్కదేవికి మూడేళ్ళు. రుద్రప్రభువునకు అయిదేళ్ళు. పెద మహారాణిగారి నగరికి దాసీలు ఎత్తుకొని ముమ్మక్కదేవిని తీసుకొచ్చేవారు.

"బావగారూ, నన్ను ఈ బెమ్మక్కలాచ్చసులు ఎత్తెకుపోయాలంట, మీరు గుల్లం ఎక్కి కత్తి పుత్తుకొని, ఆ లాచ్చసున్ని దలిమికొత్తి, తరిమేత్తాలుత. అప్పులు వత్తి నన్ను లత్తిత్తాలుత."

"బాగుంది ముమ్మక్కగారూ! నేను కత్తిపుచ్చుకు సిద్ధంగా ఉన్నాను" అని బాలరుద్రదేవుడు (రుద్రదేవి) తన మొలలో కట్టిన చిన్న కత్తిని పుచ్చుకొని, దాసీ బెమ్మక్కను తరుముకు వెళ్తూ "రాచ్చసీ చంపివేత్తాను! నువ్వు అనగా అనగా నా రాజపుత్త్రికను ఎత్తుకుపోతావా?" అంటూ ఆమెను పొడిచినట్లు నటించారు.

బెమ్మక్క ఘొల్లుమంటూ ఆ తోటలోని గడ్డిలో విరుచుకు పడిపోయింది.

రుద్రదేవుడు ముమ్మక్కకడకు పరుగిడి 'రాజకుమారీ! నిన్ను రాచ్చసుని చంపి రక్షించి మాదేశము తీసుకు వెలుతున్నాను' అని తెల్పి ఆమె చిన్నచేతులు పట్టి లేవనెత్తి తనతోవచ్చు యింకొకదాసీకి అప్పచెప్పుతూ 'తక్కిన రాచ్చసుల్ని కూడ చంపివేత్తాను' అన్నారు.

౨

ఆటలలో, పాటలలో, చదువులో శ్రీరుద్రదేవ ప్రభువును, శ్రీ ముమ్మడమ్మయు ఎప్పుడూ కలుస్తూ ఉండేవారు. ముమ్మక్క రుద్రదేవుని చూడక ఒక్క దినమైనా వెళ్ళనిచ్చేదికాదు. రుద్రదేవుడు నీభర్త అని అందరూ అంటూవుంటే ముమ్మడాంబికకు సంతోషం పొంగిపోయేది. రుద్రదేవుని కలుసుకొనడానికి వెళ్ళినప్పుడెల్ల ఆ బాలిక వన్నెవన్నెల వస్త్రాలు, ఆ వస్త్రాలకు తగిన ఆభరణాలు ధరించేది. ఏడువారాలవికావు, ఏదేడువారాల వేషాలూ వేసుకొనేది. ఒకనాడామె ఉషోబాల, ఒకదినాన ఆమె జనకుని ఇంట శైశవ క్రీడల దేలు సీతమ్మ, ఇంకొకనాడామె లేతవెన్నెల కిరణము. మరిఒక్క దినం ఆమె దివ్యంగా జ్వలించే ఉడుబాల.

ఆ ఆటలలో, ఆ ఆనందాలలో వారిరువురూ పెద్దవారైనారు. ముమ్మక్కకు వయస్సువచ్చి అంతఃపురాంగన అయినది. వసంతోత్సవములలో, పండుగ దినాల యందు, మహారాజజన్మదినోత్సవములలో తక్క, ఇతర సమయాల నామె రుద్రప్రభువుకంట పడకూడదు.

ఒకతూరి వసంతోత్సవసమయంలో ముమ్మడాంబిక వనదేవతవేషం ధరించి, వసంతవేషముతో రుద్రదేవ యువరాజు ఒంటిగా వసంతోద్యానవనాన సంచరించే సమయాన, పదునారేడుల ఈడుగల ఆ ముద్దులగుమ్మ వెనుకగావెళ్ళి ఆ యువరాజు కళ్ళుమూసింది. రుద్రప్రభువు ఉలికిపడి 'ఎవరు?' అని తొందరపాటుగా ప్రశ్నించెను.

'బావగారూ! నా పేరు చెప్పుకోండి?'

'ఓహో! నా ప్రియురాలు ముమ్మడాంబికాదేవా?'

'నెగ్గారు మీరు' అని ముమ్మడాంబిక చేతులుతీసి 'నేనే ఓడిపోయాను ఏమి చేయమంటారు?' అని ప్రశ్నించింది.

'అదిగో! ఆ పొదరింట కూచుందామంటాను.'

వారిరువురూ ప్రక్కనున్న పొదరింటిలో కూర్చుండిరి. ముమ్మక్క దేహం చెమర్చిపోయినది. భరించరాని సిగ్గు, ఎవరైనా వస్తారేమోనన్న భయం!

'ముమ్మడాంబికాదేవీ! మొన్న మా చిన్న అమ్మగారి సౌధాలకు వస్తే, మీరెక్కడా కనిపించలేదే?'

'నేను మిమ్ము చూడకూడదని అత్తయ్యగార్లిద్దరూ ఆంక్షలు పెట్టారండీ, కాని మిమ్ములను చూడనే చూశాను.'

'మీరు దినమూ ఏమి చేస్తూ ఉంటారు?'

'నాన్నగారి సహాధ్యాయి గొంకనభట్టువారు నాకు నాట్యమూ, సంగీతమూ, సాహిత్యమూ చెప్పుతున్నారు.'

'ఈ మధ్య మీ నాట్యము నేను చూడనేలేదు. మామయ్యగారు రచించిన నృత్తరత్నాకరము అంతా చదివాను. చదువుతోంటే నాకు ప్రతిక్షణమూ నాట్యం చేయాలనే బుద్ధి!'

'బావగారూ! మీతో ఆటలు ఆడకూడదని మా అత్తయ్యగార్లు నిషేధించి నప్పటినుండీ నాకు మతి....మతి....పూర్తిగా....పోయినట్లే ఉంది. నా నాట్యం మీకు నిజంగా చూడాలని ఉందా?'

'తప్పకుండా! నాట్యం చేయలేను కాని, నాట్యం చెయ్యాలని ఎంతో ఊహ! కాని నన్ను మహారాజు నాట్యం చూడకూడదన్నారు. దేవాలయాలలోకి వెళ్ళవద్దన్నారు.'

'బావగారూ! రేపు అత్తయ్యగార్ల నగరులకు రండి. నా దాసి బెమ్మక్క మహామందిరములో నుంచుని ఉంటుంది. అప్పుడది ఎలా తీసుకువెడితే అలా రండి! మీరు మాటిచ్చారు సుమండీ! మరచిపోకండి.'

ముమ్మడమ్మ రుద్రదేవుని మెడ గట్టిగా కౌగిలించుకొని నున్నని చెంప ముద్దిడుకొని, మరుక్షణంలో మాయమైనది.

ముమ్మడమ్మ ఒళ్ళు ఝల్లుమంది. ఆమె కపోలాల చిరుచెమటలు పట్టినవి. ఆ పరుగు పరుగు ఆ వనంలో ఉన్న ఒక క్రీడాసరోవరంకడ ఆగింది. అక్కడ అనేకులు బాలబాలికలు ఉయ్యాల లూగుతున్నారు. ముమ్మడాంబను చూచి, రాకుమారికలు కొందరు వయ్యారాల నడకలతో ఆమెకడకు వచ్చి ఆమెను మేలమాడ చొచ్చిరి.

రుద్రదేవునికి తాను బాలికనని అంతకుముందు విజయదశమి ఉత్సవాలకే తెలిసినదికదా ? ఇప్పుడు ముమ్మడమ్మ మాటలకు యువరాజుకు ఎంతో నవ్వు వచ్చింది. తన్ను బాలికలందరు ప్రేమించుట కారంభింతురు కాబోలు నని ఆ ప్రభువు మరింత నవ్వుకొన్నారు.

ఈలా ముమ్మడమ్మ రుద్రదేవుల నాటకం జరిగి జరిగి చతుర్థాంకాన వారి కిరువురకు వివాహమైనది. జాయపసేనానికి గణపతిరుద్రదేవ చక్రవర్తియు, శివదేవయ్య మంత్రియు రుద్రమదేవి రహస్య మెరిగించి, ఆంధ్రమహారాజ్య సంరక్షణార్థము రుద్రదేవికి స్త్రీని వివాహం చేయవలసి ఉన్నదనిన్నీ, అందుకు చిన్ననాటి నుండీ కలసిమెలసి పెరిగిన ముమ్మడమ్మను రాజకుమారునికి వధువుగా తాము నిశ్చయించామనీ, చక్రవర్తి బావమరిదియు, రాజభక్తిపూరితుడును, ఉత్తమ సంస్కారియు, మహాసేనానాయకుడు నగు జాయపసేనాని అందు కేమీ అభ్యంతరము చెప్పదని తమ భావమనియు తెలిపిరి. జాయపసేనాని సంతోషంతో ఒప్పుకొన్నాడు.

రుద్రదేవ ప్రభువు స్త్రీయని లోకానికి తెలిపేకాలం వచ్చేసరికి ముమ్మడమ్మను రుద్రదేవితోపాటే ఒక ఉత్తమ మండలేశ్వరున కిచ్చి వివాహము కావింతమని శివదేవయ్య మంత్రి జాయపసేనానికి చెప్పినాడు.

శ్రీ శ్రీ కాకతీయ మహారాజవంశచంద్రుడైన యువరాజు శ్రీ రుద్రదేవ ప్రభువునకూ, శ్రీ శ్రీ జాయపమహారాజపుత్రిక ముమ్మక్కసానమ్మదేవేరికి అఖండవైభవంగా వివాహం అయింది. సింహాద్రినుండి కంచివరకు, మోటుపల్లినుండి కల్యాణపురివరకు గల మహామాండలికులు, మహాసామంతులు, రాజబంధువులు, రాజప్రతినిధులు, మహామంత్రులు, మాండలికులు, సామంతులు, మహాకవులు, గాయకులు, కృష్ణవేణీతీరస్థ కూచిపూడి నటకులు, నర్తకీమణులు వేంచేశారు.

నిడుదప్రోలు రాజ్యప్రభువులు శ్రీ ఇందుశేఖర చాళుక్యమహారాజు వేంచేసినాడు. సారసపురాననుండి శ్రీ ఇందులూరి సోమరాజమంత్రీ, ఆయన తమ్ముడు శ్రీ పెదగన్నయమంత్రీ దయచేసినారు. వేంగీ విషయాధినాథుడు కాలపనాయక మహారాజును, నిర్మలమహాపురినుంచి చౌండసేనాధిపతియు, అద్దంకినుండి సారంగపాణిదేవమహారాజు, గుడిమెట్టనుండి శ్రీ సాగిచాగరాజమహాప్రభువును, ధరణికోటనుండి మహామండలేశ్వర కోటరుద్రమహారాజును, అతని పుత్రుడు బేతమహారాజును, సప్తగోదావరీ మధ్యదేశ కోనమండలాధిపతి హైహయ శ్రీ కోనరాజ మహారాజును,

పెళ్ళికొమార్తె పెదతండ్రి పృథ్వీనాయకుడు, పినతండ్రి నారపనాయకుడు, వారి తండ్రుల బిడ్డలయిన కమ్మనాటి ప్రభువులు, రుద్రదేవుని ఇరువురు మేనత్తలు, గణపతిచక్రవర్తి చెల్లెళ్ళయిన మైళమాంబ, కుందాంబదేవుల రాజ్యమైన నతనాటిసీమ కధిపతులైన మహామండలేశ్వర రుద్రదేవరాజు తన ఇద్దరి దేవేరులతోను, బుద్ధపురమునుండి మల్యాల గుండయమహారాజు, వర్ధమానపురమునుండి గోన లకుమయారెడ్డిప్రభువు, అదవోనినుండి కోటారెడ్డిమహారాజు, కందూరునుండి కేశినాయకప్రభువు, కందవోలునుండి నందిభూపాలుడు, కల్యాణమునుండి చోడోదయ మహారాజు, కోసగినుండి మైలపదేవుడు, రేచర్లవంశమహావీరుడు రుద్రప్రభువు, పిల్లలమఱ్ఱినుండి బేతిరెడ్డిప్రభువు, నాగులపాటినుండి విరియాలవారు, పమ్మిప్రభువులు, ముప్పవరప్రభువులైన పంట మల్లిరెడ్డిప్రభువులు వివాహానికి వేంచేసినారు.

౬

వివాహం అఖండవైభవంగా జరిగింది. నెలరోజులు దేశమంతా ఉత్సవాలు జరిగినాయి. రాజధానీనగరమైన ఏకశిలానగరం అంతా గంధర్వనగరమైపోయింది. ఆ నగరాలంకారములో ఆకాశపు పందిళ్ళు, ఏనాటికానాడు పచ్చటి మామిడాకు తోరణాలు, అరటిస్తంభాలు, పూవులు రంగు రంగు అద్దకాల మేల్కట్టుల తెరలతో వెలిగిపోవుచుండెను. నగరమంతయు భోజనశాలలు; ఆ శాలల్లో వివిధదేశాల వివిధరుచులకు తగిన శాల్యన్నాలు, గోధుమరొట్టెలు, వివిధశాకాలు, పచ్చళ్ళు, తొక్కులు, పులుసులు, చారులు, పిండివంటలు, చిత్రాన్నాలు, షాడబాలు వడ్డించుచుండిరి.

ప్రతిదినమూ కవి పండిత గాయక నాట్యగోష్ఠులు, రాత్రికాలాల యక్షగానాలు, తోలుబొమ్మలాటలు జరుగుచుండెను.

గురు, మహాప్రధాన, సామంత, సేనాపతి, ద్వారపాలక, అవసరిక, ఘటికావిర్ధారక, నటక, లేఖక, పౌరాణిక, పురోహిత, జ్యౌతిషక, కార్యజ, విద్వాంసక, దేవతార్చక, మాలాకారక, పరిమళకారక, చేష్టాధికార, గజాధికార, అశ్వాధికార, భాండాగారాధికార, ధాన్యాధికార, అంగరక్షక, సూత, సూద, భేతాళమత, తాంబూలిక, తాళవృంతక, పల్యకింకావాహక, ఛాత్రిక, దామరిక, కరాచిక, శారికాకీరమాలిక, పాదుకాధార, వర్తక, గాయక, వైణిక, శాకునిక, మాగధ, వైతాళిక, స్తుతిపాఠక, పరిహాసక, క్షౌరక, రజక, సౌచుక, చర్మకారక, ముద్రాధికారక, పురపాలక, గజవైద్య, అశ్వవైద్య, పశువైద్య, భేరీవాదక, మురజవాదక, కుంభకారక, చిత్రకారక, వ్యావహారక, మృగయ, పక్షివాహక, పణిహారిక, ఉగ్రాణాధికార, వైశ్యజనాదిగా డెబ్బదిరెండు నియోగాలవారు, వానిపై మహామండలేశ్వరు

లైన బాహ్యతర నియోగాధిపతులు ఆ ఉత్సవాలలో నేల ఈనినట్లు సంచరించు చుండిరి.

మహారాజనగరిలో వివాహమహాసభామందిరమందు క్రింద పరచిన రత్న కంబళ్ళపై, పట్టుపరుపులపై ఉపధానాల నానుకొని వారి వారి అధికారాల, పద వుల ననుసరించి మహాప్రభువు లంతా కూర్చుండిరి. వేయిమంది వేద వేదాంగ పారంగతులు వేదమంత్రాలు చదువుచుండిరి. దుర్జయవంశస్థులైన ఆంధ్ర క్షత్రియ వంశాలవారు, వెలనాటిచోడులు, చాళుక్యులు, పల్లవులు, కదంబులు, గాంగులు, గజపతులు కొందరు స్వయంగా విచ్చేసిరి. కొందరు తమ రాజవంశాలవారిని ప్రతి నిధులుగా పంపిరి. ఆంధ్రసామ్రాజ్యం ప్రక్క దేశాలైన శౌణ, విదర్భ, చోడ, కేరళ, కొంకణ, అపరాంత, బల్లాల రాజులు తమ రాజప్రతినిధులను బహుమానా లతో పంపిరి.

గజములు, గుఱ్ఱములు దాస దాసీజనులు, బంగారము, రత్నఅభరణాలు, మంచిగంధపు వస్తువులు, ధనరాసుల, కస్తూరి, జవ్వాజి, పునుగు, అందుగుబంక, హిమవాలుక, కాశ్మీరకుసుమము, లవంగ, యాలకి, జాజికాయ, జాపత్రి లవంగపట్ట మంచిగంధతరువులు, వివిధ సువాసనతైలాలు, వివిధ ఫలాలు వధూవరు లకు ప్రాభృతా ర్పించారు.

ఈలా అఖండవైభవంగా వివాహం జరిగిన నాల్గవనాటిరాత్రి శోభనమంది రంలో వధూవరులు ఒంటిగా కలుసుకొన్నారు.

ముమ్మడమ్మ కోర్కెలతో కరిగిపోతూ చిన్ననాటినుండి తనతో ఆడుకొన్న తన మనోనాథుడు, తన ఆత్మవిభుడు, తన గాటంపు చెలిమికాడు, తన భర్త అయి ఎదుట తల్పంపై కుమారస్వామివలె అధివసించియుండ సిగ్గుపడుతూ, కాంక్షతో నాథుడు తనకడకు చనుదేరడం కోరుతూ ఎదురుచూస్తున్నది. రుద్రదేవప్రభువు చెక్కుచెదరక ఒక ఘటికాకాలం కదలకుండా ఎక్కడో చూపులతో అలాగే కూర్చున్నాడు.

ముమ్మడాంబికకు రోషము, దుఃఖము, ఆశా వెలుగునీడలులా ప్రసరించి పోయినవి.

అప్పుడు రుద్రదేవుడు నిదానంగా మన్మథతల్పంనుండి క్రిందికి దిగి ఒయ్యా రంగా నడుస్తూ ముమ్మక్కదగ్గరకు వచ్చి,

"మహారాణీ! నా కో వ్రతమున్నది. అది గౌరీప్రియమైన అసిధారావ్రతం! అందుకనే నా జుట్టు పెంచుకుంటున్నాను చూడు. ఆ అసిధారా వ్రతోద్యాపన సమ యం వచ్చేవరకు నీ పుత్రలాభోత్సవానికి అంకురారోపణ జరుగరాదు" అంటూ తన కిరీటముతీసి దీర్ఘకుంతలాలు సడలించి "ప్రాణప్రియురాలైన నా రాణీ! ఈ నా వ్రత కేశభారము చూచావుకదా! స్త్రీలకుకూడా ఇంతటి సంపద ఉండబోదు సుమా! అందుకు పరమగోప్యమైన ఒక కారణం ఉన్నది. అది నా దీక్షాసమాప్తి

కాగానే నీకు సంపూర్ణంగా తెలియబరుస్తాను" అంటూ ముమ్మక్కను గట్టిగా కౌగిలించుకొని, ఆమె నొసట ముద్దుగొని. "అందుకనే నేనీ కవచం నిద్దురలోకూడా విడువకూడదు సుమా! అని కౌగిలి సడలించి, వెనుక కేగి, క్రీడాతల్పముమీద పండుకొనక, చెంతనున్న సాధారణతల్పమీద పండుకొన్నది. వెంటనే ఆమెకు నిద్ర పట్టినది.

ఈ చరిత్రఅంతా ఆ దర్పణంలోనే రుద్రదేవికళ్ళ కీనాడు ప్రత్యక్షమైనది.

తనలో ఈనా డీ ఆలోచనలన్నీ రావడానికి మూలకారణం చాళుక్య వీరభద్రునితో కలిసి తాను వేటకు వెళ్ళడమే!

రుద్రప్రభువు కా అభ్యంతరమందిరాన నంటి ఒక ప్రత్యేకోద్యానవన మున్నది. రుద్రప్రభువు నగరు ఏకశిలకు తూర్పున నున్నది. ఆ నగరిలో వెలుపలితోటకూ అభ్యంతరక్రీడావనానికీ మధ్య ఎత్తయిన గోడ ఉన్నది.

ఈ రెండు ఉద్యానవనాలకూ మధ్య ఒక ద్వార మున్నది. అది దుర్భేద్యము. ఆ ద్వారము బంధించు నుపాయము ఒక్క రుద్రప్రభువునకు, వృద్ధదాదియగు చెమ్మసానికి, చెలి అయిన వీరమాంబకు గాక ఒరు లెరుగరు.

రుద్రదేవి సముజ్జ్వలవేషాలంకృతయై అపరాజితాదేవిలా ఒక్కరిత ఆ సాయంకాలము ఆ నర్మోద్యానవనాన విహరిస్తున్నది. అలా బాలికలా ఆ తోటలో విహరించిన దినా లే రెండు మూడో ఇంతవరకు కా దేవి జీవితంలో!

ఆమె నగరిలో బాహ్యవనంలోనికి ఎవ్వరూ రాకూడదు. యువరాజదంపతులు అందు విహరించుటకే ఆ ఉద్యానవనము ఆ వనానికి రుద్రప్రభువు లోనితోటనుండి మరొక్కదారి ఉన్నది.

యువరాజు నగరి నంటి యువరాణి ముమ్మడాంబికాదేవి నగరున్నది. ముమ్మడాంబికాదేవి నగరులో ప్రత్యేకోద్యాన మున్నది. దానికీ, యువరాజోద్యానానికీ ద్వార మున్నది. దేవ్యుద్యానానికి బాహ్యోద్యానానికి వేరే ఒక దారి ఉన్నది. బాహ్యోద్యానానికి యువరాజ బాహ్యనగరిలోనుండి ఒక్కటే దారి ఉన్నది.

ఆ సాయంకాలం యువరాజు రుద్రప్రభువు దర్శనార్థం, దక్షిణ కళింగ విషయాలు చర్చించడానికి చాళుక్య వీరభద్ర ప్రభువును తోడ్కొని శివదేవయ్య మంత్రులు యువరాజనగరికి వచ్చి, ప్రభువు దర్శనం రాత్రి మొదటి ఝాము, మధ్యలోగాని కలుగదని దౌవారికలు విన్నవించినంత, శ్రీ శివదేవయ్యామంత్రి శ్రీ చాళుక్య వీరభద్రుని క్షమాపణ వేడుచు వారిని యువరాజు బాహ్యోద్యానవనానికి తీసుకొనివెళ్ళి అటు నిటు త్రిప్పుచు వారితో రాచకార్యా లెన్నో మాట్లాడుచుండెను.

ఇంతలో మహామంత్రి తనకు సంధ్యావందనపువేళ అయినదని ఆ తోటలోనే ఉన్న బ్రాహ్మణుని ఇంటికి పోయి ఒక్కఘడియలో వత్తునని చెప్పి వెడలిపోయెను.

## 3

రుద్రదేవి పూలచెట్టుకూ పూలచెట్టుకూ వనదేవతలా తిరిగింది. రుద్రదేవి కేళాకూళికీ ఆనందలక్ష్మిలా తిరిగింది. చంద్రుని దివ్యామృతరూప రహస్యం తెలిసికొనడానికి విశ్వం చుట్టివచ్చే రోహిణిలా, ఆ ఆంధ్ర యువరాజ్ఞి ఆ తోటంతా తిరిగింది.

సామంతులలో, రాజోద్యోగులలో కొందరు తన్ను యువతి అని అనుమానిస్తున్నారు. తన తండ్రిగారి కాకతీయవంశంవారి ఈ మహాసామ్రాజ్యభారం వహించడానికి తాను జన్మాంతమూ ఈలా పురుషునిలా ఉండవలసినదేనా? స్త్రీ రాజ్యాలు పాలించడానికే వీలులేదా? లోకానికి మూలాధారం శక్తి అని దేశికులే అన్నారే. సర్వదేవతలూ భండాసురుణ్ణి నిర్జించడానికి మహాయాగం సలిపినప్పుడు ఉద్భవించిన కామేశ్వరీమహాదేవి సకలసృష్ట్యద్భుతంగా ఆ భండాసురుణ్ణి నిర్జించలేదా? స్త్రీ భయంకరసింహిక కాతిపోతే చుట్టూవుండే పురుషులు నక్కలై ఆమెను సికృతింటారు. తన చెల్లెలు గణపాంబిక అదృష్టవంతురాలా? తానదృష్టవంతురాలా? చెల్లెలికిగూడ తన జీవితరహస్యం తెలుపడానికి వీలులేదని శివదేవుల ఆజ్ఞ, నాయనగారి ఆజ్ఞ.

తన ముద్దుచెల్లెలు లోకసమ్మోహమైన రూపంతో పెరిగింది. ఆటపాటలలో రాణివాసం అంతా ఆనందంతో ముంచెత్తేది. ఆమె బాలికయయ్యు తనతోపాటు వీరవిద్యలన్నీ నేర్చుకుంది. అయినా పురుషవేషంలో ఉన్న నకన్న ఎన్నిరెట్లో ఆనందంగా ఉండేది. "అన్నగారూ" అని ఆమె తనయందు ఆ చిన్ననాటి రోజులలో చూపిన ప్రేమ, తనమెడచుట్టూ ఆ బాలిక చేతులుచుట్టి బుజ్జగించిన మాటలు, నారద గీతాలకు పాఠాలు నేర్పుతుందేవి!

ఆ గణపాంబాదేవి తనకన్న మూడేడులు చిన్న. ఆమెను పదునెనిమిదవ ఏటను ధరణికోట ప్రభువునకు ఇచ్చి వివాహంచేసిన దృశ్యాలు తనకు కలిగించిన ఆనందము వర్ణనాతీతం.

తన చెల్లెలు గణపాంబాదేవిని స్వస్తి. శ్రీ చతుస్సముద్రముద్రిత, నిఖిల వసుంధరా పరిపాలక, శ్రీమత్త్రినయనపల్లవ ప్రసాదాసాదిత, కృష్ణవేణీనదీ దక్షిణ షట్సహస్రావనీవల్లభ, భయలోభదుర్లభ, చోళచాళుక్య సామంత, మదానేకపమృగేంద్ర, విభవామరేంద్ర, శ్రీమదమరేశ్వరదేవదివ్య శ్రీపదపద్మారాధక, పరబలసాధక, శ్రీధాన్యకటకపురవరాధీశ్వర, ప్రతాపలంకేశ్వర, కళిగళ మోళదకెళ్ల, బెట్టరగవకెళ్ల, గండరగండ, గండభేరుండ, జగమెచ్చుగండ, నన్నిమానాంక నామాది ప్రశస్తిసహిత, శ్రీమన్ మహామండలేశ్వర కోటకేత మహారాజ మనుమడు, శ్రీ కోట రుద్రరాజ మహామండలేశ్వరుల పుత్రరత్నమైన బేత రాజుకు వివాహము గావించినారు. ఆ వివాహ వైభవం భరతఖండములో, సర్వ మండలంలో, దివ్యలోకాలలో కథలుగా చెప్పుకొన్నారని కవులు వర్ణించిరి.

గణపాంబ చేతరాజుసౌందర్యం కవులు పాడగా విన్నది. ఆయన తన భర్త అని తండ్రి నిర్ణయించిన మరుసటి క్షణంలో ఆమె విరిసిన దిరిసెన పూవులామంజులత తాల్చినదాయెను. ఆమె విశ్వాధినేత నారాయణుని చేపట్టు వార్నిధికుమారిక కమలాలయలా ఒప్పినదాయెను.

చెల్లెలి వివాహవైభవము తలచుకొంటూ, తాను తండ్రికి దక్షిణభుజమై వెలనాటిచోడుల సామంతుల జయించి తెచ్చిన ధనరాసులు తన చెల్లెలికి స్త్రీధనంగా ఇచ్చిన దృశ్యము భావిస్తూ రుద్రదేవి పులకాంకురములు దాల్చెను.

ఆనాటి వేషమేమి? ఈనాటి వేషమేమి? తన ఈనాటి వేషంకన్న, భర్తను చేరబోయే తన చెల్లెలు గణపాంబాదేవి ఎక్కువ అందంగా ఉండెనా? కాక! ఆమె బాలికగా పెరిగెను. రాజకన్యలు నేర్వవలసిన విద్యలన్నీ బాలికవలె నేర్చుకొన్నది. ఆమె నిశ్శంకగా తమ సవతితల్లుల అన్నగారు శ్రీ జాయప మహాప్రభువు శిష్యరాలై నాట్యం నేర్చుకొన్నది. తాను బాలునిలా నేర్చుకొన్నది. హావభావవిలాసాలలో చెల్లి ముద్దులు మూటగట్టే ఉషాదేవిలా ఉంటే తా నొక ఆడంగి అబ్బాయిలా నాట్యం నేర్చుకొన్నది.

తన చెల్లి మహావిద్వాంసుడైన మహావైణికుడు శ్రీ సత్రము బొల్లమరాజాప్యునికడ సంగీతమును, సర్వవిద్యలు వేదస్వరూపులైన ఈశ్వరసూరి పండితులు విద్యాగురువుగా తనతోపాటు నేర్చుకొన్నది. పాడే సమయంలో తన గొంతుక చెల్లెలి గొంతుకలా పంచమస్వర శ్రుతినే పలికేది. అందుకని తానెప్పుడు మంద్రస్థాయిలో పాడుకొనునది.

ఏమిటీ ఆలోచనలు? ఎందుకు ఈ సాయంకాలము శ్రీ బాబయ్యగారు, శివదేశికులవారు తనతో రాచకార్యాలు మాటలాడడానికి వస్తామన్నారు? లోనికి పోవాలి! అయినా వారు రాగానే వార్త వచ్చునుకదా! ముమ్మడమ్మ ఎంతవెర్రిబాగులబాలిక! తన్ను పురుషునిగా ఎంచి సీత రాముని ప్రేమించినట్లు ప్రేమించినది పార్వతి శివుని ప్రేమించినట్లు ప్రేమించినది. పాపం, ఆ బాలికకు నిజం తెలిస్తే ఎంత బాధపడుతుందో? స్త్రీల హృదయం తనకు తెలుసును. తనకు మాత్రం తనహృదయం తెలుసునా? స్త్రీహృదయం స్త్రీకే తెలియదా? ఏ సమయానికి స్త్రీహృదయం ఏవిధంగా ప్రసరిస్తుందో స్త్రీకిని తెలియదు. తాను స్త్రీహృదయమూ, పురుషహృదయమూ తెలియలేని శిఖండి లా ఉండెను కాబోలు? పురుషుల హృదయం స్త్రీలకు నిమిషంలో అవగతం అయితీరుతుంది.

చాళుక్య వీరభద్ర ప్రభువు హృదయం ఏ రీతి ప్రవర్తిస్తున్నదో తాను గ్రహింపగలుగునా? పెండ్లికాని బాలికలవంక వారెట్లుందురో యను జిజ్ఞాసచే ఆయన తలెత్తిచూడడు. తాను బాలికసని ఆయన గ్రహించెనా? అట్లు

తన్ను తదేకదీక్షతో గమనిస్తారేమి ? ఆ మహాభాగుడు శ్రీరామునిలా ఏకపత్నీ వ్రతుడు కాగలడా ? కాకపోయిన తనకేమి ? ఆయన శ్రీకృష్ణునిలా పదారువేల మంది గోపికలను చేసుకుంటే తనకేమి ? విష్ణువు బహుభార్యాప్రియుడు, పరమశివునకును గంగవిషయంలో బహుభార్యాత్వదోషం సంభవించినది. కాని శ్రీరామునకేకపత్నీత్వవ్రతఫలం దక్కింది. బ్రహ్మకూడా ఏకపత్నీవ్రతుడేనట. వీరభద్ర మహాభావానికి జాయ భద్రకాళి. అమె రుద్రభావమే !

తనతల తిరుగుచున్నది. కొంచెంసేపు పెద్దతోటలో తిరిగి మరీ రావచ్చును. వెన్నెల ఎంతో అందంగా ఉంది.

రుద్రాంబిక అంతకన్న అంతకన్న బాలిక అయి తలుపు చేటికనే తెరిపించి బాహ్యవనంలోనికి అడుగిడి నడిచింది.

శీతాకాలం గడచి వసంతకాలం చిన్నబాలకునిలా తోటలో ఆడుకుంటున్నది. మల్లె అంటులన్నీ చిగిర్చి మొగ్గలు తొడిగినవి.

మావిచెట్లన్నీ చిగురించి ఒత్తుగా పూతలతో పిందెలతో నిండిఉన్నాయి. అరటిబోదెలలో గెలలు సహస్రఫణాలతో విష్ణునిపై వంగు శేషునిలా ఉన్నవి. వకుళపత్రాలు ఆవనం అంతాపరిమళాలు నివిరజల్లుతున్నవి. సప్తమినాటి చంద్రుడు వెన్నెలతో హృదయాల లోతులను కలతపెట్టుతున్నాడు.

ప్రక్కనే ఒంటిమిట్ట, దూరంగా చిన్నకొండలు మేఘాలులా ఆకాశంలోకి తొంగిచూస్తున్నవి. లేడి రాణిలా దిక్కుల నాఘ్రాణిస్తూ, హంసలా నడుస్తూ క్రీడా సరస్సుకడ కామె చేరినది. ఆ వెన్నెలలో నీలి కలువపూలు అప్పుడే వయస్సు వచ్చిన కన్యహృదయంలా సౌరభాన్ని వెదజల్లుతున్నవి. ఆమెవంగి నీటిలోనుండి కాడతో ఒకపూవు పెరికి నీటిని తన పయ్యెద కొంగుతో తుడిచి, నిలుచుండి ఆ పూవు నాఘ్రాణించుచు ఎదుట ఒక పురుషునిచూచి, అలాగే ప్రాన్పడిపోయింది,

ఆ పురుషుడు ఈ దివ్యమూర్తిని చూచి చేష్టలుదక్కి అట్లే నిలుచుండి పో-యి-నా-డు.

౮

ఆ పురుషుడు చాళుక్య వీరభద్రుడని గ్రహించగానే రుద్రదేవి గజగజ వణకినది. ఈ పురుషుడుకాదూ తన హృదయమంతా నిండి. తన జీవితమంతా ప్రసరిస్తున్నది ? ఈ పురుషునకుకాదూ తాను చేయదలుచుకోని ఈ స్త్రీ వేషధారణము తనచేత చేయించింది ?

ఈ కాసే వెన్నెలమూర్తిలా ఉన్నాడీ మహాభాగుడు. తానెప్పుడూ చేయని మూర్ఖకార్యం చేసి, ఈ ఉత్తముని కంటబడినది. అతడు తన్నేమను కొనునో ? అతడు నిజం గ్రహించునా ? గ్రహిస్తే ఏమిగానున్నదో !

గ్రహిస్తే గ్రహించినవాడుగాక. తన స్త్రీజన్మ ఈనాటికి సార్థకమయింది. వెన్నెల ఉండి ఆకాశాన చంద్రుడు లేకుండుట ఎట్లు సాధ్యము ?

తన్నుచూచి ఆ ప్రభువు ఆ ఉత్తమనాయకుడు విగ్రహమైఅలా నిలుచుండి పోయినాడు ! ఈ వెన్నెల కూడుకొన పాలరాయై, ఈ ఉత్తమ చాళుక్యుడైనది కాబోలు ?

ఇంతలో రుద్రదేవికి ఏదియో సిగ్గు, ఏదియో మహాకాంక్ష, ఏదియో అతి పూజాభావము కెరటాలై నిలువునా విరుచుకొనిపడినాయి.

ఈ మహాపురుషుని పాదలకడ మోకరించి, "ప్రభూ ! నేను నీ దాసిని, నీ భార్యను, నీ ప్రేయసిని, నీ అర్ధాంగిని. నన్ను పాలించుకో. నన్నీ రాజ్య పాలనాభారంనుండి శ్రీకృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోయినట్లు ఎత్తుకుపో. నువ్వు పురుషుడవు. నేను స్త్రీని. నీకు నేను, నాకు నీవు ! గోదావరీతీరంలో ఒక చిన్న ఆశ్రమం నిర్మించుకొని, ప్రేమతో, ప్రేమశ్రుతితో, ప్రేమరాగాలతో, ప్రేమగీతా లతో ఆ గోదావరీతరంగాల ఉయ్యాల ఊగుతూ, ప్రవహిస్తూ, సర్వ ప్రకృతిలో భాగమై, కోకిలలతో కొమ్మకొమ్మకూ ఎగురుతూ, జక్కవజంటతో నీరరేఖలలో సుడులౌతూ, రెండుపూవులులా, రెండు లేత రెమ్మలులా, లోకానికి దూరంగా, లోక ప్రేమనవనీతంలో కణాలవుతూ ప్రేమోపనిషన్మంత్రంలో మంత్రవ్యాఖ్యా నాలవుతూ తరింపకూడదా ప్రభూ !" అని తన్నర్పించుకుందామని రుద్రదేవి అనుకొన్నది.

ఎంత ఉత్తమమైనా, స్త్రీ పురుష ప్రేమ, వ్యక్తి మాత్ర సంబంధ కలది. ప్రేమికులు లోకంలో ఇద్దరే. వారి కింక ఏమి ఉంది ? లోకం ఏమవుతుంది ? తల్లిదండ్రులులేని బిడ్డలు, భర్తలులేని భార్యలు, వికలాంగులై తమ్ముపోషించుకో లేని పురుషులు, రోగపీడితులైన నరులు, జరాదుఃఖితులై అసహాయులైన మాన వులు, క్రూరులచే హింసిలచబడే సాధువులు, క్షామదేవత పాదాల నలిగిపోయే జనులు, కోటానుకోట్ల జనులు, వారి చిన్న చిన్న గ్రామాలు, వారివృత్తులు వారి వ్యవసాయాలు, వారి ఆనందాలు, శాంత ప్రవాహమైన వారి జీవితాలు ఇవి అన్నీ ధర్మం నేరవేర్చడానికి భయపడే ప్రభువువల్ల వంచితమై అపశ్రుతిస్వరూపమై ప్రళయంలో మగ్గిపోవునుకదా !

అలాంటి హీనరాజశాబకం తాను కాదనుకోడం ఎంత అధర్మము, ఎంత నీరస నిర్వేదము ! మహాధన్వి అయిన అర్జునుడు ఆ మహాదోషంఆచరింపబోతే భగవానుడు శ్రీకృష్ణు డాతనిని రక్షించాడు. తన్నెవ్వ రిక్కడ రక్షించేది ? తానే తనకు శ్రీకృష్ణుడౌనుగాక !

ఆమె వెనక్కు తిరిగి, ఆ వెన్నెలలో ఆ వసంతయామినీవికాసంలో, ఆ కుసుమపుష్పసౌరభాలలో, ఆ శకుంతకలకలారావగాధగీతికలలో అన్నికలలూ అక్కడే దిగజార్చి, కఠిన ధర్మాభిముఖయై పరుగెత్తిపోయింది.

* * *

ఎవ రా దేవి ? ఏ లోకాలనుండి దిగివచ్చింది ? ఎందుకు వచ్చింది ?
కాకతీయ కులదేవత కాకతీదేవియా ? ఆమెకు సైదోడు ఏకవీరయా ?

ఈలాంటి అందం లోకములో ఉండదు. ఆమె స్త్రీ కాదు, సౌందర్యవతీ కాదు! ఆమె స్త్రీత్వాతీతమైన ఒక మహాభావం, సౌందర్యమూలమైన దివ్యాతిదివ్య సౌందర్యం! ఆమె స్వప్నాలమించిన స్వప్నం! ఎవరీ బాల? వెన్నెలలో వచ్చి వెన్నెలలో కరిగిపోయినది. "నువ్వెవరవు దేవీ! అచ్చరలను నలుపు చేయ నారాయణుడూర్వశిని పుట్టించాడు. ఆ ఊర్వశీ దివ్యతేజస్సును మిణుగురు నొనర్చు మహాతేజస్సువా ?" తన కా నిమేషము చైతన్యమే తప్పినది. కన్నులు మూతలు పడలేదేమి? తన పెదవులు మాటలేని కదలిక అయినా పొందలేక పోయిన దేమి ?

ఈ మూర్తి తనకు సన్నిహితము, దూరమును! ఆ బాలికనలో తాను కనిన స్వప్నాలు, తాను రచించుకొన్న అమృతగానాలు, అణువులై ఈ రూపును పొందినవే. క్షణమాత్రం కన్నులు మూసుకొన్న తన కర్ణాలకు ఆమె సౌందర్యాలు ఏవో శారద వీణాగానాలై వినిపించిన వేమి ?

దేశికులి సౌందర్యదర్శనానికా నన్నీ వనంలో, వెన్నెలలో వదలి వెళ్ళిపోయారు ?

తనతో ఆఖేటక్రీడకు వెంచేసిన ఒక గుప్తభావము, సర్వగోప్యాలువదలి తన కీ పవిత్ర ముహూర్తంలో ప్రత్యక్షమైనదా ?

"దేవీ! ఆంధ్ర ప్రజాహృదయ నటద్దివ్యచరణ స్వర్ణమంజీర గానజీవితా! ఈ పవిత్రక్షణమే నాకు సర్వానుభూతిపుంజమై, ఇంకనుంచి ఒక్కణ్ణే ఈ జీవిత పథాల్లో యాత్రచేయ ఆదేశించినావా ?"

ఆతడు కరగిపోయినాడు. గంభీరజీవియై, మహావీరుడై, అతిరథుడై, దుష్టతురగ రేఖారేవంతుడై, గజసాహిణై, సరలోకసుందరుడై, శత్రుమత్తగజసింహమైన ఆ ఉత్తమచాళుక్యుడు తన్నలమిపేసిన లోకోత్తరప్రేమశక్తిచే కరగి, అమృతబిందుద్వయాంకితలోచనాంచలు డయ్యాడు.

"ఏమయ్యా వీరభద్రప్రభూ! వెన్నెలలో స్వప్నాలు కంటున్నావా? మూయబడిన ఆ గుమ్మంవంక అరమూతలు కన్నులు చూచేవు ఏ మహానిధి ఆవెనుక ఉందనుకున్నావు ?"

శివదేవయ్య మాటలు స్వప్నమధ్యంలో సముద్రఘోషలా వినబడి, వీరభద్రప్రభువు ఉలిక్కిపడి సిగ్గుతో వివర్ణముఖుడై, మరల ధైర్యం చిక్కబట్టి, "ఒక దేవీ ప్రత్యక్షమై మాయమైనది—గురుదేవా!" అన్నాడు.

శివదేవయ్య, ఆ ఇరువురు త్రిలింగదేశ మహావ్యక్తులూ ఒక్కముహూర్తమాత్రం తారసిల్లి విడిపోవడం చెట్లచాటునుండి గమనించినాడు. ఆయన గమనించినాడని చాళుక్య వీరభద్రుడు గ్రహించుకొన్నాడు. వీరభద్రుడది గ్రహించాడని శివదేవయ్య దేశికులు అర్థచేసికొన్నారు.

ఒకరివైపు ఒకరు ఒకనిమేషం పాఁజూచి పక్కున నవ్వుకొన్నారు.

ఇరువురూ కలసి నెమ్మదిగా యువరాజు నగరిలోకి వెళ్లుచుండగా, సేవకులు లేఖకులు, దౌవారికులు, కంచుకులు, అంగరక్షకులు వంగి నమస్కరించుచుండిరి. సభామందిరాలు గడచి ఆలోచనామందిరములోకి ఒక దౌవారికుడు దారిచూపుచుండ పోయి అందు సుఖాసనాల అసీనులయ్యారు.

శివ : ప్రభూ ! కళింగుడు సింహాద్రికడ దండువిడిసి, రాణ్మహేంద్రవరం వరకూ యుద్ధయాత్ర సాగించి కోనసీమామండల ప్రభువులు హైహయులనోడించి, గోదావరిదాటి విడుదప్రోలుపై పడనున్నాడని మీకు తెలిసిన వేగునమ్మకమైనదేనా ?

వీర : గురుదేవా ! ఆ వేగు నడిపింది మా నాయనగారి అంతరంగిక సేనాపతి, సోమనాథదేవులు. ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు చాణక్యదేవునకు గురువు కాదగిన ప్రతిభాశాలి !

శివ : కాళింగుని ఈ ఉన్మాదానికి కారణం ?

వీర : మన రాజ్యంలో ఉన్న కొందరు పెద్దలట !

శివ : ఎవరు వారు ?

౯

యువరాజు లోనికివచ్చి దేశికులకు నమస్కరించి, వీరభద్రుని నమస్కారమందుకొని పీఠముపై నాసీను డయ్యెను.

యువరాజు చూపులో, మాటలలో, నడవడిలో తొందరపాటుగాని త్రపాభావంగాని ఇనుమంతైనా గోచరించుటలేదు.

రుద్ర : కాబట్టి బాబయ్యగా రేమంటారు ? వెంటనే కటకంపైకి ఎవర్ని పంపాలని ?

శివ : ఇందులూరి పెదగన్నఅమంత్రిని లక్ష కాల్బలంతో ఇందుశేఖరమహారాజుకు సహాయంగా పంపించవలసి ఉంటుంది.

వీర : ప్రభూ ! నేను అయిదువందల ఏనుగులతో, రెండువేల అశ్వికులతో వారికి బాసట అవుతాను.

రుద్ర : చాళుక్యప్రభూ ! మీరు ఇక్కడే ఉండండి. ఈ దేశం మీదికి శౌణయాదవులు ఏక్షణంలోనైనా విరుచుకుపడవచ్చును. అందుకని నేను ఒకవిధానం ఆలోచించాను. గాండ్లనగర ప్రభువు, రేచర్ల గణనాథుల చెంత ఏబదివేల విలుకాండ్రు ఉన్నారు. ఆయన మౌద్గల్యాతీరాన్నుంచి ససైన్యంగా బయలుదేరి గోదావరినది దాటి ఈశాన్యంగా సింహాద్రి పోయి అక్కడ కళింగప్రభువైన అనంగభీమదేవుని తలపడగా, వేంగివిషయాధినాథుడు కాలపనాయకులవారు ఇందులూరి పెదగన్నఅమాత్యప్రభువును కలిసి గోదావరి ఉత్తరంగాపోయి ఇటువైపునుండి

అనంగభీముని తాకవలసింది. ఈ రెండు మహాగ్నులమధ్య వది కాళింగుడు నాశనమైపోవుగాక.

శివ : ప్రభువు చక్కగా ఆలోచించారు. అదే సమంజసమయిన యుద్ధ యాత్రావిధానము.

రుద్ర : బాబయ్యగారూ ! తాము మన ఆలోచనకు తగిన ఆజ్ఞలు పంపిం చండి. ఇంక మేము సెలవు తీసికొనవచ్చునా ?

ముప్వురూ వారివారి పీఠాలనుండి లేచిరి. శివదేవయ్య, చాళుక్య వీరభద్రుడు నిజమందిరముల కేగిరి.

వా రిరువురు వెళ్ళనను, యువమహారాజు తిరుగ తన ఆసనంమీద అధివ సించినారు. ఇంతలో దౌవారికుడు లోని కరుదెంచి "జయము జయము మహా ప్రభూ ! శ్రీ విరియాల గొంకప్రభువు వేంచేసినారు" అని విన్నవించెను.

మహారాజు వారిని ప్రవేశపెట్టుమని అనుజ్ఞ ఇచ్చెను. ఇంతలో వేగుదళ నాయకుడు గొంకప్రభువు లోనికి విచ్చేసి రుద్రదేవమహారాజుకడ మోకరించి, లేచి, ప్రభువుచూపిన ఉచితాసనంపై అధివసించి "మహాప్రభూ ! గోన గన్నయ్య చండప్రచండుడు. అదవోని ప్రభువుకు సామంతుడు కోసగిమైలి, గన్నారెడ్డి సైన్యాలతో తుంగభద్రాప్రాంత అరణ్యాలలో ఉన్నాడని తెలిసి పదిదినాలలో హుటాహుటి ప్రయాణంచేసి ఆ మహారణ్యం చేరుకున్నాడు.

"గన్నయ్య సైన్యాలతో మూడు గవ్యూతులలో ఉన్నాడనిన్నీ, తమ రాక అతనికి ఏమీ తెలిసినట్లు లేదనిన్నీ వేగులు విన్నవించుకున్నారు. కోసగినగర ప్రభువు మైలపనాయకుడు చిరునవ్వు నవ్వుకుంటూ అశ్వదళాన్ని తూర్పుగా పొమ్మన్నాడు; పడమటగా గజయూధాన్ని సాగమన్నాడు. తాను రథాలతో కాల్బ లాన్ని నడుపుకుంటూ వస్తున్నాడు. ఉత్తరంగా సగం కాల్బలం తుంగభద్రఒడ్డుననే వచ్చి గన్నయ్య సైన్యాన్ని పొదువ మన్నాడు. భేరీలు ధం ధం ధం, ధాం ధాం ధం ధం ధం అని మ్రోగగానే ఆ గుర్తుకు అన్నిసైన్యాలు సాగా లనిన్నీ గుర్తు చెప్పాడు.

"గన్నారెడ్డి సైన్యాలు ఒక అర్ధగవ్యూతిలో ఉన్నవనగా భేరీలు సంకేత ప్రకారం మ్రోగించాడు. అనేకవేల దుక్కుల కుంభవృష్టి కురిసినప్పుడు పొంగి ఉరికే ప్రళయతుంగాజలాలులా సైన్యాలు ముందుకు ఉరికాయి. ఆ మహోన్నత వృక్షాలలో, ముళ్ళడొంకల్లో సైన్యాలు పెళ్ళున ఉరికినవి. 'అఁ' అని అనే లోపలే ఇంకో కాల్బలం ఎదుటబడింది. గుర్రాలు కుడివైపునుంచి, ఏనుగులు ఎడమవైపు నుంచి దావానలం కప్పినట్లు, కొండలు విరుచుకు పడ్డట్లు వచ్చినవి. నాల్గుసైన్యాలు ఒకదాని నొకటి తాకి, ఆ వట్టితాకడంవల్ల కొన్ని కాల్బలాలు, అశ్వాలు, ఏనుగులు హతమారినవి.

"అన్నిబలాలు కళ్ళుతెరచి తాము తమ్మే చంపుకుంటున్నామని తెలుసుకొనే లోపలే ఆకాశంనుంచి భయంకరమైన బాణాలవాన మనుష్యుల్ని, అశ్వాల్ని,

అశ్వాల్ని, హస్తిపకుల్ని, గజాల్ని, కాల్బలాన్ని ముక్కలుగా చెండాడదం ప్రారంభించింది. తల యెత్తితే తీవ్రబాణాలు నిలువునా కూలుస్తున్నవి. ఆ గడబిడలో, ఆ చిందరవందరలో ఎవరికీ ఏమీ తెలియటం లేదు. విరుచుకుపడే విధిలా బాణాలు ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రాణం కొంటున్నవి. గుర్రాలు, ఏనుగులు తిరుగబడ్డాయి. ఉక్కిరిబిక్కిరి, కసకస తొక్కిసలాట. బాణాలు! బాణాలు!

"కోసగిమైలి ప్రభుని రథంమీద కురిసిన బాణాలవర్షం కరిగి నీరైంది. ఏభై గాయాలతో మైలపనాయకుడు ఫెళ్ళుమని విరుచుకుపడి విలవిల తన్నుకుంటూ చచ్చిపోయినాడు.

"గోన గన్నారెడ్డిని పట్టుకునేందుకు వచ్చిన సైన్యంలో మూడవవంతుకూడా వెనక్కు పారిపోలేకపోయారు. గనారెడ్డి అడవుల్లో ఎక్కడనుంచో పకపక నవ్వుతున్నాట్ట."

రుద్రప్రభువు ఆశ్చర్యంపొంది "ఏమిటి! గన్నారెడ్డి ఎంతటి దారుణానికి ఒడిగట్టినాడు. అతని దౌర్జన్యం అణచగల మేటి మన రాజ్యాలలో ఎవ్వరూ లేరా?" అని గొంకప్రభువును ప్రశ్నించారు.

గొంక : మహాప్రభూ! ఒకరేమిటి? వేవురు ఉండిరాయను. వారందరూ ఆ గజదొంగపైకి దూకితీరుతారు.

రుద్ర : వారంరోజులక్రిందట కృష్ణవేణీ ముఖగ్రామాలనుండి శ్రీ జాయప మహారాజులంవారితో సేనానాయకుడుగా వచ్చి సార్వభౌములవల్ల శ్రీశైలప్రాంత మార్కాపుర ప్రభువైన ఉప్పల సోమప్రభువు ప్రాణం హరించాడితడు అని వార్త వచ్చింది. ఆ విషయం మీకు తెలుసునా గొంకరాజుగారూ?

గొంక : చిత్తం మహారాజా! ఆ విషయం మరీ దారుణమండీ. వర్ధమానపుర ప్రభువు కుమారులకు ఆదవోనివారి అమ్మాయి అన్నాంబికాదేవిని ఇవ్వడానికి నిశ్చయించడం, ఆ వివాహానికి అనేక వీరులతో లకుమయారెడ్డి తర్లి వెళ్ళడం, మహాప్రభువులు, మంత్రులు ఆశీర్వచనాలతో వధూవరులకు బహుమతులు పంపడం జరిగింది.

రుద్ర : అవును. అది అంతా మాకు తెలుసును. ఆ పీటలమీద పెళ్ళి చెడగొట్టాడీ గజదొంగే!

గొంక : అవధారు మహారాజా! ఆ పెళ్ళి అలా చెడగొట్టి, ఈగన్నయ్య పెళ్ళికొడుకును ఎత్తుకు పారిపోయి, మరి వారంరోజులకు వర్ధమానపురం తిరిగి పంపాడట! వివాహానికి ఉప్పల సోమప్రభువు వచ్చి, మీకు గోన గన్నయ్య తల చూపిస్తానని రాజలోకం ఎదుట ప్రగల్భాలాడి, తిన్నగా తన నగరానికి వేంచేస్తున్నాడట.

రుద్ర : మంచిది.

గొంక ! దారిలో విశలధరణీశుడు, సూరనరెడ్డి కొద్దిసైన్యంతో ఉప్పల సోమనికి ఏదురుపడ్డారట. పాపం ఉప్పల సోమప్రభువుతో వేయిమంది సైనికులే ఉన్నారట ! ఆ గజదొంగలతో నాలుగువేలమంది రాక్షసులున్నారట.

రుద్ర : గజదొంగలబలం ఎప్పుడూ అంతేకాదా, గొంకప్రభూ !

గొంక : చిత్తం ! చిత్తం సోమరాజు, "ఇదా మగతనం మా బలగం తక్కువ అని చూచి ఈలా చేయడానికి వచ్చారు నికృష్టులు" అని తిరబాడట !

రుద్ర : ఆఁ !

గొంక ! ఆ వెంట ఎక్కడినుంచి ఊరికాడో గన్నారెడ్డి నవ్వుకుంటూ కత్తి ఝుళిపిస్తూ వచ్చాడట.

రుద్రప్రభువు ముందుకువంగి "ఆ తర్వాత ఏమయింది?" అని అడిగినారు.

౧౦

గొంకరాజు ప్రభువునుద్దేశించి ఉప్పల సోమప్రభుని గాథను ఇల్లా మనవిచేసినవాడాయెను.

"మహాప్రభూ ! సేవకుడను. అప్పుడు గన్నారెడ్డి ఉప్పల సోమరాజును చూచి, "ఓయీ ! మగవాడా ! ఓయీ మహా కఠినప్రతిజ్ఞ పట్టినవాడా ! నువ్వు నా తల రాజలోకం పాదాలముందర చెండులా పడవేస్తానన్నావట. ఇదిగో నేను, ఇది నా తల. నీ సైన్యం నా సైన్యం యుద్ధానికి దిగనవసరం లేదు. నీ సైన్యం యావత్తూ ఇదివరకే నా పక్షం తిరిగిపోయింది. ఇక నువ్వూ నేనే ద్వంద్వయుద్ధం చేద్దాము. నువ్వు ఖడ్గయుద్ధంలో ఆరితేరిన మగటిమి కలవాడవని ఛప్పన్నదేశాలూ పేరుపొందావు. నేను గజదొంగను. నువ్వు నా తల కొట్టినావా ఎవ్వరుగాని నీ జోలికిరారు. నీ దేశంలో దిగబెడ్తారు. ఎంత చెడిపోయినా నేను శ్రీ బుద్ధారెడ్డిప్రభువు కుమారుణ్ణి. అతడు నా తమ్ముడు విశలప్రభువు. అతడు నా మాట పాలన అవునట్లు చూడగలవాడు' అని చెప్పి పకపక నవ్వాడట.

"మహాప్రభువులు ఉప్పల సోముని ఖడ్గయుద్ధ నిపుణత్వం ఎరుగుదురు గదా ! ఖడ్గ, కరవాల, భిండివాల, ఛురికా యుద్ధాలలో లోకప్రఖ్యాతి పొందిన ఉప్పల సోముడు గోన గన్నయ్యలా ఆరడుగులపైన పొడుగువాడు. విశాలమైన వక్షం కలవాడు దీర్ఘబాహువులవాడు, మొక్కవోని పరాక్రమం కలవాడు. భీకరమైన తేనెకన్నులు కలవాడు, కండలు పట్టిన దేహం కలవాడు, గోన గన్నారెడ్డి మాటలు పూర్తికాకుండా మెరుపువేగంతో కత్తితీసుకొని, పిడుగు వేగంతో గన్నయ్యమీదికి ఉరికి కత్తినెత్తి అతని శిరస్సుపై అఖండ శక్తితో వేశాడు. ఆ వేగంతో గన్నయ్య ఖండితమస్తకుడై పడిపోవలసిందే.

"కావి గన్నయ్య మెరుపునుమించిన వేగంతో వెనక్కు ఉరికి ఆ వ్రేటు తప్పించుకొన్నాడు. అక్కడనుండి పకపక నవ్వుతూ, ఉప్పల సోముని అపహస్యంచేస్తూ, గోన గన్నయ్య చేసిన యుద్ధం దేవతలుచూసి ఆనందించినారట,"

రుద్ర : గన్నయ్య కత్తియుద్ధంలో అంత మొనగాడా !

గొంక : దివ్యచిత్తం మహారాజా ! ఆనాడు ఉప్పల సోమప్రభువు చూపిన కత్తియుద్ధ విచిత్రాలు ఇదివర కెన్నడూ ఎవ్వరూ చూపలేదట ! గన్నయ్య "ఓయి ఉప్పల సోమా ! తిన్నఇంటికి వాసాలు లెక్కపెట్టవూ, వాసా లెన్ని ? నువ్వా రుద్రప్రభువును సింహాసనంమీదనుంచి లాగిపారవేసే అపరరావణాసురుడవు ? ఓహో కొత్తచక్రవర్తీ ! జాయపమహారాజభృత్యా ! ఉప్పుచేపలుతినే అఖండవీరా ! ఏదిరా నీ కరవాల విక్రమము ? ఆ శదాని చేతికూడు తినవేమి ? ఆదోనివారూ, మా పినతండ్రిగారూ మంచి హంతకుణ్ని చేరదీశారు. ఆ హంతకుడు ఉప్పుతిని ముప్పందుం అవుతాడట !" ఈలాటి మాటలంటూ ప్రళయనాట్యమే చేశాడట. అంతటి వీరుడూ, ఉప్పల సోమన్న చెమటలు కారిపోవగా యుద్ధం చేస్తూన్నాడట, గరుడప్లుతంతో పైకెగిరి, గోనవారిబాలుడు కత్తి పైకెత్తేసరికి వంగి గన్నయ్యపొట్టలో పొడవ బోగా గన్నయ్య పకపక నవ్వి పర్వతచక్రమణంచేసి కాలిజోడుతో ఆ కత్తిని పక్కకుతన్ని, వెంటనే కుడ్యబంధన విధానాన కత్తిని మూడు నిలువు కోతలులాగి క్రిందకికొట్టి కత్తితో చక్రధారికాప్రయోగం చేసి ఉప్పల సోముని తల ఆకాశమునకు ఎగురగొట్టాడట,

రుద్ర ! హర ! హరా ! ఏమి దారుణము ! ఎంతటి వీరునికి ఎంతగతి పట్టింది. గొంకప్రభూ : గన్నయ్య గజదొంగయై, ఈలా పాడయిపోయినా డేమి ?

గొంక ! మహాప్రభువులకు తెలియని రహస్యాలున్నాయా ?

రుద్ర ! మీ రా దొంగవిషయం జాగ్రత్తగా కనుక్కోండి. ఇది మా ఆజ్ఞ.

విర్యాల గొంకరాజు యువమహారాజుకడ సెలవుతీసికొని వెళ్ళిపోయాడు.

మహారాజు వెంటనే లేచి దౌవారికలు ఆవునేతి కాగడాలతో దారి చూప అభ్యంతర మందిరాలలోని పూజాగృహానకు పోయి, పురోహితుడు ప్రసాద మందీయ కన్నుల కద్దుకొని సేవించి, మహానసగృహాలలో భోజన మందిరానకు పోయినారు.

అక్కడ మణులు పొదగిన దంతపుపీఠంపై మహారాజు అధివసించారు. ఎదుట బంగారపు అరటిఆకు పెద్ద అరటిఆకులో ఉంచబడినది. ఆ బంగారపు ఆకుచుట్టూ, బంగారపు గిన్నెలలో కూరలు, పులుసులూ, పచ్చళ్ళు ఉంచ బడినవి. వీరశైవులు మాంసాదులు తినరు. లింగము కట్టుకున్న మనుష్యుడు

మధు మాంసాదులు వర్జించితీరవలయును. కాకతీయప్రభువులు రుద్రదేవ చక్రవర్తి కాలంనుంచి మధుమాంసాదులను మానివేసిరి.

రుద్రదేవమహారాజు భోజన మారగించి, లేవగా పరిచారకలు బంగారు చెంబులతో నీరు కొనివచ్చి చేతులుకడిగి తుడిచినారు.

ప్రభువు తాంబూలమందిరములోనికి పోయి, ఒకపల్యంకపీఠంపై అధివసించగనే మహారాణి శ్రీ ముమ్మడాంబికాదేవి రా ననుమతి వేడినారని వార్త వచ్చినది.

రుద్రదేవ ప్రభువు లేచి చిరునవ్వుతో సంతోషంతో తన నగరులో నుండి ముమ్మడాంబికాదేవి నగరునకు పోవు మందిరాలవైపు నడుస్తూ ఎదురేగినవా రయిరి.

ఇంతలో క్రొక్కారు మెరుంగుతీవలా, ఆకాశాన్నుంచి దిగివచ్చే రతీదేవిలా మహేశ్వరునికై హైమవతి హృదయంలోంచి బయలువెడలిన దివ్యకాంక్షలా, ముమ్మడాంబిక లత్తుక అలంకరించిన పాదాల బంగారు గజ్జియలు, మంజీరాలు గలగలలాడ ఒయ్యారంగా నడుస్తూ భర్తకెదురువచ్చినది. రుద్రప్రభువు చేతులు చాచి ముమ్మడాంబికచేతులు ప్రేమతో పట్టి "మహారాణీ! నామందిరానికి దయచేయండి. మీకు పరమరహస్యం మనవిచేస్తాను. రండి, నా పూజామందిరానకు" అని అనునయించినారు.

మహారాజును, మహారాణియు కలిసి మహారాజు పూజామందిరానకు పోయినారు.

రుద్ర: దేవీ నా జీవితానికి అవసరమైతే మీరు తగిన సహాయం చేయగలరా?

ముమ్మ: ప్రభూ! మీరు నా దైవము; మీరే నా ప్రభువులు, మీరే నా జీవితము. నా సర్వస్వము మీకై అర్పించివేయడానికి నే నెప్పుడూ సిద్ధమే.

రుద్ర: దేవీ! అదిగో పూజామందిరం. అందులో పరమశివుడూ, విశాలాక్షీ, గణపతి, కుమారస్వామి మున్నగు దేవతలు అహూతులై ఉన్నారు వారందరి సాక్షిగా నేను మనవిచేసే విషయాలు అత్యంత నిగూఢాలు. ఒకటి: మనరాజ్యం కోసము మా నాయనగారు చేయగూడని పని ఒకటిచేశారు. అది నేను భక్తితో తలదాల్చాను.

ముమ్మ: మహారాజా! తము ఆలోచించకుండా చేసినదే ఉత్తమము. ఇక ఆలోచించి చేసినపని ఉత్తమోత్తమమేగదా!

రుద్ర: వారే నాచేత ఆ వ్రతము పట్టించారు.

ముమ్మ: మహాప్రభూ! అది మహాప్రసాదం.

రుద్రదేవప్రభువు పూజామంటపంకడ మోకరించి పది ఘడియలు ప్రార్థించారు. అంత వారు లేచినవారై మహారాణిని తనదగ్గర కూర్చుండ ప్రార్థించారు.

"ఈ రహస్యం మీరు ధైర్యంతో భరించాలి. పురుషులకు నాకున్న కుంతల సౌభాగ్యం ఎన్నడైనా చూశారా దేవీ?"

"లేదు. ఆ సౌభాగ్యం చూచిన నాకు అత్యంతాశ్చర్యం జనించింది."

"నా ఈడులో నూనూగుమీసాలైనా రాని పురుషు లుంటారా దేవీ?"

"చిత్రం. ఆ విషయమూ నా కెప్పుడూ ఆశ్చర్యం కలగజేస్తూనే ఉంటుంది ప్రభూ!"

"శ్రీ గణపతి రుద్రదేవ చక్రవర్తికి పురుషసంతానము లేదు."

"ఆఁ! ఏమి తాము వచించేది! నా కేదో దడవస్తున్నది? తాము....? తా....?"

"శ్రీగణపతి రుద్రదేవసార్వభౌములకు ఇద్దరు కొమార్తెలు."

"ఇద్దరా? గణపాంబాదేవిగారు ఒక్కరేకాదా?"

"నేను చక్రవర్తి పెద్దకొమార్తెను నా పేరు రుద్రదేవి."

ఈ విషయాలు రుద్రదేవి చెప్పడం ప్రారంభించినప్పటినుంచిన్నీ గజగజ వణకుచున్న ముమ్మడాంబిక కంట జలజల బాష్పవారి ప్రవహించి పోయినది. ఆమె పటలేక రుద్రదేవి ఒడిలో వాలి వెక్కివెక్కి ఏడ్చినది. ఆ క్షణం ఒక దివ్యసుందరవిగ్రహుడు శాపంచేత స్త్రీగా మారిపోతున్నట్లు ఆమె భావించుకొని మరియు దుఃఖించినది. తాను తన ఆత్మేశ్వరుని గాఢంగా కౌగలించుకుంటే ఆయన పురుషత్వము నశించిపోదని రుద్రదేవిని ఆ బాలిక ఇంకా గాఢంగా హృదయాని కదుముకున్నది.

తనతెలివిలేమిచే తన పురుషుడు పురుషత్వం కోలుపోతున్నాడని ఆమె భావించుకొని గజగజ వణికిపోయినది. తనభర్త కేదో మహదాపద సంభవించినదని ఆమె శరఘాతచెందిన కపోతరాజును చూచిన కపోతిలా మూర్ఛపోయింది.

రుద్రదేవ ప్రభువు 'ఎవరక్కడ?' అని కేక వేసినారు పలువురు పరిచారికలు పరువిడి వచ్చి ముమ్మడమ్మకు శీతలోపచారాలు చేయగానే, ఆమె తెలివి నందింది.

"మహారాణీ! ఉపశమించండి. మీరంత బాధపడుదురని ఎరిగి ఉండిన్నీ నేను తొందరపడి చెప్పివేసినాను."

"మహాప్రభూ! మీరు చెప్పేవిషయాలు నా కేమీ అర్థంకాలేదు."

"నేను మీబోటి బాలికను. మా నాయనగారు పుత్రుని వాంఛించి, వాంఛించి, స్వయంభూదేవుని పూజించి, పూజించి నన్ను గన్నారు. ఎన్నాళ్ళో పిల్లలులేని వారికి నేను కలగడమే బ్రహ్మానందమైనది. కాని పుత్రికననే విచారము వారివి వెన్నంటింది. అప్పుడే విశ్వేశ్వర శివదేశికులు, 'భగవంతుని విలాసాలు అర్థంచేసికొని పురుషుడు ఆనందించాలి. పరమశివుని కృపవల్ల కాకతీయసామ్రాజ్య విచ్ఛిన్నానికి శుంభనిశుంభాది రాక్షసు లెవరో ఉద్భవించి

ఉంటారు. వారిని సంహరించడానికి దేవియే రుద్రదేవిగా ఉద్భవించి ఉంటుంది. అందుకని ఈ బాలికను కొమరునిగా పెంచవలసింది. తర్వాత కొమరుడు పుట్టితే, అప్పు డీమె బాలికయని తెలుపవచ్చును సార్వభౌమా!' అని ఉపదేశించినారట. చెల్లీ! అప్పటినుండి నే నట్లా పెరిగినాను. వీరవిద్య లన్నీ నేర్చాను. నువ్వు నా బిడ్డవు. నువ్వు నా చెల్లివి. నా గర్భాన్ని కొమరుడు కలక్కపోతే నీపుత్రుడే నాకు పుత్రుడౌతాడుదేవీ! నువ్వు జాయపసేనాని కొమరితవు. ధైర్యంపీడి మొరకు స్త్రీలా ఈలా దుఃఖిస్తారా? నువ్వు కోరిన మహాపురుషుడు దేవలోకంలో ఉన్నా వానిని బట్టితెచ్చి నీకు సమర్పిస్తాను. మేమంతా చేసిన ఈ అన్యాయానికి క్షమించా లని నా హృదయంమీద వ్రాలు" అని రుద్రమదేవి కంట తడిచేసినది.

ముమ్మడాంబిక రుద్రదేవి మోము నిమేషమాత్రం తిలకించి, కన్నీటితో తడిసిన పెదవులపై, మేఘాలమీద నిర్మలాకాశంలో వికసించిన పూర్ణచంద్రునిలా, నవ్వు వెలుగుతూ ఉండగా రుద్రమదేవి హృదయంమీద వాలింది.

# చతుర్థ గాథ

# అన్నాంబిక

## ౧

ఆయన నేంత తీవ్రిగా ఉన్నరు! అవును. పూజ్యులైన గోన బుద్ధారెడ్డి సాహిణి మహారాజ పుత్రుడైన పురుషునకు మహారాజతీవి రాకుండా ఏలా ఉండగలదు?

అన్నాంబిక అంతుదొరకని ఆలోచనలతో తన అంతఃపురంలో సంగీత మందిరంలో దిండ్లు అలంకరించిన ఒక రత్నకంబళిపై, మెత్తని పట్టుదిండుపై ఒరిగి కూర్చుండియున్నది. ఆ మందిరమునిండా అనేక వాద్యవిశేషాలు వివిధ పేటికలలో ఉన్నవి. ఆమె ప్రక్కనే వల్లకి ఒకటి మంజులాంగుళీస్పర్శ నాకాంక్షించి ఉన్నది. ఆ మందిరమంతా రత్నకంబళ్ళు పరచి ఉన్నవి. వానిపై పట్టుదిండ్లు అక్కడ అక్కడ ఉంచబడినవి.

అన్నాంబిక పద్మాసనం వేసుకొని కూర్చుండి వీణామతల్లిని ఒడిలోనికి తీసికొని,

"లోక భీకరులైన దొంగల
మూకలను పాలించు అలక
న్నాకు చరితము వల్లకీ! పలు
పోకలను పాడేవు తగునటె వల్లకీ!"

అని ఒక పాట ఆలపించినది.

ఆమెకు కంట నీరు తిరిగిపోయినది. వసంతకాలంలో తొలకరి చినుకులు హృదయమందు దాచుకున్న చిన్న మేఘాలులా ఆమె కన్నుల నీరు కమ్ముకుంది.

"కొండరాళ్ళో, దండకాటవో
ముండ్లదారులో, మండుఇసుకో
నిండెనేమో హృదయమందున
దండువెడలే దొంగపే?"

అన్నాంబిక సౌందర్యం ఆంధ్రలోకంలో వింతగా చెప్పుకుంటారు. అన్నాంబిక విద్య, అన్నాంబిక శేముషీసంపన్నత ధూపకరండమునుండి దెసలన్నీ కమ్మే పరిమళంలా దేశాలన్నీ ప్రసరించింది.

మహారాష్ట్రి యాదవుడు, చోళ పాండ్యదేశ దాక్షిణాత్యప్రభువులు, కదంబ గాంగులు, కుంతల చాళుక్యుడు అన్నాంబికను వాంఛించారు.

అయినా కోటారెడ్డి తోటిమండలేశ్వరుని తనయునకు ఆ దివ్యశారద అన్నాంబికను ఉద్వాహం చేయ సంకల్పించాడు. కోటారెడ్డి ఆ బాలిక హృదయం ఏమి అర్థం చేసికోగలడు ?

శ్రీ గణపతిదేవ చక్రవర్తి తన బాలికనే రుద్రదేవునిగా పెంచినాడని ఏలా ఊహించాడో, అలాగే తాను తన కుమార్తెను బాలునిగా పెంచాడు, అక్కడ శివదేవయ్య మంత్రి ఇక్కడ ఏడీ ? తోడి ప్రభువులు నవ్వుతున్నారని అనుకున్నాడు. తన తనయమీద నిష్కారణకోపం వహించి ఎందుకో మండిపోయినాడు.

అత్యంతపాపం చేసుకొన్నవానికిగాని బాలికలు జన్మించరట, అందులో, బాలురు కలుగకుండా ఒక్క బాలికలే ఉద్భవించినవాని జన్మరౌరవాది నరక హేతువట, కోటారెడ్డి ధర్మశాస్త్రం అతని హృదయంలోంచే జన్మం పొందింది ! ఆ ధర్మాన్ని పాలించే ప్రభువు ఆయనే ! ఒక్కొక్కనాడు తన ఒంటి కూతును చూస్తే ఆదవోని ప్రభువుకు అపరిమిత ప్రేమ. ఒక దినం పత్రికను, పురుషవేషంతో ఉందేదినల్లో, తనతోపాటువచ్చి అర్ధసింహాసన మెక్కి రాజకార్యాలలో పాల్గొను మనేవాడు. వరొక్క దినాన 'నీవు బాలుడవై ఎందుకు పుట్టలేదు అన్నమదేవి ! దుస్తరమైన నీ విధిని నేను దాటప్రయత్నం చేయడమేమటి ?' అనేవాడు.

అన్నమదేవికి వరదారెడ్డి సాహిణిని వివాహమాడ ఇష్టంలేదని కోటారెడ్డికి దేవేరి స్పష్టంగా తెలియజేసిన సమయంలో అవు ననుకొన్నాడు. మళ్ళీ శుభముహూర్తము నిశ్చయంచేస్తున్నాము అని లకుమాయారెడ్డి వార్తనంపగానే శుభ మనుకొన్నాడు.

"చిన్నబిడ్డలకు ఇష్టానిష్టములేమిటి ? అన్నాంబిక ముక్కుపచ్చలారని కసుగందు. మంచీ చెడ్డా ఆమె కేమి తెలుస్తుంది ? మహారాణి తనకు అన్నాంబిక ఒకర్తే సంతానం కనుక చిన్నతనాన్నుంచీ అల్లారుముద్దుగా పెంచుకొంది. అందువల్ల ఆ బిడ్డ ఏమంటే తానూ అదేఅంటుంది. రాచరికపు విషయాలు ఆడవారి కేమి తెలుస్తాయి ?" అని వందిభూపాలు డన్నాడు. పాపం అంతదిట్టమైన వీరుడై కూడా అలా గన్నారెడ్డి చేతుల్లో హతమారిపోయా దేమిటి ? కందనోలంతా బట్టుకొని ఆ పాపి రాజ్యం సాధించాడు: కోటంతా బాగుచేయించాడు. మహావీరుడు ఉప్పల సోమప్రభువు గన్నయతల తెస్తానని ప్రభులోకంముందు అన్నమాటలు ఎదురుతిరిగి అతని తలనే గన్నారెడ్డి పాదాల ముందు పడవేయించాయి.

ఆ ప్రభువు శవాన్ని మంచిగంధపు పేటికలో ఆయన రాజధానికి నగౌరవంగా పంపాడట, ఆ గజదొంగ, ఆ పరమపాపికి గౌరవంచేయడం కూడా తెలుసునా ? వాడుకదా పీటలమీది వెళ్ళి చెడగొట్టినాడు. వాణ్ణి, వాడి తమ్ముణ్ణి వివాహశభామందిరంలోనే స్తంభాలకు కట్టి వివాహం వైభవంగా చేయాలి.

ఆదవోని మహాప్రభువులను అవమానంచేసి బ్రతికిపోయిన మగవాడింతవరకు ఎవడున్నాడు ? ఏది ఏట్లయినా అన్నాంబిక వివాహం త్వరగా ముగించాలి.

ఈ నిర్ణయానికి రాగానే ఆదవోని ప్రభువు అంతరంగికురాలైన అంతఃపురపరిచారిక నొకతెను ఆలోచనామందిరంలోనికి రా నాజ్ఞ పంపినవాడయ్యేను. ఆమె వచ్చి ప్రభువునకు మోకరించి లేచి నిలుచుండి 'ఆజ్ఞ' అని చేతులు జోడించినది.

"నీవుపోయి, మహారాణీగారితో రాజకుమారికి మళ్ళీ వివాహముహూర్తము స్థిరమయింతనీ, బాలికల ఇష్టానిష్టాలు ఉత్తమ రాజకీయాలకు అడ్డం రాకూడదనీ, రాజకుమారి భక్తితో వివాహసంసిద్ధయై ఉండవలసిందనీ మహారాణి నా ఆజ్ఞగా తెలియజేయవలసిందనీ మనవిచేయుము."

ఆ పరిచారిక చిన్ననాటనుండీ అంతఃపురాలలో పెరిగినది. అంతఃపుర స్త్రీలలో బలముకలవాళ్ళను ఏరి, యుద్ధవ్యవసాయనిపుణులుగా శిక్షనిస్తారు. వారు పురుషులతో సమంగా యుద్ధంచేయగలరు. అంతఃపుర రాజకీయాలు సాధారణంగా వారు పట్టించుకోరు. తమ ప్రభువులకు, దేవేరులకు అత్యంత భక్తితో సేవచేస్తూ అవసరమైతే ప్రాణాలు సమర్పించడానికి ఏమీ వెనుదీయరు.

ఆ పరిచారిక తిన్నగా మహారాణికడకుపోయి, ప్రభువు తన కప్పగించిన సందేశం వారికి మనవిచేసింది. మహారాణి ఆశ్చర్యమంది, అమ్మాయి వివాహం విషయంలో ఏలాటి విషమసమస్యలు తమరాజ్యానికి రానున్నాయో అని భయపడి, భవిష్యత్తు తమ కులదేవత విశాలాక్షీదేవి కరుణవల్లనే సుఖంగా పరిణమించాలని కనులుమూసి ప్రార్థించుకొన్నది.

౨

తండ్రిగారి ఆజ్ఞ విన్నది అన్నాంబికాకుమారి. వివాహానికి రెండవ ముహూర్తము నిశ్చయమయిందని శుభలేఖలతో వర్ధమానపుర రాజపురోహితుడు ఇరవైఐదు ఏనుగులతో, మూడునూర్ల అశ్వికులతో. వేయిమంది సర్వాయుధోపేతులగు సైనికులతో, బంగారు కట్టుల అందలం ఎక్కి ఆదవోని వచ్చాడు.

ఈ విధంగా ముహూర్త నిశ్చయ పత్రిక ఒక్క చక్రవర్తుల కుటుంబ వివాహ విషయంలోనే యాత్రచేస్తుంది. లకుమయారెడ్డి ప్రభువుకు తన హృదయంలో చక్రవర్తిత్వం సిద్ధింపనే సిద్ధించింది. మండలేశ్వరులలో తన కున్న సైన్యబలం ఇంకెవరికి ఉన్నది ! ఒకలక్ష విలుకాండ్లను లకుమయారెడ్డి ప్రభువు సన్నద్ధం చేశారు. మూడునూరుల పోతరించిన మదగజాలు, పదియేను వేలమంది రాహుత్తులు, మూకబలగం మూడులక్షలూ, వేయి రథాలు

వర్ధమానపురం కోటలో, కోటచుట్టూ గ్రామాలలో, శిబిరాలలో సిద్ధంగా ఉన్నాయి. అనేకులు మండలేశ్వరులు తమతమ సైన్యాలతో బాసటగా ఉన్నారు.

అలాంటి శ్రీశ్రీ వర్ధమానపురవరాధీశ్వర, సంతతార్చిత శశిమౌళి, రాయజగదాళ, మహామండలేశ్వరులైన లకుమయారెడ్డి మహారాజాధిరాజు కడనుండి యువరాజు వివాహానికి లగ్నపత్రిక అంత వైభవంగా రాక పోవుటెట్లు ?

"వెనుకటి వివాహప్రయత్నం సాధారణం. ఆ ముహూర్తము తప్పి పోవటమే మంచిదయింది" అనుకొన్నారు కోటారెడ్డి ప్రభువు. లగ్న పత్రికతో అంత వైభవంగా వర్ధమానపుర రాజపురోహితులు రావడం ఎంత ఉచితము ! ప్రభువు ఎంతో గర్వపడినాడు.

పురోహితునితో భట్టులు, సర్తకులు, సంగీతవిద్వాంసులు, వేదవేదాంగ పారంగతులు, పండితులు, జంత్రవాద్యమేళాలవారు వచ్చేశారు. అదవోని రాజపురోహితుడు అంత వైభవంగానూ ఎదురేగి, సగౌరవంగా వర్ధమాన రాజపురోహితుని కోటలో ఒక హర్మ్యంలో ప్రవేశపెట్టించాడు.

పండితసభలు జరుగుచున్నవి. అదవోని పట్టణం అంతా శృంగారింప బడింది. ఉత్సవాలు జరుగుచున్నవి. శుభముహూర్త నిశ్చయానికే ఇంత అఖండోత్సవం జరుగుతూఉంటే ఇంక వివాహం దేవేంద్ర వైభవంతో జరిగి తీరుతుందని ప్రజ లనుకొన్నారు.

స్వస్తి శ్రీ శాలివాహన శక ౧౧౮౩, దుర్మతి సంవత్సర వైశాఖ శుద్ధ ౦ బుధవారంనాడు, రోహిణీయుక్త కన్యాలగ్నమందు శ్రీశ్రీశ్రీశ్రీ సమస్త ప్రశస్తి సహిత, భండనోత్తుంగ, తురగరేవంత, పరబలసాధన, పతిహితా చరణ, గండరగండ, గండభేరుండ, సత్యహరిశ్చంద్ర, శౌచగాంగేయ, శరణాగత వజ్రపంజర, సకలజనస్తుతి, పరనారీదూర, బంధువింతామణి, సూర్యోదయ రాజ్యసముద్ధరణ, సకలవిద్యావినోద, విభవపురందర, వివేక చతురానన, విప్రజనాశ్రయ, చతుర్థకులసముద్భవరాజ్యవర్ధనచంద్ర, పెనమనుంగోత్ర వడ్లూరిపురాధీశ్వర గడికోట మల్లవంశ భానులైన శ్రీశ్రీశ్రీ కోటారెడ్డిప్రభువులవారు తనయుని వివాహం నిశ్చయం చేశారు.

ఆ మహోత్సవసమయంలో కార్తాంతికశ్రేష్ఠుడు కౌండిన్యగోత్ర పవిత్రుడు సోమనాథ భట్టులవారు, ఆ ముహూర్తప్రాశస్త్యం అదవోని మహా ప్రభువునకు, శ్రీవర్ధమాన రాజపురోహిత పెద్దిభట్టులవారికి వినిపించి, వేయిన్నీ నూటపదారు సువర్ణాలు, అనేక దుశ్శాలువలు, మూడుసామంతుల భూమి అలం కృత గృహము, నూరుగోవులు బహుమానము లందినవాడాయెను.

అన్నాంబిక ఒక రహస్యగవాక్షంద్వారా ఈ దృశ్యం చూస్తూ చూస్తూ వెడనవ్వు నవ్వుకొన్నది. కోసగి మైలిని ప్రాణం చూరగొన్న వాడు,

ఉప్పల సోముని తలగొండుగండడు, వందిభూపాలుని ప్రాణాపటోరుడైన ఒక భయంకరవ్యక్తి ఆ మహోత్సవమధ్యమందు నిలుచుండి పకపక నవ్వుతూన్నట్లు ప్రత్యక్షమైనాడు. ఆమెగుండె దడదడమనగా కళ్ళు మూసికొన్నది. ఆ దర్శనము మాయమైనది.

ఆత డంత భయంకరుడా! మరి అతని మోము ఎంత ప్రసన్నంగా ఉన్నది! అతడు చిరునవ్వు నవ్వని నిమేషం ఒకటైనా ఉండగలదా? మొదటి ముహూర్తంనాడు తనకు ప్రత్యక్షమైన ఆ మహాభాగుని రూపమే నేడు ఛాయామాత్రంగా ప్రత్యక్షంకాగా ఆమె అనుకొన్నది.

ఎంత ఉన్నతమూర్తి! అతడు గజదొంగా! ఎక్కడ దొంగతనం చేసినా డాయన? ఎందువల్ల? ఏమిటా గజదొంగతనం? ఇం దేదో మహా రహస్యం ఉన్నది. ఆ మహాపురుషుని మూర్తిలో, మోములో, చూపులో గజదొంగతనం ఏది? గజదొంగలు అందంగా ఉండగలరా? ఆసురికమైన సౌందర్యము హిరణ్యాక్షునిలా, దుర్యోధనునిలా తామసికమై ఉంటుంది.

గన్నారెడ్డి ద్రౌపదీస్వయంవరంనాటి అర్జునునిలా ఉన్నాడు. అతడు ఆ దినమందు తాను తెర తొలగించినప్పుడు తన్నంత కరుణతో చూచినాడు. ఆ చూపులలో వెన్నెల కిరణాలు ప్రసరించినవి ఆ చూపులలో సామగానాలు వెల్లివిరిసినవి. ఆ చూపులలో విశాలాక్షీదేవి నవ్వులు ప్రకాశించినవి.

అటు ఉప్పల సోమున వధించి, వెంటనే సైన్యంతోవెళ్ళి కందవోలు ముట్టడించి, కోటలోనివారందరూ ఏమరుపాటునఉండగా కోటలో ప్రవేశించి ప్రభువును బందీ చేసినాడట! ఈ గాథను కందనోలునుంచి అంచెలమీద వార్త తెచ్చిన చారుని చెల్లెలయిన తన అలంకారిక చంచలాక్షి చెప్పింది.

వందిభూపాలుడు కర్కోటకుడు. తన ప్రజలను ధర్మహీనుడై అనేక బాధలకు లోనుజేసిన క్రూరకర్ముడు. తనతండ్రి ఈనాడు శ్రీ గణపతిదేవ సార్వభౌముని పై, రుద్రదేవమహారాజు పై కత్తికట్టినారే! కాని చక్రవర్తి అంటే పరమభక్తితో కొలిచే దినాలలో, తనకు పదమూడుసంవత్సరాల ఈడు ఉన్నప్పుడు వందభూపాలుడు రాజుకాడు, రాక్షసుడు అని అనేవారే! అలాంటిది, ఈ దినాలలో ఆయనకు తండ్రిగారు స్నేహితులైనారు. వెంటనే గోన గన్నారెడ్డి చేతిలో హతమారిపోయినాడు.

కందనోలులో మహాసభచేసి వందిభూపాలుల విచారంచినారట. ప్రజలందరూ భయముతీరి, తమ కా వంది చేసిన అన్యాయాలు, అవమానాలు చెప్పినారట. అయినా వందిభూపాలుని కాశికి పోవలసిందని గన్నారెడ్డి హితవు గరపినాడట. వందిభూపాలుడు గణపతిదేవ ప్రభువును, గోన బుద్ధారెడ్డి ప్రభువును, గన్నారెడ్డిని, విశ్వేశ్వర శివదేశికులను అనరానిమాట లన్నాడట ఆ తవరకూ గోన గన్నయ్య నవ్వుతూనేఉన్నాడట. అప్పుడా వందిభూపాలుడు శ్రీశ్రీ రుద్రదేవప్రభువును, "తుచ్ఛవాంఛలు తీర్చుకోడానికి పురుషవేషం

వేసికొన్న ఆడకుందా" అన్నాడట! "దొరసానమ్మగారూ! అప్పుడు గన్నారెడ్డి తెల్లటి మంటతో మండే రోహిణీకార్తె నాటి మధ్యాహ్నసూర్యుడై, 'ఛీ నోరు మూయుము పాపీ!' అని లేచి పెళ్ళున వందిభూపాలుని చెంప పగులగొట్టి, చేయిపట్టి బరబర సింహాసనంమీదనుంచి లాగి, 'పిశాచీ! నీ సింహాసనం నీకే ఉంచి, శ్రీ శ్రీ రుద్రదేవులకు దాసుడ వౌతావేమో అని నిదానించాను. కాని మనుష్య జన్మయెత్తిన అతిహీనుడుకూడ భక్తితో రుద్రదేవుల పేరు తలచుకుంటాడు. గజదొంగనయినా నేను మన చక్రవర్తి బిడ్డ నెవరు హీనంగా మాట్లాడినా వానిప్రాణం కొంటానని ప్రతిజ్ఞ పూనినాను. నువ్వు నాకుకూడ అపశయం తెస్తావు' అని పలికి ఒకతన్ను తన్నినాడట. ఆవేళలో గన్నారెడ్డిని ఎవ్వరూ తేరి చూడజాలకపోయినా రంటమ్మా దొరసానమ్మగారూ! వందిభూపాలుడు గుఱ్ఱమెక్కి ఎక్కడికో వెళ్ళిపోయానాడట. అతనితో ఒక్క వీరుడైనా వెళ్ళడానికి నిరాకరించాడట. ఆ ప్రభువు భార్య ఇదివరకే కాలగతిపొంది కైలాసము చేరింది. కుమారుడు తలవాల్చివచ్చి గన్నారెడ్డికి తనకత్తిని సమర్పించి మాటలేక నిలుచున్నాడట. 'తమ్ముడూ! ఈ రాజ్యం నీది. చక్రవర్తికి సేవచేస్తూ ధర్మం నాలుగుపాదాలా నడుపు' అని గన్నారెడ్డి చెప్పి కోటలోనికి చక్రవర్తి విరోధులను రానీయవలదని చెప్పి తన సైన్యాలతో మాయమైనాడట. రెండుదినాలక్రిందట సంగమేశ్వరంలో వందిభూపాలుడు తాను చేసిన పాపాలకు నివృత్తిగా గండకత్తెర వేసికొన్నాడటమ్మా!" అని చంచలాక్షి అన్నమాంబికకు చెప్పింది.

ఆ మాటలన్నీ స్మృతిపథానికి రాగా అన్నాంబిక గవాక్షంలోనుంచి తాను చూసే శుభముహూర్త నిశ్చయోత్సవం మరచి ఆ గన్నారెడ్డినే హృదయంలో నింపికొన్నది.

## 3

'గజదొంగ అయిన పురుషునికి సార్వభౌమునిపై భక్తి ఎట్లు?' అని అన్నాంబిక తన తోటలో విహరిస్తూ ఆలోచింపదొడంగెను.

ఈసారి ఆ గజదొంగ తన వివాహము తప్పిస్తాడా? పెళ్ళికుమారుణ్ణి ఆలాగు ఆదినాన ఎత్తుకొనిపోవడానికి కారణం వివాహం తప్పించడానికా? కాకపోతే, మరెందుకు? ధనానికి ఆశపడనేదు. అహంకృతిచేతనా? లేక వట్టి కక్షచూపించడానికా? లేక 'జాగ్రత్త' అని పినతండ్రిని హెచ్చరించడానికా?

వివాహం తప్పించ నవసర మేమున్నది? ఏమో అతడు గజదొంగ అగుటకు వెనుక ఏ మహాచరిత్ర ఉన్నదో? దాసీలమాటలలో పినతండ్రి అతని రాజ్యం అపహరించడంవల్లనూ, చక్రవర్తి ఆ విషయంలో ఏమీ సహాయం చేయకపోవ

దంవల్లనూ, మనుష్యలోకంఅంటే అసహ్యంకలిగి అలా అయినాడని అనిపించింది.

రేపటిదినం ఆమెకు ప్రధానమహోత్సవం చేస్తారట. ఇదివరకు అతి తొందరగా వివాహం కావాలని ప్రధానమహోత్సవం జరపకుండా, వివాహానికి తరలి వచ్చారు పెళ్ళివారు. ఈపట్టున అన్నీ సక్రమంగా జరుపుతారట. అప్పుడు చక్రవర్తి అన్న భయము ఉన్నదట. ఇప్పుడు లేదట! ఇప్పుడు లకుమయారెడ్డే చక్రవర్తి అయినాడట! అందుకనే శుభముహూర్తపత్ర సమర్పణ తంతు ఇంత విచిత్రంగా జరుగుతున్నది.

ఎందుకీ గజదొంగ రూపము తన స్మృతిపథాలనుండి పోదు? మొదటి చూపులోనే అతడు తనహృదయాన్ని గంటుచేసి, ఆ దారివెంట ఎవ్వరూ చొరరాని తన ఏకాంత భావహర్మ్యము చేరినాడు. గజదొంగలు కన్నము వేయరుకదా! ఆనాడు తాను తెర ఒత్తిగించి ఆ గజదొంగను చూచుటే దోషమైనదా? ఆనాటినుండి ఒక్క క్షణమైనా ఈ తన చిన్నతనపు జీవితానికి శాంతి దూరమైనది.

పదునెనిమిది సంవత్సరాల అరవిచ్చు మల్లెపూప్రాయపు మసృణకోమలగాత్ర, ఆ బాలిక యౌవనక్షేత్ర ప్రథమగోపుర వినిర్గత సుందరి.

బంగారపువర్ణం ఆంధ్రయువతులకు కోరికలపంట. అందులో ఆమె తనుచ్ఛాయ మేలిమియే.

ఆ బంగారునకు కుసుమమసృణత్వము ఆంధ్రబాలికల స్వత్వము. ఆ మేలిమి బంగారు పూవుల లాలిత్యానికి గంధరాజ పరిమళము ఆంధ్రయువతీ సౌందర్య సాధారణగుణము. హిమపన్నగసానువికసితదివ్యపుష్పసౌరభమై, సేవచేసే చెలులకే మైమరపు కలుగచేస్తుంది అన్నాంబికాకుమారి సౌందర్యము.

కోలమోములో, సోగకన్నులలో వాలుచూపులు, చిన్నినోరు, బంగారు సంపెంగ నాసిక సరియైన శ్రుతిలో కూర్చబడిన ఆ బాలిక మోమును ఆదవోని రాజసభాలంకారుడైన వృద్ధకవి త్రిపురాంతకేశ్వరమంత్రి ఈలా వర్ణించాడు:

"ఆ నవమోహనాంగి దరహాస వికస్వరలోచనద్వయా
నూనత జూచియేమొ యతనుధ్వజమందలి మీన మట్టులే
నాన వహించె, శ్రీకర వినమ్రము పద్మము వాడిపోయె, ఏ
లో ననలెల్ల రాలెను, విలంబితమై యది వాలిపోవగన్."

ఈ పద్య మా మహాకవి నిండుసభలో తండ్రియొడి నలంకరించిన ఎనిమిదేండ్ల బాలికయైన అన్నాంబికపై ఆశువుగా గానంచేశాడు. ఈపద్యం సర్వాంధ్రమండలాలా ప్రతియువకునిచే పాడబడి ప్రసిద్ధమైన చాటువై పోయెను.

ఆమె కన్నుల అందాన్ని ప్రతికవీ వర్ణించాడు. నీలోత్పలపు అందం నీచోపమ మైన దా కన్నులకు?

వదినగార్లయిన వివిధ పద్మాలకన్న, సహోదరీమణులైన తెల్ల, ఎఱ్ఱ, అరుణ కలువలకన్న, ఈ నీలికలువ చిన్నది; అత్యంత మనోహరరూపం కలది. పొదుగాటి పూవు, కోలయైన రేకులు. అద్రితను పుణికిపుచ్చుకొన్న అనన్య మనోహర నీలకాంతి ఆ కొనల నలమికొన్నది. ఆకాశనీలిమ ఆ నీలికలువకడ ఓనమాలు నేర్చుకోవలసిందే! చిన్నదైన ఈ కుసుమబాలికలోని నీలిమకు దీటైనది శ్రీకృష్ణడింభకుని సౌందర్యంలోనే గోచరిస్తుందట!

ఈ పూవుపుటాల పోలిక కనులుగల సుందరాంగులు సర్వప్రపంచంలో ఇరువురు మువ్వురు మాత్రమే ఉంటారట. వారిలో శిరోరత్నము అన్నాంబికాదేవి. ఆ కన్నులు అరమూతలో అనంతమాధుర్యాలను అందంగా దాచుకున్నవి. అవి తమ సోగతనంలో అమృతధారలను ప్రవహింపచేస్తాయి. అవి తమ లోకాతీతాయి నీలిమచే అనంత వినీలత్వాన్ని ప్రత్యక్ష మొనరుస్తున్నవి.

వసంతకాలం యువతీయువకుల తీక్షనిబాధ. యుగాలనుంచీ యువతీయువకులదే ఆ కాలం. లోకాల యౌవనపు కోర్కెలన్నీకూడి వసంతమయింది.

తెల్లవారగట్ల కొంచెం చలితో వసంతమాస ప్రథమదిన ప్రారంభం. ఉదయమందు ఇక ప్రత్యక్షం కాబోవు సౌందర్యదర్శన కుతూహలానందమత్తత. వసంతభానుడూ నవయౌవనుడే! అతడు మత్తతతో లేవలేక కొంచెం వ్యవధిగా లేస్తాడు.

పుంస్కోకిల—

"ఎచ్చటే పికబాల ఏమావినీడలో
ఏతింత్రిణీ వల్లవాచ్ఛాదనమ్ములో
కువకువల కులుకుతూ కూర్చుంటి నిర్దయత
కో కో యనుచు పిలుచు ఈ కృపణనే వినవు?"

అవి విరహగీతిక పాడుకొంటున్నది.

రసాలంలో పురుషపుష్పము ప్రియురాలిని వెదకుటకై తుమ్మెదను ఆపి,

"చెలికాడ తుమ్మెదా! పలు కిదే వినరార
వలపు నా రాణి ఏ వలవంత పాలవునొ
ఈ శాఖ విడనాడ నా శక్యమేగాదు
పాశమై విధి నన్ను బంధించె నీరీతి
నాలోని హృదయమ్ము నాలోని ప్రేమమ్ము
నీలనీలములైన నీ పక్షములమోసి
నా నాతి కర్పించి నా ప్రేమకథ తెలిపి
నా ప్రాణసఖుడవై నన్ను రక్షించరా"

అనుచు షడ్జమశ్రుతి నాలపించెను.

ఇంతలో దుర్భరప్రణయావేదనతో జేగురంది లేచినాడు దివిమీదకు యువ భానుమంతుడు.

"ఏదో నా ఒడలిలో వేదనాజ్వర మొదవె
ఈ తాప మిటు లొదవ నేమి కారణమొ ?
ఏదో నా.... .... .... ... .... .... ....
ఒళ్ళు ఝల్లనిపొంగు కళ్ళలో మత్తతలు
ముళ్ళమీదను రథము వెళ్ళనట్లేతోచు"

ఆ సొబగుగాని పాట విని చిరునవ్వుతో పద్మినీబాల త్రపావతియై తల ఎత్తింది. వసంతము పద్మినీబాలది. వేసవి సంజ్ఞాదేవిది. శీతకాలంలో ఛాయాదేవి భర్తపజ్జ చేరుతుంది.

అన్నాంబికాదేవి ఇటూ అటూ తిరుగుతూ పూవులతో మాటలాడుతూ, కృత్రిమ శైవలిని ప్రక్కనే మెత్తని గడ్డిపై కూర్చుంది, ఉదయాన మహాసభలో జరిగిన వివాహలగ్నపత్రికాసమర్పణోత్సవమునుగూర్చి ఆలోచిస్తున్నది.

అన్నాంబికాదేవిని ఇందీవరాలోచన అన్న మహాకవి త్రిపురాంతకేశ్వరుని పలుకులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ అన్నాంబిక చిరునవ్వు నవ్వుకొన్నది.

చెలికత్తెలను తనతో రావలదని ఆజ్ఞ ఇవ్వడంవల్ల, వారందరూ ఆవలనే దూరదూరంగా చుట్టుప్రక్కల పూలమొక్కలచాటున అన్నాంబికను కనిపెట్టుచున్నారు. ఆ చైత్ర బహుళ తదియనాడు చంద్రుడు ఆరు ఘడియలే ఆలస్యంగా వస్తాడు. చంద్రుడు వచ్చి పదిమెట్లు పైకి ఆకాశంమీదకు సాగగానే లోనికి వెళ్ళిపోదామని అన్నాంబిక కూర్చునిఉన్నది.

ఆకాశంలోని అరుణరాగాలు ఒకవిధంగా కరుణగలవే! ఆ రాగాలు కూడుకొని యువతుల హృదయాలలోనికి చేరుతాయి. అప్పుడా బాలల స్వప్నాల మాధుర్యం ద్రాక్షసారాయంలా మత్తు తాలుస్తుంది. ఆ అమృతము వారి పెదవులలో పొంగెత్తుకు వస్తుంది. ఆ దివ్యసుధను ఆస్వాదించే నాయకులు మత్తు పొంది ఒడలు తెలియక తమ నాయికల ఎన్నివిధాలో చీకాకుపరుస్తారట.

ఈ విధంగా త్రిపురాంతకేశ్వరుడు తన వాసవదత్తా కావ్యంలో పద్యాలు రచించాడు. ఆ వృద్ధుని శృంగారరసపై చిత్రి అన్నాంబికకు నవ్వు పుట్టించింది. వృద్ధుని కిది ఏమివెట్టి అనుకొన్నదామె.

నేడు ఏదో అనిర్వచనీయ సౌందర్యము నీటిలో తేలిపోవు పుష్పపుటాలులా తనకు అస్పష్టంగా తోస్తున్నది. ఎందుకా పద్యాలన్నీ చీకటిపడే సమయంలో తన స్మృతిపథాన్ని ప్రత్యక్షం అవుతున్నవి ?

ఆమె ధరించినది తెల్లని పట్టుశాలి నూలుచీర. సరిగపూలు అచ్చటచ్చట కుట్టిఉన్నాయి. మామిడి పిందెలతో అరచేతి వెడల్పు సరిగంచు. ఆమె తొడుగుకొన్న స్తనదుకూలకంచుకము వంగపడు చాయగలది. ఆ కంచుకము అంచులో ముత్యాలపూవులు కుట్టిఉన్నవి.

ఉదయమందే ఆమెకు వట్టివేళ్ళనూనె తలంటి, గంధపొడి పిండి నలుగు పెట్టి, జాతిపరిమళజలాల స్నానమాడించి, మెత్తని సెల్లాల తడియార్చి వదులు జడవేసి మల్లెమొగ్గలు ముత్యాలకూర్పులా అలంకరించారు. ఆ మల్లెమొగ్గలు ఇప్పుడు విచ్చినాయి. ఉదయం చెలులు తన్ను ధరింపచేసిన కుసుంబా పట్టుచీర, పసిమిబంగారు స్తనదకూలము, కమలారుణపు పట్టుచీర వెంటనే మార్చింది.

ఆ నగలన్నీ ఊడ్చింది. ఇప్పు డామె అన్నీ ముత్యాలనగలే పెట్టుకొన్నది. లాలాటికమూ పెద్దముత్యమే. అన్ని నగలూ ముత్యాలవే! ఉదయం పద్మరాగ రత్నాభరణాలు, మధ్యాహ్నం గోమేధికాలంకారాలు, సాయంకాలం ముత్యాలు కూర్చిన ఆభరణాలు దాల్చు నామె.

ఇంతలో చంద్రుడు ఎఱ్ఱటి మహాపద్మంలా తూర్పున ఉదయించాడు.

అన్నాంబికాకుమారి పడే వేదన ఆమె కేమి అర్థమవుతుంది? అన్నాంబిక పుంజీభవించిన స్వచ్ఛసౌందర్యసత్వం. స్వచ్ఛసౌందర్యశక్తిప్రవాహం కర్పూర సైకతాలపైనే ప్రవహిస్తుంది. పవిత్రహృదయభూములనే తడుపుతుంది.

అన్నాంబికాసౌందర్యమహాఝురి పోటెత్తి, పరవళ్ళెత్తి, కరడుకట్టిన మూర్ఛజనకాజ్ఞాశిలలను ఛేదించుకొని ప్రవహించ జలజలలాడుతున్నది. అది ఆ బాలిక కేమి తెలుస్తుంది!

చంద్రుడు గబగబ ఆకాశంలోకి తేలుకొని వచ్చాడు. చంద్రునివైపు చూస్తూ కృష్ణతదియనాటి చంద్రుడు రాకాచంద్రునికన్న అందము తక్కువవాడా అనుకుంటూ, గజదొంగ గోన గన్నయ్య కృష్ణతదియనాటి చంద్రుడు అతడు రాకాచంద్రుడు కాలేడా అనుకుంటూ అన్నాంబిక ఇటు తలతిప్పింది.

నవ్వుతూ ఎదుట గోన గన్నారెడ్డి నిలిచి ఉన్నాడు.

౪

అన్నాంబికకు ఒక్క నిమేషం ప్రాణచలన మాగిపోయింది.

గన్నారెడ్డి వసంతమూర్తిలా, రూపంపొందిన యౌవనంలా, పోతపోసిన వీరత్వములా, ఉత్తమశిల్పి ఊహాలోని ధీరోదాత్తపురుషునిలా చిరునవ్వుతో నిలుచుండి, అన్నాంబికకు నమస్కరించి, తీయని మందర స్థాయిలోని షడ్జమస్వరంతో "అన్నాంబికాదేవీ! ఈ గజదొంగను చూచి భయపడకు, నీకు కాకతీయవంశం అంటే భక్తి ఉన్నదా? అని ఒక ప్రశ్న. రెండవది, మీకు శ్రీ గణపతిరుద్ర సార్వభౌములన్నా, శ్రీ రుద్రమహారాజు లన్నా భక్తిఉన్నదా? మూడవప్రశ్న, ఈ మహాదేశంలో ధర్మం నాలుగు పాదాలా నడవాలని ఉన్నదా అనీ—ఈ ప్రశ్నలు అడుగుతున్నాను" అని కొంచెం విషాదచ్ఛాయలు తోచే వాక్యాలతో అడిగాడు.

అన్నాంబిక మాటాడలేదు. అతని సమున్నతదేహము, అతని గంభీర ముఖాకృతి, రేఖామనోహరత్వము, విశాలఫాలము, లోతులై, వెడదలైన లోచనాలు, దీర్ఘ సమనాసిక, చిరుసోగమీసాలు, పెద్దచెవులు, ఆ చెవులన వేలాడే హంస కుండలాలు, పోతపోసిన కాంచనకంఠము చూస్తూనే లేచి నిలిచింది.

ఇంతటి మహాపురుషుడు దారిదోపిడికా డెట్లయినాడు? నాలుగవ ఏడు అతని తల్లిదండ్రులు పోయిరని విన్నది అన్నాంబిక. తల్లి పెంపకంలేని బాలుడు, తండ్రి శిక్షలేని కుమారుడు—పాపం! ఈ ఉత్తమపురుషుడు తప్పుదారుల పడిపోయినాడు. అయ్యో, భయంకరభటరక్షితమైన ఈ శుద్ధాంతవనానికి ఎలాగు వచ్చాడీయన! ఏపరిచారిక అయినా ఈయనను చూస్తే! రక్షకభటులకు తెలిస్తే!

"రాజకుమారీ! ఈ పెళ్ళివల్ల దేశంలో రాజద్రోహం రుద్రతాండవం చేస్తుంది. నీవు వరదారెడ్డి రాకుమారునే వివాహం చేసుకోవచ్చును కాని కొంతకాలం ఈ వివాహం కాకూడదు."

"ఈ వివాహం ఎప్పుడూ కాకూడదు" అన్నది అన్నాంబిక. గన్నారెడ్డి ఆశ్చర్యం పొందాడు.

"ఎందుచేత?"

"నా కీ వివాహం ఇష్టంలేదు. నేను శ్రీ లకుమయారెడ్డిగారి కుమారులను నా భర్తగా ఊహించుకోలేదు. ఊహించుకోలేను."

"అయితే మొదట ఆ వివాహానికి ఎలా ఒప్పుకున్నారు మీరు?"

"కన్యకకు తండ్రి ఆజ్ఞ అనుల్లంఘనీయము."

"ఇప్పుడు ఆ ఆజ్ఞ లేదా?"

"ఇప్పుడు మీ మాటలలో వ్యక్తమయిన చక్రవర్తి ఆజ్ఞ జనకాజ్ఞకన్న బలవత్తరమైనది ప్రభూ!"

"నేను గజదొంగను. నన్ను 'ప్రభూ' అనకండి."

"నాకు మీరు గజదొంగలుకారు!"

"మీ కా వివాహం ఇష్టంకాకపోతే, రేపు ప్రధానమహోత్సవం ఏలాగు?"

"రేపు ప్రధానమహోత్సవం జరుగదు. రేపు మావాళ్ళు ప్రాణంలేని నా బొందిమాత్రమే చూడగలరని, నేను ఈ ఉదయమే నిశ్చయించుకొన్నాను ప్రభూ!"

"రాజకుమారీ! అల్లా అనకండి! మీరు మీ తండ్రులకు ఏక సంతానం. వారికి గర్భశోకం కూర్చడంకంటె పాపం యింకొకటి ఉందా? తలిదండ్రులకు గర్భశోకం కలిగించే బిడ్డలు వేయి శిశుహత్యలు చేసినవాళ్ళవుతారు రాజకుమారీ! నా మనవి వినండి. మీరు వెంటనే నాతో రండి.

గజదొంగ గన్నారెడ్డి ఆదవోని రాజకుమారికను ఎత్తుకుపోతాడు ! మీరునాతో రావడానికి సందేహించ నక్కరలేకుండా మా అక్కగారు శ్రీ మల్యాల కుప్పసానమ్మ దేవినికూడా తీసుకువచ్చాను. ఆమె సపరివారంగా ఆదవోనిపురం బయట మిమ్మ హృదయానికి అదుముకోడానికి సిద్ధంగా ఉన్నారు.

"మహారాజా ! మీరు నన్ను ఎట్లా తీసుకువెళ్ళగలరు ? మా తండ్రిగారు ఈ నగరం యావత్తూ చీమదూరరాని కట్టుదిట్టాలు చేశారు !"

"అన్నాంబికాదేవీ ! దొంగ ఇంటికి కన్నంవేసినప్పుడు పారిపోయే సావకాశాలన్నీ కల్పించుకొనే వస్తాడు. అందులో నేను గజదొంగను !"

"ప్రభూ ! నేను మీతో రానుకాని కుప్పాంబికాదేవిని కలుసుకుంటాను. మార్గం ఉపదేశించండి."

"మంచిది దేవీ."

గోన గన్నారెడ్డి తన్ను 'దేవీ!' అని సంబోధించగానే అన్నాంబిక గుండె గుబగుబలాడింది. ఏదో ఆనందం ఆమెను అలమివేసింది. మోము ప్రఫుల్లమై పోయింది.

"మీరు మీ అంతఃపురంలోకి వెళ్ళగానే, సంపూర్ణకవచధారులైన బాలకుని వేషం వేసుకొని, మోమంతాకప్పే శిరస్త్రాణం ధరించుకోండి. ఈ నా ఛురికను చేతదాల్చి, దానితో వీధులలోకి వచ్చేయండి. వీధులలో కావలా తిరిగే సైనికులలో ఎవరైనా ఎఱ్ఱపట్టు కాసెకోక ధరించుకొన్నవారు మీదగ్గరకువచ్చి 'గన్నారెడ్డి కనపడ్డాడా' అని అడిగితే, 'ఆ గజదొంగా !' అని మీ రనండి. అతడు 'ఆ గోన వంశంలోని హాలాహలమే' అంటాడు. మీ రాతని వెంట వెళ్ళండి. మా అక్కగారిని కలుస్తారు" అంటూ గోన గన్నారెడ్డి ఒక్క ఉరుకున పూలపొదల్లో మాయమయ్యాడు.

అన్నాంబిక తొందరిగా అంతఃపురంలోకి వెళ్ళిపోయింది.

తమరాజకుమారితో మాట్లాడుతూ ఉన్న పురుషుడు గన్నారెడ్డి అని, అప్పుడే ఆకాశంపై విహారానికి వచ్చిన చంద్రకాంతిలో, సాయం మసక మసక కాంతుల్లో దూరదూరాన ఉన్న చెలులు ఆనవాలు కట్టలేకపోయారు.

ఎవరా ఈ పురుషుడు, నిర్భయంగా శుద్ధాంతవనానికివచ్చి చిన్నదొరసానమ్మగారితో మాట్లాడుతున్నాడు ! అని వా రాశ్చర్యమందినారు. ఇది మాయగా ఉన్నది అనుకొని, రాజకుమారి లోపలికి పరుగెత్తుకొనిపోగానే వారును లోనికి పరువిడినారు.

ఎచ్చటను రాకుమార్తె కనపడలేదు. నగరికి ముందున్న ప్రాంగణమందు ఉన్న ద్వారరక్షకుల్ని అడిగితే వా రొకబాలుడు వెళ్ళినాడనీ, ఆ బాలకుడు రాజకుమారి చేతిముద్ర చూపించాడనీ,ఆ బాలకుని తాము పోనిచ్చామనీ వారు తెల్పారు.

వెంటనే మహారాజుకు అమ్మాయిగారు నగరిలో లేరని తెలిపారు. గోన గన్నారెడ్డి శుద్ధాంతవనములోకి వచ్చినాడని ఎక్కడో అల్లరి పుట్టింది.

ఇంతలో రాకుమారి కనబడుటలేదన్న గగ్గోలు బయలుదేరింది.

౫

గోన గన్నారెడ్డి ఆదవోనిలో ప్రవేశించాడని అల్లరి పుట్టించింది గోన గన్నారెడ్డి అనుయాయులే ! ఊరంతా గగ్గోలు ! 'రాజకుమార్తె అంతఃపురంలో నుంచి మాయమైంది' అనే వార్త రాజకుమారి క్రొ శుద్ధాంతంలో కలిగిన గగ్గోలు వల్ల తెలిసిపోయింది.

రాజకుమారి పురుషవేషం వేసుకొని తన అతిసన్నిహితురాలైన చెలికత్తెను పిలిచి, దానిని ఒక పీఠమునకు బంధించి "నువ్వు ఏమీ అనుకోకు ; నాకు గోన వరదారెడ్డిసాహిణిని వివాహం చేసుకోడం ఏమీ ఇష్టంలేదు. రేపు ప్రధానమహోత్సవము జరిగితే నేను ఒప్పుకొన్నట్లవుతుంది. ఈ పురము వెలుపల శ్రీ మాల్యాల గుండయమహాశ్వపతి దేవేరి శ్రీ కుప్పాంబ వచ్చి ఉన్నదట. నేనామెను కలుసుకుంటాను. నేను వెళ్ళగానే నిన్నెవరైనా వచ్చి విప్పిరా సరే, లేదా, నువ్వు విప్పుకున్న సరే తక్షణం నువ్వు మహారాణిగారికి తెలియజేయవచ్చు" అని చెప్పి మాయమైపోయిందట.

ఆదవోనిపురంలో ఎవరు దొంగలో, ఎవరు సైనికులో ఆ రాత్రి తెలియడము దుర్భరమే ! తెల్లవారేవరకూ సేనాపతులు, చారులు, ఆశ్వికులు పురంలో, నగరంబైటా, కోటలో వెతికారు. దొంగలజాడగాని, చిన్నదొరసానమ్మగారిజాడగాని ఎక్కడా తెలియదు. ఆదవోనిదగ్గర ఉన్న చిన్నపల్లె అరుంధతిపాలెంకడ ఆశ్వికసైన్యం, ఇరువది రథాలు, పది ఏనుగులు ఉండెనట. మల్యాల గుండయ ధరణీశు సైన్యాలన్నీ కలిసి వెళ్ళిపోయాయట.

ఆదవోని మహాప్రభువు కోటారెడ్డికి మతిలేదు. ఒకసారి దుఃఖముతో క్రుంగిపోతాడు, ఒకసారి కోపంతో రుద్రమూర్తి అయిపోతాడు. ఒకసారి అవమానంతో మండిపోతాడు. కోటారెడ్డిప్రభువు సమీపంలోకి ఎవరు వెళ్ళగలరు ? ముఖ్యమంత్రులు, ముఖ్యసేనాధిపతి, మహాకవి ఎవరూ ఆయన్ను తేరిచూడలేకపోయారు. 'సేనలన్నీ ఆయత్తంచేసి కోట సంరక్షణకు పదాతిసైన్యం ఉంచి, సర్వఆశ్వికదళాలు, గజసైన్యాలు, రథాలూ తిన్నగా వెళ్ళి, జాడతీస్తూ ఆ మల్యాల సైన్యాన్ని నాశనంచేసి, ఆ కుప్పసానమ్మను, అమ్మాయినీబందీలుగా పట్టుకు రావలసింది' అని కోటారెడ్డి ఆజ్ఞ ఇచ్చాడు.

వెంటనే ఉదయం ఆశ్వికసైన్యాలు, గజయూథాలు, రథాలు హాహాకారాలతో బయలుదేరినవి. మహావేగంతో చొచ్చుకపోతున్నాయి. మల్యాలవారి సైన్యాలు తుంగభద్రనది వైపునకు సాగిపోయాయని తెలిసింది. జాసూసైన్యా

నప్పటికి సైన్యాలు కందనోలుకు రెండుగవ్యూతుల కెగువను తుంగభద్రను చేరినవి. అక్కడ మల్యాలవారి సైన్యాలు కందనోలుకు చేరినట్లు తెలిసి, కోటారెడ్డి మండలేశ్వరుని సైన్యాలను నడిపే శ్రీ వేడ చెలుకినాయుడు పటాటోపంతో వెళ్ళి కందనోలు ముట్టడించాడు.

వేడ చెలుకినాయుడు, ఆదవోని రాజ్యంలోని మోదుగల్లు దుర్గాధిపతి. మోదుగల్లు ఆదవోనికి ఇరువది గవ్యూతుల దూరము ఉంటుంది. కోటారెడ్డి ప్రభువునకు వేడ చెలుకినాయుడు మేనత్తకొడుకు. చెలుకినాయుడు పేరుమోసిన సేనాపతి. అతనికి బంగారు అంచులు, మణులుపొదిగిన బంగారు పూవులచే అలంకరింపబడి, పంచలోహాత్మక కలశం కలిగి, వెండితొడుగు గలిగిన మహాఢక్క ఉన్నది. ఆ నిస్సాణము పూర్వం ఇంద్రునిదట! ఇంద్రుడు రాక్షసులమీదకు పోయే సమయంలో, ఆ నిస్సాణము తనంతటతానే మ్రోగుతుందట! ఆ సహస్రమహామేఘ గర్జనకే లక్షలకొలది రాక్షసులు ప్రాణాలు కోల్పోయేవారట!

ఆ విజయనిస్సాణాన్ని ఇంద్రుడు చంద్రున కిచ్చెను. చంద్రుడు దానిని పురూరవున కీయగా, అతని వంశమునుండి పాండవులకు, వారినుండి కళ్యాణపురపు చాళుక్యులకు సంక్రమించినదట. వారివంశమువాడైన వేడ చెలుకినాయడు దానిని ఆదవోని సైన్యమహావాద్యాన్ని చేసినాడు. చాళుక్యుడు చెలుకి అయినాడు.

ఆ మహాఢక్క బరువే ఒక అర్ధబారువు ఉంటుందట. దానిని మోయగలిగినది మహాగజాలమాత్రమే. ఆ నిస్సాణాన్ని మోయించకలిగినవాడు అజేయుడైన ముష్టియుద్ధవిశారదుడే.

ఆ దివ్యనిస్సాణము అనేకసముద్రాలొక్కసారి విరిగినట్లు, వేయి ఉరుములొక్కసారి ఉరిమినట్లు కందనోలు ప్రజలకు వినబడసాగింది. ఆ మహానాదానికి శిశువులగుండె లవిసినవి. స్త్రీలు మూర్ఛపోయినారు. వృద్ధులు ప్రాణాలు కోల్పోయినారు. వీరులు దిల్లపోయినారు. నాయకులు మ్రాన్పడినారు.

కందనోలుచుట్టూ తుంగభద్రానదీ, ఆనదిలోకలిసే ఐంద్రీనదీ ఉన్నాయి. ఈ రెండు నదులనూ కలిపే పెద్దకందకం ఉంది. కోటను ముట్టడించే సాధనాలూ ఒక లక్ష కాల్బలమూ పంపించవలసిందని చెలుకినాయుడు శ్రీ కోటారెడ్డి ప్రభువునకు అంచెవార్త పంపినవా డాయెను.

కందనోలుకోటలో వందిభూపాలుని తనయుడు శ్రీమల్యాల గుండాధీశుని దేవేరి కుప్పసూంబికారాణినీ, ఆదవోనిప్రభువు తనయను శ్రీ అన్నాంబికాదేవినీ సగౌరవంగా ఎదుర్కొని, రాచనగరులలో ఒక ఉత్తమహర్మ్యము వారికి విడిదిగా ఇచ్చినాడు.

చారులు బేడ చెలుకినాయుడు ఆదవోని సైన్యాలతో ఎంతదూరం వచ్చిందీ, ఎటువస్తున్నదీ వార్తలు తెస్తున్నారు. చెలుకినాయుడు కందనోలు కడకు వచ్చేటప్పటికి కోట ఎటువంటి ముట్టడికైనా సన్నద్ధం చేయబడింది.

వందిభూపాలుని తనయుడు శ్రీ ముప్పరెడ్డి మహారాజు ప్రజ మెచ్చు గండడై, పతిహితాంజనేయుడై, గురుకార్యనిర్వహణానికి ప్రాణాలనైనా సమర్పించడానికి సిద్ధంగా ఉండెను. ముప్పరెడ్డి మహారాజుకు గురువు గజదొంగ గోన గన్నయ్య. ఆయన వాక్యమే అతనికి పరమమంత్రము. ఆయనకు యుద్ధనిర్వహణ విధానమంతా ఉపదేశించి, గన్నయ్య బేడ చెలుకినాయుడు రాకుండానే మాయమైనాడు.

కోటలో భీమునిలాంటి మహాసత్త్వుడు విఠలధరణీశుడు ముప్పరెడ్డికి బాసటగా నిలచి ఉన్నాడు. ఎక్కడచూచినా విఠలధరణీశుడే! మహోన్నతమైన అతనిరూపు చూచి ప్రజలందరూ ఆనందమందుతారు. అపరభీమసేనుడని అతనికి పేరుపెట్టుకొన్నారు. విఠలధరణీశుని సాహసకార్యాలు దేశికవులు కావ్యాలుగా, గీతికలుగా రచించి పాడుతూఉంటారు.

తెల్లనాపరాళ్ళతో నిండిఉన్న కందనోలు ప్రదేశమంతా ఎంతో విచిత్రంగా ఉంటుంది. కోటగోడలకూ, బురుజుగోడలకూ ఇతర ప్రదేశాలనుండి పెద్దరాళ్ళు తెప్పించి పూర్వప్రభువులుపయోగించారు.

చెలుకినాయుడు రెండునదులమధ్య కోటకు కొంతదూరంగా మొనలుతీర్చి నిలుచున్నాడు. ఏనుగుల కొన్నిటిని, అశ్వికులను తుంగభద్రకు ఆవల కాపుంచాడు. ఐంద్రీనదికి ఆవల కొన్ని ఏనుగులు, అశ్వికులు కాపలా కాస్తున్నారు. తాను తక్కిన సైన్యాలతో రెండునదులమధ్య కాపున్నాడు.

పదాతులులేక కోటపై బడుట మరణంతో సమానం. అందుకని చెలుకినాయుడు అప్రమత్తుడై, పదిహేను గవ్యూతుల దూరమందున్న ఆదవోనినుంచి సైన్యాలు ఎప్పుడు వస్తాయా యని ఎదురుచూస్తుండెను.

అర్ధయామము ప్రొద్దున్నదనగా ఆదవోనివైపునుంచి పదియేనువేలమంది విలుకాండ్లు, పదివేలమంది మూకబలం, నూరు ఏనుగులు, రెండువేలమంది అశ్వికులు వస్తున్నారని ఒక చారుడు తొందరగా వచ్చి తెలిపినాడు.

అశ్వికదళాలు ఎక్కడనుంచి వస్తున్నవి? రథసైన్యాలు రావటం ఏమిటి? నూరుగజాలు ఆ వచ్చేసైన్యంలో ఏమిటి? అని చెలుకినాయుడు ఆశ్చర్యపడుతూ,

'ఎవరి వా సైన్యాలు? ఎక్కడనుంచి వస్తున్నవి?' అని ప్రశ్నించాడు.

'చిత్తం మహాప్రభూ! అవి ఎవరివోనండీ. బహుశా గన్నారెడ్డి వేమోనండీ.'

'ఏమిటీ! గన్నారెడ్డివే?'

బేడ చెలుకినాయని గుండెల్లో రాయిపడింది. ఇదివరదాకా చెలుకినాయుడు పరాజయం ఎరుగడు భల్లాణులపైన దండెత్తినప్పుడుగాని, కుంతలదేశముపై దండెత్తినప్పుడుగాని, ఎదిరి బలాబలాలను నిర్ణయించుకొని అందుకుతగినట్లు యుద్ధ వ్యూహం అమర్చుకొని, అతిజాగ్రత్తగా సైన్యాలనుసడిపి, విజయాలు పొందేవాడు.

తన యుద్ధనిపుణత్వం మెచ్చి, చక్రవర్తి శ్రీ గణపతిరుద్రదేవులవారు 'రణ ముఖభైరవ' అని బిరుదము నిచ్చారు. ఎవడీ గోన గన్నడు? ఏమి వీడి ధైర్యము? వీడు అదృష్టసంపుడా, లేక మహావీరుడా?

ఎప్పుడూ భయ మెరుగని బేడ చెలుకినాయనికి మొదటిసారి కొంచెం గుండెల్లో అదటు ప్రవేశించింది.

తాను మొనలు నిలిపిన విధానం అప్రసుడు మెచ్చుకోతగినది.

కోటకు కొంచెందూరంలో నాలుగువందల ఏనుగులు, పదహారువందల విలుకాండ్లతో సిద్ధంగా ఉన్నవి. వాటి వెనుకబలం. ఆ బలం బాసటగా ఆరాబోయే పదాతిదళం కోట ముట్టడించగలదు.

కోట ముట్టడికి ఏనుగులు రెండువందలు. ఈ ఏనుగులు గోడకు ముందుంచి పదాతులు రాగానే కోటతలుపులు పగులగొట్టించుటకు ఉపయోగించదలచుకొన్నాడు.

ఈ ఏనుగుల గోడకు వెనుకగా తాను ఇరువదివేలమంది అశ్వికులతో సిద్ధంగా ఉన్నాడు. ఈ అశ్వసైన్యానికి వెనుకగా మూడువందల ఏనుగులు సిద్ధంగా ఉన్నవి. ఒక్కొక్క ఏనుగుపై ఇరువురు నిలుచుండు విలుకాండ్రు, ఇరువురు కూర్చుండు విలుకాండ్రు సర్వసన్నద్ధులై ఉన్నారు.

తన మహానిస్సాణమున్న గజము తన రథానికి ముందుగా తన్ను రక్షిస్తూ ఉన్నది.

గోన గన్నారెడ్డి సైన్యం రెండుభాగాలై చీలిందట. గజాలు తుంగభద్రా నదిని దాటి వెళ్ళినవట. అశ్వికులు ఐంద్రీనదిని దాటి వెళ్ళారట. పదాతిజనం చెలుకినాయని అశ్వికసైన్యానికి అర్ధగవ్యూతి దూరంలో ఆగిపోయినదట.

ఆ ఆగిపోయిన సైన్యము తాము నిలిచిన ప్రదేశం ముందు చిన్న చిన్న కందకాలు తవ్వుతున్నారట, నాపరాళ్ళ గోడలు చిన్నవి పేర్చుచున్నారట.

ఈ విషయం చారులు వార్త తేగానే చెలుకినాయుడు తొందరపడగూడదని ఆలోచించి, ఆదవోనినుంచి కాల్బలాలు, విలుకాండ్రు వచ్చేవరకూ వేచి ఉండా లని నిశ్చయించినాడు.

౬

రాత్రి ఒకయామం జరిగింది. రెండవయామం జరుగుచున్నది. అంతా నిశ్శబ్దంగా ఉన్నది. కోటలో సైన్యాలు, కోటచుట్టూ సైన్యాలు, కోట గోడల

పైన సైన్యాలు, కోటచుట్టూ సైన్యాలను ముట్టడించిన సైన్యాలు అన్నీ యుద్ధం గొడవే మరచి నిద్రపోతున్నాయా అన్నట్లు నిశ్శబ్దంగా ఉన్నాయి. రాత్రి రెండవ యామం పూర్తిఅయి మూడవయామపు కోళ్ళు ఆ చుట్టుప్రక్కలఉన్న శివారు గ్రామల్లో 'కొక్కొరో కో' అని అరచేటప్పటికి 'జై స్వయంభూదేవేశ్వరా జై' అని రోదసీకుహరం మారుమ్రోగేటంత భయంకరధ్వనితో కోటలోనుండి వచ్చిన విఠలధరణీశుని సైన్యాలనుండీ, చెలుకినాయని సైన్యాలను అరికట్టిన గోన గన్నారెడ్డి సైన్యాలనుండీ మహాధ్వని బయలుదేరింది.

ఎంత అప్రమత్తులై ఉన్నా చెలుకినాయని సైన్యాలు ఆ ధ్వనితో దద్దరిల్లిపోయినవి. కోటవైపునుంచి సైన్యాల వత్తిడి ఎక్కువయింది. విఠలధరణీశుని ఉరుములాంటి సింహనాదాలు చెలుకినాయని సైన్యాలదగ్గరగా వినపడుతున్నాయి. కోటవైపుతిప్పిన ఏనుగులమీద ఉన్న విలుకాండ్రను ఎడతెగకుండా పుంఖానుపుంఖాలుగా బాణాలు వదలండని చెలికినాయుడు ఆజ్ఞాపించాడు. కాని విఠలధరణీశుడు ఫలకాలను ఒక మహాఛత్రంలా భల్లయుద్ధవిశారదులైన గండరగండలైన వెయ్యిమంది జోదులను ఒక తరంగముక్రిందను, వారివెనుక యింకొక వెయ్యిమంది విలుకాండ్రు రెండవ తరంగముక్రిందను, మూడు నాలుగు ఐదు తరంగాలక్రింద నూరేసి ఏనుగులను, ఆ తరంగములవెనుక ఆ ఐదువందలమంది అశ్వికులు చెలుకినాయని సైన్యాలమీద విరుచుకుపడ్డారు. ఏనుగులమీదనుంచి విలుకాండ్రు చెవికంట నారులను లాగి రివ్వున బాణాలను వదిలిపెట్టుతూ ఉంటే ఆ బాణాలు మహాషాలమీద పడు వానచినుకుల్లా వృధా అయిపోతున్నవి.

అయినను ఒక్కొక్క బాణము ఒక్కొక్క భల్లధరుని ఫలకంలోంచి చొచ్చుకుపోయి ఆ వీరుని దేహంలోంచి దూసుకుపోయి ప్రాణాలు అపహరించే కాలాహి అవుతున్నది.

ఆ భల్లవీరులు చెక్కుచెదరక అయిదారు బాహువుల మహాభల్లాలతో గజయూధాన్ని తాకినారు. గజయుద్ధం చేయడం ఉత్కృష్టమైన వీరవిద్య. గజవేగం కన్న ఎక్కువవేగం కలిగి, తొండంపట్టుకు, దెబ్బకు తప్పికొని అతివిశిమైన దీర్ఘ ఛురికలతో తొండమును కోసివేయకలిగి, మెరుపులాంటి పాద ప్రహారాలను మెప్పముల్లా తప్పించుకొనేవాడే గజయుద్ధవిశారదుడు.

వీరికి బాసటగా వచ్చిన అశ్వికులు పొడుగాటి వేణుదండాలకు చివరనూనెలో తడిపిన గుడ్డలనుకట్టి భల్లవీరులు ఏనుగులను తాకగానే ఈ అశ్వికులు ఒక్కక్షణంలో చెకుముకులుకొట్టి ఈ పొడుగాటి కాగడాలు వెలిగించారు. ఆ కాగడాలు ఏనుగుల ముఖాలలోకి చొప్పించారు.

ఇదంతా కొన్ని నిమేషాలలో జరిగింది. ఒక్కుమ్మడి చెలుకినాయని ఏనుగులన్నీ భయపడి గీపెట్టుతూ వెనక్కు తిరిగాయి. మావటీలు ఏనుగులను

ఆపుచేయలేకపోయారు. చెలుకినాయుడి సైన్యాలన్నీ చిందరవందర అయిపో యాయి. అప్పుడు యుద్ధవిశారదుడైన చెలుకినాయుడు తన మహానిస్సాణ గజాన్ని తుంగభద్రానది నీరాలలోనికి దింపినాడు. ఆ నిస్సాణధ్వని విని చెలుకినాయని సైన్యాలన్నీ తుంగభద్రలోనికి దిగినవి. తుంగభద్రను దాటిన చెలుకినాయని సైన్యాలు ఇదివరకు అక్కడ కాపాలా కాస్తూయున్న సైన్యాలతో కలసి ఉత్తరాభిముఖము పట్టి అతి వేగముగా పారిపోవడం ప్రారంభించాయి. ఐంద్రి ఆవల సైన్యాలు విఠలునికి దాసోహ మన్నాయి.

తెల్ల తెల్లవారిపోతున్నది, ముందు బేడ చెలుకినాయని నిస్సాణగజము, ఆ వెనుక చెలుకినాయుడు రథందిగి అధివసించిన గజము, ఈ రెంటిని వెన్నంటి తక్కిన సైన్యాలు। కందనోలు యుద్ధంలో తన సైన్యానికి అట్టే నష్టం కలగ లేదని చెలుకినాయుడు సరిచూచుకున్నాడు,

బాగా తెల్లవారేటప్పటికి కృష్ణవద్దకు వచ్చాయి సైన్యాలు, ఆ వసంత కాలంలో ఈషత్ కృశాంగిఅయిన కృష్ణానది వేగముగా ప్రవహిస్తున్నది. చెలుకినాయుడు కృష్ణఒడ్డుననే సైన్యాలను పడమటగా త్రిప్పి కొంత దూరం పోవిచ్చి దక్షిణానికి మరలి ఆదవోని సైన్యాలను కలుసుకుందామనిన్నీ ఆ సైన్యాలతో వెళ్ళి కందనోలు ముట్టడించి నేలమట్టం చేయాలనిన్నీ సంకల్పిం చాడు.

కాని కృష్ణ ఒడ్డుననే పడమటగా వెళ్ళుతున్న బేడ చెలుకినాయని సైన్యాల వెనుక ప్రక్కనుంచి విఠలధరణీశుని సైన్యాలూ, ముందుప్రక్కనుంచి గోన గన్నారెడ్డి సైన్యాలూ చుట్టుముట్టాయి. గన్నారెడ్డి చెలుకినాయనిచారుణ్ణి ఒకణ్ణి పట్టుకొని వానిచేత చెలుకినాయుడు తన నిస్సాణం గోన గన్నారెడ్డికి సమర్పించి తిన్నగా ఆదవోని పట్టణం చేరుకునే నియమంమీద ఆదవోని సైన్యా లకు ఏమీ ఆపదరాకుండా వదలిపెడతానని వార్త పంపించినాడు. చెలుకినాయుడు అఖండకోపంతో మండిపోయాడు. తమప్రాణాలతో గన్నారెడ్డిని, విఠ్ఠలయ్యను బందీలుగా పట్టుకొని ఆదవోనికి తీసుకు వెళ్ళక వదలనని చెలుకినాయుడు ఎదురు వార్త పంపించాడు.

ఆ వార్త గోన గన్నారెడ్డి విని పకపక నవ్వుకున్నాడు. తనవార్త గన్నా రెడ్డికి వెళ్ళి అందేలోపుగా బేడ చెలుకినాయని మహాసేనానాయకుడు కృష్ణానది పునాదిగా అర్ధచక్రవ్యూహము రచించుకొని గన్నారెడ్డి విఠ్ఠలధరణీశుల విజృంభణ కెదురుచూస్తూ సిద్ధమై ఉండెను.

గన్నారెడ్డి సైన్యాలు విఠలధరణీశుని సైన్యాలు ప్రాపుక్రోశం దూరం వెనుకకు నడిచాయి. మండిపోయే ఆ వసంత మధ్యాహ్నపు ఎండలో చెలుకినాయని సైన్యాలమీద ఎడతెరిపి లేకుండా అగ్నిబాణం కురియడం ప్రారంభించింది. అందులో చెలుకినాయుడు తన రథం దిగి అధివసించిన

మత్తగజముపైనా, నిస్సాణమోసే గజము ముందుననూ భరింపరాని దుర్వాసనలు వెద జిమ్ముతూ గంధకబాణములు మండుతూ పడుతున్నవి.

ఆ పొగలకు ఏనుగులు రెండూ ఉక్కిరి బిక్కిరి అయి ధైర్యాలను వీడి అగ్నిబాణాలకు చిందర వందరై పారిపోతూ ఉన్న ఆడవోని సైన్యాలను వీడి కృష్ణలోకి ఉరికి ఏటు వీలయితే ఆటు పారిపో ప్రయత్నం చేసినవి.

బేడ చెలుకినాయని ఏనుగున్నూ, అతని విజయనిస్సాణగజమున్నూ గన్నారెడ్డి సైన్యాలకు చిక్కాయి. తక్కిన సైన్యాలను గన్నారెడ్డి పారిపోనిచ్చాడు.

గన్నారెడ్డి : బేడ చెలుకినాయకప్రభూ ! నీ విక్రమానికి మా జోహారులు. అయినా ఈ గజదొంగ మాయలముందు నీకేమి నిలవగలవయ్యా ! కాబట్టి నువ్వు నీ ప్రభువు కోటారెడ్డి మహారాజుగారి మనస్సు త్రిప్పు, శ్రీ రుద్రదేవ మహారాజు స్త్రీయే. ఆ విషయంలో మీరందరూ అనుమానించినది నిజం. ఏమీ సందేహంలేదు.

బేడ చెలుకి : ఆడది ఎప్పుడైనా రాజ్యం చేసినదయ్యా !

గన్నారెడ్డి : ఇప్పుడు ఎందుకు చేయకూడదు ? ఆమె దివ్యస్త్రీ. ఆమె అవతార మెత్తిన లలితాంబ !

బేడ చెలుకి : గన్నారెడ్డి ! నువ్వు గజదొంగవా ?

విఠలధరణీశుడు : మేము గజదొంగలం, దారిదోపిడిగాళ్ళం.

గన్నారెడ్డి : మా దొంగతనాలకు అడ్డంరాని కారణంచేత చక్రవర్తన్నా, ఆయన కుమారి శ్రీ శ్రీ రుద్రదేవ ప్రభువులన్నా మాకు భక్తి.

బేడ చెలుకి : అధర్మయుద్ధం చేసి నన్నోడించావు

గన్నారెడ్డి : ఓయి వెట్టిప్రభూ ! నేను ఇంతవరకు ఎప్పుడూ అధర్మయుద్ధం చేయలేదు. అన్నాంబికాదేవి మా అక్కగారి నగరంలో ఉంటున్నది. మా అక్కగారిని పట్టుకోడానికి వచ్చావు కాబట్టి నీ ప్రసిద్ధనిస్సాణము మేము అపహరిస్తున్నాము.

౭

కాకతీయవంశానికి సేవకులై, మహాసేనాపతులై, మహామాండలికులై మల్యాలవంశ్యులు ప్రసిద్ధిపొందిరి. ఈ వంశమువారు ఇటు బుద్ధపురములో అటు కొండపర్తిలో ప్రభువులై రాజ్యం చేస్తూ ఉండిరి.

ఓరుగల్లు మహానగరానికి నైరుతిగా డెబ్బదిగవ్యూతుల దూరంలో శాలివాహనుల కాలమునుంచి ప్రసిద్ధికెక్కిన బుద్ధపురమనే నగరం రాజధానిగా గణపతిదేవ-ప్రసాద-ప్రసూత ప్రాచ్యరాజ్యలక్ష్మీ సమాశ్లిష్ట దక్షిణ భుజదండుండును, సమర సముయాఖండలుండును, సంకిసపురాధినాథరిపు తిమిర

మార్తాండుండును, పెదముద్దుగండమిండుడును, బాచ మహారాణీ బాచమహారాజపుత్రుండునూ, మల్యాలవంశకలశాంభోధిచంద్రుడును, వారనారీయౌవనవనవసంతుండును, దుష్టతురగరేఖారేవంతుడును, అసిముసలకార్ముక ప్రముఖ నిఖిలాయుధ కుశలుండును, కీర్తివిశాలుండును, రాజసమాజ జేగీయమాన నిజభుజవిజయుండును, విక్రమ విజిత విజయుండును, శ్రీకుప్పాంబా మానససరోవర విహరమాణ రాజహంసుడును, శ్రీ విశ్వనాథదేవ దివ్యశ్రీ పాదపద్మారాధకుండును, రిపుకులభేదకుండును అయిన శ్రీ శ్రీ మాల్యాల గుండయ దండాధీశ్వరుడు రాజ్యంచేస్తూ ఉండెను.

ఆ మహారాజు దేవేరి వర్ధమానపురాధీశ్వరుడైన గోన బుద్ధారెడ్డి మహారాజు కొమరిత, గజదొంగ గోన గన్నారెడ్డి అక్కగారు, గన్నారెడ్డి జేవ చెలికినాయని నిస్సాణాపహర్తయైన ముహూర్తానికి వారం దినాలకు, ఆదవోని ప్రభు తనయను అన్నాంబికాదేవిని సగౌరవంగా తోడుకొని బుద్ధపురం చేరినదాయెను.

కుప్పాంబికాదేవి మువ్వదిమూడేండ్లది. కుప్పాంబికాదేవికి ముగ్గురు సంతానం. పెద్దవాడు బాచయ్య. బాచయ్యప్రభువు పన్నెండేండ్లవాడు. రెండవకుమారుడు దొప్పప్రభువు ఎనిమిదేండ్లవాడు. మూడవవాడు గణపతిదేవ ప్రభువు నాలుగేళ్ళబిడ్డడు. కుప్పాంబికాదేవి తమ్ముడైన గోన గన్నారెడ్డి ప్రోత్సాహంవల్ల భర్త అనుమతితో అన్నాంబికాదేవిని తనతో తీసుకొని రావడానికి కొంతసైన్యముతో బయలుదేరి కృష్ణానదీ తుంగభద్రానదీ రెండూ దాటి ఆదవోని వరకు వెళ్ళినది. ముగ్గురు బిడ్డలు బుద్ధపురంలోనే ఉండిపోయిరి. ఆ రాత్రి ఆ మహారాణి ఆదవోనిదగ్గర అరుంధతిపాలెంలో మకాంచేసి ఉన్నప్పుడు అన్నాంబికా రాకుమారి పురుషవేషంధరించి గోన గన్నారెడ్డి సైన్యానికి చెందిన ఒక దళం వెంబడి తనదగ్గరకు వచ్చేటప్పటికి అతిసంతోషముతో ఆ బాలికను తన హృదయానికి అదుముకొన్నది.

కుప్పాంబిక కాయశరీరంగల బంగారు శలాకలాంటి మనోహరాంగి, ముగ్గురు బిడ్డల తల్లియైనా సడలిపోని జవ్వనపు బిగువు కలది. కుప్పాంబికాదేవికి భర్త అంటే భగవంతుడే, బుద్ధారెడ్డి గారాబుకూతురై గోనవంశ దుగ్ధాంభోధిలో మందారవృక్షంలా ఉద్భవించి మల్యాలనందనవనాన్ని తేజరిల్లచేస్తూ వచ్చింది.

కుప్పాంబికాదేవి తమ్ముళ్ళ నిద్దరినీ అత్యంత ప్రేమతో తల్లి అనంతరం పెంచింది. తండ్రిపోలికలు మూడుమూర్తులా పుణికిపుచ్చుకున్న పెద్దతమ్ముణ్ణి, మేనమామ అయిన శ్రీ విరియాల భీమనృపతిలా, అపర భీమునిలా ఉన్న విఠలధరణీశుని అచంచలమైన ప్రేమతో పెంచింది.

గన్నారెడ్డి తెలివి, బుద్ధి, చదువు అనుమకొండ మహావిద్యాక్షేత్రంలో ప్రసిద్ధిపొందినాయి. అలాంటి గన్నారెడ్డి ఎందుకు శ్రీ గణపతిదేవ రుద్రదేవ

మహాప్రభువులకు ఎదురుతిరిగినాడో ఆమెకు ఏమీ తెలియదు. కాని అందు లోని రహస్యం ఏదో తన భర్తగారగు శ్రీ గుండయమహారాజుకు తెలియును. ఆయన కుప్పాంబికను చూచి "దేవీ, మా బావమరదలు గన్నారెడ్డి, విఠల ధరణీశుడూ ఏవో కొన్ని మహత్తర కారణాలుండి గజదొంగలయ్యారు. కాని నేను విన్నంతవరకు వాళ్ళు దారులు ఎక్కడా దోచినట్లెరుగను, ఇక ముందును దోచబోరు. ఉత్తరోత్తరా మీకు కొన్ని రహస్యాలు చెప్తాను. గన్నారెడ్డి యుద్ధవీరులలో మేటి౦త్నం. నీ పినతండ్రిగారు లకుమయారెడ్డి భూపాలుడు మీ తమ్ముళ్ళ నిద్దరిని అన్యాయం చేయ సంకల్పించుకొన్నారు. ఆ సందర్భ ములో వీరుడైన గన్నారెడ్డి ఎట్లు ఊరకొనగలడు" అని చెప్పినారు.

భర్త చెప్పిన ఈ ముక్కలు విని కుప్పాంబికాదేవి హృదయం పొంగి పోయింది. ఆ రాత్రి అన్నాంబికాదేవి పురుషవేషంతో తన దగ్గరకు అలా రాగానే ఆమెను కౌగలించుకొని "తల్లీ, అన్నాంబికా రాజకుమారీ! రాజ కీయాలు ఎప్పుడూ యిలా కర్కశంగా ఉంటాయి. మీరు మీ తండ్రిని, తల్లిని వదలి ఇలా రావలసిన అత్యవసరాన్ని గూర్చి మా తమ్ముడు గన్నారెడ్డి ప్రభువు నా కన్నీ చెప్పినాడు. ఈ సంఘటనవల్ల ఈ కుటుంబాలన్నిటికీ ఏయే కష్టాలు వస్తాయో అవి అన్నీ మనం భరించవలసి ఉండెను" అని చెప్పింది.

అన్నాంబికాదేవి : కుప్పసానమ్మదేవీ! మీ భర్త గుండయ మహారాజుల వారు వితరణంలో కర్ణుని, శిబిని చిన్నబుచ్చుతున్నారు. వారికి తగిన దేవేరులు మీరు. మీ ఇద్దరి దాంపత్యము అనన్యము. అలాంటి మీకు తమ్ములైన గోన గన్నారెడ్డి ప్రభువు గజదొంగలంటే నేను నమ్మను. నాకు వరదారెడ్డి రాకుమారుని వివాహం చేసుకోవడం ఏమాత్రం ఇష్టంలేదు. అందుకని ఈ వివాహం తప్పించాలని ప్రయత్నంచేసే మీ తమ్ముల సహాయం నేను అంగీక రించాను.

కుప్పసానమ్మ : సంతోషం తల్లీ, మనం వెంటనే బయలుదేరాలి.

ఇంతలో గోన గన్నారెడ్డి ప్రత్యక్ష్యమై వారిని ప్రయాణం చేశాడు. ఆ రాత్రి రాత్రి వారు కందనోలు చేరుకున్నారు. కందనోలులో రెండు దినాలు ఆగి కృష్ణా తుంగభద్రా సంగమమైన సంగమేశ్వరమునకు పోయి ఆ పుణ్యతీర్థంలో క్రుంకులిడి సంగమేశ్వరుని అర్చించి బ్రాహ్మణులకు విరివిగా దానాలిచ్చి రెండు దినాలల్లో బుద్ధపురంవచ్చి చేరిరి.

బుద్ధపురంలో అన్నాంబికాదేవి, గన్నారెడ్డికీ బేడ చెలుకినాయునికీ జరిగిన యుద్ధ పర్యవసానం ఏమైందో అని ఆతురతతో కనిపెట్టుకొని యుండెను. కుప్పాంబికా మహారాణిని 'వార్తలేమైనావచ్చినవా' అని అడుగు చుండెను.

వీరు బుద్ధపురంవచ్చిన మూడవదినానికి గన్నారెడ్డి, విఠ్ఠలధరణీశులు మహారాణి అంతఃపురానికి వచ్చారని వార్తవచ్చింది. ఆ వార్త వినడంతోనే

అన్నాంబిక హృదయం ఒకగంతువేసింది. ఆమెకు గన్నారెడ్డి వచ్చారనే వార్తతో పాటు ఒక మహానిస్సాణ ధ్వని బుద్ధపురమంతా మారుమ్రోగింది. ఆ గంభీరధ్వని వినడంతోనే అన్నాంబిక తన మేనమామ అయిన బేడ చెలుకినాయనింవారి నిస్సాణాన్ని గన్నారెడ్డి విజయప్రాభృతంగా కొనివచ్చినారని అర్థం చేసికొన్నది. ఆమెలో ఏదో సంతోషం, ఏదోభయం ఆవరించుకున్నవి. ఎవరీ గన్నారెడ్డి? ఈ గజదొంగ అంటే తన కింత కుతూహలం ఎందుకు? ఈయన మహాపురుషుడా? హీనుడా? తాను ఇట్లా తల్లిదండ్రులను వదలి ఇంత విచిత్రంగా ఈ బుద్ధపురం రావటం ఏమిటి?

అన్నాంబిక ఆమెకై ఏర్పాటుచేసిన శుద్ధాంతనగరిలో ఉపధానాల పల్యంక పీఠముపై అధివసించి వేయి ఆలోచనల పాలయింది. ఎంత ఆలోచించినా హోస సుందరమైన గన్నారెడ్డి మోము ఆమె హృదయాన్ని చిందరవందర చేస్తున్నది. తానా పురుషుని ప్రేమిస్తున్నానని ఆమె నిశ్చయానికి వచ్చింది. ఆ నిశ్చయం ఆ బాలకు కలగడంతోటే ఆమె గజగజ వణకిపోయింది. యుద్ధవిక్రమంలో, సౌందర్యంలో అర్జునుడై ఈ మహాభాగుడు గజదొంగ అని కళంకం సంపాదించుకొన్నాడేమిటి? తన్ను పెండ్లికూతురునిచేసి చిన్న బంగారుపీఠముమీద అధివసింపచేసి, బంగారుపువ్వుల పట్టుతెరలు కప్పి వివాహమండపానికి తన్ను తీసుకువస్తూ ఉండగా తెర ఒత్తిగించి ఈవిచిత్రనాయకుని తాను చూచినప్పటినుంచి తన మనస్సు ఆయనపై లగ్నమైయుండి ఉండాలి. అది పవిత్ర ముహూర్తమో, దుర్ముహూర్తమో?

౮

తానీ మహాపురుషుని, ఈ గజదొంగను, ఈ పరమోత్తమ వీరుని ప్రేమిస్తున్నమాట నిజం। ఈ ఉత్కృష్టమూర్తి ఈవిధంగా తన జీవితాకాశం ఆక్రమించిన వెలుగుమూర్తి అయినాదేమి। అదేనాప్రేమ? ఈప్రేమనేనా శకుంతల దుష్యంత దర్శనముచే అనుభవించినది। తన్ను ఆ మహాపురుషుడు ప్రేమించగలడా? ఈ వీరాధివీరుడు, ఈఉత్తమ దుర్జయాన్వయుడు తన్ను ప్రేమించకపోయిన క్షణం తన జన్మతీరినట్లే। లోకమే తలక్రిందు లగునుగాక, సర్వభువనాలూ మండిపోవునుగాక, తానీ వీరుని చెట్టపట్టకుండ నెవరు వారింపగలరు?

"ఈ వీరుడు గజదొంగ అగునుగాక, తానును గజదొంగ అవుతుంది। ఆయన రాజ్యాలు నగరాలూ దోచనీ, తానును అలాగే చేయగలదు. ఆయన ప్రేమకై తపస్సుచేసి, ఆయన చూపులకై తేజస్సుల వెలిగించి, ఆయన ప్రేమ భాషణలకై సర్వశ్రుతులూ స్పందింపజేసి, ముల్లోకాలనూ గగ్గోలుపరగలదు తాను" అని ఆమె ప్రతిజ్ఞ గైకొంది.

ఆ ఆలోచనతో ఆమె ఉప్పొంగిపోయింది. వేయి మనోహరరాగాలు ఏక రూపొంది, అమృతప్రవాహమై ఆమెను చుట్టివేసినవి. ఆమె పులకరించిపోయినది. ఆమె జీవితంలో ప్రతిఅణువు గన్నభూపతిపై ప్రణయముచే దివ్యత్వము పొందింది.

ఇంతలో కుప్పాంబికాదేవికడనుండి అన్నాంబికను దర్శించుటకు అనుమతిని కోరు పిలుపు వచ్చింది. అన్నాంబిక పీఠమునుండి లేచి తాను మహారాణిరాకకై గౌరవంతో ఎదురుచూస్తున్నదని ప్రతివార్త పంపినది. కొంతసేపటికి కుప్పాంబిక అన్నాంబికకడకు వచ్చినది.

అన్నాంబిక తొందరగా ముందుకు నడచివచ్చి 'మహారాణీ! మీరు నన్ను అనుమతి వేడడం సమంజసముగా లేదు. మనము దగ్గరచుట్టాలము. నేను మీకన్న చిన్నదానను' అని కన్నుల నీరు తిరుగ మనవిచేసింది.

కుప్పాంబిక అన్నాంబిక చేతులుపట్టి దాపుసనున్న ఆసనముపై ప్రక్కన కూర్చుండబెట్టుకొని 'రాజకుమారీ! మీరు ఆదవోని ప్రభువుల కుమారికలు. మీకు ప్రధానోత్సవం చేయబోయేముందు మాతమ్ముడు మిమ్ము ప్రోత్సహించి తల్లిదండ్రులను వదలి పారిపోయి వచ్చునట్లు చేసినాడు. మీరు మా అతిథులు. తల్లిదండ్రులను విడిచి వచ్చినందుకు మీమనస్సు ఏదైనా కించపడుతోందేమోనని మాతమ్ముడు కనుక్కొమ్మన్నాడు' అని అనునయపు మాటలు పలికినది.

అన్నాంబిక: మహారాణీ! నేను గన్నారెడ్డి ప్రభువులతో ఏమీ అనుమానం లేకుండా వరదారెడ్డి రాకుమారుని వివాహం చేసుకోడానికి ఇష్టంలేదని స్పష్టంగా మనవిచేసి ఉన్నాను. ఆదవోనినుంచి నేను పారిపోయివచ్చే పిలుపు ఆ ప్రభువు కల్పించకపోయినట్లయితే నా వజ్రపుటుంగరములోని విషము త్రాగిఉందును.

కుప్పాం: అన్నాంబికాదేవీ! మీరు మీ తలిదండ్రులను విడిచి ఏదో పర్యవసానం తేలేవరకూ నాదగ్గిర ఉండగలరా?

అన్నాం: మహారాణీ! మా నాయనగారు నేను ఇక్కడ ఉన్నాను అని తెలియగానే కోపగించి, తనసైన్యాలు, తనస్నేహితుల సైన్యాలతో వచ్చి మీ కోట ముట్టడించవచ్చును. మీ సైన్యాలలో అనేకమంది వీరులు మడియవచ్చును. ఇందుకు నాకు ఒకే ఉపాయం తోస్తూఉన్నది. నన్ను ఓరుగల్లు పంపించండి. అక్కడ శ్రీ రుద్రదేవి మహాప్రభువుగారి అంతఃపురంలో ఉంటాను.

కుప్పాం: ఎంత ఆలోచనమ్మా మీది! మీరన్నట్లే మా తమ్ముడున్నూ చెప్పినారు. మీ తండ్రిగారవడంవల్ల ఆదవోని ప్రభువును ఏమి చేయడానికీ తనకు ఇష్టంలేదట!

అన్నాం: వారికి కృతజ్ఞురాలను.

కుప్పాం : నేనూ, బుద్ధపుర మహాప్రభువులూ బయలుదేరి శ్రీ గణపతి రుద్రదేవ సార్వభౌములను, శ్రీరుద్రదేవ ప్రభువులను దర్శించడానికి వెళ్ళాలను కుంటున్నాము. రేపు పూర్ణిమ వెళ్ళిన తదియనాడు అందరమూ బయలుదేరి వెళ్ళుదాము.

అన్నాం : నావల్ల మీ కందరికీ ఇబ్బందులు కలుగుతున్నాయికాదా!

కుప్పాం : అదేమమ్మా ఆ మాటలు? ఒకసారి మా తమ్ముడు మీ క్షమాపణ అడగాలని....

అన్నాం : నా క్షమాపణా? ఎంతమాట! వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనాలు అర్పించవలసి ఉన్నది. వారి దర్శనము చేయిస్తారా?

కుప్పాం : రోగీ, వైద్యుడూ పాలే కోరుతారు ఒక్కొక్కప్పుడు.

చిరునవ్వు ఆమె మోమున ప్రసరింప అన్నాంబికచేతిని గ్రహించి కుప్పాంబిక తన అంతఃపురంలోనికి తీసుకువెళ్ళి అభ్యంతర సభాగృహంలో ఒక సింహపీఠికపై కూర్చుండబెట్టింది

చెలులు పలువురు వచ్చి, అన్నాంబికకు, కుప్పాంబాదేవికి లత్తుకపెట్టి కుంకుమపూవు పాపటను అద్ది, గంధం, పరిమళతైలాలు అలదినారు. ఒక చెలి బంగారు పళ్ళెరమున అమూల్యాభరణాలు తీసుకొనివచ్చి ఆమెకు అలంకరించింది. ఆమెను అలంకారమందిరానకు కొనిపోయి, వెలపొడుగుచీర, ఉపవీతము, స్తన చీనాంబరము కట్టినారు.

మరల అన్నాంబికాకుమారిని కొనివచ్చి వారామెను ఉచితపీఠంపై అధివసింపచేసినారు. ఇంతలో వారిద్దరి అనుమతిని వేడుతూ గోన గన్నయ్యా వార్త పంపినారు. అన్నాంబికా రాకుమారి అనుమతి ఇచ్చినది.

గన్నారెడ్డిని చూచుట యనగనే ఆమెకు మహానందమైనది. ఆయనకై తన్నలంకరిస్తున్నారని ఆమె పారవశ్యం పొందింది. 'ఆయన వరుడై, తాను వధువైననాడూ ఇలాగే అలంకరిస్తారా?' అని ఆమె ప్రశ్నించుకొన్నది.

ఒకసారి మెరుపుమెరసినట్లు ఆ పురుషుని చూచింది! రెండవసారి తోటలో చంద్రకాంతిలో అస్పష్టంగా తొందరపాటులో చూచింది ఆ సందర్శనాలే చాలు, ఆయన దివ్యవిగ్రహము తనహృదయంలో అనంతకాలం నిలిచిఉండుటకు. ఎంతటి ఉన్నతరూపము! ఏమి దేహచ్ఛాయ! ఏమా బలరూపసంపద! ఏమి ఆ ఠీవి! కుమారస్వామి కా ఠీవి ఉండగలదా? ఆ నడకలో ఎంతటి విలాసము! ఆయన కంఠమాధుర్యము తన శ్రవణలోకంలో దివ్యగీతాలు రచించినది! సంతతహాస ప్రఫుల్ల మా మోము. ఆ సోగమీసాలు, ఆ విశాల నేత్రాలు, ఆ కాటుకకళ్ళు, తెల్ల దానిమ్మగింజలవంటి పలువరుస! ఓహో! ఆ బాహువులబలం శ్రీరామచంద్రుని వింటిని విరువగలదు. ఆ బాహువుల బలం పువ్వులనైన నలుపలేదు. ఆ బాహువులు స్వామిద్రోహుల పిండిగొట్టగలవు.

కందనోలులో ఈ ఉత్తమపురుషుని రాజశుద్ధాంతంలోని దాసీ లందరు ఎంత కృతజ్ఞతతో ఎంత మనోహరంగా వర్ణించారో!

ఇంతలో గోన గన్నారెడ్డి మందగమనంతో లోనికి విచ్చేసినాడు.

అన్నాంబికాదేవి లేచి నిలుచుండి గోన గన్నారెడ్డికి నమస్కరించింది. అక్కగారికి ప్రభువు నమస్కరించాడు.

'అక్కయ్యగారూ! మీ ప్రయాణం, శ్రీ ఆదవోనిప్రభుకుమారి ప్రయాణం సౌఖ్యంగా కొనసాగిందా?'

కుప్పాం: గన్నయ్యా! 'మీ యుద్ధం ఏమయిందో' అని మేము కళవళ పడుతుంటిమి!

అన్నాం: విజయనిస్సాణం కొనివచ్చినందుకు సంతోషం.

గన్నయ్య: మీకు ఎవరు చెప్పారు?

అన్నాం: దాని ధ్వనిచే చెప్పింది.

గన్నయ్య: పేద చెలుకినాయనింవారిని సగౌరవంగా ఆదవోని పంపించాము.

కుప్పాం: ఏమంత దయతలచినారు తమ్ముడూ?

గన్నయ్య: నే నెప్పుడయినా కఠినాత్ముడనా? గజదొంగను కావచ్చు.

అన్నాం: 'గజదొంగ', 'గజదొంగ' అని అస్తమానం అనకండి.

౯

అన్నాంబికా రాకుమారి అతితీవ్రంగా అన్నమాటలకు గోన గన్నయ్య ఆశ్చర్యంలో మునిగిపోయాడు. తాను 'గజదొంగ' అంటే నేమి, కాకపోతే నేమి ఈ బాలికకు? ఆడవారి ఆలోచనలన్నీ అదోరీతిగా ఉంటాయి. ఈమె తన తమ్ముడును, పినతండ్రి కుమారుడును అయిన వరదారెడ్డిని వివాహం కావడానికి ఇష్టంలేక బాధపడుతూ, ప్రాణత్యాగమైనా చేసికొనుటకు సిద్ధమయివుంటే తా నామెను ప్రధాన మహోత్సవంనుండి తప్పించి తీసుకొనిరావడంవల్ల, తాను సత్పురుషు డనుకొంటున్నది కాబోలు! ఏమి వెఱ్ఱితనం?

ఆడవారిలో మహోత్తమురాలు, ఆంధ్ర మహాసామ్రాజ్యయువరాజ్ఞి రుద్రదేవి మహారాణివారు ఒక్కర్తే! తక్కినవాళ్ళు మంచివారే! వారందరూ అనుకూలురైన భర్తలవద్దచేరి, ముత్యాలవంటి బిడ్డలగని పెంచి పెద్దవారనిచేసి, కౌసల్యవంటి, యశోదవంటి, తన తల్లివంటి, తన అక్కగారివంటి తల్లులుకావాలి. ఒక్క రుద్రదేవప్రభువునకే స్త్రీఅయినా, పురుషధర్మమైన యుద్ధము చెల్లుతుంది. తక్కినవారు పత్నులు, తల్లు లవడానికి ప్రయత్నించాలి.

కుప్పాం: ఏమయ్యా తమ్ముడూ! ఏమి ఆలోచిస్తున్నావు?

గన్నా : (ఉలిక్కిపడి) 'ఏమీలేదు అక్కా ! మీరూ, బావగారూ, శ్రీ అన్నాంబికా రాకుమారిగారూ ఎప్పుడు ఓరుగల్లుపురం ప్రయాణమై వెళ్ళేది ?, అని ఆలోచిస్తుంటిని.

కుప్పాం : రేపు పూర్ణిమ వెళ్ళిన తదియకదా ?

గన్నా : మీరు వెళ్ళగానే, ఈ గజదొంగ విషయమై శ్రీ రుద్రదేవ ప్రభువులు, శ్రీ శివదేవయ్య మంత్రుల్ని అనేక విధాలుగా ఒత్తిడి చేయవచ్చును.

అన్నాం : ప్రభూ ! మీరు మాతోరండి, నేను వెళ్ళి మహారాజయిన రుద్రదేవ ప్రభువుల పాదాల వాలి తమ్ము క్షమింపుమని వేడుకొంటాను.

గన్నారెడ్డి తనలో 'మళ్ళీ ఈమె ఏదో మొదలు పెట్టింది బాబూ' అనుకుంటూ, పైకి 'రాజకుమారీ ! నా పరాకృతఫలం నేను అనుభవింపక తప్పదు గదా ! ఎవరేమి ప్రయత్నం చేసినా లాభంలేదు ! పైగా ఆ రుద్రప్రభువు నా రాజ్యం మా పినతండ్రి అనుభవిస్తూంటే, ఒక్క పినరత్తైనా అది అధర్మమని శ్రీ లకుమయారెడ్డి ప్రభువులకు వార్త పంపినారుకాదు. అలాంటి వారి గొడవ నా కక్కరలేదు. నా గొడవ వారి కక్కరలేదు ! నాకొరకు మీరు ఆయాసం చెందకండి.'

అన్నాంబిక ఆ మాటలు విని ఎంతో చిన్నబుచ్చుకొన్నది. అయినా ఈ వీరుని కోపం తనమీద కాదు, రుద్రదేవుల ప్రభువుల మీద అయినట్లు స్పష్టమేకదా, తనంటే ఈషణ్మాత్రం గౌరవం కలిగినా, గన్నారెడ్డి ఆ ముక్క లనేవారు కాదు.

అన్నాంబిక కించపడుట గన్నారెడ్డి కనిపెట్టి 'రాజకుమారీ ! అలా అన్నానని మీరు ఆశ్చర్యం పొందకండి ! నేను మొరకణ్ణి : మీరు సదుద్దేశంతో, దయతో అన్నమాటలు మీ ఉత్తమహృదయాన్ని తెలుపుతాయి. అందుకు నేనూ, మా తమ్ముడూ తమకు కృతజ్ఞులం. నవనీత హృదయంగల మిమ్ములను మాపై క్రోధం వహించి ఉన్న రుద్రదేవ ప్రభువులు ఏమంటారో అని భయం. ఇది మీరు అన్యథా తలచకండి' అని పేపికొను మాటలు కాకువుతో అన్నాడు. ఆ మాటలకు అన్నాంబిక కలతతేరి, 'ప్రభూ, నేను సెలవు తీసుకొంటాను' అని హర్మ్యంలోకి మందాక్రాంతవృత్తములా నడిచి వెళ్ళిపోయింది.

గన్నారెడ్డి తన కర్కశత్వానికి తానే తెల్లబోయి, ప్రమాన్పడి అట్లే కూరుచుండిపోయినాడు.

కుప్పాంబిక తమ్ముని చుఱచుఱ చూచి 'తమ్ముడూ ! మీరు అన్నాంబికా రాజకుమారి మనస్సు అలా నొప్పించినా రేమిటి ?' ప్రత్యుత్తరము కోరని ప్రశ్నవేసి, కుందిన హృదయంతో లోనికి వెడలిపోయింది.

గన్నారెడ్డి అట్లే నిలుచుండిపోయినాడు. తనలో ఏదో విపరీతస్థితి సంభవించి ఉండడంచేత ఎవరన్నమాటలకూ ఎప్పుడూ విసుగుచెందని తాను

ఈ దినాన తల్లిదండ్రులను వీడి, రాజకీయపు సుడిగుండాలలో పడిన ఒక అమాయికపు బాలికను, తనయందు ఉత్తమ గౌరవంతో ఏదోచేయాలని ఉన్న ఒక గుణశీలను ఆవిధంగా మనస్సు నొప్పించినా దేమిటి? ఏలాగు తాను ఆ బాలిక ననునయించుట? అప్పుడే అరవిచ్చు మందార పుష్పంలా ఉన్న ఈ శాంతశీలను మనస్సు నొప్పించగలిగిన తన పెయిదము క్షమింపరానిది. ఈ దినాన తనకు జరిగిన సంఘటన తనకు ఒక్క నిమేషమేని మరువరాని అప్రమత్తతను నేర్పుతున్నది. ఈనాటినుండి శత్రుల అడ్డగించుటలో తక్క ఇతర చేష్టలలో పరమశాంతత చూపించవలసి ఉన్నది.

గన్నారెడ్డి ఇతికర్తవ్యతామూఢుడైనాడు. ఏలాంటిమగవారితో నైనా తాను వ్యవహరించగలడు, కాని స్త్రీవిషయం వస్తే తానేమి చేయకలుగును? వారి జీవితాలకూ, తనకూ సంబంధం ఏమిటి? స్త్రీల హృదయం తన కేమి తెలియును? పురుషులకు కోపం వచ్చే విషయాలు వారికి నవ్వు కలిగించవచ్చును. ఒక స్త్రీకి నవ్వు కలిగించే విషయం, వేరొక వనితకు క్రోధ కారణం కావచ్చును.

ఇంతకూ లలితాస్వరూపిణి ఆ బాలికను తన అక్కగారే సముదాయించునుగాక!

ఈ ఆలోచనతో గన్నారెడ్డి తన విడిదిలోనికి వెళ్ళిపోయినాడు.

* * *

అన్నాంబికాదేవి తన సౌధంలోనికి రూపెత్తిన ప్రసన్నతలా వెళ్ళగానే ఆమె చెలికత్తె అయిన మల్లిక పరుగున వచ్చి పాదాల నంటినది. అన్నాంబిక అతిసంతోషంతో 'మల్లికా! సుఖమే? ఎప్పుడు వచ్చావు? ఒసే ఎట్లావస్తివి? ఆదవోనినుంచేనా?, అని ప్రశ్నలవర్షం కురిపిస్తూ మల్లికను రెండు భుజాలూ పట్టి లేవతీసింది. కళ్ళ నీళ్ళతో నవ్వుతూ, మల్లిక రాజకుమారిని చూచి, 'దొరసానమ్మగారూ! అమ్మయ్యా మీరేమయ్యారో తెలియక మహారాణీగారు, మేమూ పడిన బాధ ఇంతా అంతా నండీ! మీరు కందనోలు వెళ్ళడం, అక్కడనుంచి ఆదవోని చేరడం మాకు వార్తలు వచ్చాయి. అప్పటికి మా మనస్సులు కుదుటపడ్డాయి' అని తొందరగా, ఆనందంగా మాట్లాడింది.

అన్నాంబిక ; నాకోసం అంత బాధపడ్డారటే ?

మల్లిక ; చిత్తం, దొరసానమ్మగారూ !

అన్నాంబిక ; నాయనగారు ఏమన్నారు ?

మల్లిక : నాయనగారు ప్రళయకాలరుద్రునిలా ఉన్నారు. ఆయన దగ్గరకు ఎవ్వరూ వెళ్ళలేకుండా ఉన్నారు. వారు బేడ చెలుకినాయనివిం వారిని అన్నమాటలు విరోధులనుకూడ ఎవ్వరూ అనరు. ఆయన విజయ

ధక్కాను గన్నారెడ్డి దోచడం చాలా బాగా ఉందట. ఒక్క పైనికు నయినా పోగొట్టుకోకుండా తిరిగిరావడం ఆడవారి కొక్కరికే చెల్లుతుందట! మగవాడు ముసలాడై, ఆడదాని చేతులో రాజ్యం నడవడంవల్ల పరువుగల రేడులవంశాలన్నీ ఆడవాళ్ళ వంశాలయ్యాయట. ఒక్క మగవాడూ లేడట! అందుకనే పురుగులలాంటి, తేళ్ళలాంటి దొంగలూ, హీనులైన కొండజాతి వాళ్ళకన్నా నికృష్టులైన దారిదోపిడిగాళ్ళూ బయలుదేరారట. లోకం అంతా నిండిన ఈ కల్మషాలన్నీ నాశనంచేసి ధర్మరాజ్యం తాము స్థాపిస్తారట, చిన్న దొరసానమ్మగారూ! ప్రభువువారికి నిద్దట్లోనన్నా క్రోధం తగ్గుతుందో లేదో అనే నా అనుమానము.

అన్నాంబిక ; నువ్వు ఎలావచ్చావే ఇక్కడికి ?

మల్లిక : అదో వింతకథండీ, దొరసానమ్మగారూ! నాలుగు రోజుల క్రిందట తమ నగరిలో తోటలోనికి వెళ్ళానండీ, ఆ తోటలో తిరుగుతూ ఉంటే నాతోటున్న తక్కిన దాసీలు కొంచెం దూరమయ్యారండీ, తమరిని గురించే ఆలోచించుకుంటూ ఆ పొదరింటి దగ్గర కూలపడ్డానండీ అమ్మా. అంతలో ఎక్కడనుంచో ఆ సందె చీకట్లో 'మల్లికా! నీకు అన్నాంబికాదేవంటే గాఢమయిన అపేక్షకదా?' అని వినబడింది దొరసానమ్మగారూ! ఉలికిలి, బేజారై, మాటరాక వణికిపోయానండీ తల్లీ! 'భయపడకు! నీకు అన్నాంబికా రాకుమారంటే ప్రేమయేనా?' అని మళ్ళీ వినబడింది. ఈపట్టు వెనక్కు తిరిగి చూచానండీ, ఆ పొదరింటిప్రక్క చీకట్లలోనుంచి ఒక పురుషుడు లేచి, కూర్చుండి 'మల్లికా, నన్ను గన్నారెడ్డి ప్రభువులు పంపారు. మీ చిన్న రాణీ గారు ఆదవోని చేరి ఉంటారు. వారికి నువ్వు దగ్గర ఉండటం ఉత్తమంకదా! కాబట్టి నిన్ను ఆదవోని తీసుకువెళ్ళమని వారు నల్గురను మమ్ము ఆజ్ఞ ఇచ్చి పంపారు. ఇప్పటికి నాలుగు దినాలనుంచి మాలో ఒకరమైనా ఈ తోటలో కావలా కాస్తున్నాము. నేటికి నీదర్శనమైంది. మేం మా మహాపురుషునకు బంటులమై నాచిన్న చిన్న రాజ్యాలకు ప్రభువులము. నేను రేచెర్ల సోమా రెడ్డిని. నాతో వస్తే ఆదవోని తీసుకొని వెళ్తాను' అన్నాడండీ. నాకు తమ మాట వినేవరకు ప్రాణం లేచివచ్చిందమ్మా! సరే వస్తానన్నానండీ!

అన్నాం ; చాలా చిత్రంగానే ఉంది, ఆ వెంటనే వచ్చి వేసినావా మల్లికా ?

మల్లి ; వెంటనే ఎట్లాగండీ! ఊరు కావలా పాండవుల శిబిరం, ఘటోత్కచుడు కాపాడినట్లేనండీ! ఆలా మహారాజులుంగారు కట్టుదిట్టాలుచేశారు.

అన్నాం ; ఎందుకా కట్టుదిట్టాలు ? నే నెలాగ వస్తిని.

మల్లి ; ఏమో మీరు వెళ్ళినట్లు పట్టి గాలివార్తే! అందుకని ఆ సోమా రెడ్డి ప్రభువు నన్ను వెంటనే చేయి దొరకపుచ్చుకొని హాకీతిపులుగు సాయం

కాలం పెంటికోసం కూసినరీతిగా కూసినారండీ. దానికి ప్రతిగా పెంటి హారీతి కూయిడినట్లు తోట నాలుగు మూలలనుంచీ వినబడ్డాయండీ. నా కా పురుషుడు కూసినట్లు తెలియకపోతే నేను 'ఏదో పక్షి కూస్తోంది' అనుకొనే దాన్నండీ. తర్వాత మేం బయలుదేరాము. ఆ వనానికి చుట్టూ ఉన్న పెద్ద గోడ దగ్గరకు ఉత్తరంగా నడుచుకుంటూ తీసుకుపోయాడండీ. ఆ డొంకల్లో పిల్లి అడుగులతో నెమ్మదిగా ఎలా తీసుకొనివెళ్ళాడో సోమారెడ్డి ప్రభువండీ. అక్కడకు పోగానే ఆయనలాగే రాజవేషాలు ధరించివున్న నలుగురు రెడ్డి ప్రభుకుమారులు ఛాయలలా వచ్చి కలుసుకొన్నారు. ఎలా దాటించారో నన్ను చెండులా ! నన్ను అవతలికి దింపారు. అంతకుముందే నన్ను ఒక మూలగా పోయి పురుషవేషం వేసుకొమ్మని ఆదవోని సేనాపతుల లాంటి వేషానికి సరిపోయే వస్త్ర కవచాదులు నాకు యిచ్చారంటీ. నేను చాటుగా పోయి పురుషవేషం వేసుకువస్తే వారు నాకు కవచాలు తొడిగారండీ. మేమందరం ఆదవోని సైన్యపు ఉప సేనాపతులలా ఉన్నాము. ఆ తరువాతనే కోటగోడ దాటాము. ఆ ప్రక్కన ఉన్న ఒక యింటి దొడ్డిలో ఆరు గుఱ్ఱా లున్నాయండీ. మేము గుఱ్ఱాలెక్కి నిర్భయంగా ఉత్తరపు కోట గోపుర ద్వారాన్ని చేరుకొన్నాము. కోటగుమ్మం దాటే సాంకేతికపు మాటలు వాళ్ళకు తెలుసును కాబోలు ! ఆ గుమ్మాన్ని దాటి అంచెలు అంచెలుగా ఈ ఊరు ఇంతకు ముందు నాలుగు ఘడియల క్రితం చేరుకున్నామండీ. నన్ను వారు తిన్నగా కుప్పాంబాదేవి మహారాణిగారి నగరంలోకి తీసుకువచ్చి విషయం చెప్పి ఒక దాసికి అప్పగించారు. ఆ దాసి తన గదిలోకి తీసుకువెళ్ళింది. నేను అక్కడ నా ఆడ వేషం మళ్ళీ వేసికొని ఆ దాసీ తమ నగరికి దారి చూపిస్తే ఇక్కడకు వచ్చానండీ. ఇంతట్లో తమరు ఇక్కడకు వచ్చారు.

అన్నాంబిక : నీ చరిత్ర బృహత్కథాగ్రంథంలో కథలా ఉందే ! నీవు రావడం ఒక పండుగలాగే ఉంది. ఇచట ఏంత ప్రేమతో చూచినా, కావలసినివాళ్ళ దగ్గర ఉండటం విషయం వేరు.

వాళ్ళిద్దరూ మాటా మంతీ చెప్పుకుంటూ కాలం గడిపారు.

ఆ రాత్రి అన్నాంబికకు ఎన్ని ఘడియలకూ నిద్రపట్టదు. ఎంత అందగాడా గన్నారెడ్డి ప్రభువు ! ఎంత ఉత్తమ వీరుడు ! లలితములై కనబడుతూ దృఢములైన ఆ వీరుని చేతులు తన్ను ఆ మహాపురుషుని హృదయానికి దగ్గరగా అదుముకోగలవా ? లోతులై వెడదలైన ఆ సుందరాంగుని కన్నులు తన్ను చూచిన వెంటనే ఆనంద కాంతులతో సూర్యోదయాలవలె వెలిగి పోగలవా ? పూలతో సింహాసనము అమర్చి ఆసనను అందు అధివసింప జేసితా నా మనోహరమూర్తి పాదాలకడ యుగ యుగాలు అధివసించి ఆ

దివ్యపురుషుని కాంతిలో తాను లయమైపోతూ, ఆ స్థితికి నిత్యత్వం సంపాదించుకో గలదా ?

ఆయనవేళ్ళు తన ముంగురుల నెట్లు సవరించగలవు ? ఆయన చూపులు తనచూపులలో ఎట్లు సంగమించగలవు ? ఆతన తనతో వర్ణనాతీత పరమరహస్య సంభాషణలు ఏనాడు జరుపగలరు ?

'గజదొంగ' యట! ఏమిటా గజదొంగతనము ? తన హృదయాన్ని దొంగిలించడంలోమాత్రం ఆయన 'గజదొంగ' కావచ్చు. ఏకాలమందైనా, ఏబాలిక అయినా ఇలా తనవలె తన సర్వాధినాథుడైన పురుషుని స్మరిస్తూ నిద్రరాక కాలమంతా కరిగి ఒకే మహాప్రవాహంలా ప్రవహించేటట్లు ఆలోచించుకుంటూ ఉండగలదా ?

'గజదొంగవా స్వామి ! కన్నె మేతువ ఏమి !

స్వజన దూరాగతను విజితురాలను నీకు.'

అని కూనిరాగంతో పాడుకుంటూ ఆ హంసతూలికాతల్పంపై దొర్లుతూ మూడవయామపుఘంటిక కోటమొగసాలలో కొట్టిన కొద్దివేళకు ఆమె గాఢనిద్రా వరవశురా అయింది.

## ప ం చ మ గా థ

# ఓ రుం గ ల్లు

### ౧

ఓరుంగల్లు ఎనిమిది లక్షల పౌరులు సుఖంగా కాపురంచేసే మహానగరం. రెండు గవ్యూతుల వెడల్పు, మూడు గవ్యూతుల పొడుగు గల కోటనగరము. ఆ కోటచుట్టు మహానగరము ఉన్నది. తీర్చిన వీధులు, పెద్ద చెరువులు, చిన్న సెలయేరులు, తోటలూ, దేవాలయాలూ, విపణివీధులతో ఆ మహానగరానికి ఈడైన మహానగరము దక్షిణాపథమందుకాని, ఆర్యావర్తమునందుకాని లేనేలేదు.

కోటనగర మధ్యమందు మహారాజుల కోట ఉన్నది. ఆ కోటయే పెద్ద పురమంత ఉన్నది. కోటలో ఏకశిలకు తూర్పుగా మహారాజ శుద్ధాంతాలు, మహారాజ నగరులు ఉన్నాయి. ఉత్తరంగా, వాయవ్యంగా స్వయంభూదేవేశ్వరాలయం, కేశవదేవర గుడి, ఏకవీరాదేవిగుడి ఉన్నవి. నైరుతిగా పడమట కోట తటాకం, ఈ తటాకాన్ని ఆనుకొని రాజోద్యానమూ ఉన్నవి.

స్వయంభూదేవాలయంకడకు నాల్గు మహావీథులు కూడుతాయి. ఆ దేవాలయానికి తూర్పువీధినంటి రాజబంధువుల మందిరా లున్నవి. చక్రవర్తి హర్మ్యం పావు గోరుతం పొడవు వెడల్పు ఉంటుంది. ఆ మహాభవనాల చుట్టూ ఎత్తయిన గోడ లున్నాయి. వానికి తూర్పుగా ప్రధానామాత్య శివదేవయ్యవారి హర్మ్య మున్నది. ఆ భవనానికి దక్షిణంగా దుర్గపాలకుడైన ప్రసాదాదిత్యనాయనింవారి సౌధా లున్నాయి. వానికి తూర్పుగా మహారాజాతిథిభవనా లున్నవి. ఆ భవనాలకు తూర్పుగా తంత్రపాల ప్రోలనాయనింవారి సౌధా లున్నవి. ఆ సౌధాలకు దక్షిణంగా ప్రోలనాయనింవారి కుమారులైన ఎక్కినాయని, రుద్రినాయని, పినరుద్రినాయని, పోతానాయనింవారల సౌధా లున్నాయి. వీ రందరు సేనాపతులు.

ఏకశిలకు పడమటగా కుమార రుద్రదేవమహారాజులకు అంగరక్షకులైన తంత్రపాల వల్లయనాయకులవారి సౌధాలున్నవి. ఇంక దక్షిణంగా మారమరాజులంవారి, ప్రోలనాయనింవారి భవనా లున్నాయి. చక్రవర్తి నగరులకు ఉత్తరంగా మహాసేనాపతియైన రుద్రనాయనింవారి భవనా లున్నాయి. ఆయన ఏకశిలానగర పాలకుడు. నగరసైన్యాధ్యక్షుడు నాగచమూపతి, నాగచమూపతి మామగారయిన మేచయ నాయకుడు ఎంతకాలమునుంచో తలవరిగా నున్నాడు. మేచయనాయకుని

కుమార్తె అయిన మల్లమాంబిక నాగచమూపతి ఇల్లాలు. నాగచమూపతి తండ్రి మల్లచమూపతి గణపతిదేవుని మహాసేనాపతులలో ఒకరు.

రాచకోట లోపలిగోడ ననుసరించి ఉపసేనాపతు లనేకుల భవనాలున్నాయి. అక్కడక్కడ సైన్యశాల లున్నవి. రాజోద్యోగు లనేకుల మేడలు రాచకోటలో పడమటిద్వారం దగ్గరగానున్నా, ఉత్తరపు గోడపొడుగునా రజకాది శూద్రుల గృహాలు, రాచవారి సేవచేసేవారి ఇళ్ళు ఉన్నాయి.

అన్నాంబికకు ఓరుగల్లు చూడడం ఇదే ప్రథమపర్యాయం. మహారాణి కుప్పసానమ్మతోపాటు ఆ బాలికకూడా మత్తగజంపై అంబారీలో అధివసించి ఓరు గల్లు నగర వైభవం ఆనందంతో పరికించుతున్నది. నగరబాహ్యంలో ఉన్న వాడలలోనికి పొలాలనుండి రైతులు తిరిగి వస్తున్నారు. చిన్నపూరిళ్ళు, చిన్న చిన్న ఇళ్ళు, మేడలు ఆ మహారాజపథానికి ఈవలావల వాడలలో ఉన్నాయి. నేత శాలలముందు నూలు పడుగులు చేస్తున్నారు. సన్నని నూలును ముతకనూలును భామలు కండెలకు చుట్టుతున్నారు. కొందరు వనితలు కళింగమునుండీ, ఆంధ్ర మంజిష్ఠాది దేశాలలో అనేక భాగములనుండి వచ్చిన నూలును సన్నతనం, ముతక తనమును బట్టి కేటాయింపులు చేస్తున్నారు.

ఆంధ్రదేశంలో దూదిబట్టల పరిశ్రమ అతి పురాతనకాలంనుండీ ప్రసిద్ధికెక్కి నది. పది మడతలు పెట్టి ధరించినా దేహాన్ని స్పష్టంగా కనిపింపజేయగల సన్న నూలు వడకడంలో ఆంధ్రవనితలు జగత్ప్రసిద్ధి నందినారు. ఎంత ఉత్తమకుటుం బీకురాలయినా, వ్రతములతోపాటు, పవిత్రమైన నూలునుకూడా వడకవలసిందే! ఆంధ్రవనితల నైపుణినిబట్టి వివిధపుంజాలుగా తేలు నూలు వస్తుంది. దేశానికి కావ లసిన వస్త్రాలు సిద్ధం చేయడమేకాకుండా, ఇతరదేశాలకు సరిపోయే వస్త్రాదికా లను నేసి, ఆంధ్రులు ఎగుమతి చేసేవారు.

నేతలో ఆంధ్రసాలెవా రంత కౌశలంకలవారు అఖిల భారతదేశంలో ఇంకొ కరు లేరు. మానుపనాటి, బుద్ధనాటిలో, పెనాదాడిలో, పిద్దవాడిలో ఉన్నిని నూలంత సన్నంగా వడకగలిగేవారు గొల్లభామలు. ఆ నూలును కురవసాలీలు సన్నని కంబ ళ్ళుగా నేసేవారు. ఆ కంబళ్ళు కాశ్మీరశాలువలకు, హిమాలయరాంకవాలకు ఏమీ తీసిపోయేవి కావు. కళింగము, దక్షిణకోసలము చక్కని దుకూలాలకు ప్రసిద్ధి. చీనాదేశాన్నుండి తళతళలాడే మెత్తని పట్టునూలు దిగుమతి అయ్యేది. కామరూపా న్నుంచి వచ్చిన పట్టునూలున్ను ఉత్తమమైనదే. ఆ పట్టునూళ్ళతో ఆంధ్ర పట్టు సాలీలు నేసిన చీనీ చీనాంబరాలు, దుకూలాలు జగత్ప్రసిద్ధి పొందినవి.

ఆంధ్రదేశంలో పట్టునూలుపై బంగారము కరగించి పూతపూసి హొంబట్టు చేయుట పురాతనకాలంనుంచీ ఉన్నది. ఈ నూలుకు పారశీకులు జరీన్‌తారు (జల తారు) అనే పేరుపెట్టారు. పారశీకవర్తకులు ఈ హొంబట్టు నూలును విపరీతంగా

కొనుక్కుపోయేవారు. ఈ పరిశ్రమచేసే శాలలు ఓరుగల్లులో ఎన్నో ఉండేవి ఈ పరిశ్రమను పట్టుసాలీలు, స్వర్ణకారులు కలిసి చేసేవారు.

౨

మల్యాలవారి సైన్యం ఓరుగల్లునగర బాహ్యప్రవాదలలో ఆగింది. మల్యాలవారివాడ. రేచర్లవారివాడ, విరియాలవారివాడ, ఇందులూరివారివాడ, గోనవారివాడ మొదలయిన సామంతుల సైన్యాలూ, ఉద్యోగులూ ఉండే పేటలు ఉండేవి.

మల్యాలవారి సైన్యం, సిబ్బందీ మల్యాలవాడ చేరుకున్నారు. గుండయ భూపతి, కుప్పసానమ్మ, అన్నాంబిక, కోటలోపల ఉన్న మల్యాలనగరు చేరుకున్నారు. మల్యాలవారి రాచఏనుగులు, గుఱ్ఱాలు దక్షిణద్వారాన ఓరుగల్లుపురం చొచ్చాయి. అలాగే దక్షిణపు గోపురద్వారాన కోటలోకిన్నీ వెళ్ళి ఉత్తరంగా ప్రయాణించి తూర్పుకు తిరిగి తూర్పుద్వారానికి కొలది దూరంలోఉన్న మల్యాలనగరు చేరుకున్నవి.

ముందుఏనుగుపై మల్యాల గుండయ్య ప్రభువు అధివసించి ఉన్నారు. వారి వెనుక మహారాణీ, అన్నాంబిక అధివసించిన మత్తేభము, ఆ వెనుక రాజకుమారుల ఏనుగులు మూడు వచ్చినవి. ఆవెనుక రాజగుఱ్ఱాలు ఏబది. ఆ గుఱ్ఱాల వెనుక దాస దాసీజనులు ఎడ్లబండ్లపై శిబికలపై వచ్చినారు. వీని అన్నింటికి ముందు భజంత్రీలు, నాగస్వర మేళము నడుస్తున్నది. వందులు గుండయప్రభువు బిరుదావళులు చదువుతున్నారు. అంగరక్షకసైన్యం ముందు, ప్రక్కల, వెనుక నడుస్తున్నది. రాజవీధులు బళ్ళతో, గుఱ్ఱాలతో, ఏనుగులతో, శిబికలతో, స్యందనాలతో నిండి ఉన్నవి. రాచవారు ఎవరు వెడుతున్నా అది ఒక ఊరేగింపే।

అక్కలవాడ, భోగంవీధి, స్వర్ణకారవీధి, శిల్పకారులవీధి అన్నీ పురంలో ఉన్నాయి. కోటనగరంలో ఉన్న గుళ్ళల్లో ఎప్పుడూ ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి. చక్రవర్తుల దుర్గనగరానికి ఎదురుగుండాఉన్న రాజవీధిలో కొంతదూరం పోయిన తర్వాత సార్వభౌమ చిత్రశాల, గ్రంథాగారము లున్నాయి. నగరిలో సార్వభౌమ సౌధాలలో ఒక్కొక్క మహాభవనంలో ఒక్కొక్క చిత్రశాల ఉన్నది.

మాండలికులు చిత్ర, నృత్య, గ్రంథశాలల తమతమ నగరులలో ఉంచుకొనే వారు. మల్యాలవారి నగరిలో ఉన్న చిత్రశాల దేశప్రసిద్ధమైనది.

అన్నాంబిక ప్రయాణపు బడలిక తీరునట్లు సుగంధాలు కలిసిన వేడి నీట జలకమాడి శుభ్రవస్త్రాలు ధరించి సుగంధతైలదీపాలతో స్వర్గలోకంలా

ఒప్పారే చిత్రశాలకు వెళ్ళింది. ఆ చిత్రశాలలో ఉన్న శివలీలా విలాసాలు గమనిస్తూ హంసతూలికల పరుపులు పరచిన దంతపుపీఠంపై అధివసించి ఆ చిత్రలేఖనా లన్నీ అనేక రీతులుగా తన్ను గమనిస్తూ వుండగా ఆలోచనకు లోనయింది. తనభక్తికి ఆకరమైన తండ్రికిని, ప్రేమ విధానమైన గన్నారెడ్డి ప్రభువుకు యుద్ధం సంభవించవచ్చును.

ఒకమాటు ఇక్కడ, మరొకమాటు అక్కడ నీడ వున్నచోట నిలవక, ఎండ వున్నచోట నిలిచి, తిరిగే గన్నారెడ్డి తనతండ్రిగారి ఔద్ధత్యానికి ఎన్నికష్టాల పాలవునో? తనతండ్రిగారికి పట్టుదల విపరీతము. ఈమధ్య సైన్యాలెన్నో కూరుస్తున్నారు. ఏదో భయంకరమైన సంఘటన రాబోతున్నతి. ఈ సంఘటనలోగా తన తండ్రిగారికీ గన్నారెడ్డికీ సంఘర్షణవస్తే తన గతి ఏమి? ఒక వంక తండ్రి, వేరొకవంక తాను భగవంతుడుగా ప్రేమించే ప్రియుడు. వీ రిరువురు ఒకరివల్ల ఒకరు పరాభవం పొందినా, లేక నాశనమైనా తన కది ప్రాణంపోకడే అవుతుంది.

ప్రేమకై స్త్రీపురుషులు సర్వమూ అర్పిస్తారు. ఆ ప్రేమ ఎంత క్షణికమో అంత మహాశక్తిపూరితము. ప్రేమిస్తున్నానని, ప్రేమకై రుక్మిణీదేవి అలా తన తలిదండ్రులను, అన్నదమ్ములను అందరినీ వదలి, పురుషునితో పారిపోయింది. సీత అడవులలో భర్తతోపాటు సర్వకష్టాలు పడింది. సావిత్రి భర్తప్రాణంకోసం యముణ్ణికూడా వెంటాడింది.

స్త్రీ ప్రేమకోసం సర్వమూ త్యజిస్తే పురుషు డట్లా చేయగలడా? స్త్రీలు ప్రేమకోసం అన్నింటినీ అర్పిస్తూ ఉంటే పురుషుడు రాజ్యంకోసం అన్నీ సమర్పిస్తాడు. క్షణికమై, నశ్వరమైన ఈ జీవితం భోగభాగ్యాలకోసం గజిబిజీ చేసుకొనే పురుషుడు నిజము గ్రహించే ఈనాటకము ఆడుతున్నాడా?

ఈ సమస్యను, తన చరిత్రమును అంతా శ్రీ శివదేవయ్యదేశికులను కలుసుకొని తాను యిదమిత్థమని తేల్చుకొంటుందిగాక.

అన్నాంబిక చిత్రశాలలో ఉన్నదని తెలిసి కుప్పసానమ్మ ఆ మందిరానికి విచ్చేసింది. అన్నాంబిక లేచి నిలిచింది.

కుప్ప : అన్నాంబికా! చాలా ప్రొద్దుపోయింది. అలసటపడి వున్నారు. మనం భోజనాదికాలు కానిచ్చి శయనమందిరాలు చేరుకుందాము.

అన్నాంబిక, ప్రయాణంలో నా కేమీ కష్టం కలుగలేదు. ఆదవోనిలో, బుద్ధపురంలో, కందనోలులో ఏమి గడబిడలు జరుగుతుంటాయో అని భయపడుతూ ఆలోచించుకుంటున్నాను.

కుప్ప : రాజకుమారీ! మా తమ్ముడు ఎవ్వరికీ ఏమీ కష్టం రానియ్యడు. అతని యుద్ధనైపుణ్యం ఎంతటిదో నీతిసంపదకూడా అంతటిదే.

# 3

శివదేవయ్యామంత్రి ఆరాధ్య ఆరువేల నియోగిబ్రాహ్మణుడు. ఉత్తమ రాజ్యతంత్రజ్ఞుడు, పండితుడు, సకలశాస్త్రపారంగతుడు, మహాకవి. శివదేవయ్య చక్రవర్తితోపాటు గోళకీమఠ శైవగురుపరంపరలోని విశ్వేశ్వర శివాచార్యులకు శిష్యుడై, తమ గురువు గుప్తమైన వెనుక తాను శివదేశికులై, రాజమంత్రియై శ్రీ కాకతి గణపతి రుద్రప్రభునిచే ఆంధ్రమహాసామ్రాజ్యము అఖండముగ, రామరాజ్యముగ పరిపాలనము చేయించుచున్న పరమాద్భుత సత్త్వుడు. జనమంతైనా రోగ మెరుగని తపస్సంపన్నుడు. సర్వవేదాంత సారములూ కూలంకషంగా తెలుసుకొని, శంభుమహిమను పూర్తిగా ఎరిగిన ముముక్షువు. జనకచక్రవర్తివలె రాజధర్మం అనే తామరాకులో నీటి బిందువులా ప్రకాశిస్తూ, యుద్ధం చేయని పార్థసారధిలా, కాకతీయ మహారాజ్య పరిపాలనా రథానికి చోదకుడై నడుపుతున్నాడు. ఆయనమాట గణపతి రుద్రదేవునకు శివాజ్ఞ.

ఈ నాడీ ఉత్తమపురుషుడు కళింగంనుండి కంచివరకు, మోటుపల్లినుండి కళ్యాణివరకు విస్తరించిఉన్న ఈ సామ్రాజ్యమున విచ్ఛేదక శక్తులు తాండవమాడుచున్నవని గ్రహించాడు

ఈ స్థితి రావడానికి తానూ ఒకవిధంగా కారకుడే। మగబిడ్డలు లేని, గణపతిరుద్రుని కూతునే కుమారునిగా పెంచుమని ఆలోచన చెప్పినది తాను. ఆ బాలికకు వేరొక బాలికను తెచ్చి వివాహం చేయించింది. తాను. ఈ రహస్యం ఆలా పరమగోప్యంగా ఉండిపోవాలని తా నెప్పుడూ అనుకోలేదు.

మహారాజ్య పరిపాలనాదక్షతా, శక్తీ రుద్రదేవి సముపార్జించి సామ్రాజ్ఞి కాగోరి తా నీ రీతిగా రాజధర్మము నడిపినాడు.

ఇప్పుడు గణపతిరుద్రదేవుడు కైలాసాభిముఖుడై ఉన్నాడు. నెమ్మదిగా తన నిమంత్రణంచే, రుద్రదేవి వనిత అని లోకం అంతటా వ్యాపించింది. దీనినిగూర్చి ప్రథమంలో దేశం అంతటా గుసగుసలు బయలుదేరతీసింది తాను. మగవాడై పెరిగిన రుద్రదేవిని మరల స్త్రీగా మార్చు శక్తులను తాను ప్రయోగించాడు. అందుకు నిమిత్తుడు చాళుక్య వీరభద్రదేవుడు. ఆ నిరవద్యపుర రాజకుమారుడు, ఇందుశేఖర మహారాజు ప్రథమతనయుడు రుద్రమదేవిని తన బుద్ధిలో ఆత్మేశ్వరిగా నిర్ణయించుకొన్నాడు. అది శుభం। ఇటు రుద్రదేవి కుమారియు చాళుక్య వీరభద్రునిపై మరులుకొన్నది. చదువుకొన్నది, ఈడు మీరినది. ఆ కుమారి కొన్ని ధర్మాలు నిర్ణయించుకొన్నది. ఇప్పు డా రాజమార్గమునుండి తప్పి నడవడానికి శంకిస్తున్నది. ఆమె దారి ఆమెయే వెదకుకొనాలి. అది ఉత్తమ ధర్మమార్గం కావాలి. ఆ అన్వేషణ క్రమ వికాసితంగా వుండేటట్లు చూడవలసింది తాను.

రుద్రదేవుడు ఉద్వాహమైన ముమ్మడమ్మకు నిజమైన నివాహం కావాలి. ఈ ధర్మం నిర్వహించబడాలి అంటే రుద్రదేవుడు సంపూర్ణంగా రుద్రదేవి కావాలి. ఆ పిమ్మట రుద్రదేవప్రభువే ముమ్మడాంబికకు భర్తను వెదకాలి!

శ్రీ సకలాంధ్ర సామ్రాజ్ఞి అగుటకు వ్యతిరేకించి క్రోధోన్మత్తులై పరవళ్ళు త్రొక్కబోయే దక్షులకు వీరభద్రులు కావాలి. మహావీరులనుగన్న ఆంధ్రమాత కడుపు చల్లగా ఆ వీరభద్రులు శివజటాజూటోద్భవు లయినారు.

తనకు ఏనాటి కానాడు చారులు, యథార్థవర్తులు, ప్రణిధులు, గూఢ పురుషులు ఆంధ్రభూమండలం అంతటినుండీ వార్తలు తీసుకొని వస్తున్నారు.

మనస్సులోమాత్రం వికారం పొందినవారు, 'శ్రీ చక్రవర్తిని అవునా' అని ఆక్షేపించేవారు, తామే మేటి మొనగాండ్రు గాదలచుకొన్నవారు, సన్నాహాలు చేస్తున్నవారు, సైన్యాలు కూర్చేవారు, రహస్యంగా రాయబారాలు నడుపుతున్నవారు—ఓహో! ఆంధ్రదేశం రాజద్రోహిమాండలికులతో నిండి ఉన్నది.

కాలవైపరీత్యము! యుధిష్ఠిర సింహాసనం ఈనాటి కటులైనది. ధర్మం సందుదారుల నడుమపడవలసిన వ్రాత వచ్చింది. ఇంకను ఎట్టివ్రాత ఈ దేశానికి విధి వ్రాసి ఉంచినాదో ?

ఈలా ఆలోచనలు తరంగమాలలా దొర్లుకువస్తూ ఉండగా శివదేవయ్య దేశికులు భోజనానంతరము తన ఆలోచనామందిరములో కూర్చొని ఉండిరి. ఇంతలో ప్రసాదాదిత్యనాయనింవారు దర్శనార్థము వచ్చినారని లోనికి వార్తలు పంపినారు. వార్త తెచ్చిన శివభక్తునితో ప్రసాదాదిత్యుల ప్రవేశపెట్టవలసిందని చెప్పి శివదేవయ్య శివనామామృత శ్లోకాలు తీయని కంఠంతో పాడుకుంటూ ఉండిరి.

శ్రీ రేచర్ల ప్రసాదాదిత్యనాయనింవారు పద్మనాయక వెలమరెడ్లు. ఆ దినాలలో ఆంధ్ర క్షత్రియ కులాలవారికి భోజన ప్రతిభోజనాలలోగాని, వివాహాదులలోగాని నిషేధాలు లేనేలేవు. కాకతీయ వంశానికి మొదటినుండి రేచర్ల వారు మాండలికులై, అంగరక్షకులై, వంశరక్షకులై కాకతీయరాజుల ప్రేమకు పాత్రులై ఉండిరి.

ప్రసాదాదిత్యులవారు లోనికి ప్రవేశించి శివదేవయ్య దేశికులకు పాదాభివందన మాచరించి, వారిచే ఆశీర్వాదా లంది, వారిచే చూపింపబడిన ఆసనం అధివసించిరి.

ప్రసా : గురుదేవా! దేవగిరి యాదవులు ప్రబల సన్నాహాలు చేస్తున్నారని వేగులు మహాప్రవాహంలా వచ్చిపడుతున్నాయి. మనం ఏమరుపాటుగా లేముకదా ?

శివ : యాదవులు మనదేశంమీదకు ఇప్పట్లో రాన్నెత్తినూడరు. శ్రీ సార్వభౌములవారు విస్మృతసంతో ఒకమాటు, నేను మంత్రిత్వభారం గైకొన్న

క్రొత్తదినాలలో ఒకసారి శౌణయాదవులకు మరపురాని బుద్ధిచెప్పారు. ఆ రక్షలు ఇప్పటివరకూ మాయలేదు. కృష్ణభూపతి బొందెలో ప్రాణం ఉన్నంతవరకూ యాదవ సైన్యాలు దేవగిరి దాటవు. మీరు నమ్మండి.

ప్రసా : మహాదేవరాజు తండ్రిమాట వినేదినాలు దాటిపోలేదుకదా అవి ?

శివ : మహాదేవరాజుకు తండ్రిమీద గౌరవంపోయి నాలుగు సంవత్సరాలయింది. కాని తక్కిన మాండలికులకు, సేనాపతులకు కృష్ణభూపతి అంటే అనన్యమైనభక్తి. ఆ కారణంచేతే మహాదేవుడు ఓరుగల్లు మహానగరాన్ని తలచుకొని నోరూరి చప్పరిస్తూంటాడు.

ప్రసా : అయినా మనం సర్వసిద్ధంగా ఉండవలెకదా ?

శివ : గజదొంగ అయిన గోన గన్నారెడ్డి ప్రభావమువల్ల రేచర్లవారి, మల్యాలవారి, కోటవారి, నతనాటసీమవారి సైన్యాలన్నీ సతమతమై చేయూడకుండా ఉన్నవి.

ప్రసా : అవునవును, అతడు మెరుములా ఒకసారి శ్రీశైలందగ్గర ఉంటాడు, ఇంతట్లో ఇటు మంత్రకూటందగ్గర కనబడుతాడు.

శివ : మీ రేచర్లవారి పిల్లవాండ్రుకూడ కొంతమంది ఆ జట్టులో చేరారు. అతని సైన్యం నానాటికీ పెద్దదయిపోతున్నది.

ప్రసా : గురుదేవా ! నిన్నసాయంకాలం మల్యాల గుండయ్య ప్రభువుగారు వచ్చినారు. వారితో వారి రాణీగారితో కలిసి ఆదవోని ప్రభువు కుమార్తె అన్నాంబిక వచ్చింది. గోన గన్నయ్య ఆ రాజకుమార్తెను ఆదవోని నుంచి ఎత్తుకొనివచ్చి అక్కగారిదగ్గర ఉంచితే గుండయ్య ప్రభువు ఆదవోని రాజుతో పోరాడటం ఒప్పక ఈ నగరం వచ్చాడని చారులు వార్త పట్టుకువచ్చారు

శివ : కుప్పసానమ్మ, అన్నాంబిక ఈ దినము సాయంకాలమే మహారాజుల దర్శనం చేసుకుంటారు. అక్కడి సంఘటనలవల్ల ఆదవోని రాజుకూ మల్యాలవారికీ యుద్ధం వచ్చితీరుతుంది. కోటారెడ్డి మనవైపు ఉండవలసినవాడు. అందుకని మీరు చక్రవర్తి పేరిట ఆదవోని ప్రభువుకు ఒక శ్రీముఖం పంపించండి. "అన్నాంబికారాకుమారి నారాంబా పేరాంబా మహారాజుల శుద్ధాంతాలలో సగౌరవంగా చక్రవర్తి కన్నకూతురులా ఉంటుంది. పిలువెంబడిని రాకుమారికను ఆదవోని చేర్పగలవార" మని.

ప్రసా : ఏమిచక్కని ఆలోచన చేశారండీ గురుదేవా ! ఓయి వెర్రి కోటారెడ్డి ! ఏకపుత్రికావిషయంలో నీకు శ్రద్ధలేకపోతే ఆమె నీకు దక్కదని ఎంచుకోలేకపోయావుకదా !

శివ : ప్రసాదాదిత్యప్రభూ ! శుభముహూర్తం చూచి శ్రీ కుమారరుద్రదేవప్రభువు చక్రవర్తికి పెద్దకొమార్తె అని ఏదో ఒక మహోత్సవ సందర్భంతో లోకానికి తెలియజేయవలసి ఉంది.

ప్రసా : గురుదేవా ! ఆ విషయంలో గోన గన్నారెడ్డి లోకమంతా చాటింపు చేస్తూనే ఉన్నాడు.

౪

అప్పుడు శివదేవయ్య ప్రసాదాదిత్య ప్రభువును తీక్షంగా చూచి 'సేనాధిపతీ ! ఇప్పుడు రుద్రదేవ ప్రభువుపై కుట్రచేసివా రందరికీ ఒక్క మహానాయకత్వం ఏదో తెర వెనుక వుంది. ఆ నాయకత్వం ఎవరిదా అని వేయివిధాల ప్రయత్నంచేసి కనుక్కొంటున్నాను, కాని ఏవిధమైన ఉదంతం నాకు దొరకటంలేదు.'

"శివదేవయ్య దేశికుల గరుడలోచనాలు చూపుల కందని ఆ మహా వ్యక్తి ఎవరు గురుదేవా ?"

శివ ; ఆ విషయం తెలియకేకదా ఈ చిన్న చిన్న కుట్రవాగులను విజృంభింపనిస్తున్నది.

ప్రసా ; లకుమయ్యా ?

శివ : లకుమయ్యాకాదు, కోటారెడ్డికాదు, మరెవ్వరూకారు.

ప్రసా : యాదవప్రభువా ?

శివ ; యాదవప్రభువు తన కక్ష మొదటినుండీ నువ్యంక్తంచేస్తూనే ఉన్నాడు.

ప్రసా ; హరిహర, మురారిదేవులా ? వాళ్ళే అయితే నా చేతులతో వాళ్ళను నూనె పిండుతాను మహామంత్రీ !

శివ ; కాదయ్యా సేనాపతీ ! వాళ్ళ దినచర్య అంతా నాకు ప్రతిక్షణం తెలుస్తోంది. నాశక్తిని వమ్ముచేస్తున్న ఆ మహావ్యక్తి ఎవరో, ఈ భయంకర నాటక సూత్రధారి ! ప్రయత్నాలన్నీ వృథా అవుతున్నాయి. నే నొకటే కాదు 'ఆ మహావ్యక్తివరో' అని ఆకుట్రలలో చేరినవారే ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ నాటకాన్ని నడిపే ఆ సూత్రధారి జ్ఞానాతీతుడై ఉన్నాడు.

ప్రసా ; చివరకు మన ప్రయత్నాలన్నీ నిష్ప్రయోజనం అయిపోతా యేమో గురుదేవా ?

శివ ; ఆ భయం నాకు లేకపోలేదు. ఇందుకు ఒకటే పాశుపతం వుంది. దాన్ని ప్రయోగించాను. మొదట అది సాధారణబాణం అనుకున్నాను, కాని అఖండాస్త్రమని నానాటికీ వ్యక్తమవుతున్నది. ఆ సూత్రధారు డెవరో తెలుసుకొని, వానిని నాశనం చేయగలిగింది ఆ ఒక్క అస్త్రమే !

ప్రసా ; ఉత్తమశక్తిసంపన్న అయిన ఒక్క మహారాజ్ఞి రాజ్యం చేయ డానికి పురుషులకు ఇంత ఇష్టం లేకపోవడం నాకు ఆశ్చర్యంగా ఉంటున్నది ! గాలితో ఏమి యుద్ధం చేయగలం ? ఆ మగవాడు బయటపడితే మన బలా బలాలు తెలుసుకోవచ్చునుకదా ?

శివ, ఆ మనుష్యుని జాడలు కొంతవరకు వచ్చి ఆగిపోతున్నవి. రోగ మూలం తెలియకుండా, బాధబాధకూ మందు పుచ్చుకుంటే క్రొత్తబాధలు వస్తూ ఉండడమే కాని ప్రయోజనకారి కాదు.

ప్రసా : దేశికులవారూ ! మీ ప్రయత్నాలు సాఫల్యం పొందకపోవడం అనేది ఉండదు.

శివ : దేశంలో ఉన్న నీచహృదయులకూ, తప్పుదారుల బడినవారికీ ఆ తెరచాటువ్యక్తి బలం ఇస్తున్నాడు. అతని ఉద్దేశం తానే చక్రవర్తి కావాలని ! ఆ వ్యక్తి చాలాబలవంతుడు అయిఉండాలి. కాకతీయసామ్రాజ్య రహస్యాలన్నీ పూర్తిగా తెలిసిఉన్నవాడాతడు. 'ఆడదా రాజ్యం చెయ్యడం' అనే మిష ఆ పురుషుని అంబులపొదిలోని పెద్ద ఆయుధం. కాబట్టే ఆ ఆయుధంలోని సగం బలం తీసివేయడానికి భావి ఆంధ్ర సామ్రాజ్యభారం వహించబోయేది రుద్రమదేవి అని లోకం అంతా తెలియజేస్తున్నాము.

ప్రసా : మనకు బాసటఅయ్యే ప్రభువులు నేశంలోను ఉండకపోరు.

శివ : ఎవరినీ నమ్మకూడదయ్యా ! చివరకు శ్రీ గణపాంబాదేవిగారి భర్తనూ నమ్మకూడదు. దివాలలాంటివి. అయినా నా వేగులవల్ల పూర్తిగా నాకు ఎంతో నమ్మకం కలిగినవారు, దిట్టమైనవారు అన్ని నాడులలోనూ ఉన్నారు. ఇప్పటికి మూడు తరాలనుంచి శాంతి, సుభిక్షము, ఐశ్వర్యము, ఆనందము అనుభవించే ఈ మహాదేశము, నేడు ఎవరో కొందరి దురాశలకు లోనై స్వనాశనం చేసుకోదు. అది మన ముఖ్యబలం. అందుకనే ప్రజలందరూ కాకతీయ సామ్రాజ్యానికి అండగా ఉంటారు.

ప్రసాదాదిత్యనాయకులు కలకదేరని మనస్సుతో శివదేవయ్య పాదాలకు నమస్కరించి అనుమతిసంది వెడలిపోయెను.

ఆ వెంటనే ఒకవ్యక్తి శివదేవయ్యదేశికుల అనుమతిని వారికడకు వచ్చి సాష్టాంగనమస్కార మాచరించి, ఆజ్ఞకై తలవంచి దూరాన నిలుచుండెను.

ఆ వచ్చిన నూతనపురుషుకు ఒక సద్బ్రాహ్మణుడు. ఆయన ముఖమునను పైదివితేజము తాండవిస్తున్నది. ఆయన వేదవేదాంగ పారంగతుడు, అద్వైతి. నాట్యశాస్త్రంలో దిట్ట. వేషాలు వేయడంలో ఆ ఉత్తమ బ్రాహ్మణు డద్వితీయుడు. ఆయనకడ అనేకులు గణికలు నాట్యశాస్త్ర మభ్యసించి అప్సరసలని పేరు పొందారు. ఆ బ్రాహ్మణుడు ఎల్లాంటి మారు వేషాలన్నా వేయగలడు. ఆ యా వేషాలకు తగిన భాషలు నేర్చినవాడు. చూపులు చేష్టలు, నడక అన్నీ ఆ వేషంలో పాలూ నీళ్ళూ కలిసినట్లు కలసిపోతాయి.

ఈమారువేషాలు వేసుకొనే బ్రాహ్మణచారులు శివదేవయ్యమంత్రికొలువులో పదునారుమంది ఉన్నారు. వారందరూ పండితులు. కొందరు సర్వశాస్త్రపారంగ

తులు, కొందరు కొన్ని శాస్త్రాలలో ఉద్దండపండితులు ఆ పండితులు అందరూ దేశాలు తిరుగుతూ, కొన్ని దేశాలలో నివాసంచేస్తూ, ఎప్పటివార్త అప్పటికి శివదేవయ్య దేశికులకు అందజేస్తూఉంటారు. ఈ బ్రాహ్మణబృందానికి నాయకుడు సోమనాథభట్టు. ఆయన భరద్వాజగోత్రుడు, వారి కాపురము బుద్ధపురము. శ్రీ మల్యాలప్రభువంశానికి వారు పురోహితులు. ఈ సోమనాథభట్టోపాధ్యాయులకు మంత్రగురువు శివదేవయ్యాదేశికులు.

కాకతీయసామ్రాజ్యాపసర్పగణానికి నాయకుడు ప్రసాదాదిత్యనాయడు. వారు తెచ్చేవార్తల విధానము వేరు. వాని విషయము వేరు. శ్రీ శివదేవయ్య మంత్రికి శిష్యులైన ఈ పండితులు తెచ్చు వార్తలు వేరు. ప్రసాదాదిత్య నాయకుని చారులు మూడు తరగతులవారు.

ఒకతరగతివారు ఓరుగల్లు నగరంలో అప్రమత్తులై తిరుగుతూ, అధర్మం తలెత్తకుండా చూస్తూఉంటారు. ఆ దళములో అయిదారువందలమంది వారు లున్నారు. బిచ్చగాళ్ళవలె, శివయోగులవలె, యాత్రికులవలె, నగరములో నివాసముచేయు సాధారణపౌరులవలె, వివిధవృత్తులవారివలె వారు నివసించుతూ ఆ నగరానికి రహస్య తీక్ష్ణలోచనాలవలె ఉంటారు.

రెండవతరగతి చారులు దేశం అంతా తిరుగుతూ రాజకీయవిషయాలూ, ఇతర ధర్మవిషయాలూ కనిపెట్టుతూ ఉంటారు. మూడవతరగతి చారులు అఖండులు. వారెవరో ప్రసాదాదిత్యనాయకునకు, ఆయనక్రింద ఉద్యోగులైన తంత్రపాలునకు, ముఖ్యచారదాయకునికీ మాత్రమే తెలియును. ఈ చారులు వేయిమంది ఉంటారు. వీరు సర్వరాజ్యాలూ తిరుగుతూ ఉంటారు. ఎక్కడెక్కడి విషయాలు పోగుచేసుకు వస్తారు. వర్తకులుగా, వర్తకుల లేఖలుగా, పుణ్యక్షేత్ర యాత్రికులుగా తిరుగుతూ ఉంటారు. వీరందరూ బహుభాషావేత్తలు, వివిధదేశాచార జ్ఞానసంపన్నులు, చారులందరూ సర్వయుద్ధవిశారదులు.

సోమనాథభట్టోపాధ్యాయులు ఆనవాలుకట్టలేని వేషాన వచ్చి పాదాభివందన మాచరించి నిలుచుండగానే శివదేవయ్యాదేశికులవా రా పురుషుని తేరిపార చూచి నారు. ఆయన చూపు లా పురుషుని వైద్యుడు రోగిని చూచునట్లు, దూడలలో ఆవు తనదూడకై చూచునట్లు, స్వర్ణకారుడు వివిధరత్నాలను పరీక్షించునట్లు తీక్షముగా ప్రసరించునవి. అప్పటికి ఆయన ఒక నిర్ణయానికివచ్చి, చిరునవ్వుతో 'సోమనాథార్యా ! అంత పరిశీలన చేయకపోయినచో నేను నిన్ను గుర్తుపట్టలేక పోయే ఉందును' అని పలికినాడు.

సోమనాథభట్టాచార్యు లప్పుడు నవ్వుచు, 'ప్రపంచములో ఎవ్వరినైనా నేను మోసగించగలను. కాని నాగురుదేవులకడమాత్రం నా పప్పు ఉడికేదిలేదు' అని తాను ధరించిన పాములవాని వేషమును కొంతతీసి అక్కడున్న ఒకపీఠంపై

ఉంచి, శివదేవయ్యగారి పీఠంకడ ఇంకొకపీఠంమీద అధివసించి, 'శ్రీ రుద్రదేవ ప్రభువుకు వ్యతిరేకంగా అనేకవిషయాలలో, నాడులలో, మండలాలలో కుట్ర విజృంభిస్తోంది. శ్రీ గణపతి రుద్రదేవసార్వభౌములవారు కోరలూ, నఖాలూ లేని పంచనఖమైపోయారని వారికి ధీమా ఏర్పడింది. ధరణికోటవారు, విడుదప్రోలు వారు, కోన హైహయులు, కొలనిప్రభువులు, ఇందులూరివారు, కమ్మనాటివారు, నతనాటిసీమవారు, మల్యాలవారు, రేచర్ల వారందరూ, సారంగదేవులు, సాగివారు మనపక్షంవారు. ఆ విషయంలో మనకేమీ సందేహం అక్కరలేదండీ' అని మనవిచేశాడు.

శివ : సోమనాథభట్టాచార్యా ! మీరు నాకు తెలియని విషయాలు తెలియ జేయనక్కరలేదు. నాకు మీరు కనిపెట్టవలసిన ముఖ్యవిషయం ఒకటి ఉన్నది. ఈ కుట్రకు మహానాయకు డొకడున్నాడు. ఎన్నివిధాల ఎంతమంది ప్రయత్నం చేసినా ఆ నాయకుని ఉదంతం ఏమీ తెలియటంలేదు. ఆయన్ను మీరు కనిపెట్టండి. కాకతీయవంశ రక్షకులు కండి మీరు.

సోమ : నా యీ బొందెలో చైతన్యం ఉన్నంతవరకూ, నాకు శ్రీ సోమ నాథదేవులు ప్రసాదించిన మేధాశక్తి ప్రసరించగలిగినంతవరకూ ఆ మహాపురుషు డెవ్వరో కనిపెట్ట ప్రయత్నం చేస్తాను. ఆశీర్వదించండి. ఇంటికి వెళ్ళకుండానే ఇదే దేశంమీద పడతాను.

శివ : సత్వర విజయప్రాప్తిరస్తు. దీర్ఘాయురస్తు. ఆచార్యా ! వెంటనే వెళ్ళు. నీ దీక్షను కాకతీయసామ్రాజ్యము మరచిపోదు.

సోమనాథు డప్పుడు పాములవానివేషం పూర్తిగా సవరించుకొని, శివ దేవయ్య పాదాలకు నమస్కరించి వారిచే అనుజ్ఞాతుడై వెళ్ళిపోయెను.

కాకతీయసామ్రాజ్యానకి శివదేవయ్యకు పూర్వమందు శ్రీ చెన్నప్రగడ గాణపామాత్యుడు మంత్రి. చక్రవర్తికడనే ఉండి, చక్రవర్తి సర్వసేనలకు అధి పతులైన సర్వసైన్యాధ్యక్షులొక రుంటారు. గణపతి రుద్రదేవ సార్వభౌమునకు జాయపసేనాని ప్రస్తుతము సర్వసేనాధ్యక్షుడు. వారికిముందు హేమాద్రిరెడ్డి సర్వ సేనాధ్యక్షులు, వీరుకాక ఆర్థికవిషయాలను గమనించు ప్రధాని యొకడుండును. నాల్గవమంత్రి మహాతలవరి యొకడుండును. ప్రధానిగా పమ్మిపుర పాలకులైన దేవనప్రగడ ఉండెను. మహాతలవరిగా మేచయనాయకుడుండెను. ప్రోలరౌతు తంత్రపాలుడుగా ఉండెను.

మహామంత్రి రాజ్యాంగవ్యవహారములు చూచును ముఖ్యసేనాపతి రాజ ధానిలో ఉండు సామ్రాజ్యసేనల కధిపతి, ఆర్థికవేత్తయగు ప్రధాని సుంకములు, పన్నులు, అడవులు, గనులు, ఓడవర్తకము, వానివాని రాబడి, వివిధ విషయాల కైన వెచ్చము చూచుకొనుచుండును. తలవరి నగరరక్షణ, న్యాయవిచారణ మొదలైనవి చూచును. తంత్రపాలుడు మహామంత్రి ఆజ్ఞలను పరిపాలించు అధికారి.

ఆ యా మంత్రులకడ వివిధోద్యోగులు, వివిధోపశాఖలు పాలనముచేస్తూ ఉంటారు.

౫

రుద్రదేవమహాప్రభువు శ్రీగణపతిదేవసార్వభౌముని ప్రథమపుత్రిక అనిన్నీ, కుమారులు లేకపోవడంవల్ల కొమరితనే సార్వభౌముకు యువరాజుగా నిశ్చయించి పురుషవేషమువేసి వీరవిద్యలన్నీ నేర్పుతూ, చివరకు జాయపసేనాని కొమరిత ముమ్మడమ్మను ఇచ్చి వివాహం చేశారనీ, ఈ అఖండ ఆంధ్రసామ్రాజ్యానికి భావి చక్రవర్తిని శ్రీరుద్రదేవే అనిన్నీ, ఆమె శ్రీ రుద్రదేవ సార్వభౌములుగా చతుస్సముద్రముద్రిత భూమండలం ఏలుతూ వుంటారనీ, స్వస్తి. శ్రీశాలివాహనశక ౧౧౮౩ దుర్మతి సంవత్సర వైశాఖ బహుళ పంచమీ సోమవారంనాడు మహాసభలో శ్రీశ్రీశ్రీ మల్లికార్జునారాధ్య గురుమహాదేవుల అపరావతారమైన శివదేవయ్యదేశికుల వారు ప్రకటించారు.

సభఅంతా ఆనంద జయజయధ్వానాలు కావించారు.

సభలో మహాసేనాపతులు, సేనాపతులు, మంత్రులు సామంతులు, వివిధ సభాసభ్యులు, వర్తకులు పండితులు అందరూ కిటకిటలాడుతూ ఉన్నారు

ఇంతలో వేదాశీర్వాదదివ్యనాదాలు బయలుదేరాయి. శుభవాద్యాలు, సామ్రాజ్య భేరీభాంకారాలు వినిపిస్తూవున్నాయి. స్వయ భూదేవ, కేశవదేవాది దేవాలయాలలో గంటలు మారుమ్రోగుతున్నాయి. లాసికాబృంద వాచికాభినయ మధురస్వరాలు వినవస్తున్నాయి. వేదపనసలు పఠిస్తూ త్రయీపాఠులగు శ్రోత్రియులు సభాస్థలంలోకి వచ్చారు. వందిమాగధులు.

"బహుపరాక్, శ్రీశ్రీశ్రీ సమధిగతపంచమహాశబ్ద మహామండలేశ్వర, పరమమాహేశ్వర, అనుమకొండ పురవరాధీశ్వర, వరనారీసహోదర, లాడచోడ కటకచూఱకార మన్నియభేంటకార, విభవదేవేంద్ర, సత్యహరిశ్చంద్ర, శ్రీస్వయంభూదేవర దివ్యశ్రీపాదపద్మారాధక, పరవరవ్రతాపాశ్రిత, వితరణచణ, శరణాగత వజ్రపంజర, పరబలసాధక, ఉపమన్యుప్రముఖ భక్తజనానందకార, వైరిసంహరణ, చతుస్సముద్రవలయ దిక్పూరితకీర్తి, సప్తమచక్రవర్తి, ఆదిరాజ చారుచరిత, రాజరాజేశ్వర, సుస్థిర నిజరాజాన్వయచంద్ర, ప్రత్యక్ష ప్రమథమగణావతార, సుజనైకమిత్ర, కదనప్రచండ, చలమర్తిగండ, శ్రీమన్మహారాజాధిరాజ। రాజపరమేశ్వర। శ్రీకాకతీయ గణపతిరుద్రదేవసార్వభౌమా। జయ జయ। జయ జయ" అంటూ స్తోత్రపాఠం చేసిరి.

సభికులందరు ఒక్కసారిగాలేచి, పూర్ణకంఠాలతో జయజయధ్వానాలు చేసిరి. అప్పుడు డెబ్బదిరెండు సంవత్సరాల ఈడున్న శ్రీగణపతిచక్రవర్తి, అనేక శివ

మొగులు, జాయపసేనాని, మహాతలవరి తన్ను పరివేష్టించి వుండగా తెల్లని గడ్డము మీసాలతో వజ్రకిరీటంతో, బంగారుతొడిగి రత్నాలు పొదిగిన చేతికట్టు కుడిచేత అనుకొని, ఎడమచేయి జాయపనాయకమహాసేనాని భుజంమీద వుంచి నెమ్మదిగా నడుస్తూ, గరుత్మంతుని చూపులతో, గరుడనాసికతో భుజమువరకూ వ్రేలాడే చెవులకు మకరకుండలాలు ప్రకాశించుతూ వుండగా వేంచేసినారు.

అప్పుడా సార్వభౌముడు సాక్షాత్తూ హిమవత్పర్వతాకారుడై వుండెను. ఆ చక్రవర్తి తెల్లని నురుగువలె పుత్తుంగతరంగాలతో వుప్పొంగే సముద్రునిలా వుండెను.

వేదమంత్రాలు నింగిముట్టుతూవుండగా శ్రీ గణపతిదేవసార్వభౌములు సింహాసనం అధివసించారు. శ్రీశ్రీశ్రీ రుద్రదేవప్రభువులు యువరాజ సింహాసనం అధివసించినప్పటినుండీ, చక్రవర్తి సార్వభౌమసింహాసనం అధివసింపలేదు. ఈ రెండేళ్ళతర్వాత ఇప్పుడు సింహాసనం అధివసించి నిండోలగ్గమున్న గణపతి మహాప్రభువు సుధర్మలో దేవేంద్రునిలా వుండినవారాయెను.

అంతలో మళ్ళీ త్రయీపాఠాలు, తుమ్మెదఝుంకారంలా, మహానది పురవడిలా, సముద్రఘోషలా, మేఘగర్జనలా వినిపించినవి. భేరీభాంకార, నాగస్వర, శంఖ, కాహళ, ముఖవీణా, మృదంగాది శుభవాద్యాలు ఘోరుకొన్నవి.

ఆ సద్దున్నా అయినవెనుక "శ్రీ శ్రీ సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర, అన్మకొండపురవరేశ్వర, పరమమాహేశ్వర, పతిహితచరిత, వినయవిభూషణ, శ్రీ స్వయంభూదేవర దివ్యశ్రీపాదపద్మారాధక, మూఱురాయజగదాళ, మహామండలేశ్వర శ్రీ శ్రీ శ్రీ రుద్రదేవమహారాజా! జయ జయ!" అని వంది మాగధులు పాటలు పాడినారు.

ఇంతలో శ్రీ కుమారరుద్రదేవ మహారాజులవారు గంభీరంగా నడుస్తూ వచ్చినారు. సార్వభౌములుతప్ప, తక్కినవారందరు లేచి నిలుచుండిరి. శ్రీ రుద్రదేవప్రభువు తన సేనాపతులతో, మంత్రులతో వచ్చెను. ప్రభువునకు కుడవైపునవే శ్రీశ్రీ చాళుక్యవీరభద్రమహారాజు నడచి వచ్చినాడు.

యువరాజు సార్వభౌమసింహాసనంకడకు వచ్చి తండ్రికి మోకరించి నమస్కరించెను. సార్వభౌముడు చేతులు చాచి, రుద్రప్రభువును అర్ధసింహాసనము అధివసింపచేసెను.

అందరును యథోచితముగ ఆసీనులైరి. నాగమదేవి అనే నర్తకి మేళముతో వచ్చి శంభువిజయమును నాట్యముచేసినది. ఆ వెనుక సంగీతశాస్త్రనిధి అయిన కేతానామాత్యులు వీణపై రాగరగించు గాంధర్వవిద్య ప్రదర్శించినాడు. ఆ వెనుక శివతత్వసారమునుండి ఒక పరమమాహేశ్వరుడైన ఆరాధ్యబ్రాహ్మణ గురువు శివమాహాత్మ్యము సార్వభౌమునకు, సభ్యులకు పాడి వినిపించెను.

అప్పుడు శివదేవయ్యాదేశికులు ఈ ఆంధ్ర మహాసామ్రాజ్యంలోని సర్వ సామంతులకూ, బ్రాహ్మణోత్తములకు, సర్వప్రజలకు శ్రీ శ్రీ శ్రీ సార్వభౌములు తమ శ్రీముఖము ఈరీతిగా వినిపిస్తున్నారు. "శ్రీస్వయంభూదేవ దివ్యశ్రీ పాదార విందాలను పూజించి శ్రీ శివప్రసాదలబ్ధమైన ఈ సామ్రాజ్యము యావత్తూ తమస్థానాన ప్రతినిధిగా తమ పెద్దకుమార్తెయైన శ్రీ శ్రీ శ్రీ రుద్రదేవమహారాజులుం వారు పరిపాలిస్తారు. శ్రీ సార్వభౌములవారు తమ యావత్కాలమూ తపస్సుచేసుకో డానికి నిశ్చయించినారు. ఇది సార్వభౌముని పవిత్రేచ్ఛ. ఈ ఇచ్ఛను ధిక్కరించిన వారు భగవద్ద్రోహులు, రాజద్రోహులు, ధర్మద్రోహులు" అని గంభీరంగా ప్రక టించారు. వెంటనే మిన్నుముట్టే జయజయధ్వానాలు విరోధిరాజుల గుండె లవియ చేస్తూ సర్వ విశ్వమూ క్రమ్మినవి. విప్రాశీర్వాదాలు చెలగినవి. మహామంత్రి, మహా సైన్యాధ్యక్షులు, మహాసేనాపతులు, మహామండలేశ్వరులు, మండలేశ్వరులు, ప్రధానులు, రాజోద్యోగులు రాజప్రతినిధి శ్రీ కుమార రుద్రదేవ మహారాజులుం వారికి మహారాజప్రాభృతా లర్పించుట మొదలుపెట్టినారు.

ఆ సభ రెండవయామం పూర్తి కావస్తుండగా ముగిసినది. వందిమాగధులు కైవారాలు సేయ శ్రీ శ్రీ గణపతిరుద్రప్రభువు తననివాసం చేరినారు. తర్వాత రుద్రప్రభువులవారు తమ నగరికి పయనం చేసినారు.

౬

కాకతీయసార్వభౌము పరిపాలితమైన దేశాలన్నీ వీరశైవభక్తితో నిండి వున్నాయి. గురుమల్లికార్జున పండితారాధ్యులు ఋగ్వేద నియోగి బ్రాహ్మణ వంశంలో వుద్భవించారు. వారి తండ్రి భీమన, చాళుక్య భీమేశ్వర నగరంలో భీమేశ్వరస్వామివారి అర్చకుడై వుండేవారు. తల్లి గౌరాంబ. మల్లికార్జునారాధ్యుడు సర్వవిద్యాపారంగతుడు. ఆయన కోటిఫలి సోమారామక్షేత్రవాసి అయిన ఆరాధ్య దేవర అనే గురువుకడ వీరశైవదీక్ష పొంది దృఢవ్రతుడగు వీరశైవాచార్యుడై నాడు.

శైవమత రహస్యాలన్నీ సమన్వయించి, వానిని శివతత్వసార మనే గ్రంథంగా రచించినాడీ మల్లికార్జునుడు. దేశమంతటా వీరశైవమత ప్రచార మొనర్చెను.

ఆనాటికి బౌద్ధమత ప్రాబల్యం నశించిపోలేదు. వైష్ణవమతమూ పూర్తిగా వున్నది. జినమతము నశించిపోలేదు. మల్లికార్జునారాధ్యుని శిష్యుడైన పాలకురికి సోమనాథకవి ఆ పండితుని చరిత్రమూ, వారి శివతత్వసారమూ జానుతెనుగులో, అద్భుతమైన శైలిలో పండితారాధ్యచరిత్రము రచించెను. బసవపురాణమూ, ఈ గ్రంథమూ ద్విపదకావ్యాలుగా రచించినాడు. అనుభవసారము, చతుర్వేద సారసూక్తులు, సోమనాథభాష్యం, రుద్రభాష్యం, బసవరగడ, గంగోత్పత్తి రగడ,

సద్గురు రగడ, చెన్నమల్లు సీసములు, నమస్కారగద్యము, వృషాధిప శతకము మొదలైన గ్రంథాలెన్నో కూడా ఈ సోమనాథుడు రచించాడు.

వీరశైవులకు ఏమీ పరమత సహనములేదు. బ్రాహ్మణులను, వైష్ణవులను, బౌద్ధులను, జైనులను, చార్వాకులను వీళ్ళు కంఠోక్తిగా దూషిస్తూ, బాధిస్తూ, ఒక్కొక్కప్పుడు హతమారుస్తూ ఉండిరి.

కాని శ్రీ గణపతిరుద్రదేవమహాప్రభువులుగాని, శ్రీ రుద్రదేవప్రభువుగాని ఏమాత్రమూ ద్వేషంలేకుండా పరమతసహనం చూపుతూ ఉండిరి.

శ్రీ గణపతిదేవచక్రవర్తి మేనకోడలు బయ్యలమహాదేవి ధాన్యకటకంలో బుద్ధదేవునీ, అమరేశ్వరునీ సమంగా ఆరాధించేది. చెలికి గంగాధర మంత్రి బుద్ధుని విష్ణ్వవతారముగా తలచి హనుమకొండలో బుద్ధదేవాలయం నిర్మించాడు.

ఓరుగల్లునగరం నిర్మిస్తూ శ్రీ రుద్రదేవమహారాజు బుద్ధదేవుని ప్రతిష్ఠ చేశాడు. ఈ దేవాలయం వీరభద్రేశ్వరుని దేవాలయం ప్రక్కనే ఉన్నది.

అనుమకొండలో కొలనిపాకలో జినదేవాలయాలలో పూజలు విరివిగా సాగుతూ ఉండేది. గజదొంగ గన్నారెడ్డి తండ్రి బుద్ధారెడ్డి పేరు ఆయన తండ్రి బుద్ధదేవునియందున్న భక్తిచే పెట్టుకొన్నదే; రాముని భక్తిచే లకుమయ్య అని రెండవ కుమారునికి పేరు పెట్టుకొన్నాడు.

కాకతీయ సామ్రాజ్య ప్రారంభకాలంలో శ్రీ రామానుజాచార్యుడు వైష్ణవ విశిష్టాద్వైతవాదం తీసుకొని శ్రీభాష్యం రచించి లోకం అంతా ప్రచారం చేశాడు.

శ్రీ గణపతిరుద్రదేవుని కాలంలో వైష్ణవం కొద్ది ప్రాబల్యం మాత్రం కలిగి ఉండేది. అనుమకొండలో, ఓరుగల్లులో కేశవదేవాలయాలు రుద్రదేవుడు ప్రతిష్ఠించాడు. గోన బుద్ధారెడ్డి పెద్దకుమారునికి కన్నయ్య అని కృష్ణుని పేరూ, విఠలయ్య అని రెండవ కుమారునికీ పేర్లు పెట్టుకొన్నాడు.

ఓరుగల్లు చేరిన నెలదినాలకు అన్నాంబికయూ, కుప్పసానమ్మయూ శ్రీగన్నారెడ్డి కందూరుప్రభువైన కేశనాయకుని మహాయుద్ధంలో కూల్చి అఖండ విజయంసంపాదించినందుకు స్వయంభూదేవరకు, కేశవదేవరకు, మైలారదేవునకు బుద్ధదేవునకు, వీరభద్రదేవునకు, ఏకవీరాదేవికి, కాకతిదేవికి మొక్కులు చెల్లించ డానికి బయలు దేరారు.

బంగారు పల్లకీలు దిగి, రత్నాలుకూర్చిన శిబికలపై వీరిరువురూ స్వయంభూదేవుని గుడి చేరి, తూర్పు హంసగోపురద్వారందగ్గర దిగారు. ఆ దినం సోమవారం. ఆ ఉదయకాలంలో ఆ గుడిఅంతా భక్తులైన స్త్రీ పురుషులతో నిండి పోయి ఉన్నది.

మొదట సార్వభౌములపేర అర్చన జరిగింది. గురుమల్లికార్జున పండితారాధ్య తనయుడు శివారాధ్యులవారు స్వయంభూదేవర కర్చన జరుపుతున్నారు. శివ నామమంత్ర పఠనంతో, గీతాలాపాలతో ఆ దేవాలయం అంతా మారుమ్రోగుతున్నది.

ఇంతలో మల్యాలప్రభువుల అర్చన వచ్చింది. వేయి నారికేళాల అభిషేకం జరిగింది. ఆరాధ్యులకు, వీరశైవులకు, మాహేశ్వరార్చన జరిగింది. బ్రాహ్మణులకు అన్నదానం జరిగింది. కుప్పసానమ్మ భూదానాదుల శాసనాలు వ్రాయించి మహా పండితులకు ఇచ్చింది. అన్నాంబిక పరవశురాలయి, సంతత శివనామోచ్చారణ పులకితయై గన్నప్రభునకు విజయాన్ని సమకూర్చినందుకు భగవంతునకు నిలువు దోపిడు లిచ్చింది. వివిధ దేవాలయాలలో పూజలన్నీ పరిసమాప్తి చేసికొని వారు తమ నగరు చేరుకొనేసరికి సాయంకాలం మూడవయామంకూడా దాటింది. అప్పుడు వారు భోజనాలు నిర్వర్తించి, అన్నాంబికాదేవి మందిరం చేరినారు.

అక్కడకు గన్నారెడ్డికడనుండి వచ్చిన వార్తాహరుని వారు రప్పించుకొనిరి. రేచెర్ల ప్రభువంశంలోని ఆ పడుచువాడు కుప్పసానమ్మతో 'మహారాణీ! కందూరి కేశినాయకుడు వర్ధమానపురంవారికి సామంతుడు. గోన గన్నారెడ్డి ప్రభువు దాయాదుడు కాదని అతడు వాదించాడు. వెనుక వరదారెడ్డిని మేము పట్టుకొని పీటలమీది పెళ్ళిని తప్పించినప్పుడు తాను గన్నారెడ్డిని పట్టుకుంటానని ప్రగల్భాలాడిన మహావీరుడు. ఈ వార్తలన్నీ మా నాయకునకు అందినా అప్పుడు చిరునవ్వునవ్వి ఊరుకొన్నారు. కొద్దిదినాలక్రిందట చక్రవర్తిగారి సుంకాలధనం, ఇతరధనాలు, భరుకచ్ఛాన్నుండివచ్చే కోట్లు పణాలు విలువచేసే వస్తువులు, అన్నీ మా రేచెర్లవారితో ఒకవీరుడు, ప్రసాదాదిత్యనాయక బాదియ్యగారి అన్నకుమారుడు కతిపయ సైనికులు వెంటరా పట్టించుకు వస్తూ ఉండెను.

ఆ సమయంలో ఈ కందూరి కేశినాయుడు సగర్వంతో 'అసలు రాజ్యం చేయడం, దానికి ఈ విలువగల వస్తువులు వెళ్ళడం అన్యాయం. ఇంతమంది మహావీరులు ఉంటూఉంటే గణపతిదేవప్రభువు ఆడదానికి రాజ్యం అప్పగిస్తాడా? ప్రభువులంతా ఆడవాళ్ళయ్యారనుకున్నాడా?' అంటూ పెద్ద సైన్యంతోవచ్చి, ఆ రేచర్ల ప్రభువును చంపి, చక్రవర్తి సైన్యాన్ని నాశనంచేసి, ఆ సంపద యావత్తు దోచుకొని కందూరినగరం చేరాడు.

కుప్పసానమ్మ : ఎంత అన్యాయం! ఎంత దౌర్జన్యం!

అన్నాంబిక : శ్రీ రుద్రదేవప్రభువులను ఆలా ఈసడించి మాట్లాడడమే?

రేచెర్ల చినదామానాయుడు : ఈ వార్త మాకు మరునాడే తెలిసింది మహారాణీ!

కుప్పసానమ్మ : మా తమ్ముడికి వెఱ్ఱికోపం వచ్చిఉండాలి !

రేచెర్ల : అఁ ! గన్నప్రభువు పక పక నవ్వాడు. ఆయన పకపక నవ్వితే మేమంతా ఉప్పొంగిపోతాము. మా విరోధులంతా గజగజలాడిపోతారు.

కుప్ప : ఎవరయ్యా మీ విరోధులు ?

రేచెర్ల : ధర్మద్రోహులంతా మా విరోధులండీ.

అన్నాం : అప్పుడేమైంది మహారాణీ ?

రేచెర్ల : వెంటనే తనదగ్గరఉన్న నగం దండును సిద్ధంకమ్మని ఆజ్ఞ ఇచ్చారా ప్రభువు. మేమంతా సిద్ధం అయ్యాము. 'దొంగలా కోటదూరి దాకొన్న ఆ హీనుణ్ణి ఆ కోటలోనే మనం జుట్టుపట్టి లాగి ఈవలవైచి హతమార్చాలి' అని మా ఆజ్ఞ.

'ఆ రాత్రి ప్రయాణం. మాసైన్యం ఎనిమిదివేలు. అందరూ సింహాలు. ఇంచుకంతైనా అలికిడిలేకుండా మరునాడు తెల్లవారేసరికి ఎక్కడివారక్కడ మాయమైపోయారు. చిన్నచిన్న యాత్రికుల జట్టులలా ప్రయాణం చేయాలని నాయకుని ఆజ్ఞ. ఆ రాత్రికి కందూరు చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలన్నిటిలో మావారు అణిగి ఉన్నారు. రాత్రి ఒకజాము గడిచేసరికి కందూరు కోటచుట్టూ మాసైన్యం చేరింది.'

## 8

"చేసినతప్పు ఎలాగాచేశాడు, తనకు భయమేమిటి' అని కేశినాయకప్రభువు అనుకొన్నాడు. కేశినాయక ప్రభువు చాలాకాలంనుంచి కోట బాగుచేయించుకొని బగ్గలపై మేటివిలుకాండ్లను, అప్రమత్తులైన ఆగ్నేయశస్త్రాయుధులను, శిలాయుధ ప్రయోగ నిపుణులను కాపలా పెట్టాడు. నగరికోటచుట్టూ ఉన్న అగడ్తలోనూ పూర్తిగా జలం నింపి, భయంకరమైన మొసళ్ళను ఆ అగడ్తలలో వదిలాడు. కోట ద్వారాలదగ్గర బురుజులలోను మెరికలలాంటి శూరుల్ని హెచ్చరికమై నిలిపిఉంచాడు.

"దెబ్బతిని పడిపోయిన వారిస్థానంలో వెంటనే నిలబడేటందుకు, అలసట పొందినవారిస్థానే వచ్చేటందుకు శూరులు సిద్ధంగా ఉన్నారు. ఆజ్ఞ ఇచ్చిన మరునిమేషంలో తలుపులు తెఱచుకొని కోటబయటఉన్న శత్రువులను ఖండఖండాలుగా నరికివేయడానికి, కనకసత్రొక్కివేయడానికి, తరిమితరిమి నేలమట్టం చేయడానికి ఏనుగులు, అశ్వికులు, రథికులు నగరగోపురద్వారాలకడ, కోటగుమ్మాలకడ సిద్ధంగా ఉన్నారు. వీధి వీధి, ఇల్లు ఇల్లూ కోటలైపోయాయి.

"శత్రువుల ఒత్తిడి ఎక్కువైతే వెనుకనుంచి పోయి ఇతరప్రదేశాలు ఆక్రమించడానికి తగువిధానాలు అమరింపబడినాయి. అవసరమైతే ఇళ్ళు, వీధులు తగలబెట్టి శత్రువుల అరికట్టడానికి కట్టుదిట్టాలు జరిగాయి.

"ఈ సర్వసన్నాహం గోన గన్నయ్యకు వేగువచ్చింది. ఇంత జాగ్రత్తపడ్డ కేశినాయుడు కలలో కల, ఆలోచనలో ఆలోచనవంటి గన్నారెడ్డిని ఎల్లా నలువరింపగలడు ?

"కందూరులో గోన బుద్ధారెడ్డిసాహిణి పరాక్రమం, ఔదార్యం, ప్రేమ రుచి చూచినవారు వేలకువేలు ఉన్నారు. బుద్ధారెడ్డి మహారాజు పేరు చెప్పి దీపాలు పెట్టుకొని మొక్కలిడే తల్లులు ఆ నగరమంతా నిండి ఉన్నారు. వారందరికీ శ్రీ సర్వభూమండలాఖండులైన గణపతిదేవ చక్రవర్తిపేరు విన్నంతనే భక్తి ఉట్టిపడుతుంది. వారేకదా కళ్యాణిరాజు గర్వం అణచి, భల్లాణుల పొగరు నాశనంచేసి, యాదవుల మదం నీటగలిపి దేశంలో శాంతం నెలకొల్పిన ప్రభువు। దేశంలో యుద్ధంవస్తే వానలు భయపడి పారిపోతాయి; మనుష్యుల ఆగ్రహాల మంటలకు నదులూ, చెరువులూ ఎండిపోతాయి. కరువు 'అమ్మతల్లిలా' విజృంభించి సంహార తాండవం చేస్తుంది.

"అపర రామచంద్రావతారమైన సప్తమచక్రవర్తి గణపతిదేవ ప్రభువులు బ్రతికిఉండగానే కేశినాయక ప్రభువునకు చెలగాటమా ? అని ప్రజలు వణికిపోయారు.

"ప్రజలందరూ బుద్ధారెడ్డి మహారాజు కొమారుడు, వీరవిక్రముడు గన్నారెడ్డి ప్రభువు అడవులుపట్టి పోవడం సహించలేకపోయారు. అదీగాక గన్నారెడ్డి లోకమోహనమైన వీరవిక్రమాలు వింటున్నారు. అతని తమ్ముడు విఠలధరణీశుడు అపర భీముడు. ఈ భీమార్జునుల జట్టులో శరభాలలాంటి, గండభేరుండాలలాంటి మహావీరులు, యువకులు చేరారు.

"కందూరు నగరవాసులైనబాలురే గన్నారెడ్డి జట్టులో వేయిమందిఉన్నారు. గన్నారెడ్డి సైన్యంలో శిక్షణ పొందినవాడు పులిమీసాల పట్టి ఆడించగలడు. ఈ వేయిమంది బాలురు కందూరుపురంలో అనేక వేషాలతో చేరారు. కేశినాయక ప్రభువులు చేసిన దారుణచర్య వారి వారి చుట్టాలకు చెప్పారు. ఆ బంధుగులలో వీరులు కేశినాయని దురంతానికి ఉగ్రులైపోయారు."

ఇంతవరకూ కథచెప్పి ఆ చినదామానాయకుడు పిల్లలమఱ్ఱిప్రభువు రెండవ కుమారుడు పకపక నవ్వి 'మహారాణీ! మా నాయకుని ఎత్తులు ఇంతవరకు ఎవ్వరూ పన్నలేదు. ఇక ముందున్నూ ఎవ్వరూ పన్నలేరు. స్వజన నష్టం కాకూడదు; విరోధులు దాసోహం కావాలి. అది గన్నయ్య మహారాజుకు మూలధర్మం' అన్నాడు.

కుప్పసానమ్మ: మా తమ్ములను గజదొంగలంటూ ఉంటే నాకు హృదయకంటకంగా ఉంటుంది.

అన్నాంబిక: మహారాణీ! నాకు శ్రీగన్నారెడ్డి దొంగ అనే భావం ఎప్పుడూ కలగలేదు.

కుప్పసానమ్మ: అయితే చక్రవర్తిని దుర్భాషలాడి అత డెందుకు ఓరుగల్లు విడిచిపోవాలి రాజకుమారీ?

అన్నాంబిక: అలా అని ఏ ఏ రాజ్యాలు వారు దోచుకున్నారో మీరు శాసించగలరా మహారాణీ?

చినదామానాయుడు ఆ మందిరంలో దూరంగా సిడలు దట్టంగా ఆవరించి ఉన్నచోట కూర్చుండి ఉన్న దివ్యసుందరియైన ఈ బాలిక ఎవరు? ఈమెకు గన్నారెడ్డిప్రభువంటే అంతనమ్మక మేమిటో? 'అన్నాంబికాదేవి క్షేమంకూడా విచారించిరా దామానాయుడూ!' అని గన్నారెడ్డిప్రభువు తనకు ఆజ్ఞ ఇచ్చాడు. 'రాకుమారీ' అని మహారాణి సంబోధిస్తున్నది. అవ్యక్తమైన దివ్యరూపంతో ఠీవిగా, పవిత్రభంగిమలో అధివసించిఉన్న ఈ బాలిక తమ నాయకుని జీవితనాటకంలో ముఖ్యపాత్ర వహించబోతున్నదని మనసులో అనుకొన్నాడు.

కుప్పసానమ్మ: దామానాయకప్రభూ! ఆతర్వాత ఏమయింది?

దామా: మూడుదినాలు తన సైన్యానికి కోటపై తలపడే ఒక నూతన విధానం బోధించారు మా నాయకులు. ఈలోగా అంచెలమీద మా రెండవ సైన్యంతో ఒక రహస్యప్రదేశంలో ఉన్న విరలధరణీశునికి సైన్యం యావత్తూ నడుపుకొని రావలసిందని వేగు పంపించారు. ముందుగా తమ తమ్ముడును మేఘాలమీద వచ్చి తన్ను కలుసుకోవలసిందనిన్నీ వార్తపంపారు.

"ప్రసిద్ధిచెందిన మొసలిపేటకాళ్ళు మొసళ్ళవలెనే రాత్రిళ్ళు నీళ్ళలోకి జారి మొసళ్ళను వేటాడి చిత్రవధచేశారు. ఆ పేటలో ఆరుగురి ప్రాణాలు పోయాయి."

అన్నాంబిక 'అమ్మా!' అని చేతులతో కళ్ళుమూసుకొని గజగజ వణికిపోయింది. కుప్పసానమ్మ లేచి ఆమెదగ్గరకుపోయి మీద చేయివైచి 'రాకుమారీ! యుద్ధాలలో ఈలాటి ఘట్టాలు అనేకం వస్తాయి. అది దురదృష్టం. రాజ్యాలు పరిపాలించేవారికి ఈలాంటివార్తలు వినడం తప్పదు' అని అనునయించింది.

చినదామా: మహారాణీ! ఆ కందకంలో మొసళ్ళన్నీ నాశనం అయ్యాయి. మా సైన్యం అంతా సిద్ధంఅయింది. ఒకరాత్రి ఉద్దండమైన కేకలతో ముట్టడి ప్రారంభం అయింది. కోటమీదనుండి బాణాలు అగ్నివర్షం మామీద వర్షిస్తున్నవి. కాని మా తలమీద అభేద్యమైన ఉక్కుఫలకవితానం ఏర్పడింది. ఎద్లులేని రెండెడ్లబళ్ళక్రిందనుండి మావాళ్ళు అగ్ని

బాణాలు, గంధక బాణాలు పరపుతూ ఉన్నారు. గంధకం, సూరేకారం కలిపిన అగ్నిబాణాలు నగరకుడ్యాలపై పది పెద్దమంటలతో మండుచుండెను. ఆ వెలుగులో వాడిగా బాణాలజడులు మహావేగంతో వెళ్ళి గోడలమీది వీరుల ప్రాణాలు కొంటున్నాయి. కందకాలలోనుండి అల్లరిచేస్తూ, ఈదులాడుతూ వీరులు శిలాపాతానికి అందక, అగ్నిపాతానికి అందక ప్రళయకాలంనాటి గడబిడ చేస్తుండిరి. దూరాననుండి మహాబాణయంత్రాలు వదలిన రజ్జునిశ్రేణులు వచ్చి లగ్గలకు తగిలి అక్కడ బిగిసి క్రిందికి వ్రేలాడినాయి. ఒకవైపు నిశ్రేణి ఇట్లు తగలగానే, వీరులు ఇరవరా ఫలకాలు తలలకు బిగించుకొని చేతులతో కోతులలా కోటగోడ ఎగబ్రాకసాగారు. అగ్నిబాణాలు నిశ్రేణులను కోయడానికి వచ్చిన వీరులను హతమార్తున్నాయి. కొన్ని నిశ్రేణులు కోయబడి వీరులతో సహా నీటిలో పడితే పుట్టెలతో సిద్ధంగా నీటిలో తేలియాడుతూ ఉన్నవాడూ, నీటిలో ఈదుతున్నవారూ ఆ వీరుల్ని రక్షిస్తున్నారు.

"ఇంతలో నగరంలోనుండి 'గన్నారెడ్డి! గన్నారెడ్డి!' అని కేకలు వేస్తూ రెండువేలమంది ఉరుకువీరులు నగరకుడ్యాలపై రెండుమూడుచోట్ల పడ్డారు. ఆ ప్రదేశాలలో లోకం పగిలినట్లు యుద్ధఘోష, సంకుల సమరమూ ఉద్భవిల్లినవి. ఆ బీభత్సములో కోటగోడలమీదకు వానరమూకలా గన్నారెడ్డి సైన్యం ఎగబ్రాకింది.

'గన్నారెడ్డి లోనికి వచ్చాడు' అని గగ్గోలు పుట్టగానే కందూరు సైనికులకు ప్రాణాలమీద ఆశపోయి పారిపోయినారు. తమకు తెలియకుండానే వారి తలలు రాలిపోతున్నవి. ఈ గడబిడలో కోటనుండి యుద్ధం నడపడానికి వచ్చిన కేశినాయకుడు ఒక కోటగుమ్మం తెరిపించి ఏనుగుల్ని, రథాల్ని, అశ్వికుల్ని కోట బయటఉన్న గన్నయ్య సైన్యంమీదకు నడిపాడు. ఇంతలో విఠలధరణీశుడు అన్నగారి ఉపదేశాన్ని అనుసరించి ఆ బయలుపడిన సైన్యం ఎదుట పలాయన నాటక మాడి కేశినాయకసైన్యాలను దూరంగా తీసుకుపోయి, అక్కడ తనసర్వ సైన్యంతో ఆ సైన్యాన్ని చుట్టుముట్టి నాశనంచేయడం ప్రారంభించాడు.

"ఆసంగతి తెలిసికొన్నవెంటనే కేశినాయకుడు తన సైన్యం వదలి నగరం కోటలోనికి పారిపోబోయాడు. అతడలా వెళ్తూంటే—

'కేశినాయకా! నిలు! నిలు!' అంటూ గన్నారెడ్డి అక్కడకు చకాచకా వచ్చాడు."

౮

"కేశినాయక ప్రభువు గన్నారెడ్డిమాట వినగానే నిలువునా నీరై పోయాడు. అతనికి ధైర్యం నీరై ప్రవహించింది. పదిక్షణాలు మాటరాక

తెల్లబోయిచూచినాడు. తన చుట్టుప్రక్కల పారచూచినాడు. ఎక్కడ చూచినా గన్నారెడ్డి సైన్యాలే అతని కంటికి కనపడ్డాయి.

'ఓరి గజదొంగా! రాక్షసుడా! నీకు దొరికాను, ఇకనేమి? చంపు' అని కేశినాయకుడు—ఏడుపువస్తూంటే ఆపుకొంటూ మాట్లాడేబిడ్డలా—కేకవేశాడు. గన్నారెడ్డిప్రభువు పకపకనవ్వి ఓయీ దుర్మార్గుడా! నేను గజదొంగనా? చక్రవర్తి ధనం ఓరుగల్లు వెడుతూంటే నేనా దోచింది? నేనా ఆ చిన్నదళాన్ని పెద్ద సైన్యంతో వెళ్ళి నిర్దాక్షిణ్యంగా ఒక్క మనిషన్నా మిగలకుండా నరికిపారవేసింది? ఏమిరా పిరికిపందా! కోట దుర్భేద్యం చేసుకొని, గోడల వెనుక దాక్కొని రాజప్రతినిధి శ్రీరుద్రదేవ మహారాజును వినరాని మాటలనే గజదొంగను నేనటరా? మాట్లాడవేం? నోరు వాతంకమ్మి పడిపోయిందా? ఓరి నీచుడా, నేను ద్వంద్వయుద్ధానికి రమ్మనడానికి కూడా నువ్వు తగవు. నీ కుట్రలన్నీ నాకు తెలిశాయి. నాకు రాజ్యం లేదని విచారంలేదు. కాని లోకంలో నీబోటి తుచ్ఛులు, స్వలాభపరాయణులైన పురుగులు, నిర్మల నీలాకాశంలా ఉన్నదేశాన్ని మహాప్రళయ ఝంఝాక్షుభితం చేస్తారు! పో! నీకోటలోనికిపో! ఇక ధర్మవిజయం చూడు. నీ కోటలో నిన్ను నా కున్న ఈ కొద్దిసైన్యంతోనే మట్టం కావించి లోకానికి నీతి చాటిస్తాను' అని నవ్వుతూనే చెప్పినారు మహారాణీ!"

కుప్పసానమ్మ : పసిపాపలను ఉపలాలించే మా తమ్ముల చిరునవ్వు నే నెరుగనా?

చినదామా : మహారాణీ! గన్నారెడ్డిమహారాజుల అపారకరుణ వారితో రెండుదినాలు మెలిగినవారికి తెలుస్తుంది. తనసైన్యంలో చెంచులూ, కురుమలూ, కడజాతివారినికూడా దయామయుడైన మా ప్రభువు ప్రేమతో ఆదరిస్తారు. అంత చిన్నవారైనా ఆ ప్రభువు మాకు తల్లీ, తండ్రీకూడా మహారాణీ!

రేచర్ల చినదామానాయని మాటలు వింటోంటే అన్నాంబిక హృదయంలో ఆనందం ఉప్పొంగిపోయింది. ఆమె కన్నులవెంట ఆనందాశ్రువులు అమృతబిందువులై ప్రవహించినాయి.

తన ప్రభువు, తన నాయకుడు, తన ఆత్మేశ్వరుడు భగవదంశసంభూతుడు. ఆ ప్రభువుకు తాను సేవచేస్తూ వేయిజన్మలు గడిపినా తనకు తృప్తితీరదు. ఈ మహావీరుడే తనకు రాజాధిరాజు, భగవంతుడు.

అర్ధనిమీలితాలైన ఆ బాలిక విశాలనయనాలలోనుండి స్రవించు ఆనందాశ్రువుల గమనించి చినదామానాయని కన్నులలోనే నీళ్ళు తిరిగినవి. ఆ అశ్రువులను కంటితోనే మ్రింగి వెంటనే తన కథనము సాగించినాడు.

"మహారాణీ! కేశనాయకప్రభువు తలవాల్చికొని కోటలోనికి వెళ్ళిపోయినాడు. రెండుమూడురోజులు మేమూ వారూ చల్లగా ఊరకొంటిమి. ఇంతలో

వర్ధమానపురంనుంచి ఒకలక్షసైన్యంతో గోన లకుమయారెడ్డిప్రభువు స్వయంగా కేశినాయని సహాయానికి వస్తున్నారని విశలధరణీశునికి వేగువచ్చింది. ఆయన అన్నగారితో ఆలోచించినారు ఆ వేగువచ్చిన మరునిమేషంలో గన్నయ్య ప్రభువు 'కోటమీదకు ఉరుకుతున్నా' నని కేశనాయకునికి వార్త పంపి, ఇచ్చిన గడువు దాటిన మరునిమేషంలో కోట పిడుగు లొక్కసారి విరుచుకు పడినట్లు కోటమీదకు ఉరికిరి. ఒక్కసింహద్వారంపై ఆయన పెట్టిన ఒత్తిడి మహాపర్వత పక్షాలను ఛేదించే వజ్రపాత భయంకరమై మూడు గడియలలో ద్వారమును ముక్కలు చేసింది. తక్కిన ద్వారాలకడ ఒత్తిడి నటింపబడింది. గోడలపైకి ఎవ్వరూ వెళ్ళలేదు. కోటముఖద్వారం వెనుకకు కొన్నివేల అగ్నిబాణాల వర్షం కురిసినవి. బురుజులనుంచి, గోపురగృహాలనుండి, అగ్గలనుంచి శత్రువుల సంతత ధారగా వర్షించే ఆగ్నేయాది శస్త్రాలను లెక్కచేయక గుమ్మాన్ని కూల్చివేసినారు.

"మహారాణీ! పైనుండి కరగించిన ఇనుము, సీసము, కుతకుతలాడే నీళ్ళు పోశారు. మా వాళ్ళు కొందరు నాశనమయ్యారు. కాని మేము మోసుకు వచ్చిన కంచనోలు శిలాఫలకవితానాలు మాకు గోవర్ధనపర్వతాలైనవి. ఈ ఉపాయము గన్నారెడ్డి ప్రభువుదే.

"పైనున్న విరోధుల్ని చీల్చిచెండాడే నిశితశరపాతము, గంధకాస్త్రపాతం ఊపిరాడకుండా మా వాళ్ళు కోటగుమ్మాలకడ లేవనెత్తిన ఉన్నతమైన పందిళ్ళ మీదనుండి కురిపిస్తున్నారు.

"మూడుగడియలలో మా ఏనుగుల తాకుడువల్ల, మా యంత్రములతాకుడువల్ల కందూరు దుర్గద్వారక వాటాలు రెండూ ఫెళ్ళున వెనక్కు విరిగి పడిపోయాయి. నిండివున్న మహాతటాకానికి గట్టుతెగితే వచ్చే ప్రవాహ ప్రపాతంలా మావాళ్ళు లోనికి చొచ్చుకుపోయారు. సంకులసమరంలో కొన్ని విచిత్రవిధానాలు గన్నయ్యమహారాజు మాకు నేర్పారు. సాంకేతికాలతో మాకు ఎదిరిని తెలుసుకోవడము, మా వారిని తెలుసుకోవడము అతిసులభం. మావాళ్ళెప్పుడూ ముగ్గురు, అయిదుగురు, ఆగ్గురు, ఎనమండుగురు ఉంటారు. అంతకన్న పెద్దజట్టు ఉండకూడదు. ఈ జట్లు విడిపోరు.

"ఒక ద్వారం పడిపోగానే తక్కిన ద్వారాలు లోనికి వెళ్ళినవారే తెరిచారు. రెండు ఘటికలలో యుద్ధం పూర్తి అయినది. రాచనగరిలో మాత్రం యుద్ధం చెలరేగుతున్నది. గన్నారెడ్డిప్రభువు, విశలప్రభువు గండరగండులై పిసుంతో నగరిని ఛేదించి లోనికి ఉరికారు. ఆ దినాన మా గన్నారెడ్డిప్రభువు ఎవ్వరూ తేరి చూడలేకపోయారు. సింహమై, శరభమై, పాశుపతాస్త్రమై శత్రువులను వేలకువేలు పలాయితులను చేయుటే కాని ఏపది పదిహేనుమందినో తప్ప సంహరించలేదు.

"ఆయన కా కోపంతీరి, సాయంకాలపు సూర్యబింబంలా శాంతమూర్తి అయ్యేసరికి ఆయన ఎడమపాదం కందూరి కేశనాయకుని హృదయముమీద ఉన్నది. నాయని దేహం రెండుఖండాలుగా చీలిఉన్నది."

కుప్పసానమ్మ, అన్నాంబికా ఒక్కసారిగా కన్నులు మూసుకున్నారు.

"మహారాణీ! యుద్ధసమయంలో ఉత్తమమనుష్యుడు రుద్రమూర్తి అవుతాడు. నీచుడు పిశాచి అవుతాడు. గన్నారెడ్డిప్రభువు ప్రళయకాల రుద్రుడు, చక్రధర విష్ణువు.

"ఆయన వెంటనే కేశినాయకుని శవాన్ని గౌరవంగా, అతని కుటుంబానికి అప్పగించి, రాత్రి ప్రథమయామ మధ్యమందు తన సర్వసైన్యముతో మాయమయ్యాడు. ఈలోననే చక్రవర్తిసొమ్ము కేశినాయకుడు దోచిన ధనము చక్రవర్తి కటకు కొన్ని దళాలు తీసికొనిపోయినవి.

చినధామానాయుడు కథ ముగించగానే అన్నాంబికా రాకుమారి లోనికి తుఱ్ఱున వెడలిపోయి చెలికత్తెనొకదానిని పిలిచి, వెలపొడుగు వస్త్రాదికములు, కొన్ని వజ్రములు దామానాయనికి 'ఒక చెల్లెలు అర్పించిన' వని బంగారు పళ్ళెరాన పెట్టి పంపినది.

మల్యాలనగరిలో మహోత్సవములు జరిగినవి. సేవకబృందానికి ఎన్నియో బహుమతులీయబడినవి, పేదలకు అన్నవస్త్రదానములు చేయబడినవి.

ఆ దినమందే శ్రీరుద్రదేవమహాప్రభున కీవార్త తెలిసి వారాశ్చర్యమందినారు. గజదొంగ గోన గన్నారెడ్డి 'కందూరి కేశినాయక తలగొట్టుగొంగ' అయినాడా! అనుకొన్నారు.

కందూరు విడిచి గోన గన్నారెడ్డి మాయమైన మరుసటి ఉదయానికి గోన లకుమయారెడ్డి లక్షసైన్యంతో వచ్చినాడనిన్నీ, తన అనుగుణ్యుడైన కేశినాయకుడు గన్నయ్యచే వధింపబడినాడని తెలిసి, ఆ మహాప్రభువు ప్రళయఝంఝామారుతానికి పణకిన మహావృక్షంలా వణకి, కోటలో పదివేలసైన్యం కాపుంచి గన్నరాక్షసుని పట్టుకొనడానికి వెంటనే తక్కిన తొంబదివేల మహాసైన్యంతో బయలుదేరాడనిన్నీ శ్రీశివదేవయ్య మంత్రికి వేగువచ్చింది.

లకుమయ్య శ్రీ శ్రీ రుద్రదేవ ప్రభువునకు వ్యతిరేకించదలచిన రాజద్రోహులలో ఒకడని శ్రీ శివదేవయ్యదేశికులకు పూర్తిగా తెలుసును.

'దూరదృష్టిలేని మూర్ఖులు తాము పన్నిన జాలంలో తామే పడి నాశనం అయిపోతారు. ఆ గజదొంగపైకి పోయి లకుమయ్య నాశనమైపోతాడు. ఈవిచిత్ర యుద్ధము గమనింపవలసినదే! గన్నయ్య తన పినతండ్రిని నాశనంచేయ ఇష్టపడునా? ఇష్టమున్నా నాశనం చేయగలడా? ఎంత తీసినా లకుమయ్య గోన వంశారణ్య వృద్ధసింహమే. ఈ రెండు సింహాలలో ఏది విజయమందగలదో!

అవిశివదేవయ్య ఆలోచించి జేగంట ప్రయోగించెను. ఆ పిలుపునకు వచ్చిన బ్రాహ్మణుని చెవిలో ఏదియో తెల్పెను.

౯

ఓరుగల్లు మహానగరమునుంచి మహావేగంతో ఒక అశ్వికుడు బయలుదేరినాడు. దిక్కులు తెల్లతెలవారుతుండగానే ఆ అశ్వికుడు మహామంత్రి ఆజ్ఞాముద్రిక చూపిస్తూ కోటద్వారమూ, నగరద్వారమూ దాటి మహావేగంగా ప్రయాణంచేస్తున్నాడు. ఆ మేలుజాతి అశ్వము పారశీకదేశమునుంచి వచ్చింది. హయహృదయము తెలిసి, తన్ను ప్రేమించేవానికి మాత్రమే మాటవింటు దా అశ్వము. తన ధర్మం నెరవేర్చటంలో సూర్యాశ్వాలే దానికి దీటు. ప్రతిఅశ్వానికి పేరు ఉంటుంది. కాని ఆ జాతి అశ్వాలన్నిటికీ వ్యక్తిత్వం ఉంటుంది.

చక్రవర్తి అశ్వశాలలో ఈ ఉత్తమాజానేయాలు మూడువేలున్నాయి. దాని రౌతు లందరు అశ్వహృదయం ఎరిగినవారే. వారికి ఆ అశ్వాలు తమ బిడ్డలకన్న ఎక్కువ. ఆ అశ్వాలను ఉత్తములైన అతిథులను ఉపచరించినట్లుగా సూతులు, రౌతులు పోషిస్తారు.

'వాయుసుత' అనే ఆ గుఱ్ఱము ఒకసారి సకిలించి గాలిపీల్చి తలఎత్తి తూర్పుదిక్కు గమనించి, ముక్కుపుటాలు విస్ఫారితంచేసి, ఖురాలతో నేలను ద్రవ్వుతూ నిలుచున్నది. ఒక నిమేషంలో కోటద్వారం, రెండవ నిమేషంలో నగరద్వారము దాటింది. మహామంత్రి ఆజ్ఞను చూపించుటే తడవు.

మహావేగంతో వెళ్ళే ఆ తురంగము చిన్నచిన్న గ్రామాలనేకం దాటింది. జాము ప్రొద్దెక్కేసరికి ఆ రౌతు రుద్రవరగ్రామం చేరాడు. ఆ గ్రామం బుద్ధపుర, వర్ధమానపురాది నగరాలకు పోయేదారిలో ఉన్నది. ఓరుగల్లు నగరానికా గ్రామానికి ఇరవై అయిదు గవ్యూతుల దూరం ఉన్నది. రుద్రవర గ్రామంలో సార్వభౌముల అశ్వశాల ఒకటి ఉన్నది. అది ఒక చిన్న కోటవలె ఉంటుంది. ఆ కోటలో ఎప్పుడూ పది అశ్వాలుంటవి. సార్వభౌమునివార్తలు దేశం అంతా పంపడానికీ, దేశవార్తలు సార్వభౌమునికి అందజేయడానికి అటువంటి అశ్వశాలలు దేశంలో పదిపదిహేను, ఇరవై గవ్యూతుల దూరంలో అక్కడక్కడ ఏర్పాటుచేసినారు. ఈ యాశ్విక స్థానాలలో అశ్వికులు ఇతర విధు లేమీ నిర్వర్తించ నవసరములేదు. ఈ తురంగాలను యుద్ధాదులకు ఉపయోగించరు.

మన అశ్వికుడు రుద్రవరం చేరి మహామంత్రి తన కిచ్చిన కమ్మఉన్న చిన్న మంజూషను ఆ శాలాధికారి కిచ్చెను. అతడు వెంటనే సిద్ధముగనున్న వేరొకరౌతు కది ఇచ్చి, గమ్యస్థానమును తెలియజేసెను. ఆ రౌతు నిర్దిష్ట మార్గాన్ని వెడలిపోయినాడు. ఈ రీతిగా అంచెలుగా ఆ కమ్మ ప్రయాణిస్తున్నది.

ఈ కమ్మను గణకునిచే తాటియాకుపై వ్రాయించి ఉత్తరాల అంచెల మంజూషలో పెట్టించి తానే స్వయముగా సన్నపులున్న పట్టుదారపు ముకదానిని చుట్టును చుట్టి శివదేవయ్యమంత్రి విచిత్రమైన ముడి నొకదానిని వేయించినాడు. మరునాడు వేకువను ఆ కమ్మను గర్భమందు దాచుకొన్న ఆ మంజూష ప్రయాణం సాగించింది.

ఆ ఉత్తరము ప్రయాణము సాగించిన మరునా డుదయం ఈ అంచెల వార్తలందించు శాఖకు నాయకుడు శ్రీశివదేవయ్యదేశికుల దర్శనముకు ప్రార్థిస్తూ వారి సభలో కనిపెట్టుకొనియున్నాడు.

అర్ధముహూర్తకాలానికి దేశికులు శివపూజను చేసికొని, అభ్యంతర సభా మందిరాన గూరుచుండి, వార్తాహర దళనాయకుని లోనికి రావలసిందని ఆజ్ఞ పంపినారు. ఆ నాయకుడు భయభక్తియుక్తమైన హృదయంతో మహామంత్రి కడకు పోయి పాదాభివందన మాచరించి, భక్తితో నిలబడినాడు.

"ఏమయ్యా! మావార్త గమ్యస్థానాన్ని చేరిందా?"

"మహాప్రభూ! మా వార్తాహరదళమును తాము కటాక్షించాలి. తమ నేఖ గజదొంగ గోన గన్నారెడ్డి చేతులలో పడినదండీ. అందు మా వార్తాహరుని లోపము లేదండీ!"

"ఏమిటీ! గజదొంగ చేతిలో పడినదా ఆ ఉత్తరము? అది ఎట్లా సంభవించినదయ్యా! సూర్యునిలా గతులు దప్పని మీ దళవీరుల ప్రజ్ఞలు ఉడిగి పోయినాయా?"

"మహాప్రభూ! మావార్తాహరులలో చివరి అంచెవాడు సాయంకాలానికి అమరపురం చేరబోతున్నాడు. ఆ ఊరింకా ఒక అర్ధగవ్యూతి ఉందనగా ఏబది మంది అశ్వికవీరులు మార్గాని కీవలావలనుండి వచ్చి మా వార్తాహరుని దారి అరికట్టారటండీ. మా వార్తాహరుడు తమ ఆజ్ఞాముద్రిక చూపించినాడటండీ. అయినా వారు లెక్కచేయక, వెనుకనుంచి గట్టివస్త్రం ఒకదాన్ని మావార్తాహరుని నెత్తిపై వేసి, అతనిని దిట్టమైన త్రాళ్ళతో బంధించారటండీ. వెంటనే మంజూష హరించి కొని పోయినారటండీ!"

"దేశం అరాజకం పాలబడిందా?"

"చిత్తం మహామంత్రీ!"

"ఆ వెనుక ఏమయింది?"

"ఆ పిమ్మట మా వార్తాహరుడు కట్టుత్రాళ్ళతోనే మా శిబిరం చేరినాడటండీ. వెంటనే మేఘాలలాంటి అశ్వాలపై జట్టు కిరువురు చొప్పున చుట్టు ప్రక్కల ప్రదేశాలన్నీ వెదకడం ప్రారంభించాము."

"మంచిది!"

"అందులో ఒక జట్టు కెదురుగా నల్లని గుఱ్ఱం ఎక్కిన వీరు డొకడు తార సిల్లాడు ప్రభూ!"

"అందరూ వీరులే! కవిత్వం చెప్పలేనివాడు, వీరత్వం నెరపలేనివాడు ఈ దినాల్లో ఎవడున్నాడు?"

"చిత్తం, ఆ వీరుడు మా జట్టువాళ్ళను తారసిల్లి 'మీ వార్తాహరుని కడ నుండి మంజూషను తస్కరించిన దొంగలకడనుండి, శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువు జట్టులోని మేము మా మంజూషను పాములనుండి గరుత్మంతుడు అమృతభాండము నెత్తికొనిపోయిన రీతిగా లాగికొన్నాము' అని చెప్పి మాయమైనాడు దేవరా! పట్టుకొందామని ప్రయత్నించారటగాని లాభం లేకపోయిందని మా వాళ్ళు వార్త పంపారు."

'ఓహో!' అని పక పక నవ్వి శివదేవయ్య దేశికులు 'ఓ వార్తాహరదళాధి పతీ! ఈ విషయంలో మీ లోపం ఏమీలేదు. ఇకముందు వార్తలు పంపు విధానము కొంతకాలంవరకూ మార్పు చేయవలసివస్తుంది. ఇక నీవు వెళ్ళవచ్చును' అని ఆజ్ఞ ఇచ్చినారు.

వార్తాహరదళాధిపతి వెళ్ళిపోయిన మరుక్షణంలో శివదేవయ్య దేశికులు పక పక నవ్వుకుంటూ "గజదొంగ గన్నారెడ్డి చేతులలో పడిందా ఆ ఉత్తరము? ఈదినాల్లో అన్నిదారులు గన్నారెడ్డినే చేరుతున్నవి. ఏలాంటివా డీ గన్నారెడ్డి! రేపు పినతండ్రితో యుద్ధం ఏలా చేస్తాడు? పినతండ్రి కొన్నిలక్షల సైన్యాన్ని పోగుచేసి శిక్షణయిస్తున్నాడట. లకుమయారెడ్డికి కాకతీయవంశమంటే ఇంతటి విరక్తి ఎందుకో? అన్నగారు బుద్ధారెడ్డి జీవించి ఉన్నంతకాలం సోదరభక్తితో రాజభక్తితో ఉండే లకుమయ్యకు ఆ తర్వాత ఆశ పుట్టింది. కాకతీయులుగాని, వారికి ముందు చాళుక్యులుగాని, వేంగిచాళుక్యులుగాని, చోడులుగాని, వారికిముందు పల్లవ చక్రవర్తులుగాని ఆశవల్లనే సార్వభౌము లయ్యారా?

"కానీ, ధర్మంకోసం, ప్రజలకోసం రాజ్యంచేసే ప్రభువులను ధిక్కరించి సామ్రాజ్యాలు స్థాపించాలని కుట్రచేసినవారు నాశనమే అయ్యారు,

"లకుమయారెడ్డి సామ్రాజ్యం స్థాపించాలని దీక్షవహించాడు. అందుకు విఘ్నేశ్వరపూజ అన్నకుమారునకు రాజ్యంలేకుండా చేయడం! భారతము కౌరవ పాండవ యుద్ధమేకదా! ఆయుద్ధం రాజ్యవాంఛవల్లనేకదా ఉద్భవించింది! ఈ భయం కరవాంఛవల్ల అర్థమూ, ధర్మమూ నాశనమై, ప్రజాక్షోభ ఉప్పతిల్లుచున్నది.

"రుద్రదేవప్రభువు తండ్రిగారివలెనే జననష్టానికి ఓర్వలేరు. చతురుపాయా లలో మొదటి మూడింటివలనే కార్యాలు చక్కబెట్టుకోవాలి అంటారు.

"మొన్ననే విక్రమసింహపురంనుంచి శ్రీ జన్నిగదేవసాహిణి మహారాజు అపరవేదవ్యాసు లనదగిన తిక్కయజ్వభారతము ఉద్యోగపర్వము పంపించారు. వాగనుశాసనుడైన నన్నయ్యభట్టు పిమ్మట ఇంత మహోత్తమకవి లేడు. తిక్కనామాత్యులు ఏమన్నారు ?

చం. 'పగ యడగించు టెంతయు శుభం బది లెస్స, యడంగునే బగం
బగ, పగఁగొన్న మార్కొనక పల్కకయుండగవచ్చునే, కడుం
దెగ మొదలెత్తిపోవ బరిపెర్వగవచ్చిన క్రౌర్యమొందు నే
మిగతి దలంచినన్ బగకు మేలిమిలేమి ధ్రువంబు కేశవా!'

ఎంత లెస్సమాటలివి !

శివదేవయ్యమంత్రి ఇలా తలపోసుకుంటూ 'గన్నయ్య ఆ మంజూష తెరచి ఏమిచేయునో' అనుకొనెను.

## ౧౦

ఓరుగల్లు నగరంలో బ్రాహ్మణవాడ ఆవుపాలతో నడిగిన ముత్యంలా ఉంటుంది. ఈ వాడలో దిగ్దంతులైన పండితులూ, వేద వేదాంగ పారంగతులూ, ఆరాధ్య నియోగిభక్తులూ, అద్వైతులైన నియోగులూ నివాసంచేస్తూ ఉంటారు. ఈ వాడ మహాపురమంత ఉంటుంది. ఈ వాడలోనివారందరికీ చక్రవర్తికొలువులో గాని, వివిధమండలేశ్వరుల కొలువులలోగాని, మంత్రులుగా, రాజోద్యోగులుగా, ఆస్థాన పండితులుగా, కవులుగా, పురోహితులుగా, గురుకులాచార్యులుగా, దేవాలయార్చకులుగా పను లుంటూ ఉన్నవి.

ఈ బ్రాహ్మణవాడలో రేచెర్ల ప్రసాదాదిత్యప్రభువునకు మంత్రిఅయిన అక్కినమంత్రి (శ్రీ అక్కినేపల్లి జానకిరామారావు జాగిర్దారుగారి పూర్వీకుడు) కౌండిన్యసగోత్రికుడు, పిల్లలమఱ్ఱినగరవాసి, ఒక ఉత్తమభవనంలో నివాసంచేస్తూ ఉండెను. అక్కినమంత్రి పూర్వీకులు రేచెర్ల వంశానికి మంత్రులు. రేచెర్ల బ్రహ్మనాయని వంశంవారయిన శ్రీ కాటయప్రభువుకడ అక్కినమంత్రి తాతగారు సోమనామాత్యులు మంత్రిగా ఉండేవారు. అక్కినమంత్రి తండ్రి భీమేశ్వరమంత్రి 'శ్రీ సకలగుణాలంకార, పరనారీదూర, అమవిగింటి పురవరేశ్వర, వీరలక్ష్మీనిజేశ్వర, దోర్బలభీమ, రణరంగధామ, వితరణకర్ణ, శౌర్యసౌవర్ణ, పతిహితాంజనేయ, శౌర్యగాంగేయ, సత్యరత్నాకర, దుష్టజనభీకర, మనుమకులాదిత్య, సుభటసంస్తుత్యనామాది ప్రశస్త' శ్రీ రేచెరువుల కామిరెడ్డి ప్రభువులకు ముఖ్యమంత్రిగా ఉండెను.

అక్కినమంత్రి అన్నగారు మల్లికార్జునమంత్రి పిల్లలమఱ్ఱి ప్రభువైన నామిరెడ్డికడను మంత్రిగా ఉండెను. శ్రీ నామిరెడ్డి మండలేశ్వరుడు కామిరెడ్డిమహారాజు కుమారుడు. కామిరెడ్డి అన్నగారు బేతిరెడ్డి. ఆ ప్రభువున కొక్కడే పుత్రుడు, మల్లిరెడ్డి. అక్కినమంత్రి రేచెర్లవంశంలో పేరుగన్న

బేతాళనాయకుని కుమారుడైన ప్రసాదాదిత్యనాయకునికడ మంత్రిగా ఉండెను.

అక్కినమంత్రి అందలమెక్కి వందిమాగధులు పొగడుతూ ఉండగా కోటగుమ్మం దాటి నగరపాలకుడైన ప్రసాదాదిత్యప్రభువు నగరుచేరుకొని అక్కడ రాజసభలో ప్రవేశించినాడు. అక్కినమంత్రి ప్రవేశించగానే ఆ సభలోని వారందరు నిలిచి వారికి జోహారు లర్పించారు.

అక్కినమంత్రి ప్రతిభాశాలి, ఉత్తమ పండితుడు, శివభక్తుడు. అరువది మూడేండ్ల వృద్ధుడైన ఆ మంత్రి శివదేవయ్య దేశికుల కుడిభుజంగా సర్వరాజ కార్యదక్షులై ఉండేవారు.

ఓరుగల్లు నగరపరిపాలన మొకఎత్తు, తక్కిన మహారాజ్య పరిపాలన మంతా ఒకఎత్తు. ఆంధ్రమహాసామ్రాజ్య మంతా, ఓరుగల్లునగరంలో ప్రతి ఫలిస్తూ ఉండేది. ఆ నగరంలో అన్నిశాఖలూ ఆముదం నూనెచే తడిపిన రథ చక్రాల ఇరుసులులా పాలింపబడుతున్నవి.

ఎగుమతి దిగుమతులు, వస్తువుల ఉత్పత్తి, వస్త్రపునేత, వానికి రంగుల అద్దకము, నగరాయుర్వేదము, ఆహారపదార్థముల సేకరింపు, అతిథిపూజ న్యాయపాలనము, నగరరక్షకశాఖ, నగర మార్గనిర్మాణము, విద్య, సామంత రాజ్యతంత్రము, నగరపశుపోషణ, పశువైద్యము, నగరవినోదశాఖ, నగరో ద్యానవనపోషణ, శాకముల మాంసముల అందుబాటు, విపణిపీథులు ఈ మొద లయిన శాఖలన్నీ పురాధ్యక్షుడు చూచుకోవాలి. అక్కినమంత్రి ఆ పురాధ్యక్షునకు మంత్రాంగము

అక్కినమంత్రి కుమారుడు నలుబదిరెండు సంవత్సరముల ఈడుగల సోమయామాత్యులు సార్వభౌమసభలో వణిక్ శాఖామంత్రిగా ఉండెను. సోమయా మాత్యునకు చినఅక్కినప్రగడ కుమారుడు. ఈ బాలకుడు పదునెన్మిది సంవత్స రాల ఈడువాడు. చిన్నతనములోనే ఉద్దండపండితుడై, సాంగవేదియై, అపర పతంజలి అని పేరు పొందాడు. అతడు గన్నారెడ్డితో కలసి, ఆ గజదొంగకు మంత్రియై, ఆంధ్ర సామ్రాజ్యమునందంతా సింహస్వప్నమైపోయాడు. కొడుకు దుశ్చేష్టితాలన్నీ తలచుకుంటూ సోమయామాత్యులూ, మనుమని ఆగడాలు తలచు కొని అక్కినమంత్రీ నలుగురిలో తలలెత్తుకొని తిరగడానికి సిగ్గుపడుతూ ఉండిరి

ఆ ఉదయం అక్కినమంత్రులవారు సభదీర్చి కూర్చుండగానే ప్రసా దాదిత్యప్రభువు సభకు వచ్చారు. అందరూ లేచి నిలుచున్నారు. నాయకుడు అక్కినమంత్రికి నమస్కరించి, సింహాపీఠి నలంకరించి, వ్యవహారాలు విచా రించ ప్రారంభించినాడు.

నగరంలోని అభియోగాలన్నీ మహాతలవరే పండితసభ సహాయముతో విచారిస్తాడు. పెద్ద పెద్ద అభియోగాలు నగరరక్షక సభకు వస్తాయి. ఈ అభియోగ

విచారణకాలంలో ఉత్తమ పండితులు, ధర్మశాస్త్రవేత్తలు, వణిక్ సంఘాధిపతి, నగరరక్షకునకు సహాయం చేస్తూవుంటారు. అక్కినమంత్రి ఆ పండితసభలో పెద్ద. ఈ అభియోగాలు, అర్థాన్నిగూర్చి, వాణిజ్యాన్నిగూర్చి, సామంతుల సేవకుల మధ్య తగవులగూర్చి జరుగుచునుంటవి.

ఆ దుర్మతి సంవత్సర శ్రావణమాస బహుళ పంచమినాడు శ్రీ శ్రీ మహాసామంత వర్ధమానపుర మహారాజు లకుమయారెడ్డి, గన్నారెడ్డి ఓరుగల్లులో నివసించే తమ నగరును తన భృత్యులకు స్వాధీనం చేయవలసివున్నదని పుర రక్షక ప్రభువైన ప్రసాదాదిత్యునికడ అభియోగం తెచ్చినాడు. ఈ అభియోగం తేలడానికి, విచారణసమయంలో అందులో పాల్గొనడానికి, వర్ధమానపురం నుండి లకుమయారెడ్డి రెండవమంత్రి చిన్నయామాత్యుడు వచ్చినాడు. చిన్నయామాత్యులు, అక్కినమంత్రియు దూరపుచుట్టాలు. చిన్నయామాత్యుడు, అక్కిన మంత్రితో కొంతవరకు మాట్లాడి, ఆవిషయమై విచారణను ప్రసాదాదిత్యప్రభువు ప్రారంభించగానే చిన్నయామాత్యుడు, గజదొంగ అయిన గన్నయ్య ప్రభువు వర్ధమాన రాజ్యానికి అర్హత పోగొట్టుకొన్నాడు కాబట్టి మానువనాటి ప్రభువుల స్వత్వాలన్నీ ఆయనకూ, వితలధరణీశునకూ పోయాయనీ, అందుచే శ్రీ శ్రీ లకుమయారెడ్డి మహారాజు తిరిగి గోనప్రభువుల నగరిని ఆక్రమించవచ్చు ననీ వాదించాడు.

ధర్మశాస్త్ర నిర్ణయాధికారులైన పండితు లా విషయం చర్చించి చిన్నయామాత్యుని వాదన అంగీకరించి, శ్రీ శ్రీ లకుమయారెడ్డి ప్రభువు ఆ నగరిని స్వాధీనంచేసుకోవచ్చు నన్నారు. ప్రసాదాదిత్య ప్రభువు అంగీకరిస్తూ తీర్పు చెప్పాడు.

౧౧

అక్కినమంత్రి వృద్ధుడైనా జవసత్వము లేమి సడలని యోగివంటివాడు. ఆ దినమున సభ రెండవజాము పూర్తి అగుటకు ఇంకను మూడుగడియలున్న దనగానే సభ చాలింపబడినది. ప్రసాదాదిత్యప్రభువు లేచి అక్కినమంత్రి అనుమతి నంది సభ చాలించి వెళ్ళిపోయాడు.

వెంటనే అక్కినమంత్రియు మోసాలకడ శిబికనెక్కి వందులు బిరుదులు పాడ, ధవళచ్ఛత్రము, ధవళాశ్వము ముందునడువ, సామంతభేరి మ్రోగుతూ వుండగా ఓరుగల్లు మహాపురంలో తమ నగరు చేరారు. మళ్ళీ స్నానసంధ్యానుష్ఠానాలు కావించి సరిగా ప్రొద్దు పడమటివైపు మళ్ళిన ఒక ఘడియకు కుమారునితో, పండితులతో, అతిథులతో కలసి మృష్టాన్న భోజనం చేశారు,

ఆంధ్రుల భోజనం జగత్ప్రసిద్ధము. మల్లెపువ్వులవంటి రాజనాల అన్నం, పప్పు, పచ్చళ్ళు, శాకాలు, ధప్పళము, చారు, పాలతో గోధుమ

పిండితో చేసిన భక్ష్యాలు, కమ్మటి పెరుగు, ఘుమఘుమలాడు నెయ్యి—ఇవి ప్రతిదినమూ ఉండాలి. ఆంధ్రులలో రైతులు బలంకోసం జొన్నరొట్టెగాని, జొన్నన్నంగాని తింటారు. చుట్టాలువచ్చినా, పండుగ వచ్చినా రాజనాలు వండు కొంటారు

అక్కినమంత్రి భోజనానంతరం అభ్యంతరచతుశ్శాలలో రత్నకంబళ్ళపై సదివసించి కుమారునితో, అతిథులతో తాంబూలచర్వణ చేస్తూఉండెను. కొంత కాలం విద్వత్‌గోష్ఠి జరిగింది.

ఎవ్వరూ ఎప్పుడూ, అక్కినమంత్రికడ మహిమమైన అక్కినప్రగడ విషయం ఎత్తరు. గజదొంగలలో గలసిన అక్కినప్రగడ తన మనుమడగుటకు ఆయన యెంతో బాధపడును. ఒక్కొక్కప్పుడు ఆయనకు పట్టరాని కోపంకూడా వచ్చేది,

తాంబూలచర్వణం చేస్తూఉండగా అక్కినమంత్రి సత్తముని దర్శనార్థము కొందరు పండితులు వచ్చినారు. వారు దూరదేశాన్నుంచి వచ్చి, శ్రీ శివదేవయ్య మంత్రిగారి నగరులో వారిపంక్తిని భోజనంచేసి, అక్కినమంత్రి దర్శనార్థము వచ్చినారు.

పదునారేడుల చిన్ననాడే దిగ్విజయయాత్రచేసి, సర్వభారతీయ పండిత ప్రకాండులచే ప్రశస్తులు పొందిన అక్కినప్రగడ ఏడని ఆ పండితులు అక్కినమంత్రిని ప్రశ్నించారు. ఆ ప్రశ్నతో అక్కినమంత్రికి మితిమీరిన కోపం వచ్చింది. 'ఆ పాపిమాట నాకడ తీసుకురాకండి!' అని అక్కినమంత్రి ఖండితముగా చెప్పినాడు.

ఆ పండితు లొకరిమోము లొకరు చూచుకొనుచున్నారు. అప్పుడు అక్కినమంత్రి కుమారుడు సోమయామాత్యులు, విచారమేఘావృతమైన మోముతో ఆ పండితుల చూచి, 'మావాడు గజదొంగ అయిన గోన గన్నారెడ్డి జట్టులో కలిసి పోయాడు. ఆ దొంగకు తాను మహామంత్రి అట! అప్పటినుండి మా నాయనగారికి మతి విరిగిపోయింది. మాదుఃఖానికి మేరలేదు. పండితుడైన కుపుత్రునికంటె మూఢుడైనా, కొడుకు గుణవంతుడగుట మేలు' అంటూ సోమయామాత్యుడు నిట్టూర్పు వదిలాడు.

అప్పు డందులో సాహిత్యవిశారదుడు, వ్యాకరణవేత్త అయిన శ్రీధర పండితుడు, రాజరాజనరేంద్ర నగరవాసి సోమయామాత్యుని చూచి 'చిత్తం! మీ అబ్బాయిగారు గోన గన్నారెడ్డితో చేరినట్లు మాకు తెలియును. మే మందరము కృష్ణాతీరస్థమైన ఒక అడవిలో ప్రయాణంచేస్తూ కందనోలునుంచి వస్తూఉంటిమి. కందనోలు ప్రభువు పందిభూపాల తనయుడు మమ్మెంతో ఆదరించి, విలువగల బహుమతులిచ్చి, వీడుకోలిచ్చినాడు. ఆ ప్రభువు గోన గన్నారెడ్డిని ఆశ్రయించేటట్లు పొగడాడు. ఆ ప్రభువును వదలి మేము తుంగభద్రదాటి ఏకశిలానగరాభిముఖులమై వస్తూ ఉంటే, కృష్ణాతీరంలో ఒక అడవిలో మమ్ము గోన గన్నారెడ్డి

సైనికులు అడ్డగించి గౌరవముగా తీసుకుపోయినారు. మా కళ్ళకు గంతలుగట్టి గన్నారెడ్డి సైన్యాలతో నివసించిఉన్న కోటకు కొనిపోయారు. అక్కడ మాకు వారిచ్చిన ఆతిథ్యం వర్ణనాతీతమే. మేము మీ అబ్బాయిగారిని ఆ సమీపాన ఎక్కడా చూడలేదండీ' అని ప్రతివచన మిచ్చారు.

"గజదొంగ అనే చిహ్నలేవీ మా కక్కడ కనిపించలేదు. కళ్ళకు గంత లెందుకని మే మాశ్చర్యమందినమాట నిజం. కాని, ఒకసారి వారికోట చేరిన తర్వాత మాకు వారుచేసిన గౌరవం అప్రతిమం. ఇంతలో ఒకచిన్న మంజూష పట్టుకొని ఒక దళవాయి వచ్చి గన్నయప్రభువుకు అర్పించాడు. ఆయన ఆ మంజూషను కట్టిన ముడిని సునాయాసంగా విప్పి అందులో ఉన్న తాటియాకుల కమ్మనుచూచి ఈలా చదివినారు. 'స్నేహితుడా! లకుమయారెడ్డి లక్షకాల్బ లముతో, ఇతరసైన్యాలతో గన్నారెడ్డిని హతమార్చడానికి వెడుతున్నారు. గన్నారెడ్డి గజదొంగ ఏమిచేయగలడు ? పినతండ్రికి దొరకక మాయమవుతాడు. అతనికి ఇది అదనుకాదనేసంగతి తెలుసు. అయిన మీరు మన రాజ్యవ్యవహారా లకు అప్రతిలేకుండా జాగ్రత్తపడి ఉండవలయును. శ్రీ రుద్రదేవమహారాజు శ్రీ శ్రీ గణపతిరుద్రదేవ సార్వభౌముల పెద్దకుమారై అనిన్నీ, వారు సార్వ భౌములకుగాను రాజప్రతినిధియై పరిపాలనం జేసూవుండగలందులకుగాను మహోత్సవం జరిపారు. కాబట్టి మీకు మీకు తెలియజేయదమైనది. దేవాలయాలలో, శాసనాదులలో ఇరువురిపేరా పూజాదికాలు, బ్రాహ్మణ పూజలు జరపవలసింది. ఆశీర్వాదాలతో శివదేవయ్య' అని ఆ ఉత్తరం గన్నయ్యప్రభువు పైకి చదివా రండీ" అని ఆ పండితు డూరకున్నాడు.

## ౧౨

ఓరుగల్లు నగరంలో శ్రీ రుద్రదేవమహారాజు రాజప్రతినిధి అయినందుకు ఉత్సవాలు అఖండంగా జరుగుతూనే ఉన్నాయి. ఆ మహానగరంలో మహా రాజనగరులో, మండలేశ్వర నగరులలో, దేవాలయాలలో దినదినమూ నృత్య గీత వాద్యాదులు, పండిత సన్మానములు, తోలుబొమ్మలు, కథాకాలక్షేపములు జరుగుతూ ఉండెను.

మహారాజనగరంలో నృత్యవిద్యాసంపన్నత సభికులకు చూపించే నర్తకీబృందంలో ఉత్తమురాలు మధుసాని. ఆ మధుసాని కిరువది అయిదు సంవత్సరాలు. బంగారురంగు హారంగుతో, పోతపోసిన విగ్రహంవలె స్ఫుటత్వముగల అవయవాలతో భూమికి దిగివచ్చిన ఘృతాచిలా ఉంటుంది. ఆమె జాయపసేనానికి ప్రియురాలు, శిష్యురాలును. జాయపమహారాజు ఆ దివ్యసుందరికి భరత, భామహ, వామభట్టోత్పల, ఉద్భట, రుయ్యక, ఆనంద

వర్ధన, అభినవగుప్త, దండి, క్షేమేంద్ర, ఏకావళీకార, మమ్మట, ఉద్భట, హేమచంద్రాది మహామహుల అలంకారశాస్త్రములు నేర్పియు, నేర్పించియు ఆమెను మహోత్తమవిద్యాసంపన్నను చేసినారు. (ఈమె సుకుమారాలే పిమ్మట ప్రతాపరుద్రదేవుని వలపించిన మాచల్దేవి).

ఈమె నగరు—సార్వభౌముల నగరికి దక్షిణమున, ఆ నగరు కంటియున్న జాయపసేనాని నగరు—నంటియున్నది. ఈ నగరులో అనధ్యయన దినములలో తప్ప ప్రతిదినమునందు సాయంకాలము పందొమ్మిదవ నాళిక రాచనగరు మోసాల యందు మ్రోగినప్పటినుండి గోధూళికాలంవరకూ సభ జరుగుతుంది. ఆ సభలో పండితులు, కవులు, గాయకశ్రేష్ఠులు, నర్తకీమణులు తమ తమ విద్యలు చూపుతూ ఉంటారు. నెలకు ఒకసారి పూర్ణిమముందు శుక్రవారంనాడు కామేశ్వరీపూజానిరతురాలైన మధుసాని లేక మధుమావతీదేవి ఉదయమూ, రాత్రీ కామేశ్వరీదేవికి దివ్య నాట్యము అర్పిస్తుంది. ఆ సమయమందు ఆహూతులయ్యేవారు పండిత వృషభాలు, రాజసింహాలు, కవిహంసలు, గాయకతల్లజాలు, మంత్రిపుంగవులు మాత్రమే. ఆమె నాట్యప్రదర్శనం చూడడం తపఃఫలంగా ఎంచుకొనేవారు.

ఆంధ్ర నర్తకీమణులకు అత్యంత ప్రియమైనది నందికేశ్వర సంప్రదాయం. నాట్యము మూడుపాళ్ళు, నృత్తము ఒక పాలును వారు ప్రదర్శిస్తారు. ఆంధ్ర నాట్యము జగత్ప్రసిద్ధము. ఆంధ్రులంత నృత్యప్రియులా దినాల ఇంకొకరు లేరు. సర్వశాస్త్రపారంగతురాండ్రైన దేవగణికలకు పాఠాలు నేర్పడం ప్రాథమికవిద్యగా ఎంచుకొనే కైశికీమణులతో కామేశ్వరీకథ చెప్పుతూ నాట్యమాడే జక్కుల పురంధ్రులతో ఆంధ్రనాట్యవృక్షము పుష్పఫలావృతమై పెరిగింది.

నాట్యమున పూర్వరంగము ఇష్టదేవతా ప్రార్థనాత్మకమై, దివ్యగాథా నాట్యపూర్ణమై ఉంటుంది. ఉత్తరరంగము, ఉత్తమ మానవ చరిత్రాభినయపూర్ణము, చతుర్విధాభినయములతో, శృంగార కరుణ భక్తిరసాలుగా కావ్యాలు నాట్యం చేయబడుతాయి.

మధుసాని ఒక సార్వభౌమ నగరియందు మాత్రమే నాట్యముచేస్తుంది. శ్రీశ్రీ రుద్రదేవ మహారాజు సార్వభౌమ ప్రతినిధిగా అభిషేకించిన ఆ ఉత్సవాలలో రుద్రదేవమహారాజుసభలో శుక్రవారాలు కానటువంటిన్ని, అనధ్యయనదినాలు కానటువంటిన్ని దినాలలో ఆ మహారాజు సభ నలంకరించి ఉండగా మధుసాని ఉదయం ప్రథమయామమధ్యమునుండి ద్వితీయయామ మధ్యంవరకూ ఏడున్నర ఘటికలు తానే నాట్యం చేస్తుంది.

ఆమె నాట్యసభకు ఉద్దండులను మాత్రమే ఆహ్వానింతురు. ఆ రుద్రేశ్వర నామక మహాసభలో సార్వభౌమ సింహాసనానికి దిగువగా రాజప్రతినిధి సింహాసనంపై రుద్రదేవి పురుషవేషంతో అధివసించిఉంది. ఆమెకు కుడిప్రక్క మహా

మంత్రి గద్దెపై శివదేవయ్యామంత్రులవారు, ఎడమప్రక్క సర్వసైన్యాధ్యక్షుల వేదికపై జాయపసేనానులవారు అధివసించిఉండిరి. వారికి కొంచెం దిగువగా శివదేవయ్యగారికి కుడివైపున ప్రసాదాదిత్యులు, జాయపమహారాజుకు ఎడమగా మహాతలవరి ఉన్నారు.

అక్కడనుండి సభకు ఈవలావల ఆసనాలపై మహాసామంతులూ, సామ్రాజ్యప్రధానులు వారివారి మర్యాదలక్రమంగా పీఠికలపై అధివసించివుండిరి. రాజప్రతినిధి సింహాసనానికి దిగువగా జగత్ప్రసిద్ధ పండితుల ఆసనాలుంటవి. వారికి దిగువగా రసికోత్తములగు సామంతులు, కళానిధులు, కోటీశ్వరులు, ముఖ్యాధికారులు మొదలైనవా రందరి ఆసనాలూ వుంటాయి. పండిత పీఠాలకు దిగువ ఉత్తమ రత్నకంబళిపరచిన స్థలంలో లాసికాబృందము, మృదంగద్వయం ఈవలావలగా, దేశికులైన పండితులు కుడివైపుగా, చెలియైన వేలాక గణిక ఎడమవైపుగా మధుసాని నాట్యం చేస్తుంది. మధుసాని వెనుకగా శ్రుతిగాయన్న గణికాబృందానికి కుడివైపునా, ఎడమవైపునా, ఒకవీణ, ఒక సైరంధ్రి, ఒక తాళహస్తము, ఒక పిల్లనగ్రోవి ఉంటాయి.

మధుసాని శ్రీ రుద్రదేవప్రభువు ఆజ్ఞప్రకారం సభలో ప్రవేశించి రుద్రదేవికి, శివదేవయ్య దేశికులకు మోకరించి నమస్కరించి, లేచి జాయపసేనానికి తక్కుంగలవారికి నమస్కరించినది.

మధుసాని, కాముని వింటినారివలె భంభరవేణి మధుసాని; పంచబాణుని మందార బాణాలవంటి పీనపయోధరి మధుసాని; మీనకేతనుని కేతనంవంటి మెలుకలాడి మధుసాని; మదనుని చెరకువింటివంటి మధురోష్ఠి మధుసాని, రతితన్వంగి వంటి జవరాలు. మధుసాని నవ్వితే శరత్కాలమూ, నడిస్తే వర్ష కాలమూ, మాటలాడితే వసంతకాలమూ, కనులు మూసినచో శీతకాలమూ ఉదయిస్తవి.

అట్టి మధుసాని నాట్యసౌందర్యము ఉత్తమ కళాభిజ్ఞురాలగు శ్రీ రుద్రదేవి చూచి, గ్రహించి, ఆశ్చర్యమంది, ఆనందింపగలిగింది. శ్రీ శివదేవయ్య దేశికులు ఆమెనాట్యంలో ఉదయసంధ్యానటేశ్వర నృత్యచ్ఛాయలు చూచి ఆనందించినారు. తక్కిన వృద్ధులు, కౌమారులు, యౌవనులు అందరూ మహామధురనాట్యముతో కూడిన ఆమె సౌందర్యంలో మనస్సులను శలభాలు చేసుకున్నారు.

"ఓం వినాయక, విఘ్నరాజం వందే।
ప్రమథ గణేశ్వర పాహిమాం, పాహిమాం।"

అని పూర్వరంగము ప్రారంభించింది. నాట్యభేదములలో ఇరువదినాలుగవదియగు పుష్పాంజలి నాట్యముతో ప్రారంభించి భృంగినాట్యముతో సమాప్తం చేసింది.

ఆ వెనుక ఉత్తరరంగంలో శృంగారనాట్యం ఆరంభించి ఉత్తమ గీతాలు ఎత్తుకొని మధురమైన కంఠంతో వాచికాభినయమూ, పరమపవిత్రమగు సాత్వికాభినయమూ, మనోహర పద్మలతాహస్తాలతో, పద్మపత్రాక్షులతో, చంద్రబింబాస్యంతో, శంఖగ్రీవంతో, నునుకౌనుతో, ఘనకటితో, రంభోరులతో, పద్మపాదాలతో అంగాభినయమూ, నవరత్నఖచితాలంకారాలతో, దుకూల వస్త్రాదులతో, తను రాగ, లేప కజ్జల, పుష్పరాగాలతో ఆహార్యాభినయమూ ఆ ప్రౌఢ చూపించింది.

ఆమె నాట్యమాడినది కుమారసంభవ యక్షగానము, నవయౌవనవతియైన పార్వతి చెలితో అంటున్నది.

> "నాతి ! ఏల నామనసూ నన్నూవిడిచిపోయే
> నా కలలు తోచేనే నాట్యమాడెడు ఒకడూ !
> జటలే తాల్చినవాడు, జాహ్నవి ముడిలో ఆడు,
> చంద్రశేఖరుడమ్మా సుందరీ విను, కొమ్మా !

అప్పుడు చెలి ఏమన్నది ?

> "నగరాజూ నీతండ్రి నగుబాటుపాలౌ
> తగదమ్మా ఈ వలపు తలవంపులౌనా,

పార్వతి : "నాతో మేలం వద్దు
నవ్వులు కావమ్మా :
నాగభూషణునొకని నలినాక్షి చూచితిని !
నిద్దుర మెలకువవచ్చి నిలువెల్ల పులకిస్తి
అద్దిరహృదయము మ్రోగె ; అలమె సిగ్గులు నన్ను
నాతి.... ....
ఒడలు ఝల్లనపొంగె కదలికెరటము రీతి
చిడిముడిపాటున మనసు చేదె ! వశముదప్పె
ఎవ్వరే ఆ వయసుకాడు ? ఎవ్వరే ఆ జటాధారి ?
అవ్వరో ! ఆ సుందరాంగుడు అంగముల విభూతివాడె ?
నాతి.... ....
చేతకలదే ఢక్కఒకటి ; చేర్చెవహ్నిని ఇతరకరమున
నాతి ఆ దివ్యమూర్తే నా తలంపుల నిండిపోయెనే !"

చాళీయమై, లవణియై, విద్యుద్భ్రమరకమై మధుసాని నాట్యము పాల సముద్రవీచికలా, మందమలయానిలంలా చంచలగతిని సభ్యుల ఆత్మలనే కరగించివేసింది.

నాట్యం పూర్తిఅయి ఆమె తాను వేషమువేసికొనే అభ్యంతర మందిరంలోకి రుద్రదేవ మహారాజుయొక్క, ఇతర సభాసదులయొక్క సెలవునంది వెడలిపోయినది.

ఆమె లోనికి వెళ్ళగానే, ఒక వృద్ధ ఆమెకడకు వచ్చి 'మధుమావతీదేవీ! శ్రీ జాయపమహారాజులుంవారు సైన్యంతో బయలుదేరి లకుమయారెడ్డి సైన్యాన్ని ఎదురుకొనేందుకు అవసరమని శివదేవయ్య గురుపాదుల కోరిక. ఇది అతిరహస్యంగా జరగాలి. శ్రీ జాయపమహారాజులుంవారు మూడవ సైన్యాన్ని పానగల్లు పంపించివున్నారు. ఆ పానగల్లు పట్టణంలో సారంగపాణిదేవమహారాజు తన సైన్యంతో సిద్ధంగా వున్నారట. నీవుకూడా శ్రీ జాయపమహారాజులవారితో బయలుదేరాలి. సంతోషానికి మీ ఇరువురూ బయలుదేరినట్లుండాలట. అవసరమైతే లకుమయప్రభువు సైన్యాన్ని నాశనంచేసి, లకుమయప్రభువును బందీగాపట్టి సగౌరవంగా ఓరుగల్లుకు కొనిరావలసిందని గురుపాదులు తమ ఆలోచనగా శ్రీమహారాజులంవారికి మనవి చేయనున్నారు' అని రహస్యంగా నివేదించినది.

శివదేవయ్య దేశికులు శివావతారులని మధుమావతికి నమ్మకం. మధుమావతి భక్తురాలు. రాచరికపు వ్యవహారా లెరిగిన శేముషీసంపన్న. ఆమె శ్రీ శివదేవయ్య దేశికుల భావం అర్థంచేసుకున్నది. ఆ మరునాడు శ్రీ శ్రీ జాయపమహారాజులవారు మధుమావతితో, తన రాణివాసంతో సంగమేశ్వర పుణ్యక్షేత్ర దర్శనానికి పరివార యుక్తులై బయలుదేరారు.

## ౧౮

రుద్రదేవి తిన్నగా అభ్యంతరమందిరం చేరి, కవచాదులు చెలులు విప్పగా, మరల జవ్వనియై, స్నానగృహానికి వెళ్ళింది. స్నానమాచరించి కులదేవతయైన కాకతీదేవి పూజచేసి, భోజనం పూర్తిచేసి, విద్యామందిరంచేరి పీఠమధివసించి, ఏవో గ్రంథాలు చెలులచేత తెప్పించుకొని, చదువుకొనుట ప్రారంభించింది.

ఎంత గొప్పవాడైనా, ధర్మపాలనాదక్షుడైనా, ప్రజానురంజకుడైనా, వీర విక్రముడైనా ప్రతిమహారాజు అవసానకాలమందూ, సామంతులు తిరగబడడం, ప్రక్కదేశాలరాజులు దండెత్తిరావడం, వారివల్ల ప్రజాక్షోభ కలగడం, కాటకం వస్తూఉండడం జరుగుతూ ఉంటుంది. తన తాతగారి రాజ్యకాలం ఆ కొద్దిసంవత్సరాలూ దేశం అంతా తలక్రిందులైనది. తన పెదతాతగారి చరమకాలం భీషణ వత్సరాలే.

తన తండ్రిగారు ఒక్కొక్కసంవత్సరము ఒక్కొక్కవైపు యుద్ధయాత్రసలిపి ఒక్కొక్కదేశం జయిస్తూ, ఈ సామ్రాజ్యము నిర్మింపవలసి వచ్చినది. వెలనాటిసీమ ప్రభువు మేనత్తభర్త; వెలనాటివారు సవతి మేనమామలు. చాళుక్యప్రభువులు తమ కెప్పుడూ అనుకూలురు. అరువేలనాడు గిరిసీమ కొండపడమటి తూర్పుసీమలు తమకు చుట్టాలు. సింధనాటిసీను పాకనాటిని మార్జనాటిని జన్నిగప్రభువు రాజ్యం చేస్తూవుండెను. ఆయన

రాజభక్తి తంగయసాహిణి రాజభక్తికి వన్నెలు దిద్దుతుంది. ఇటు మానువ నాటి సీమలో రాజద్రోహం పూర్తిగా తలఎత్తింది. ఒక ప్రక్క ఈ గజదొంగ గన్నారెడ్డి, వేరొకప్రక్క ఆతని పినతండ్రి లకుమయమహారాజు యుద్ధం చేయబోతున్నారు. గన్నారెడ్డి ఎంత గజదొంగ అయినా సాధ్యమైనంతవరకు ప్రజాసంహారము లేకుండా వైరిసంహారముమాత్రం చేస్తున్నాడు. అది అంతవరకు నయం. ఈలా రాజ్యాలు పాలించేవారి తలపై ఉన్నభారం శేషునిభారానికి వేయిరెట్లవుతున్నది. రాజుల కెందుకీ ఆశ ! ఈ ఆశతో ఎన్ని సామ్రాజ్యాలు జన్మించి నాశనమవుతున్నవి ! రాజ్యాలకోసం బలమైనవాడల్లా ప్రయత్నంచేస్తూ తోటిరాజుల్ని, తనసైన్యాల్ని హింసిస్తూ శాంతియుతమైన దేశాలలో సంక్షోభం తీసుకువస్తూ ఉంటారు.

రుద్రదేవి కాటియాకులపుస్తకం చూస్తున్నా, ఆమెమనస్సు ఈలా ప్రపంచ యాత్ర చేస్తున్నది.

ఆమె ఈ దినాలలో తన నగరిలో యువతి. మహారాజసభలో పురుషుడు ! ఆమెకు శ్రీ శివదేవయ్య దేశికుల భావం పూర్తిగా అర్థమైనది. ఆమె సంపూర్ణ స్త్రీయై, ఆ ఉత్తమపురుషుడు,.... ఆ ఉత్తమచాళుక్యుడు.... ఆ.... ఆ చాళుక్యవీరభద్రుని ఎదుట నిలుచున్నది.

చాళుక్యవీరభద్రమహారాజానాడు తన్ను సంపూర్ణస్త్రీగా తోటలో చూచుట కామె పొందిన యానందము వర్ణనాతీతము. ఎప్పుడా మహాభాగుడట్లు ప్రత్యక్షమైనాడో, ఆ శుభముహూర్తములో తనలో ఉన్న అనంతానుమానాలన్నీ సూర్యకాంతికి మంచుకరిగినట్లు కరిగిపోయాయి. ఆ దివ్యపురుషుని ఎదుట తన జనకుడూ, తానూ, తనచుట్టూ నిర్మించిన పురుషత్వదుర్గకుడ్యాలు, బురుజులు రాలిపోయినవి. తాను స్త్రీయై జన్మించినకథకు, ఫలశ్రుతి అమృతకలశోపమానమై ఆనాడు ప్రత్యక్షమైనది. తన ఒడలు ఝల్లుమన్నది. తన దేహము ఉప్పొంగినది. తన హృదయము మత్తిల్లినది. కన్ను లరమూతలు వడినవి. తక పెదవులు వణకిపోయినవి, ఫాలమున చిరుచెమ్మటలు పోసినవి. కంఠాన మధుబిందువు లలమిపోయాయి.

ఆ సాయంకాలము తా నెట్లింటికి వచ్చినదో ? ఇంతలో దేశికులూ, ఆ ప్రభువూ తన్ను రుద్రదేవమహారాజుగా చూడడానికి వచ్చారు. లొంగని గుండెను దిటవుపరచుకొని వారికి తాను దర్శన మిచ్చింది. వారితో మాట్లాడిన ఆ కొలది కాలమూ తనకు అసిధారావ్రత నిర్వహణ మయినది.

తా నా మహాపురుషుని ప్రేమించుచున్నమాట నిశ్చయము. భగవంతుని మనం ప్రేమించమా ? అంతియ ఈ ప్రేమయున్నూ, దూరాన్నుండే ఆ దివ్యపురుషుని ప్రేమిస్తూ, ఈ రాజ్యనిర్వహణరథం నడుపుకుంటూ, తనధర్మం తాను ఆచరిస్తుంది. అవివాహిత అయిన స్త్రీకి రాజ్యార్హత లేదంటారు. తన

కా భాగ్యమే కలిగితే ఏ రాజక్షోభమూ లేని సాధారణకన్యయై, జీవితరహస్యం తాను తెలుసుకోగలదు.

తన తండ్రి, తన గురువులు ఇరువురూ తా నెన్నిసారులు తన కీ రాజ్యం అక్కరలేదన్నా, 'నీవు రాజ్యభారం వహించవలసినదే' అని ఖండితముగా చెప్పినారు. తాను తండ్రిమాట వ్యతిరేకించడానికి సాహసించినా, భగవంతుని అవతారమైన గుర్వాజ్ఞ ఎట్లు వ్యతిరేకించగలదు ?

సామంతులలో కుట్రలు, రాజద్రోహం; ప్రజలలో కలహాలు, వ్యాధి కాటకాల విజృంభణ, అతివృష్టి, అనావృష్టి బాధలు; పొరుగురాజ్యాలవారి కాంక్ష ఇవన్నీ భరించవలసిన రాజధర్మ మెంత భయంకరము ?

తాను స్త్రీయై, ఆనందజీవితయాత్రోన్ముఖవధువై, గృహిణియై, బిడ్డల తల్లియై, బహుకుటుంబినియై, సంసారయాత్ర సాగించవలసిన బాలిక! ఈలా కఠిన రాజ్యధర్మము నిర్వహించడం ధర్మవ్యతిరేకం కాదని తన గురువులిరువురూ తలపడం ఏలా పొసగిందో తన కిప్పుడు గ్రాహ్యంకాని విషయమే అయినది. అట్లు చేయకపోవడ మధర్మమనికూడా దేశికులు బోధించారు. 'రాజ్యార్హతకలిగి రాజ్యం చేయనివాడూ, ఋతుస్నాతయై పతినికోరిన భార్యను జేరనివాడూ, కలిగి యుండి అన్నార్తునకు భోజన మీయనివాడూ ఘోరపాపాల నాచరించినవాళ్ళు' అని గురువుగా రుపదేశించారు.

తాను స్త్రీయని ప్రకటించి దేశికులు మంచిపనిచేశారు. తనకు సోదరులు లేనప్పుడు, తండ్రికి సోదరులు లేనప్పుడు, పెదతాతగారికి బిడ్డలు లేనప్పుడు, కాకతీయవంశానికి తా నొక్కతే రాజ్యార్హతకలదని నిర్ణయింపబడినయపుడు తాను రాజ్యం స్వీకరింపకుండా ఏలా ఉండగలదు ?

ఈ విషయమై తనకూ, తండ్రిగారికీ, తమ దేశికులకూ దీర్ఘవాదోపవాదాలు జరిగినవి. తాను తనతండ్రివెనుక రాజ్యం చేసితీరవలసివచ్చింది. అలాటి ధర్మనిర్ణయం జరిగినవెనుక తన సర్వశక్తులతో మనోవాక్కాయ కర్మలచే ఆ ధర్మాన్ని ఆచరించితీరుతుంది. అది తన తపస్సు, తన జీవితం. తన ఆత్మ.

అలాంటి తపోమయ జీవితంలో పురుషుడు ప్రవేశించడానికి తావేది ? పురుషుడుగా, హృదయేశ్వరుడుగా, ఆత్మనాథుడుగా తనకు ఈ రెండు మూడు నెలలలో ప్రత్యక్షమైన ఆ దివ్యుడు తనకు కాడు. ఆ రూపము, గంభీరకంఠ మాధుర్యము తనకు దూరం కావాలి.

"స్వయంభూనాథా! నేను అబలను. అసహజమైన పురుషధర్మం నేను నిర్వహించాలి. యుద్ధంలో సైన్యాలను నడిపించుకొని విరోధులపై దండెత్తి, ్వర విరోధిసైనికులు, నాసైనికులు నాశనమవుతూంటే చూడాలి!

"తండ్రీ! స్వధర్మమూర్తీ! ధర్మరక్షణకోసం స్త్రీ పురుషులను శిక్షించాలి. బంధించాలి. ఎలా తప్పగలదు నీ ఆదేశం? అకుంఠితమైన ఈ భయంకర ధర్మం ఎంతకాలం నిర్వర్తించగలను?

"నాలోని సౌందర్యం నాశనమైపోవుగాక! నాలోని కాంక్షలు నుసిగా రాలిపోవుగాక! నా మనోనాయకుడు నాకు దూరమగుగాక!

"రాజ్యము వదలడానికి వీలులేదు. పురుషుని వదలలేను.

"ఈ కోలనైన చక్కని నామోము, రేఖలు ప్రవహించే ఈ దేహము, పొంకాలు తిరిగిన ఈ అంగాలు కృంగి, కృశించి, కర్కశరేఖలు తాల్చి నేను కురూప నగుదునుగాక!"

౧౮

రుద్రదేవికి కన్నులనీరు జల జల ప్రవహించింది. ఆమెకు తా నటునని విశ్వానికి లోనయిపోయినట్లు స్పష్టంగా తెలుసును. అయినా పొంగిపొరలి వచ్చే దుఃఖాన్ని ఆమె ఆపుకోలేకపోయింది. ఆమెను ధైర్యము పటాపంచలయింది. ఏ చెలిఅయినా, సేవకురాలయినా చూస్తారేమో అన్న సిగ్గు, కళ్ళు తుడుచుకుంది. కళ్ళు ఎఱ్ఱబడినాయి.

అలా క్రుంగిపోయి, ఆమె దీనహృదయై ఉన్న సమయంలో, ఆ కుతప కాలంలో శ్రీ రుద్రదేవప్రభువును దర్శించడానికి శ్రీ మల్యాల కుప్పమాంబికా దేవి, అన్నాంబికాదేవితో బంగారుపొదిగిన అందలాలనుండి నగరిప్రాంగణంలో దిగారు. వెంటనే ద్వారపాలకులు వారిని సగౌరవంగా తోడ్కొని అభ్యంతర మందిరాలలోనికి తీసుకొనిపోయి స్త్రీసభామందిరంలో కూర్చుండబెట్టినారు.

ఒక దౌవారిక పోయి విద్యామందిరకవాటందగ్గర నమస్కారం చేస్తూ 'జయ జయ! శ్రీ మహారాజులంవారికి. శ్రీ మల్యాల కుప్పమాంబికాదేవి, శ్రీ అన్నాంబికాదేవి మహారాజుల దర్శనానికి వేంచేశారు' అని మనవి చేసింది. ఆమాట వినడంతోటే రుద్రాంబికకు ఎక్కడలేని ధైర్యమూ కమ్ముకుంది. 'వారిని సభాగృహంలో కూర్చుండబెట్టు' మని ఆజ్ఞాపించి లేచి, విసవిసనడచి స్నానగృహం చేరి మోము కడుగుకొని దాసి అందిచ్చువస్త్రాన తుడుచుకొని, ఆమె కుప్పాంబిక, అన్నాంబికలు కూర్చొనిఉన్న స్త్రీ సభాశాల చేరింది.

దివ్యరూపంతో వచ్చిన ఒక బాలికనుచూచి మహారాణి ముమ్మడాంబికా అనుకున్నారు వా రిరువురూ! కాని వారు ముమ్మడాంబికను చూచే ఉండిరి. అంతకన్న పొడుగరియై దేవతాకన్యలా వచ్చిన ఈ బాల ఎవరు అని వారిద్దరూ తత్‌క్షణమే లేచి ఆమెకు నమస్కరిస్తూ నిలుచున్నారు. రుద్రాంబ నవ్వుతూ చరచరా వారిద్దరికడకు వచ్చి 'ఏమమ్మా, అలా తెల్లబోయి చూస్తున్నారు.

నన్నుసవాలు పట్టలేదా ?' అని ప్రశ్నించి, 'కూర్చోండి' అంటూ తాము వారి ప్రక్కను అధివసించింది.

అప్పటికి రుద్రాంబ మోములోని రేఖలు గమనించి, మాటలు విని వారిరువురూ ఈమె రుద్రమహారాజ్ఞి యని గ్రహించి అత్యంతాశ్చర్యం పొందినారు.

వా రిరువురూ రుద్రమహారాజ్ఞి పాదాలకు నమస్కరించారు. రుద్రాంబిక వా రిరువురిని లేవనెత్తింది.

కుప్పాం : ఈమె అన్నాంబిక, శ్రీ కోటారెడ్డి మహారాజు కొమరిత !

రుద్ర : అవును, లకుమయ్యకుమారుని వివాహం చేసుకోడానికి ఇష్టం లేకపోతే, మీరు ఆదవోని ప్రాంతాలకు వెళ్ళినప్పుడు మీతో పారిపోయి వచ్చిన బాలిక. అన్నాంబికాకుమారీ ! నీధైర్యమూ, సాహసమూ నా కెంతో ఆనందం కలుగజేసినాయి. మీరంతా ఈ నగరం రావడమూ నాకు తెలిసింది.

కుప్పాం : మహా.... మహా.... మహా....

రుద్ర : మహారాణీ ! అని పిలువుతల్లీ ! మీకు భయమేమి ? నేను ఇప్పుడు రాజూనూకాను, రాణినీకాను, వట్టి రుద్రమ్మను !

కుప్పాం : మహారాణీ, తమ దయ అనుపమానం ! ఈ బాలికను వెంట బెట్టుకొని మేము వచ్చినదినాలలో తమదర్శనం చేద్దామని సంకల్పించుకొంటిని. కాని ఇరువురు గజదొంగల అక్కనయిన నేను తమదర్శనం చేసుకోడానికి ధైర్యం లేకపోయింది.

రుద్ర : మరి యిప్పు డెలావచ్చింది ధైర్యం ?

కుప్పాం : ఈ అన్నాంబికా కుమారి నన్ను దినదినమూ వేగిరపెట్టింది మ.... మహా.... మహారాణీ !

రుద్ర : (చిరునవ్వుతో) కుప్పాంబికాదేవీ ! మీకు ఇంకా అనుమానం వదలలేదు. నన్ను రుద్రాంబికా అనే పిలిస్తే ఆనందం పొందుతాను.

అని ఆమె మందహాసవదన అయింది. అన్నాంబికాకుమారి ఇంతలో చటుక్కునలేచి రుద్రాంబిక పాదాలకడ మోకరించి, 'మహారాణీ, గన్నారెడ్డి ప్రభువు ఉత్తమవీరుడు, సుగుణసంపన్నుడు, అలాంటి ఆ ప్రభువూ, సర్వవిధాలా వారికి దీటువచ్చే విఠలధరణీశుడూ ఏలా దొంగలయ్యారో నాకు అర్థంకాలేదు. వారు నిజంగా గజదొంగలు కారు. మహారాణులవారు తమకు సహజమైన అపార కరుణతో వా రిద్దరినీ వారి అనుచరులతో క్షమిస్తే వారంతా తమసైన్యంలో చేరుతారు. శ్రీ గన్నారెడ్డి మహారాజు తమ కుడిచేయి కాగలడు మహారాణీ ! వారి నందరినీ క్షమించండి' అని కన్నుల నీరు ప్రవహింవ ప్రార్థించినది.

రుద్రాంబికాదేవి అన్నాంబిక మోము తీక్ష్ణంగా పరిశీలించి, ఒక్క నిమిషం పక పక నవ్వుతూ అన్నాంబికను గ్రుచ్చి ఎత్తి కౌగిటచేర్చుకొని, 'అన్నాంబికాకుమారీ ! నువ్వు వట్టి పేలవమ్మా ! కరిగిపోయే హృదయం నీది !

నువ్వు ప్రార్థించిన విషయం నేను బాగా పరిశీలించి తగినపని చేస్తాను.' అంటూ ప్రక్కన కూర్చుండబెట్టుకొన్నది. రుద్రాంబిక కుప్పాంబికాదేవి వైపు చూచి, కన్నుమూసి తెరిచింది. ఆమెయు అనుకున్నట్లు కన్నుమూసి తెరిచింది.

రుద్ర : అయితే ! నేను శ్రీ శివదేవయ్య దేశికులవారిని ఈ విషయం పూర్తిగా విచారించి గన్నయ్యప్రభువుతో రాయబారాలు సాగించమంటాను.

కుప్పాం : మహారాణీ ! మా తమ్ములిద్దరూ పసివాళ్లు. మూర్ఖులై అలా గజదొంగలని అపకీర్తిపాలైనారు.

రుద్ర : కుప్పాంబికాదేవీ ! గన్నయ్యప్రభువు మూర్ఖుడంటే నేను ఒప్పను. రాజ్యాలు ఎల్లా స్థాపన అవుతున్నాయి ? రాజులందరమూ బ్రహ్మదేవుని భుజంలోనుంచి వచ్చామని నమ్ముతున్నారా ? రాజరికం విశ్వపురుషుని భుజాలు అన్న ఉత్ప్రేక్షవాక్యాని కది వ్యాఖ్యానం! పురాణాలు చదవలేదా దేవీ ? ఎన్ని రాజవంశాలు రాలేదు, పోలేదు ? శివదేవయ్య మంత్రులవారు మా కాకతీయ వంశచరిత్ర నాకు చెప్పారు. బొట్టుభేత ప్రభువు మా పూర్వికు డెల్లాగో మాండలీకు లయ్యారు. ఆయన కందిపల్లవులకు మాండలీకుడు ! ఆయన చిన్నతనంలో విరోధులు వారి రాజ్యమైన అనుమకొండ, కొఱవిదేశం ఆక్రమించుకొంటే ఆయనకు సామంతులైన విర్యాల ఎఱ్ఱనప్రభువు ఆ విరోధిని జయించి కొఱవిదేశంలో మా పూర్వికుని సింహాసనం ఎక్కించి చనిపోయాడట. అతర్వాత ఎఱ్ఱప్రభువు భార్య కామమసాని తాను స్వయంగా సేనలు నడిపి, కాకతీయ మండలమైన సబ్బిసాహిర మండలం ఆక్రమించిన విరోధుల నాశనంచేసి ఆ బొట్టుభేతప్రభువును తిరిగి కాకతిసింహాసనం ఎక్కించింది.

అన్నాంబిక ; మహారాణీ ! కాకతీయవంశము భగవంతుని దయవల్ల రాజ్యం సంపాదించినది.

రుద్ర : కుమారీ ! రాజ్యాలు సంపాదించినవా రందరూ భగవంతుని దయవల్ల సంపాదించినవారే. ఈ భూమండలం ఏలే రాజులందరూ సూర్యవంశస్థులో, చంద్రవంశస్థులో ! మనం అంతా ఆర్యధర్మం త్యజించిన దుర్జయ వంశస్థులం ! మనం అంతా ఆర్యధర్మం తిరిగి గ్రహించినా యజ్ఞోపవీతం తీసివేయడంమూలాన సుక్షత్రియత్వం పోగొట్టుకొని, మనుమకులజులమై పోయాము. గన్నారెడ్డిప్రభువు మాకు తెలిసినంతమట్టుకు ఏవిధమైన గజదొంగతనమూ చేయలేదు. అల్లా చేసినట్లయితే శిక్షిస్తాము. లేకపోతే నెమ్మదిగా చెప్పించి రాజధానికి రప్పించుతాము.

అన్నాం : వారిరాజ్యం వారి కిప్పించరా మహారాణీ ?

రుద్ర ; గన్నారెడ్డి అలా పారిపోకపోతే ఇప్పించిఉండేవారమే. అతడు తాను వీరుడననుకొని పృథ్వీరాజ్యం వీరభోజ్యమని, స్వయంగా రాజ్యం

తిరిగి సంపాదించుకోవాలని అనుకున్నాడేమో ? వీటి అన్నిటికీ ఏమిగాని అన్నాంబికా రాకుమారీ ! నువ్వు నాతో కొద్దిదినాలు ఉండుతల్లీ ! కుప్పాంబికా దేవీ నాకోర్కె పాలించి ఈ బాలికను నాతో కొన్నిదినాలు గడపనీయండి.

కుప్పాం : మహారాణీ ! తమ ఇష్టమే మాకు శాసనం. అవశ్యం ఉంచుకోండి. అమ్మాయి కవయిత్రి, అద్భుత గాంధర్వవిద్యావిలాసిని. ఆమెను మీరు వినితీరాలి.

౧౫

ఆ సాయంకాలము రుద్రాంబ, అన్నాంబికా తోటలో విహరించారు. ఆ రాత్రి చుక్కలక్రింద కూర్చున్నారు. అన్నాంబిక రుద్రదేవికి తాను రచించిన పాటలు వీణ వాయిస్తూ మధురకంఠంతో పాడి వినిపించింది.

౧

"శివుని శిఖపై వెలిగి చిన్నారి నెలవంక
భవురాణి భ్రూమధ్య ప్రసరించి వెలుగు
శివుని పెదవులనాడు ధవళ చంద్రజ్యోత్స్న
భవురాణి చూపులో పర్వి లోకము నిండు.
నా వియోగములోన నాతి వెన్నెలయేది ?
నా నవ్వులని చేరె నళినాక్షి చంద్రుణ్ణి.

౨

"దొంగవాడట కృష్ణుడూ వెన్న
దొంగిలించెడువాడె వెన్నుడూ
దొంగలకు గురువటే దొంగలకు దేవుడటె
అంగనల హృదయములు దొంగిలించెడువాడె
దొంగవాడట.......
వలువలను హరియించి వనిత ఎక్కెనె పొన్న
కలగని మనసుతో చెలువ వేణువునూదు
దొంగవాడట......"

ఈ పాటలను పాడుతూఉంటే అన్నాంబిక కంఠంలోనుంచి ప్రవహించిన గాంధర్వవాహిని అలకనందలా అత్యంతశీతలమై భయంకరమై గజగజ వణికించింది. రుద్రాంబిక అన్నాంబికను తన హృదయాని కదుముకొని గట్టిగా కౌగిలించుకొంది. రాజ్యరథాశ్వపాశాలను ధరించిననూ కోమలమైన తన రెండుచేతులా అన్నాంబిక చెంపలబట్టి మోమెత్తి ఆమె కన్నులలోకి చూచి 'చెల్లీ ! నీవున్నా వలెనే బాధపడుతున్నావా ? మనకన్న వ్యవసాయం చేసుకొనే రెడ్డిబిడ్డ

నయంకదూ ? నీ హృదయం అంతా నా కర్దమైంది. నీ తండ్రికి విరోధీ—గజదొంగా, నీ సార్వభౌమునకు విరోధీ-అపఖ్యాతికి సిద్ధై వెన్నాదేవాడూ నాయకుడా? కష్టసుఖాలు దరికిచేరని రాణివాసంలో కుసుమకోమలి, ఒక మనోహరాంగి—నాయికా ? ఈలాగే ఉంటాయి తల్లీ లోకం పోకడలు.'

"ఒక సార్వభౌముని కొమరిత, భావిచక్రవర్తిని—నాయిక ! ఉత్తమ సామంతుడు, వీరుడూ-నాయకుడూ. స్త్రీలకు స్వాతంత్ర్యంలేదు. అక్కగారూ ! పురుషులకు స్వాతంత్ర్యం ఉందంటాము. నిజంగాలేదు. పురాణాలలో ఒకరికై ఒకరు పుట్టి, ఒకరినొకరు ప్రేమించి, ఒకరినొకరు చేరడానికి ఎన్నో బాధల నంది చివరకు మనోరథసిద్ధి పొందుతారు. కాదా అక్కగారూ ?"

"కాళిదాస కుమారసంభవంలో పార్వతి శివునికై విరాళి-లాభంలేక తపస్సు-అప్పుడు శివుడు పార్వతిని ఇదివరకే ప్రేమించి ఉన్నాడు గనుక వివాహం చేసుకుంటాడు. రామునికై సీత ఉద్భవించింది, వారిద్దరివివాహము అడవుల పాలు-లంకానగరశోకవనవాసం, లంకాయుద్ధం-అగ్నిపరీక్ష-పట్టాభిషేకం ! మన చరిత్రలు అలాఎందుకుంటాయి చెల్లీ ? మన కీ రాజ్యాలు వద్దు. చక్కని నగలు, అందమైన వస్త్రాలు, ముద్దులుగులికే బిడ్డలు, కోరినభర్త ! అవీ కావలసినవి. మనలో బడాయి లున్నాయి. గర్వం ఉంది. రాణులుగా ఏడాదికోసారి మనం నగలతో, అద్భుతమైన వస్త్రాలతో ప్రజల కంట బడుతాము. అప్పుడేగద మన అందాలను, ఐశ్వర్యాలను లోకమూ, లోకంలోని స్త్రీలూ చూచి మెచ్చుకొనేది చెల్లీ!"

అన్నాంబిక నిట్టూర్పు విడిచింది.

"ఇంకముందు మన జీవితం మన నాథులు, మన బిడ్డలు, సాధారణ భార్యలలా మనం భర్తజీవితంలో జీవితమై, అతని సంతోషం, అతని పాటు, అతని కృషి, అతని చెమట, అతని బాధ, అతని పశుత్వము చూచి, అతడు మన కృషీ, మన మాతృత్వము, మన దాసీత్వము, మన సంతోషం, మన బాధ, మన ఆట, మన పాట చూస్తూఉండగా-నాగలి లాగే రెండు పశువులూ, పడవను నడిపే చుక్కానీ గాలులుగా జీవితయాత్ర సాగించడానికి వీలుందా చెప్పు !"

అన్నాంబిక ఆశ్చర్యంతో మహారాణిని చూచింది.

"అంతఃపురాలలో పంజరాలలోని చిలుకలులా ఉండి, భర్త ఎప్పుడు వస్తే అప్పుడు పుత్తడిబొమ్మలులా వేషాలు వేసుకొని, మన అందాలు, మన భూషణాలు, మన చీరలు చూచేది మన దాసీలే అయినా సపత్నుల గొడవలలో పడి, కృంగి, కృశించి, మనబిడ్డలకు మనం పాలిచ్చుకోవడానికి వీలులేక, మన వంటలు మనం తినడానికి వీలులేక, అనవసరమైన కూరలు, భక్ష్యాలుతింటూ, ఆరోగ్యంలేక, అందంపోయి నగలూ, చీరలే అందాలైతే రహస్యంగా ఏడ్చి

ఏదిపి కావ్యాలలోనూ శాసనాలలోనూమాత్రం ఎక్కి అదే పదివేలనుకొని సంతోషిస్తాం చెల్లీ!"

అన్నాంబిక కన్నుల నీరు క్రమ్మెను.

"రాజ్యంకోసం ఆ రాజకొమరుని పెండ్లి చేసుకోవాలి మనం! ముక్కూ మొగం ఎరుగము మనం. రాజ్యాలు పాలించే ప్రభువుల బిడ్డలము, రాజ్యాలు పాలించే ప్రభువుల భార్యలము, రాజ్యాలుపాలించే బిడ్డల తల్లులము. అందుచేత మన చుట్టూ గోడలు, మనపైన గోడలు, అనుకున్నచోటికి వెళ్ళడానికి వీలులేదు. వెళ్ళడానికి ఇష్టంలేకపోయినా, వెళ్ళవలసినచోటికి వెళ్ళితీరాలి."

అన్నాంబిక రుద్రదేవి ఒళ్ళో వాలిపోయింది,

"రాజ్యాలకోసం అన్నదమ్ముల పోట్లాట, నాశనంచేసుకొనడం, మామకూ, అల్లుడికీ, బావమరదులకూ యుద్ధాలు-కౌరవయుద్ధం! చాళుక్య గణిక విజయాదిత్య రాష్ట్రకూట కృష్ణరాజ యుద్ధం! ఏమి భయంకరమమ్మా ఈ రాచపుట్టువు?"

ఈ ఉపన్యాసం అంతా తెల్లబోయి విన్నది అన్నాంబిక. ఆ బాలిక కన్నుల దొనదొన నీరు పొంగింది, జలజల అశ్రులు రాలిపోయాయి. రుద్రదేవి ఒడిలో తలపెట్టుకొని, నిర్వచింపరాని ఆవేదనతో కరిగిపోయింది రుద్రదేవి ఆ బాలికను మళ్ళీ కౌగిలిలోకి తీసుకొని "చెల్లీ, ఈ క్షణంలో నేను ఆంధ్ర సామ్రాజ్యానికి రాజప్రతినిధినికాను, నువ్వు ఆదవోని మండలేశ్వరుల తనయవూ కావు. నువ్వు బాలికవు, నేను బాలికను. నువ్వు గన్నారెడ్డిని ప్రేమిస్తున్నావు. నేను చాళుక్య... చాళుక్య వీరభద్రుని ప్రేమిస్తున్నాను. నువ్వు కొంచెం నాకన్న నయం...."

అన్నాంబిక తలఎత్తి-కంటినీటితో ఉన్న-మోము ప్రఫుల్లమై వికసించి వానతో తడిసిన పూర్ణకమలంకాగా నవ్వుతూ 'మహారాణీ....' అని ఏదో చెప్ప బోయింది. వెంటనే రుద్రదేవి ఆ బాలిక నోరు మూసి "చెల్లీ, ఒంటరిగా వున్న ప్పుడు, నేను నిన్ను 'చెల్లీ!' అంటాను. నన్ను నువ్వు 'అక్కా!' అని పిలు, తెలిసిందా? లేకపోతే నేను నువ్వు ఊహించలేని బాధపడతాను. ఇది మనిద్దరి మధ్యా రహస్యం తల్లీ!" అన్నది. అప్పుడు అన్నాంబిక పకపక నవ్వుతూ లేచి నాట్యంచేస్తూ,

"తెలిసిందమ్మా నాకొక తియ్యని కమ్మని రహస్యమూ,
దీనులపాలిటి మందారమ్మొక దేవికి మెత్తని హృదయమ్మా:
బంగారపు బొమ్మలకైనా పల పల మనునే ప్రణయమ్మా
పుత్తడి బొమ్మకు హృదయములోనే పురుషుడొక్కరు నివాసమ్మా"

అని కిలకిల నవ్వింది.

రుద్రదేవి 'దొంగపిల్లా, అల్లరిచేస్తావా? నీపని పడతా ఉండు' అంటూ పీఠంనుంచి లేచి పరుగున వచ్చింది. అన్నాంబిక అందకుండా పరుగెత్తింది.

రుద్రమ్మ తరిమింది. వారిద్దరూ ఆ మందిరంనుంచి ఇంకో మందిరంలోకి పరుగిడిరి.

## ౧౬

ఆ రాత్రి వారలా పరుగెత్తుతూ ఉంటే, మహారాణి ముమ్మడమ్మ అక్కడకు వచ్చుటకు అనుమతి వేడుతూ ప్రతీహారిణిని పంపింది. చిన్నబిడ్డలా ఆటలాడుకొను రుద్రదేవికడకు దాసీలు ఎవ్వరును రా వెరచినారు. ఒక కొత్త ఆమె ఎవ్వరో దూరాన భయభక్తులతో నిలిచి ఉండడం అన్నాంబిక కనిపెట్టింది.

వగరుస్తూ, నవ్వుతూ అన్నాంబిక రుద్రదేవికడకు పోయి 'అక్కా, ఎవ్వరో నీకోసం వచ్చారమ్మా' అని తెలిపింది. రుద్రదేవి అన్నాంబిక దృష్టివైపు పరికించి ముమ్మడమ్మ ప్రతీహరిణిని చూచి అన్నాంబికను దగ్గరకు లాక్కొని 'చెల్లీ! అల్లా పిలవాలి నన్ను: లేకపోతే నీపని పట్టించిఉందును. ఇక నా కొమరిత, నా చెల్లెలు, నా భార్య అయిన ముమ్మడాంబికను చూద్దువుగాని' అంటూ రుద్రాంబిక ఆ ప్రతీహారిణిని దగ్గరకు రమ్మని సైగచేసి 'మహారాణిగారు మా అలంకారమందిరంలోకి వస్తారుగాక! వారిని మేము ప్రేమ పూర్వకంగా ఆహ్వానిస్తున్నాము' అని తెలిపింది.

ఆ ప్రతీహారిణి భక్తితో తలవంచి వెనుకకు నడచుచు ముమ్మడాంబికాదేవి నగరిలోనికి వెళ్ళిపోయింది.

రుద్రదేవియు, అన్నమదేవియూ అలంకారమందిరంలోకి వెళ్ళినారు. అక్కడ వారు కూర్చుండి మాటామంతీ చెప్పుకుంటోంటే ఘల్లు ఘల్లుమని బంగారుగజ్జెలు చప్పుడుకాగా ముమ్మడమ్మ చెలికత్తెలతో గుమ్మందగ్గరకు వచ్చింది చెలులు గుమ్మంకడనుంచి వెనక్కు వెళ్ళారు. ముమ్మక్క లోనికి వచ్చింది.

ఆమె లోనికి రాగానే రుద్రదేవీ, అన్నాంబికా లేచిరి. రుద్రదేవి ముమ్మడమ్మకు అన్నాంబికను చూపిస్తూ 'దేవీ! ఈ బాల ఆదవోనిప్రభువుకు ఏక సంతానం, అన్నాంబిక. మన చెల్లెలు సుమా!' అని తెలిపింది. ముమ్మడమ్మ పాదాలకు అన్నాంబిక నమస్కరించింది. ముమ్మడమ్మ నవ్వుతూ అన్నాంబికాదేవిని భుజాలతో లేవనెత్తి 'చెల్లీ! నువ్వూ, నా భర్తగారూ ఆడుకుంటూ ఉండడము నాకు దాసీల వల్ల తెలిసింది. మా భర్తగారితో ఆటలాడుకొనేందుకు ఇంకో భార్య వచ్చిందేమో అని భయపడి, ఉడుకుబోతుతనంతో చక్కావచ్చాను' అంటూ పక పక నవ్వింది.

ఆ ముగ్గురు బాలికలు విరగబడి నవ్వుకున్నారు. ఆనందంతో ఉప్పొంగిపోయారు. వారి హృదయాలు త్రివేణీ సంగమం అయ్యాయి. ముమ్మడమ్మా, రుద్రమ్మా మరింత సన్నిహితులగుటకు అన్నాంబిక కారణం అయింది.

వారు దాగుడుమూత లాడుకొన్నారు. కథలు చెప్పుకొన్నారు. రుద్రదేవి తన మధురకంఠంతో పాటలు పాడింది. కర్షకవధువులవలె ఆడుకున్నారు.

రుద్ర; ఒసే పిల్లా! నేను పొలం ఎల్ల వల్సిందిగదా ఇంతకూడై నా ఎట్లవేంటి?

ముమ్మ : నే నేటి సేసేది మారాజా ! నన్ను మీ సెల్లెలు అన్నమ్మ వొన్నం వొండని స్తే గంద.

అన్న : ఓరబ్బో ! ఏటిమాటలు సెప్తుందవు వొదినా ! నా అన్నకీ నాకూ తగువులాశెట్టి....

రుద్ర : నిన్ను అత్తింటికి పంపేయాలని సూస్తున్నదిగందా.

ముమ్మ : మా ఆడబిడ్డకు భరత ఎక్కడుందాడు ?

రుద్ర : ఏమో ఏ అడవుల్లో వుండాడో ?

అన్న : లేకపోతే ఏ రాచకొలువులో ఉండాడో !

ముమ్మ : ఓయి మారాజ !

సద్దికూడూ మెక్కి సల్లగుండావూ
పొద్దెక్కినాదయ్యో పొలమెల్లిపోవూ ?

రుద్ర : నారాణిసూస్తుంటె నాగుండెకొట్టు
ఏరు వొరిణింతురే నినొ్నసి ఒట్టు

అన్న : ఒకరంద మొకరిలో ఊగిపోతూ ఉంటె
ఒయ్యారి నావొదినె ఒదలగలదే అన్న !

తమ పాటలకు తామే కలకలలాడేరు. రుద్రమ్మ ముమ్మడమ్మను చూచి 'పెద్దచెల్లీ ! ఈ రాత్రి ను వ్విక్కడే ఉండు. కాని నీ రహస్యం ఓటి నాకు తెలిసి పోయిందిలే ! నేను భర్తను ఉండగా ఎందుకమ్మా మొన్న నా పట్టాభిషేక సమయంలో ఒకర్ని అంతదీక్షగా పారకించావు ?' అని ప్రశ్నించింది.

ముమ్మ : చూడు చెల్లీ ! ఈ అక్క ఏమంటున్నదో ! తాను పురుషుడై, రాజప్రతినిధై సింహాసనం ఎక్కి కూర్చున్నదీ ! ఎదురుగుండా ఒక అందగాడు రాజప్రతినిధిని చూచి నిట్టూర్పులు విడవడమా ? ఆ అబ్బాయినిచూచి రాజప్రతినిధి గారికీ నిట్టూర్పు లెందుకు ?

రుద్ర : అవునవును. ఆ అబ్బాయిగారి పక్క ఓచిన్నబ్బాయి సింహాసనం అధివసించి ఉంటే, ఆ చిన్నబ్బాయిని చూచి నిట్టూర్పులు ఓ తాయిలంగారే విడిచి అదంతా నామీద త్రోయడమా ?

అన్నాం : హోహో ! చిన్నక్కగారూ పెద్దక్కగారూ మీలోమీరు తగాదా లాడి అన్ని రహస్యాలూ వెల్లడించుకొంటున్నారా ! చిన్నక్కా ! ఎదుటివా రెవరు ? పెద్దక్కా ! ఎదుటివారి పక్కనా రెవరు ?

ముమ్మ : ఎదుటివారు చాళుక్య....

రుద్ర : పక్కవారు చాళుక్య....

అన్నాం : చాళుక్యఅంటే ? ఇద్దరు చాళుక్యు లున్నారా ఏమిటి ?

ముమ్మ : నాకు తెలియదు.

అన్నాం : చాళుక్యవీర....

ముమ్మ : అదే చాళుక్య....

అన్నాం : చాళుక్య మహా....

రుద్ర : అదే చాళుక్య....

అన్నా : సరేలెండి !

నాకు తెలిసిందమ్మ నాకు తెలిసింది
దొంగలిద్దరి గుట్టు దొరసాని విసవె :

రుద్ర : ఒక తాయిలంగారికి దొంగలంటే మా ఇష్టంట. దొంగ అనే మాట వినగానే వసంతంలో మల్లెలు వికసించిన ట్లయిపోతుందట !

ముమ్మ : దొంగలంటే నాకు భయమూ
దొంగమాటె తేపు నయమూ !
దొంగపిల్లా నీకు దొంగలన ప్రీతటే !
దొంగల్ని తలచుకొని పొంగిపోతావుటే ?

ముగ్గురూ తెల్లవారేవరకూ మాట్లాడుకుంటూ ఉండిరి. రుద్రదేవి ఇరువురితో సకలాంధ్రదేశములోనూ కాకతీయవంశం అంటే కొందరు తిరుగుబాటు చేయబోతున్నారనీ, అందుకు కారణం తాను స్త్రీఅయి సామ్రాజ్య సింహాసనం అధివసించనుండుటయే అనిన్నీ, అందుకు శ్రీ శివదేవయ్య దేశికులు, ప్రసాదాదిత్యప్రభువు ప్రతిఎత్తుకుగా చేస్తున్న కృషి అవన్నీ చూచాయగా వివరించింది. రాజద్రోహం ఆచరించేవారి పేరులు మాత్రం బయటపెట్టలేదు.

మాటలు చెప్పుకొని చెప్పుకొని ఆ బాలలు ముగ్గురు విపులమై పాలసముద్రంలా ఉన్న రుద్రదేవి తల్పంపై ఒళ్ళు తెలుగక నిదురపోయిరి.

షష్ఠగాథ

# గజదొంగ

## ౧

గన్నారెడ్డికి ఇప్పుడు ఇరువదినాల్గవయేడు జరుగుతున్నది. అతనికన్న రెండేళ్ళు చిన్న విఠలధరణీశుడు. గన్నారెడ్డి ఆరడుగుల పొడవు, కోలమోము, వెడదఫాలం, తుమ్మెదరెక్కలవంటి చిన్న కోరమీసాలు.

విఠలధరణీశుడు ఏనుగుగున్న. అతని బలం భీమబలం. అతడు ఎంత పెద్ద బండరాయినైనా బంతివలె ఎత్తి ఆవలకు గిరవాటు వేయగలడు. ఏనుగులతో కుస్తీ పట్టగలడు. సింహాలతో, పెద్దపులులతో నిరాయుధుడై యుద్ధంచేసి, చిన్న గాయమైనా లేకుండా వాని ప్రాణాలు హరింపగలడు; అతని దండలు చిన్న మద్దిచెట్టుల మొదళ్ళవలె ఉంటాయి; అతని ఛాతీ ఒక కొండచరియయే. అతడు వేళాకోళంగా వీపుమీద చరిస్తే స్నేహితులు కూలబడి మూడు పల్టీలు వేస్తారు.

గన్నారెడ్డికి విఠలధరణీశుడు కుడిచేయి అయితే, అయిదడుగుల పది అంగుళాలున్న సూరనరెడ్డి అనే యువకుడు ఎడమచేయి. సూరనరెడ్డి దేహం ఒక చిన్న కొండే. అతన్ని శూలంతో పొడిస్తే చీమ కుట్టిం దనుకుంటాడు. శూరులు అతనికి ప్రత్యర్థులుగా ఎదుట పడడం అంటే వణికిపోతారు. మనుష్యుల్ని, గుఱ్ఱాల్ని, ఏనుగుల్ని, రథాల్ని సునాయాసంగా ఎత్తి నేలవేసి కొట్టడం అంటే అతనికి మహాప్రీతి.

సూరనరెడ్డి, విఠలుడూ మల్లయుద్ధంచేస్తే రెండు కొండలు, రెండు భూగోళాలు ఢీకొన్నట్టే! ఇద్దరూ పెద్ద ఇనుపగదలతో యుద్ధం చేయడమంటే ఎంతో ముచ్చట పడతారు. కాని వీ రిరువురికన్నా సన్నగా ఉన్నా సింహవిక్రముడైన గన్నారెడ్డితో వారు మల్లయుద్ధానికి తలపడరు. గన్నారెడ్డి పట్టుకు దొరకడు. అతని మాయలు ఒరు లెరుగరు.

గన్నారెడ్డికి ఇరవై ఒకటవ సంవత్సరం జరుగుతూఉన్న సమయంలో రాజవంశాలలోని యువకులు మూడువందల నలభై మందితో కలిసి ఓరుగల్లు వీడి అడవుల బడ్డాడు. తమ తమ మండలాలనుంచీ, విషయాలనుంచీ, నాడులనుంచీ ఆ యా యువవీరులు దిట్టరులైన సైనికుల్ని సేకరించుకొన్నారు.

"మే మందరం గజదొంగలం, శ్రీ శ్రీ గణపతిదేవ చక్రవర్తి వృద్ధులై, రాజ్యభారం వహించలేని స్థితిలో, ఈ దేశంలో అరాచకం వచ్చింది కాబట్టి మేము మా ఇష్టంవచ్చినట్లు దేశాలను దోచుకుంటాము. అధర్మంలో అధర్మ

పోతాము. రాక్షసులలో రాక్షసులమైతాము" అని శివదేవయ్య మంత్రికి కమ్మ వ్రాసి, వాండ్లు అడవులదారి పట్టినారు.

ఆ దినం ఓరుగల్లు దద్దరిల్లింది. కాకతీయవంశానికి భక్తులై, చక్రవర్తులకై తమ ప్రాణాలూ, తమ సర్వస్వమూ సమర్పించడానికి సిద్ధంగా ఉన్న మాండలికుల పుత్రు లెందమందో ఆ గజదొంగల జట్టులో చేరారు. రేచెర్ల వారి బిడ్డ లెందరో అందులో చేరారు. మాల్యాల చౌండ్యసేనాని మనుమడా జట్టులో చేరాడు. విర్యాలవారి బిడ్డలు చేరినారు.

ఈగజదొంగలజట్టుకు సర్వసేనాని గోనగన్నారెడ్డి, అతనిమాట ఆయువకు లకు దేవాజ్ఞ. అతడంటే ప్రాణాలు విడుస్తారు. అతడు నిప్పులో దూకమంటే దూకుతారు. పెద్దపులిచెవులు పట్టుకొని లాక్కురమ్మంటే లాక్కువస్తారు.

గన్నారెడ్డి తాను గజదొంగల నాయకుడు కాకపూర్వమే శ్రీశైలానికి పడమరగా ఉండు నల్లమల అడవులలో, భయంకర ప్రదేశంలో పాడుపడిన పట్టణం ఒకటి చూచాడు. ఆ పట్టణం ఆంధ్ర శాతవాహన చక్రవర్తులనాటిది. నాగార్జున పర్వతలోయలో ఉన్న ఇక్ష్వాకుపట్టణమైన విజయపురంవలె ఈ నగరము ఆ పూర్వ కాలంలో మహోత్తమదశను అనుభవించింది. శాతవాహన రాజ్యాలు అడుగంటిన వెనుక పల్నాటిరాజులైన పల్లవులు విజృంభించినారు. ఆ దినాలలో ఈ నగరం పాలించే ఆంధ్రభృత్యుడైన ఒక శాతకర్ణి పల్లవులను ఎదిరించి ఆరేండ్లు పెక్కు యుద్ధాలలో ఓడించాడు. చివరకు పల్లవులచే ఓడిపోయాడు. పల్లవులా నగరమును నాశనంచేశారు. ఇవివైయేళ్ళలో ఆ నగరాన్ని భయంకరారణ్యం కబళించి వేసింది.

ఈ నగరం చుట్టూ, ఇక్ష్వాకుల విజయపురిచుట్టూ ఉండే కొండలకన్న ఎత్తయిన కొండ లున్నాయి. ఆ లోయలోనికి ఒక్కటేదారి. అది కృష్ణఒడ్డునుండే ఉన్నది. శ్రీశైల పర్వతప్రాంతాల కృష్ణానది కొండల దొలచుకొనిపోయి పాతాళ గంగలా ప్రవహిస్తున్నది. శ్రీశైలానికి నన్నెండుమైళ్ళ ఎగువలో కృష్ణకు తాకి ఉన్న ఒక కొండ రెండువందల బాహువుల ఎత్తు ఉంటుంది. (1 బాహువు — ఈనాటి 2 గజాలు) ఆ కొండప్రక్క ప్రదేశంఅంతా అడవితో నిండి ఉంది. ఆ అడవిలో ఒక విచిత్రమైనదారి ఉంది. తెలియనివారు ఆ దారిని ఒక సంవత్సరం పాడుపడినా కనుగొనలేరు.

ఆ పాడుపడిన నగరంలోని ఇళ్ళు, మేడలు గన్నారెడ్డి బాగు చేయించాడు. కూలిపోయిన కోటగోడలు మళ్ళీ యథాప్రకారంగా కట్టించినాడు. అయినా ఆ గోడలమీద అడవితీగెలు, గుబురుచెట్లు ఇంకను పెంచినారు. పైకిచూస్తే పాడుపడి, మొక్కలతో నిండి ఉన్నట్లుంటుంది. కాని మేడలూ, నగరాలూ చక్కగా యథారీతి బాగుచేయించినాడు గన్నారెడ్డి.

ప్రతిగృహమూ, అలాగే ఉన్నది. పైన పాడు, లోన సౌందర్యము. ఆ కోట బాగుచేయించే సమయంలో గన్నారెడ్డికి నాలుగునిధులు దొరికాయి. ఒక నిధిలో వెండి బంగారు నాణెములు కొన్నిలక్ష లున్నవి. ఇంకొక నిధిలో నవరత్నఖచిత సువర్ణాభరణాలు వేలకువే లున్నవి. ఒక చోట పూర్వకాలపు ఆయుధాగారము కాబోలు ; దానినిండా పూర్వకాలపు ఆయుధాలు తుప్పుపట్టినవి, తుప్పుపట్టక ఇప్పటికీ సరియైన స్థితిలో ఉన్నవి దొరికినవి. నాల్గవనిధిలో రాగి కడ్డీలు, సీసపుకడ్డీలు, ముత్యాలు, ముద్దలు, వెండిఇటుకలు ఇరవై మువ్వదిబళ్ళ వస్తువులు బయల్పడినాయి.

గోన గన్నారెడ్డికి ఇట్లు మూలధనం దొరికింది. సైన్యాలతో పోయి చిన్న సామంతులకు కొద్దికొద్ది పన్నులు విధించి ధాన్యాలు, ధనాలు పేకరిస్తున్నాడు. అతడు దాగుకొని ఉన్న ఆ పాడుపట్టణం చుట్టుప్రక్కల ఉన్న రైతులు కూరగాయలను పండించి అతని సైన్యాలకు అందిస్తున్నారు. వారి కాతడు ఎక్కువ మూల్యం అందిచ్చేవాడు.

ఆ రహస్యదుర్గానికి చుట్టూఉన్న చెంచులూ, బోయలూ, గోన గన్నారెడ్డి సైన్యానికి ఉపసైన్యాలుగా ఉంటూ ఆ దుర్గరహస్యం లోకానికి ఎవ్వరికీ తెలియకుండా కాపాడుతున్నారు. ఆ పరిసరాల ఎక్కడో గన్నారెడ్డి దుర్గము ఉందని మాత్రం అందరికీ తెలియును. కాని అది ఎక్కడో ఎవ్వరికీ తెలియదు.

౨

ఆ రహస్యదుర్గంలో గన్నారెడ్డీ, అతని సహచరులూ సర్వకాలం మల్లయుద్ధాలలో శిక్షణ పొందుతూ ఉంటారు. గన్నారెడ్డి వారికి యుద్ధవిధానాలు అనేకం నేర్పుతూ ఉంటాడు, సైనికు లనేకులు భార్యలను, ప్రియురాండ్రను. తల్లులను తెచ్చుకొన్నారు. ఒక్కొక్కప్పుడు సైనికుల వినోదార్థము తోలుబొమ్మలు, యక్షగానాలు, జక్కులకథలు, పల్నాటి వీరగాథలవంటి బుర్రకథలు, పురాణ శ్రవణము, సంగీతసభలు, విద్యావ్యాసంగము, నాట్యసభలు ఆ రహస్యదుర్గంలో జరుగుతూ ఉంటాయి.

గన్నారెడ్డి మంత్రులలో దిట్టమైన ఆరువేల నియోగి బ్రాహ్మణ బాలకు లున్నారు. ఆ బాలకులలో మేటి సోమయామాత్య కుమారుడైన చినఅక్కినమంత్రి. ఈ అక్కిన శివదేవయ్యమంత్రి శిష్యుడు. రాజనీతి తన శేశువికడ సంపూర్ణంగా గ్రహించి ఆ చిన్న తనంలోనే పెద్దరాజ్యరథపు పగ్గాలను దృఢముష్టితో పట్టుకున్నాడు.

గన్నారెడ్డి చినఅక్కినమంత్రిని తనకు ముఖ్యమంత్రిగా, అపసర్ప విద్యాపరిశోధకుడుగా ఏర్పరచాడు. అపసర్పనాయకుడు సబ్బప్ప ఆ విద్యలో ఆరితేరినవాడు. ఓరుగల్లు అపసర్పగణనాయకుడైన శ్రీ విరియాల గొంక

ప్రభువు తనయుడు. అతడు వేయని వేషం లేదు. ఆ రహస్యదుర్గంలోని సేనా పతులు ఒకరినొకరు చూచుకొని నువ్వు సబ్బప్పవు కాదుగదా అని ప్రశ్నించు కుంటారట. ఒకనాడు ఒక బాలనాయకుడు ఒక తేలును చంపుతూఉంటే, పక్క వారు ఆ తేలు సబ్బప్పేమో చంపవద్దన్నారట.

ఆ రహస్యదుర్గంలో కొలుముతీర్చిఉన్న గోన గన్నారెడ్డికి సబ్బప్ప ఒక నాడు ఒక లేఖామంజూషను తెచ్చి ఇచ్చినాడు. ఆ మంజూషచుట్టూ ఉన్న దారపు ముడిని సునాయాసంగా విప్పి గన్నయ్య శ్రీ శివదేవయ్య దేశికుల లేఖ చదువు కొన్నారు. వెంటనే ఆయన తనమంత్రి చినఅక్కినప్రెగడను చూచి "ఏమండీ అక్కినామాత్యులవారూ, మా బాబయ్యగారు లక్షలాది సైన్యం నడిపించుకొని ఈ చుట్టుప్రక్కల విడిదిచేసి ఉన్నారని మనకందరకూ తెలుసును. వారితో మా తమ్ముడు వరదారెడ్డిప్రభువు తన్ను తీసుకొనివచ్చిన దారి జ్ఞాపకం ఉంచుకొని తండ్రికి దారి చూపించి అంతవరకు తీసుకు రాగలిగాడు. కాని కళ్ళకు గంతలుకట్టి మనం మన దుర్గానికి తీసుకువచ్చాము. ఆ రహస్యదుర్గం కని పెట్టాలని ఇప్పటికి నెలరోజులనుండి మా చిన్నాయనగారు ప్రయత్నం చేస్తున్నారు. కాని ప్రయత్నా లన్నీ వృధా అయిపోయినాయి.

"ఇక్కడ శ్రీ శివదేవయ్య మంత్రులవారి ఉత్తరంచూస్తే ఒక విచిత్రం చేద్దామని తోస్తున్నది. మా చిననాయనగారిని మాయచేసి, ఒక్కణ్ణి బంధించి, ఓరుగల్లు చేర్పించి, అక్కడ శివదేవయ్య మంత్రులవారి చేతుల్లో పడేటట్లు చూద్దాము. వెంటనే మనం వెళ్ళి మా వర్ధమానపురపు కోటను ముట్టడిసాము. పట్టుకుందాము. అదికూడ చిత్రంగానే! పినికి మీమీ ఉద్దేశాలు చెప్పండి" అని సభాముఖమై అడిగెను.

విఠలధరణీశుడు వెంటనే, 'అద్భుతం' అన్నాడు. సూరపరెడ్డి తలఊచాడు. చినదామానాయుడు చాలా బాగుందన్నాడు. అందరూ 'వెంటనే' అన్నారు. అప్పుడు చినఅక్కినప్రెగడ లేచి గన్నారెడ్డిని చూచి 'ప్రభూ! తాము ఆలోచించినది సరియైనదేకాని మనం ఎందుకోసం ఈలా గజదొంగలం అయ్యామో ఆ ఉత్కృష్ట కార్యం అలా ఉండగానే వర్ధమానపురపుకోట పట్టుకోగూడదు. లకుమయను ఖైదీగా పట్టుకొని ఓరుగల్లు మహానగరం పంపిద్దాము. అంతే! ముందుంది ముసళ్ళ పండుగ! మీరే ఆలోచించండి' అని మనవిచేశాడు. ఇరువదిఒక్క సంవత్సరం ఈడుగల అక్కిన తలఊపుతూ ఒక్కొక్కమాటే ఆలోచనాపూర్వకంగా ఈలా చెప్పనాడు.

గన్నారెడ్డి విని 'అవును, అక్కినమంత్రీ మీ మాటలు నాకు నచ్చాయి. అలాగ చేద్దాము. మా చిననాయగారిని రాత్రిరాత్రి మాయంచేయాలి. దానికి ఉపా యం ఈ రాత్రే ఆలోచిస్తాను' అని చెప్పి లేచినాడు సభ ముగిసింది.

ఆ రాత్రి 'ఏమయ్యా సబ్బినాయకా! మీ వేగులవారు పరిశీలించి తెచ్చి కొని వచ్చిన విషయాలు కొన్ని కావాలి నాకు' అని తన ఏకాంతమందిరంలోనికి సబ్బయ్య నాయకుని పిలిపించి గన్నయ్య అడిగాడు.

సబ్బి : మహారాజా! సైన్యం అంతా కృష్ణాతీరం పొడగునా విడిశారు. మీ పినతండ్రిగారి శిబిరం శ్రీశైలందగ్గర ఉన్నది. వివిధ సైన్యాలన్నీ కలిపి ఒకలక్ష ముప్పదివేలమంది ఉన్నారు. ఆయన వేగులవారు ఈ ప్రదేశాలన్నీ సూదిని వెదికినట్లు వెదుకుతున్నారు. జల్లెడతో గాలిస్తున్నారు. ఎన్ని సారులు చూచినా ఈ దుర్గానికి మార్గం దొరకటంలేదు. ప్రభువుల ఆజ్ఞ చొప్పున మన దుర్గంలో ఒక్క దీపం, ఒకమంట కూడా రావటంలేదు. పగలు పొగరాకుండా వంటలు చేయిస్తున్నాను. అయినా మన దుర్గాన్ని వారు కనిపెట్టవచ్చునని ఏచారుడైనా రావచ్చు. అలా పడిగావచ్చిన చారులు మళ్ళీ వారికి కనబడరనుకోండి. అయినా ఏ కొండశిఖరాన్నుంచో గమనించి, అనుమానించి సైన్యాన్ని తీసుకు రావచ్చు, వారు హతమారారే అనుకోండి. అయినా దుర్గరహస్యం బయలవుతుంది.

గన్న : అందుకనే నేను ఒక ఉపాయం ఆలోచించాను. మనవాళ్ళు రెండు మూడువేలమంది, రహస్యమార్గాన వీరి సైన్యాలకు దూరంగా కనబడి, వారిని ఆ అడవులలో తప్పుదారుల పట్టించాలి. ఇంకొకవేయిమంది, ఈ ఎగుడు దిగుడు కృష్ణవెంబడినే దిగువకు తీసుకొనిపోయి వాళ్ళపాట్లు వాళ్ళకుపెట్టాలి. ఇంకొక అయిదారు వందలమంది ముందు పరుగుతీయాలి. ఆ వెనుక వీరి సైన్యం ఎంత వస్తుందో రానీ, అలా పరుగుతీస్తూ కృష్ణ ఎగువకు లాక్కుపోవాలి. మూడు నాలుగు వేలమంది మన గజదొంగ పతాకం రాచయేనుగుకు కట్టి ఈ సైన్యానికి కనబడి దొరక్కుండా కందనోలుపోయి ఆ కోటలో ఉంటారు. ఈ గడబిడలో చిన్నాయనగారు ఏ సైన్యంలో ఉన్నారో నాకు వేగు అందించు. మా విఠలయ్యతో, సూరన్నరెడ్డితో, చినదామానాయనితో ఇతర నాయకులతో సంప్రతించి వారి వారిని ఆ యా పనులకు వినియోగిస్తాను. నీ వేగు ఆ యా సైన్యాలకూ, ఇక్కడే ఉండే నాకూ ఎప్పటికప్పుడు వార్తలు అందజేయాలి.

సబ్బినాయకుడు చిత్తమని సెలవుపొంది మాయమయ్యాడు. గన్నారెడ్డి తాను వేసిన వ్యూహవిధానాల ప్రకారం వివిధ సైన్యాలను వివిధ స్థలాలకు పంపించాడు.

తాను మెరికలవంటి నూరుమంది దళపతులతో, సైనికులతో సబ్బినాయని కడనుండి వేగురాగానే రంగంలోకి ఉరకడానికి సిద్ధంగా ఉండెను. విఠలు దొక సైన్యాన్ని, సూరయ్యరెడ్డి ఒక సైన్యాన్ని, దామానాయుడొక సైన్యాన్ని, అక్కినమంత్రి ఒక సైన్యాన్ని నడుపుకుంటూ కృష్ణకు దూరంగా

ఒక ఎత్తయిన కొండమీదినుండి ఉన్న రహస్యమార్గంగుండా వారి వారి పనులు నిర్వర్తించడానికి వెళ్ళిపోయారు.

గన్నారెడ్డి ఒక వేగులవానికి ఏదో రహస్యాలు కొన్నిచెప్పి ఎచ్చటికో పంపించాడు.

మూడురోజు లైనవెనుక ఒక భయంకరమైన చెంచువాడు వచ్చి గన్నారెడ్డి ఎదుట నిలుచున్నాడు. గన్నారెడ్డి చెంచుభాషతో 'ఏమిదొరా! నీ మొగం నాకు కొత్తదిగాఉంది' అన్నాడు.

ఆ దొర మొగం చిట్లించుతూ 'ఏమిదొరా! నా మొగం కొత్త అని పెబువులు నన్ను అవమానం చేయదలచుకొన్నారా' అనుచు వంగి నమస్కరించి 'ప్రభూ! నన్నే ఆనవాలు పట్టలేదా?' అని సబ్బినాయని గొంతుకతో అన్నాడు.

గోన గన్నారెడ్డి పకపక నవ్వి 'ఓయీ! అసాధ్యుడా! ఎంత మాయచేశావు! సరే, విషయాలు తొందరగా తెలుపు' అన్నాడు.

సబ్బి : ప్రభూ! మీ పినతండ్రిగారు సైన్యాలన్నిటినీ మన సైన్యాలవెంట ఎండమావులవెంటబడిన పిపాసిరీతిగా పంపించాడు. తానుమాత్రం పదివేలమంది మెరికలవంటి సైన్యంతో శ్రీశైలంలోనే విడిదితీర్చి ఉన్నాడు. దినదినమూ పూజలూ పునస్కారాలు చేయిస్తున్నారు. చక్రవర్తిపై భక్తి ఉన్నట్లు వారి పేరున కొన్ని దానాలు ధర్మాలు చేసి దానశాసనాలు వేయించాడు. శ్రీశైలం మఠాలన్నీ పండుగలు చేసుకుంటున్నాయి.

గోన : శ్రీశైలంలో మన అనుయాయులు అప్రమత్తులై ఉన్నారా?

సబ్బి : చిత్తం, మీఆజ్ఞకోసం నిరీక్షించండని వారికి బోధించివచ్చాను, తమ శలవు.

గోన : సబ్బినాయకా! మీ పని అద్భుతము. ఉదయాస్తమానాలు మిమ్మ పొగడడంఅంటే నాకిష్టంలేదు! కాని అది తప్పటంలేదు. మీకు అద్భుతమైన బిరుదు అర్పించుకోగలను. అది తర్వాత. ఈ దినమే ఇక్కడ సాధారణంగా కాపలాఉండే వారుకాక తక్కిన సైనికులు మారువేషాలతో శ్రీశైలనగర మహాక్షేత్రాన్ని చేరాలి. వారందరినీ శివాచార్యులుగా, శివభక్తులుగా, జంగమదేవరలుగా, ఆరాధ్యులుగా శ్రీశైల వివిధ మఠభక్తులుగా చేర్పించండి. నాగుర్తు 'జయ మహాదేవ శంభో! పార్వతీనాథ!' అని. దానికి ప్రతివచనసంజ్ఞ 'త్రిలోక్య నగరారంభ మూలస్తంభాయ శంభవే!' అని. ఇవి ప్రతివారికీ రావాలి. లేకపోతే చాలా తంటా ఉన్నది. రేపు రాత్రి శంభుమహోత్సవం, మైలారుదేవ ఉత్సవం. వీరభద్రపళ్ళెం పట్టించండి. మొక్కుబడి తీరేందుకుగాను ఎవరో ధనవంతుడైన భక్తుడు ఉత్సవం చేయిస్తున్నాడు. నువ్వొక శివాచార్యుడవు. నీ ఇంద్రజాలమంతా చూపించాలి. రేపురాత్రంతా ఒళ్ళుతెలియని ఉత్సవాలు. మా చినాయనగారి సైన్యాలు అనేక

కార్యాలమీద చెదిరిపోవాలి రెండుజట్లు ఒకచోట ఉండకూడదు. నేను వచ్చి ఆ ఉత్సవంలో ఉంటాను. ఆతర్వాత నేను చెప్తాను మీరు ఏమిచేయాలో. మా చిన నాయనగారు మాయం కాగానే మీరందరూ చప్పగా, చల్లగా పారిపోవాలి. ఈలోగా మన అంచెధారలు మా చిననాయనగారిని ఓరుగల్లు చేర్పించగలవు. నేను నా సాధారణపు గజదొంగరూపంలో ప్రత్యక్షమవుతాను. మా చిననాయనగారికి, అంగరక్షకులకు గొప్ప శివభక్తులు ఒక చిన్న బంగారుపళ్ళెంలో ప్రసాదం ఇవ్వగలరు. వారు చక్కగా నిద్రపోతారు. మీశిష్యులు వర్ధమానపురాంతఃపుర రక్షక భటులవుతారు. ఇక తరువాయివిషయాలు నే నక్కడ చెప్పుతాను.

నల్లనాయకుడు మరి పది క్షణికాలు మాట్లాడి మాయమైపోయాడు.

*　　*　　*　　*

శ్రీశైలము పురాతనకాలంనుండీ మహాశైవక్షేత్రము. ఆంధ్రులు మొదటనుండీ శైవమతావలంబకులు. శాలివాహనశక పూర్వమునందు ఒక వేయి సంవత్సరాలనుండి శ్రీశైలము అనేక ఋష్యాశ్రమసంకీర్ణమై బహుజనాకర్షమై పవిత్ర యాత్రాస్థలమై ఉండేది. బౌద్ధమతముగాని, జినమతముగాని ఈక్షేత్రాన్ని చెక్కు చెదర్చలేకపోయాయి.

ఈ దివ్యపర్వతము చుట్టూ ఉన్న నాడులలో ఆంధ్ర మహారాజవంశాలు అనేకం ఉద్భవించి దేశాలు పాలించాయి. ఈ పర్వతానికి తూర్పున పల్లవ భోగములో రాజులు పల్లవులై విజృంభించారు. వారికి ముందు ఇక్ష్వాకులు, వారికిముందు శాతవాహనులు సామ్రాజ్యాలేలినారు.

శ్రీశైలానికి దక్షిణంగా చళుకవిషయ రాజవంశమువారు చాళుక్యులై శాతవాహనులకు సామంతులై వారి మాండలికులుగా, సేనాపతులుగా పడమటి కుంతల దేశానికి పోయి అక్కడ బాదామిలో శాతవాహనులకు పిమ్మట స్వతంత్రులై చక్రవర్తులైనారు. వారిలో వేరొకశాఖ తూర్పునకువచ్చి తూర్పుచాళుక్యులుగా వేంగిలో సామ్రాజ్యం స్థాపించారు.

శ్రీశైలానికి పడమటిదేశం శాతకర్ణాటదేశమై, కర్ణాటమై చాలాకాలం శాతవాహనభృత్యవంశమైన శాతకర్ణాటుల రాజ్యమై, అవెనుక యాదవులపాలై, గాంగులపాలై, చివరకు కొంతభాగం భిల్లాణులచేతికి వచ్చింది.

అట్టి దివ్యపర్వతం కాకతీయ గణపతిదేవ సార్వభౌముని కాలంలో విశ్వేశ్వర గోళకమఠము, శివమఠము మొదలైనవానితో నిండి ఒక మహాపట్టణంలా విరాజిల్లుతూ ఉండేది. ఈ కాలంలో ఆ ప్రదేశమంతా అడవి ఎడారి కొకసారి శివరాత్రినాడు ఉత్సవం జరుగుతుంది

ఆ శ్రీశైలంలో శివభక్తులగు రాజన్యులు అనేక మఠాలు కట్టించి శివయోగులకూ, ఆరాధ్యులకూ ఆశ్రమాలు నిర్మించి అర్పించుచుండిరి. లకుమయారెడ్డి ఒక

మఠం తన ఉనికిపట్టు చేసికొని, అందులో నూరుమంది రక్షకభటులతో, చిన్నయామాత్యులతో, సేనానులతో ఉన్నాడు.

'గన్నయ్య సైన్యాలు కనబడినవి' అని వినగానే వారిని నాశనం చేయవలసిందని ఆజ్ఞ ఇచ్చి తాను శ్రీశైలమందే ఉండి వేగులచేత వార్తలు తెప్పించుకొనుచూ ఉండెను. ఒకనాడు కాశీనుంచి భక్తు లనేకులు శివాచార్యుల శైవక్షేత్ర యాత్రలుచేస్తూ శ్రీశైలం వచ్చారు. వారితో కోటీశ్వరులగు భక్తు లనేకులు వచ్చి ఆ శైవమునులకు, శివాచార్యులకు ఉత్సవాలు చేయించినారు. మైలారభటులు, వీరభద్రభక్తులు నిప్పులు త్రొక్కియు, శూలాలు పొడుచుకొనియు రుద్రతాండవాలు సలుపుచుండిరి. రుంజలు, ఢక్కలు, భేరులు, నాగస్వరాలు దెసలు మారుమ్రోయించుచుండెను. మహాదేవార్చన పరమాద్భుతంగా జరుగుచుండెను. మల్లికార్జున దేవునకు ఎడతెగని అర్చన, అభిషేకము జరుగుచుండెను.

ఆ రాత్రి భక్తులు కొందరు మూడు బంగారు పళ్ళెరాల శ్రీ లకుమయమహారాజునకు శివప్రసాదము అర్పించినారు. వారి భటులు, సేనాపతులు వెండిపళ్ళెరాలతో వచ్చిన శివప్రసాదాల స్వీకరించారు. అత్యంత మధురమై సుగంధపూరితాలైన ఆ ప్రసాదము కాశీనివాసి అయిన పరమశివమఠ పరమశివాచార్యులవారు అర్పించినవని అపరశివమూర్తులైన శివయోగులు తెచ్చి అవి లకుమయారెడ్డి మహారాజు కడ ఉంచినారు.

మహారాజు, ఆయన సేనాపతులు, అంగరక్షకులు, దౌవారికులు, ద్వారపాలకులు, కంచుకులు దాసదాసీజనం అందరూ భక్తితో ఆ ప్రసాదము ఆరగించినారు. వారందరికీ శివప్రసాదమహిమవల్ల ఒడలు తెలియని నిద్ర పట్టినది. ఇంతలో కొందరు క్రొత్తరక్షకభటులు లా విడిదిలో అప్రమత్తులై కాపలా కాయుచునే ఉండిరి. తెల్లవారినది. నిద్రమత్తు వీడి రక్షకభటులు, సేనానాయకులు, తదితర పరివారజనము లేచినారు. కాని మహారాజు లకుమయారెడ్డి ప్రభువు తమ హంసతూలికా తల్పంమీద లేరు! ఒక్కసారి ఆ విడిది గృహాల్లో 'మహారాజు!' అని గగ్గోలు బయలుదేరింది.

గోన గన్నారెడ్డి చిన్నతనాన్నుంచి ఉత్సాహంతో పొంగిపోయే బాలుడు. చదువుకొనడంలో, ఆటలు ఆడడంలో, వీరవిద్య శిక్షణపొందడంలో ఎప్పుడూ సంతోషం, ఉప్పొంగు. గురువు 'ఈ పని చేయగలవా రాజకుమారా' అంటే 'చేస్తా! చేస్తా! చేస్తా! ఓ చేసితీరుతా' అని ఆ పనియొక్క కష్టం, నిష్ఠురము, స్వరూపం ఒక్క నిమేషం ఆలోచించి, వానిని అధిగమించే విధానం ఇంకో నిమేషం ఆలోచించి, మనస్సు, బుద్ధి, హృదయము ఆ పనిపై నిశితంగా ప్రయోగించి మూడవ నిమేషంలో నిర్వర్తించేవాడు. ఈ పాఠము 'క్రొత్త' అని లేదు. ఆ పందు బాణంతో కొట్టడం 'కష్టసాధ్యం' అని లేదు 'ఆ గుఱ్ఱం పొగరుగలది. రౌతులను పరాభవం

చేయడంలో అందెవేసిన జంతువు' అన్నా లెక్క లేదు. 'కళ్ళెంలేకుండా గుఱ్ఱాన్ని స్వారి చేయలేము' అని లేదు. ఏపని అయినా చేయడానికి ముందుగా సిద్ధం.

చదువులేని సమయంలో, వీరి శిక్షణలేని సమయంలో అంత చిన్నతనాన్నుంచీ గన్నయ్య ఏదో ఆలోచించుకొంటూనే ఉండేవాడు. తెల్లవారగట్ల అతనికి మెలకువ వచ్చేది. బంగారు పట్టుదారాలు కుట్టిన కాశ్మీర శాలువ కప్పుకొని పడుకొన్న చలికాలంలో, కండలుకట్టిన తన బంగారుదేహం పోతపోసిన విగ్రహంలా కనబరచు సన్నని పంచెతో మాత్రం ఆ పట్టు పరుపులపై పండుకొన్న వేసవి కాలంలో, వానకురియుచు తన శయనమందిరానికి పైన శ్రుతివేసే వానకాలంలో కదలక పడుకొని కలలపాలయ్యేవాడు. పసితనంలో, బాల్యమందు, జవ్వనం పొడచూపే దినాల ఎప్పుడూ ఆలోచనలే!

ఆ ఆలోచనలలో రాజ్యపాలనం, దుష్టనాశనం, ఉత్తమ విద్యావ్యాసంగము, మహోత్తమ వీరవిద్యా కౌశలము సుడులు తిరుగుతూ ఉండేవి. ప్రపంచం అంతా పురాణాలలో ఒకవిధంగా వర్ణించి ఉంది. గణితశాస్త్రంలో ఇంకోవిధంగా వర్ణించి ఉంది. సముద్రం ఎంతవరకు? భూమి ఎంతవరకు? సముద్రం అడుగున భూమి ఆ భూమి అడుగున అంటే ఆ భూమి తవ్వుకుపోతోంటే, దానికి అంతుఉన్నదా? అలా ఎన్నిక్రోశాలు తవ్వుకుపోవాలి? అలా తవ్వుకుపోగా తర్వాత ఏమి ఉంటుంది? ఆకాశంలో ఎగిరే పక్షి ఎంతదూరం ఎగురుతుంది? ఒక మనుష్యుడు ఎగిరేశక్తి సంపాదించుకుంటే ఎంతదూరం ఎగురగలడు? అతని కేమీ అడ్డం రాదా? నక్షత్రాలు వానిదగ్గరకు వెళ్ళి చూస్తే ఎల్లాఉంటాయి? 'సూర్యగోళం భూమికన్న అనేకలక్షల రెట్లు పెద్దది' అని గణితాచార్యులన్నారు. ఆగోళందగ్గరకు వెళ్ళగలమా? అందులో సూర్యు డెటులుండును?"

ఈలా అంతులేని ప్రశ్నలు వేసుకొని వానికి సరియైన సమాధానాలు తోచక వేదనపడేవాడు. 'కొండలు, నదులు, అడవులు, వానలు, వరదలు, వేసవి, శీతాకాలం, చలి, వేడి ఇవి ఏలావస్తాయి?' అని ప్రశ్నించుకొనేవాడు.

వీని అన్నింటికి గురువులనుండి సమాధానాలు కోరేవాడు. వానికి గురువులిచ్చిన సమాధానాలు ఒక్కొక్కప్పుడు నచ్చేవి కావు. అతని హృదయంలోని ఈ ప్రశ్నపరంపరలవల్ల విపరీతమైన ప్రకృతిజ్ఞానం అలవడింది. ఎప్పుడు వాన వచ్చునో, నది ఈఏడు ఎంతపొంగునో అతనికి కరతలామలకము.

అతడొంటిగా ఏకొండశిఖరంపైనో కూర్చుండి నిశ్చలతారకాయామినీవేళ నక్షత్రపథాలలోనికి, తన హృదయంలోని ప్రశ్నలకు సమాధాన మూ చోటుల ప్రత్యక్షమవునేమో యని పరికించి చూచేవాడు. కృష్ణఒడ్డున మధ్యాహ్నల కూర్చుండి నీటిమేఘాలు; సుడిగుండాలు, నదిలోని రాళ్ళ వాని చుట్టూనదీజలాలు ప్రవహించే విధానము గమనిస్తూ జీవితమునుగూర్చి చర్చించు

కొనేవాడు. "ఈ జీవితమూ నదివంటిదేనా ? నదికి ఆ కొండ పుట్టుకస్థలమంటాను. ఆ చుట్టుప్రక్కల ఎన్నోవందలమైళ్ళ ప్రదేశంలో పుట్టే ప్రతి చిన్న నీటిబిందువు ఆ నదికి పుట్టిన స్థలమే ! అలా మనుష్య జీవితాలు అనేకవందల బిందువుల కలయికా ? అవి మాతృగర్భంలో కలుస్తాయా ? మేఘాలు నీటిఆవిరి అని పెద్దలు చెప్పారు. ఆ నీటిఆవిరి సముద్ర జనితం. సముద్రాలలోనికి నదులు, నదులు అనేక జీవబిందువుల కలయిక. జీవసముద్రంలో మృత్యుసూర్యతప్తమై అవి ఆవిరిగా మారి మానవమూర్తి మేఘాలలోచేరి, అక్కడే పెరిగి స్త్రీగర్భకుహరాలలోనుండి బయలువెడలుతాయా జీవితాలుగా ? అయితే అవి మనుష్యులలో ఏలా చేరుతాయి ? శుక్లం బాల్యావస్థలో పురుషుని దేహంలో లేదు. శుక్లం ఎప్పటికప్పుడు మనుష్యునిలో వృద్ధి. అది స్త్రీ గర్భంలోకిపోయి స్త్రీలో చిన్నతనంలో లేని శోణితబిందువులలో కలిసి ఒక పూర్ణరూపం అవుతుందీ ? అది మనుష్యుడుగా ఉద్భవిస్తుందీ ?

"ఈ రాజ్యాలు, ఈ నాగరికతలు, ఈ అర్చనలు వివిధ నామాలుగా భగవంతుని భావించుకోడం, కొందరు భగవంతుడే లేడనడం, కొందరు శివుడే భగవంతుడని, కొందరు విష్ణువే భగవంతుడని, కొందరు వీరందరూ హంగక్కి—ఆద్యంత రహితము, నామ రహితము అయిన బ్రహ్మమే నిజము—అని వాది చడం ఏది నిజం ?"

ఈలా ఆ యువకుని ఆలోచనలు అనంతములై ప్రవహించేవి. కార్యోన్ముఖుడైనప్పు డే యాలోచనలు ఉండక ఆ కార్యఫలాకాంక్షమాత్రం మాతన్ని ఉద్భూత లూ చేది.

వర్ధమానపురంలో తండ్రియైన బుద్ధారెడ్డిప్రభువు గన్నయ్యకు, అతని తమ్ముడు విఠలయ్యకు చిన్నతనంలో మంచి గురువులచే చదువు చెప్పించినాడు. అతడు పోగానే లకుమయ్య ఈ బాలుర నిద్దరినీ ఓరుగల్లు చమవుకై పంపినాడు. అక్కడ వారిద్దరూ తమ నగరిలో వాసదాసీజనసేవితులై పెరిగారు. రాజబంధువులలో ఒక ముసలి యామె వారి పోషణభారం వహించింది.

గన్నయ్య ఎంత చురుకువాడో, విఠలయ్య అంత మందమతి—అసలు చదవలేకపోవడం కాదు. ఏదో చదివేవాడు. విఠలయ్య చిన్నతనాన్నుంచి భీముడే; తోటి బాలు రెవ్వరూ అతనిని మల్లయుద్ధంలో ఓడించలేకపోయేవారు సరిగదా, మొదటి గడియలోనే ఓడిపోయేవారు. అతడు చేయలేని బరువుపని ఏదీ లేనేలేదు.

విఠలయ్యకు ఎప్పుడూ రాదు కోపం ఏపని చేసినా ఉద్రేకము వచ్చేది కాదు. చదువూ అంతంతమాత్రమే : పంచకావ్యాలై సాహిత్యమాపినాడు. ఏదో వ్యాకరణమూ, ఏదో గణితము, ఏదో వేదాంతము చదివినాడు. కాని ఆంధ్ర కర్ణాట మహారాష్ట్రాది ద్రావిడ భాషలూ చదివినాడు. ఆంధ్రభాషలో భారతము, శివనీతిసారము చదివినాడు.

ఎప్పుడూ చదువుట మానలేదు. అన్నగారికి చదువు గరుత్మంతునికి ఎగురుట వచ్చినట్లు రావడం, తనకు చదువుదూరదూరాననే ఉండటం అతనికి నవ్వువచ్చేది. అన్నగారే అతనికి ముఖ్యగురువై పాఠాలు నేర్పేవాడు.

అన్నగారు విఠలయ్యకు భగవంతుడు. అతనికి మల్లయుద్ధం అంటే అపరిమితప్రేమ. అన్నగారిని ఎవరైన నిరసించినట్లు కనబడితే వెంటనే ఆ యువకుడు ఎంత పెద్దవాడైనా, పూలచెండులా పైకెత్తి 'జాగ్రత్త' అని మళ్ళీ క్రిందకు దింపేవాడు.

గన్నారెడ్డి ఓరుగల్లులో చదువుకునే దినాల్లో లకుమయారెడ్డి మహారాజా భూతాది ప్రాభృతాలు పంపించటం మానివేయడం జరిగినప్పుడు వర్ధమానపురం నుంచి బుద్ధారెడ్డిని ప్రేమించిన కొందరు ఓరుగల్లు వచ్చి లకుమయ్య దుస్తంత్రము గన్నయ్యకు నివేదించారు. గన్నయ్య గరుడునివలె సమస్తరాజకీయాలు గ్రహిస్తూ ఉండెను. ఓరుగల్లు గురుకులాన అతనితోపాటు చదువుకొనుచుండిన రాజకుమారు లందరూ గన్నయ్యను నాయకునిగా ఎన్నుకొని అనేక వినోదాలలో పాల్గొనేవారు.

గన్నారెడ్డి వారందరినీ ఒకనాడు చేరదీసి ఆరుగడియల కాలం ఏమేమో బోధించాడు. ఆ వెనుక గన్నారెడ్డి మూడు నెలలు తమ్మునితో, తనకు సర్వవిధాల బాసట అయిన సూరపరెడ్డితో దేశం అంతా తిరిగాడు. తక్కిన యువకులు అయిదుగురు, ఆరుగురు జట్టులుగా వారివారి సేవకులతో దేశం నలుమూలలా తిరిగారు.

వారందరూ ఏర్పరచుకొన్న గడువు మూడు నెలలూ దాటగానే ఓరుగల్లులో మళ్ళీ అందరూ కలుసుకొన్నారు.

౫

రహస్యంగా రాజకుమారు లందరూ ఓరుగల్లులో గోనవారి నగరులో కలుసుకొన్నారు. గన్నారెడ్డి వారందరినీ చూచి, "అన్నలారా! మనం స్వయంభూనాథుని పాదపద్మాలుసాక్షిగా ఏర్పాటుచేసుకొన్న ప్రతిజ్ఞను అనుసరించి, నేను మీతోపాటు దేశాలన్నీ తిరిగాను. నాకు మన విడిదికి తగిన అద్భుతప్రదేశం శ్రీశైలందగ్గర కనబడింది. ఆ ప్రదేశం పాడుపడిన పురాతన పట్టణం. ఆ పట్టణానికి ఒకటే దారి ఉన్నది. ఆ చాటుదారిని నాకు ప్రాణస్నేహితుడైన ఒక చెంచుదొర చూపించాడు. ఇంకో రహస్యమార్గం ఉంది. తెలియనివాళ్ళు కొన్ని వేల యేండ్లు గాలించినా ఆ పట్టణం దొరకదు. చెంచువారి సహాయంతో ఆ పట్టణం సర్వవిధాలా బాగుచేయించడానికి మా విఠలయ్య, చిన అక్కినప్రగడ గారలు వెళ్ళారు. అది సిద్ధంకాగానే మనం ఒకమంచిదినాన గజదొంగలం అవు

దాము. ఈ లోగా వాటు వారు తగిన ధనం, బలగం పోగుచేసుకొని సిద్ధంగా ఉండండి" అని గన్నారెడ్డి తెలిపెను.

వీర యువకలోక మంతా 'వల్లె' యని కత్తులు పైకెత్తెను. ఆ జట్టుకు నాయకుడు గోన గన్నయ్య. ఆతని నాయకత్వం అంటే ఎవ్వరికీ ఏవిధమైన అనుమానాలూ లేవు.

ఈ సమావేశం జరిగిన నెలదినాలకు 'సర్వం సిద్ధమైనది. కాబట్టి ఇక రావచ్చు' అని విఠలయ్యదగ్గరనుంచి వార్త వచ్చింది. ఒకదినాన వారందరూ కలుసుకొని శుభముహూర్తం ఏర్పరచుకొన్నారు. మైలారదేవుని సాక్షిగా, వీరభద్రుని సాక్షిగా, ఏకవీర సాక్షిగా, స్వయంభూదేవ సాక్షిగా వారు ఒట్లు పెట్టుకొన్నారు. ఏర్పరచుకొన్న శుభముహూర్తన వారందరూ ఓరుగల్లు విడిచిపోయారు. వారు ఓరుగల్లు వదలిన వారము దినాలకు గన్నారెడ్డికడనుండి శివదేవయ్య మంత్రికి ఉత్తరం వచ్చింది.

"శ్రీ శ్రీ శ్రీ అపరగురుమల్లికార్జునావతార, శివదేవయ్య పండితారాధ్య దేశికులకు పాదపద్మాల సాగిలంబడి గోన గన్నయ్య మనవి.

"మా పినతండ్రి నా రాజ్యం తన హస్తగతం చేసుకొన్నాడు. ఈలాంటి అన్యాయాలు శ్రీశ్రీశ్రీ సప్తమ చక్రవర్తులైన మా సార్వభౌములు వృద్ధులవడం వల్ల సంభవించినవి. మాకీ రాజ్యంలో న్యాయం దృశ్యం కావటంలేదు. కాబట్టి మేమంతా దోపిడీ దొంగల మవుతున్నాము. నాతోపాటు ఇరవై అయిదుగురు రాజకుమారులు వచ్చారు. శ్రీ చిన అక్కినప్రగడ మహామంత్రీ వచ్చినాడు. మేము మా రాజ్యం స్థాపించుకొన్నాము. మేము ఎవరు ఎంత ప్రయత్నించినా దొరకము. ఆ యా రాజకుమారులు వారి వారి తల్లిదండ్రులకు ఉత్తరాలు వ్రాసుకొన్నారు. మమ్మల్ని పట్టుకొనవచ్చినవారిని హతమారుస్తాము. అన్యాయము చేసే వారిని దోస్తాము. మాకు స్వయంభూదేవుడే నాయకుడు. ఇట్లు తమ శిష్యపరమాణువు గోన గన్నయ్య. ఇవే అనేక శుభలేఖార్థములు."

ఆ ఉత్తరం చూచి శివదేవయ్య చిరునవ్వు నవ్వుకొన్నాడు. ఆ సాయంకాలంలోగా వివిధ రాజనగరులనుండి ప్రభువులు, పెద అక్కిన మంత్రులవారు హుటాహుటి ముఖ్యమంత్రి శివదేవయ్యకడకు వచ్చారు.

" మీ మీ కుమారులకు భయ మేమీలేదు నేను వారినందరినీ మంచి మార్గానికి దింపే సాధనం ఆలోచించి తిరిగి రప్పిస్తాను. మీ మీరేమీ తొందర పడకండి" అని శివదేవయ్య దేశికులు బోధించారు.

ఆ నాటినుండి ఊళ్ళు దోచకపోయినా, ఇతరులను దోచకపోయినా గన్నారెడ్డినిగూర్చి ప్రపంచమంతా గగ్గోలుపుట్టింది. ఆ తర్వాత రెండు మూడు సంవత్సరాలు గన్నారెడ్డి పెద్దసైన్యము సమకూర్చినాడు. కోట్లకొలది టంకాల వెల గలిగిన

బంగారపాతలు దొరికినవి. అనేక విధాలుగా ఎక్కడెక్కడినుంచో ధనం వస్తూ ఉన్నది. ఆ రహస్య పర్వతప్రదేశంలో ఒక విచిత్రరాజ్యం ఉద్భవించింది.

గన్నారెడ్డి వేలకొలది జాతిగుఱ్ఱాలను బంగారు రాసులు పోసి సముపార్జించినాడు. గుఱ్ఱాలమీద అతివేగంగా స్వారీచేస్తూ ఉరకడం, అతివేగంగా పరుగిడే గుఱ్ఱంమీదకు ఉరకడం, పగ్గములు లేక గుఱ్ఱముల స్వారిచేయుట, గుఱ్ఱములపై పండుకొని స్వారిచేయుట, అతివేగంగా గుఱ్ఱముపై స్వారిచేస్తూ బాణముల గురిచూచి కొట్టుట మొదలయిన పనులన్నీ వేలకొలది అశ్వికులకు నేర్పించినాడు. దుష్టతురగరేఖావంతుడై అతడు అతిరథశ్రేష్ఠుడై వెలిగిపోయాడు.

అక్కడినుండి అప్రతిమాన వ్యూహరచనాసామర్థ్యంతో, యుద్ధనైపుణ్యంతో దేశాలన్నిటిలో రాజు లందరికీ గుండెబెదు రయినాడు. ఇరువదివేలమంది అశ్వికులు, వాయువుతో పందెములు వేయువారు ఆ లోయలో శిక్షణ పొందినారు. నదులు ఈదుట, కొండ లెక్కుట, ఎంతనున్నటి గోడలనైనా ఎగబ్రాకుట, తాటి నిచ్చెనలు సిద్ధముచేయుట, వివిధాయుధ యుద్ధముచేయుట, అనేక నూత్న యుద్ధములు సృష్టించుట, జట్టులు దళములు పంక్తులు బారులు వ్యూహాలు చెడకుండా అతివేగాన పరుగులిడి శత్రువులను గదియుట, బాణములు పరుగులో గురితప్పకుండా వేయుట, పండుకొని, కూర్చుండి, మోకరించి, బాణాలు గురిచెడకుండ వేయుట, శూలయుద్ధము, శూలములు దూరాన గురితప్పకుండా విసిరివేయుట, మల్లయుద్ధము చేయుట, అన్నివిధములైన కత్తియుద్ధములుచేయుట, గజములతో, వ్యాఘ్రములతో యుద్ధము చేయుట గన్నారెడ్డి సైనికు లందరూ నేర్చుకున్నారు.

౬

గన్నారెడ్డి పినతండ్రి లకుమయ్యను బందీచేసినా అత్యంత గౌరవంతో ఓరుగల్లుపురం చేర్చినాడు. ఒక వార్తాహరునిచే శివదేవయ్యామంత్రికి 'లకుమయారెడ్డిని, ఆయనమంత్రి రుద్రయామాత్యులను బందీలుగా సార్వభౌముల సేనాపతుల కెవరికైనా పిల్లలమఱ్ఱికడ అపగింతుమనీ, వారిని అత్యంత గౌరవంగా గోనవారి నగరులో ఉంచవచ్చుననీ, విధేయుడు గజదొంగ' అని ఉత్తరం పంపించాడు.

వెంటనే ప్రసాదాదిత్యనాయకులు దళపతులతో పదివేల గుఱ్ఱపుసైన్యం తీసుకొని రెండురోజులలో పిల్లలమఱ్ఱి చేరినాడు. మరునా డుదయం ఒక భద్రదంతావళముపై బంగారు చవుదోలుపై పట్టుపరుపులపై పరుండి నిద్రపోవు లకుమయారెడ్డి మహారాజును, రుద్రయామాత్యులను నలుగురు అశ్వికులు ప్రసాదాదిత్య నాయని సైన్యంకడకు తీసుకువచ్చారు.

వెంటనే అశ్వికుల్ని ప్రసాదాదిత్యుని దళపతులు బందీలను చేశారు. ప్రసాదాదిత్యులు గౌరవంతో రుద్రయామాత్యునికి స్వాగతంఇచ్చి శ్రీ లకుమయారెడ్డి ప్రభువును ఆ భద్రగజంమీదనే పిల్లలమఱ్ఱి తీసుకొనిపోయి, అచ్చట కోటలో రాజభవనంలో దింపి తూలికాతల్పంమీద పరుండబెట్టినారు. రేచెర్ల వారి రాజవైద్యుడు వచ్చి లకుమయారెడ్డి నాడిచూచి ప్రభువు జ్ఞానపత్రి, నల్లమందు తినియుండుటచే వారి కా మత్తు కలిగినదనిన్నీ, మత్తువదిలే సూచనలు కనబడుతున్నవనీ చెప్పాడు.

ఆ వుదయం పదునొకండు గడియలకు లకుమయప్రభువు కండ్లు తెరిచాడు. ఆయన కండ్లుతెరిచిన కొద్దికాలంవరకూ తా నెక్కడున్నదీ తెలియక ఏవేవో అసందర్భవాక్యాలు పలుకుతూ వుండెను. దాసీ లాయన నుదురు చల్లని సుగంధ జలముతో తడుపుచుండిరి. ఒకగడియ అయినవెనుక లకుమయ మహారాజుకు సంపూర్ణంగా తెలివి వచ్చింది. 'ఇప్పుడు నే నెక్కడున్నాను?' అని చటుక్కున లేచి ప్రశ్నించాడు.

"మహారాజా, మీ రిప్పుడు పిల్లలమఱ్ఱిలో రాచనగరులో అతిథిమందిరంలో వున్నారు" అని రుద్రయామాత్యుడు మనవిచేశాడు.

లకు: రుద్రయామాత్యులవారూ! మీ రేల వచ్చినారు? ఆ రాక్షసుడు మిమ్ము బందీగా కొనిపోయాడని మీ భటులు ఎంతకాలంక్రిందటో మాకు చెప్పారు. అప్పటినుండి మీరు కనపడలేదుకూడా!

రుద్ర: మహాప్రభూ! మీకు వచ్చినవార్త నిజమైనదే. నన్ను గన్నారెడ్డి ప్రభువు....

లకు: ఆ పరమనీచుని పేరు నా ఎదుట తీసుకురాకండి.

రుద్ర: చిత్తం మహాప్రభూ! ఆ గజదొంగ నన్ను పట్టుకొని శ్రీశ్రీ యువమహారాజులవారిని గంతలుగట్టి తీసుకొని వెళ్ళిన స్థలానికే నన్నూ తీసుకువెళ్ళాడు. నాకూ గంతలుకట్టారు.

లకు: ఏమిటీ! వీడి దౌర్జన్యానికి అంతులేకుండా ఉంది. ఇంతకూ శ్రీశైలంలో ఉన్న మేము ఇక్కడి కెలా వచ్చాము?

రుద్ర: చిత్తం మహాప్రభూ! అదే మనవిచేస్తున్నాను. వారు నన్ను గౌరవంగానే చూస్తూ ఒక ఇంటిలో ఆ రహస్యనగరంలో ఉంచారు. నిన్న సాయంకాలం నా కళ్ళకు గంతలుకట్టి వారు ఒక గుఱ్ఱంమీద ఎక్కించి ఎక్క డెక్కడో తిప్పి ఒకప్రదేశంలోదింపి కళ్ళకు గంతలువిప్పారు. ఎదురుగుండా మహాప్రభువుల భద్రగజమూ, బంగారపు అంబారీ ఉన్నవి. నన్నుకూడా అంబారీ ఎక్కించారు. లోన ప్రభువులు నిద్రపోతున్నారనీ, నేను జాగ్రత్తగా ఉండాలనీ ఎవరో నాతో చెప్పారు. మాచుట్టూ వేయిమంది అశ్వికులుకూడా వస్తూ ఉండగా ప్రభువులను వాళ్ళు ఈ పురం చేర్చి ప్రసాదాదిత్యనాయకులవారికి తమ్ము అప్పగించారు.

లకు : ఏమిటీ ప్రసాదాదిత్యనాయకులకా? ఆయన ఈ ఊరు ఏల వచ్చాడు? ఆశ్వికులు ఆయన సైనికులా? అప్పగించడ మేమిటి?

రుద్ర: మహాప్రభూ! ఆ వేయిమందిలో నలుగురుతక్క తక్కినవారందరూ ఈ నగరం అయిదు గవ్యూతు లుందనగానే వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు. ఆ నలుగురూ తీసుకొనివచ్చి, ఈ నగరానికి ఏకారణంచేతనో వచ్చిన ప్రసాదాదిత్య నాయకునకు అప్పగించినారు. వారు మిమ్మల్ని ఈ రాచనగరిలో ప్రవేశపెట్టారు.

లకు : ఎంతపని జరిగింది! మాకు శ్రీశైలం ఎవరో ప్రసాదం పంపారు. మేము దానిని తిన్నాము. ఏదో నిద్రమత్తు విపరీతంగా వచ్చింది. పోయి పడుకొంటిమి. తరువాత ఇదే మెలకువరావడం.

లకుమయారెడ్డి తాను లక్ష సైన్యంతో గన్నారెడ్డిని పట్టడానికి రావడం, గన్నారెడ్డి కందూరి కేశినాయని చంపివేయడం మొదలయినవన్నీ రుద్రయామాత్యునితో పూర్తిగాచెప్పి, 'మన మిరువురము వెంటనే వర్ధమానపురం చేరాలి. శ్రీశైలం దగ్గర సైన్యాలవిషయం ఏమయిందో తెలియదే' దన్నారు.

రుద్రయామాత్యులు గన్నయ్య వందిభూపాలుని, ఉప్పల సోముని నాశనం చేయడం, ఆదవోని ప్రభువు కొమార్తె నెత్తుకుపోయి తన అక్కగారికడ వుంచడం మొదలయిన విషయాలన్నీ తన ప్రభువు చెప్పగా విన్నారు. ఏది ఎటులవునో అని గజగజ వణికిపోయినాడు.

లకుమయారెడ్డి స్నానాదికములన్నీ అయి, రేచెర్ల ప్రభువు పంపిన నూతన వస్త్రాదికములు ధరించి, తన విడిదిలో సుఖాసీనుడై ఉండగానే ప్రసాదాదిత్య నాయుడు తాను లకుమయతో మాట్లాడవలసియున్నదని సందేశ మంపినాడు. లకుమయారెడ్డి 'అంతకన్న ఆనందమేమి ఉన్న' దని మరల సందేశమంపినాడు. వెంటనే ప్రసాదాదిత్యప్రభువు లకుమయకడకు వచ్చినాడు. లకుమయ సగౌరవంగా ఆతని నెదుర్కొని తీసుకువచ్చి పీఠాన్ని అధివసింపచేశాడు. ప్రసాదాదిత్యనాయుడు లకుమయప్రభువును చూచి మహాప్రభూ! నేను రాజప్రతినిధి అయిన రుద్రదేవుల ఆజ్ఞచేత, గజదొంగ గన్నారెడ్డిని పట్టుకొనడానికి ఈ ప్రాంతాలకు వచ్చాను. అప్పుడు గజదొంగజట్టులోని నలుగు రాశ్వికులు మిమ్ము తీసుకొనివచ్చి నా కప్పగించినారు. నేను వెంటనే వారిని బంధించితిని. కాని వారు ఎటుల చిత్రముగా తప్పించుకొనిపోయిరో తెలియలేదు. నూరుగు రాశ్వికులు వారిని వెదకుచున్నారు. ప్రభువులకు వేయిసైన్యం రక్షణ కిస్తున్నాను. తమరు ఓరుగల్లు వెళ్ళవలసిన ముఖ్య కారణ మొకటి వచ్చింది. ఓరుగల్లు వెళ్ళి ప్రభువులు తమనగరు చేరుకోవచ్చును. పిల్లలమఱ్ఱి పాలకుల సహాయంతో నేను గన్నారెడ్డిని పట్టుకొనడానికి వెళ్ళుతున్నాము' అని మనవిచేసి వెళ్ళిపోయినాడు.

8

లకుమయారెడ్డి సైన్యాలు గన్నయ్య సైన్యాలను ఆ అడవులలో, ఆ లోయలలో, ఆ కొండలలో, ఆ వాగులలో వెన్నంటి తరుముచు నాల్గురోజులు ఎన్నో కష్టాలకు లోనై, చిట్టచివరకు శత్రువుల జాడ తెలుసుకోలేక, తమలో ఎందరో పడిపోతుంటే, వారిని జాగ్రత్తగా తీసుకొని రాదగిన సైనికులను ఆపి తక్కిన వారు సాగిపోతూ గజదొంగలజట్లు భాగాలుగా విడిపోతే, తాము భాగాలై విడిపోతూ తుదకు శత్రువుల జాడలు, వారి అంతూ ఏమీ తెలియక, వెఱ్ఱిమొగాలు వేసుకొని తిరిగిరావడం ప్రారంభించారు.

చిన్న చిన్న జట్టులవారు తరుముతూ తరుముతూఉండగా, ఎలా వచ్చేదో ఒక పెద్ద విరోధివాహిని ; వీళ్ళని వెనుకనుంచి చుట్టి కత్తులు, కటారులు మొదలయిన ఆయుధాలను లాక్కొని, బందీలచేసి తీసుకొని పోయేవారు. ఈ విధంగా నాల్గయిదు దినాలకు గన్నారెడ్డి సైన్యాలకు పదిహేనువేలమందికి పైగా బందీలు దొరికారు. వారినందరిని ఆ అడవులలోకి తీసుకొనిపోయి, ఇంత తిన డానికి కొన్నరొట్టె, పిండి రెండుమాడల చొప్పున ఇచ్చి వదిలెడివారు. చాలమంది తమకు నిజమైన ప్రభువు గన్నారెడ్డేననీ, వారి సైన్యాలలో తాము చేరుతామనీ చెప్పిరి. గన్నారెడ్డి కోరిన ప్రతిజ్ఞలన్నీ నెరవేర్చి గన్నారెడ్డి సైన్యంలో చేరారు. అలా చేరినవారు మూడువేలమంది ఉండిరి.

లకుమయారెడ్డి సైన్యం ఈ విధంగా చిందరవందర ఐపోయింది. అందులో పెద్దసైన్యాలు తిరిగి శ్రీశైలం చేరేసరికి లకుమయారెడ్డిని గన్నయ్య బందీచేసి తీసి కొనిపోయాడని తెలిసి భయాక్రాంతులై పోయారు. సేనాపతులు సమాలోచించు కొని మాట్లాడక వర్ధమానపురం దారిపట్టి ప్రయాణాలు సాగించారు.

లకుమయారెడ్డి అన్నకుమారునిపై సలిపిన విజయయాత్ర ఈలా విచ్ఛిన్నమై దేశాలన్నిటిలో నవ్వులపాలైన పదిహేను దినాలకు గన్నారెడ్డి తన రహస్య పురంలో కొలువుతీర్చి తక్కిన ప్రభుకుమారులతో విషయపర్యాలోచన చేస్తూ ఉండెను.

అపసర్పగణాధిపుడైన సబ్బప్రభువు గన్నారెడ్డివైపు చూచి "ప్రభూ! లకుమయారెడ్డిని తమకు ఆలోచనచెప్పుతూ ఓరుగల్లునగరంలోనే ఉండవలసిందిగా శ్రీశ్రీశ్రీ రుద్రదేవమహారాజులంవారు ఆజ్ఞ ఇచ్చారు. ప్రసాదాదిత్య నాయకమహారాజు సైన్యాలతో కంచి చేరుకున్నారు. వర్ధమానపురంలోని సైన్యాలలో నాల్గింట మూడువంతులు తగ్గింపవలసిందనిన్నీ, అలా చేయకపోతే వర్ధమానపురం ముట్టడించి నేలమట్టం చేస్తామనీ నిండుసభలో శ్రీశ్రీశ్రీ రుద్రదేవ మహారాజులు లకుమయ మహారాజుతో చెప్పారు. లకుమయప్రభువు మొగం జేవురించింది. కత్తివాటుకు రక్తపుచుక్క లేనట్లయింది మహాప్రభూ! అప్పుడు శివదేవయ్య మంత్రుల

వారు లకుమయప్రభువుపంకి జూచి 'మహారాజా! ఈ మహారాజ్యంలో స్త్రీలపై కుట్రచేసేవారు ఉద్భవించారు. రాజద్రోహం దుష్టవాసనలా దేశాలన్నీ కమ్మింది. మీపైన కొందరు రాజద్రోహనేరం మోపుతున్నారు. సార్వభౌములు కాని, యువ మహారాణీవారు కాని ఆ మాట నమ్మలేదు. అయితే తమ కెందు కంత సైన్యం? ఆ విధమైన సన్నాహం? వెంటనే మీ ఆజ్ఞలు వర్ధమానపురం పంపండి, సైన్యంలో మూడువంతులు తగ్గించుడని. అదీగాక మీరు మీ అన్నగారి కుమారునికి రాజ్యం ఎందుకు అప్పగించలేదు? ఆ కారణంచేత ఆ తెలివితక్కువ బాలకుడు గజదొంగయై దేశాన్ని నాశనం చేస్తున్నాడు. అతని శిక్షించడానికి ప్రసాదాదిత్యనాయకుడు సైన్యాలతో వెళ్ళాడు. కంచి మొదలైన క్షేత్రాలు సేవించి వస్తారు. మీరు సార్వభౌములతో వేదాంతచర్చ చేస్తూ సుఖంగా కాలక్షేపం చేస్తారుగాక!' అని చెప్పేరట" అని మనవి చేశాడు.

గన్న : మనం అనుకున్నట్లే అయింది. ఇప్పటికైనా వీరందరికీ నాయకుడెవరో తెలుసుకున్నావటయ్యా సబ్బయ్యా!

సబ్బ : లేదండీ. చాలావరకూ గాలించాను. దేశంలో ఎవరు అఖండ సైన్యాలు సమకూరుస్తున్నారో పిల్లి కళ్ళతో రాత్రిళ్ళు, వేయికళ్ళతో తెల్లవారగట్ల చూస్తున్నాను. మహారాజా! నా కొక అనుమానం ఉన్నది. అది....

గన్న : నాకు నీవు చెప్పబోయేకడనే అనుమానం ఉంది. నేనూ మీరూ స్వయంగా వెళ్ళి విచారిద్దాము. ఈలోగా వేంగి మహారాష్ట్రంలో గోదావరీతీర నగరమైన మేడిపల్లిలో కాచయనాయకుడు చాలా గర్వించి పోతున్నాడనీ, ఆంధ్రరాజ్యం విచ్ఛిన్నం చేయటానికి కాళింగుల సహాయం కోరుతున్నాడనీ, మొన్ననే తరిమి వేయబడినా కటకాధిపతి కొంత సైన్యమూ, ఏనలకొలదీ ధనమూ కాచయనాయకునికి పంపించాడనీ మీవాళ్ళు పట్టుకువచ్చిన వేగువిషయంలో నేను ఒక విచిత్రాలోచనకు వచ్చాను. ఈ సభవా రందరూ 'వల్లె' అంటే మనం వెంటనే కాచయ్యను గోదావరి కెరటాలలో ఊగిస్తూ చల్లంగి పంపించవలసి ఉంది.

అప్పు డొక యువక ప్రభువు లేచి 'ప్రభూ! మనం ఇంతసైన్యంతో అన్ని వందలమైళ్ళు ఎలాప్రయాణం చేయగలం?' అని వినయంగా అడిగినాడు.

గన్నారెడ్డి చిరునవ్వునవ్వి "ఓయి మహారాజా! గజదొంగలు అవసరమైతే రెక్కలు కట్టుకుని ఎగిరి వెళ్ళలేరా? మనం భక్తుల జట్టులుగా పదివేలమంది గోపాదక్షేత్రమూ, తదితర గోదావరీతీర క్షేత్రాలు చేరుకొంటాము. మన అశ్వికులు రెండువేలమంది పనిగా, ఇరవైగా వివిధమార్గాలను విడుదప్రోలుకు ఎగువనున్న మలయపర్వతారణ్యాలకు చేరాలి. నేనూ మారు

వేషంతో ముందుగా అన్ని విషయాలు విచారించి మన జైత్రయాత్రావిధానం నిశ్చయం చేస్తాను. నాతో ముప్పదిమంది అపసర్పులుంటారు. నేను వారిద్వారా వివిధజట్టులవారికి సందేశా లందజేస్తాను. సబ్బప్రభువు నాతో వుంటారు. అందరూ అప్రమత్తులుగా వుండండి. మనకు యథాప్రకార సాంకేతికాలలో 'కావపాత్ర' అనే సాంకేతికం కొత్తది" అని సభ ముగించాడు.

గోన గన్నయ్య తర్వాత తన ముఖ్యనాయకులతో ఆలోచనా మందిరాన సంప్రతించి యుద్ధయాత్రావిధానంలోని తక్కిన అంశాలన్నీ బోధించాడు.

౨

మేడిపల్లినగరం గోదావరీ తీరానకు ఆరు గవ్యూతులలో వున్నది. జొన్న, పత్తి, కందులు, పెసలు, మినుములు, వులవలు, ఆముదాలు, బొబ్బర్లు పంట పండే బంగారంవంటి గోదావరి వంత్రుభూములున్న మేడిపల్లినగరం తోటలతో, పూలవనాలతో వెలిగిపోతూ వున్నది.

మేడిపల్లిని కాచయనాయకుడు పరిపాలిస్తూ వున్నాడు. కాచయనాయకుడు నిడుద్రవోలు చాళుక్య ఇందుకేశ్వర మహారాజుకు సామంతుడు పరాక్రమవంతుడైన సేనాపతి. చాళుక్య సేనాపతియై కళింగ ప్రభువులు సింహాచలం దాటకుండా యుద్ధంచేసి అనేకమార్లు తరిమివేసిన వీరుడు. కాకతీయ మహాసామంతుడైన చాళుక్యులకు సామంతుడై అడవి కోయదొరలను భయ, భక్తి, స్నేహాలతో అదుపాజ్ఞలలో వుంచి, ఆ గోదావరీ తీరారణ్య ప్రదేశాల శాంతి నెలకొల్పి అడవి వస్తువులు దేశాల కెగుమతిచేయిస్తూ అనేక లక్షల మాడలను తన ధనాగారాన్ని నింపుతూ వుంటాడు.

అతడు గండ్రగొడ్డలితో మహాయుద్ధం చేయగలడు. ఆ గండ్రగొడ్డలికి రెండువైపులా పదును వున్నది. ఆ గొడ్డలిని ఖడ్గంగా మహావేగంతో వుపయోగించి ఎంతటి వీరునితలనైనా ఆకాశానకు బంతిలా ఎగరగొట్టగలడు. ఆ గొడ్డలి తలకట్టునకు భల్లశిరంకూడా వుండడంచేత, విరోధుల గుండెల్లో భల్లంలా పొడిచి వారిని హతమార్చగలడు. అతని గొడ్డలికి చిరుగంట లున్నాయి, దంతపుపిడి వున్నది. రత్నాలు పొదిగిన ఆ పిడితో వజ్రసదృశమై దర్శనమాత్రాన శత్రువుల గుండె లవియచేస్తూ వుంటుంది ఆ గొడ్డలి.

కాచయనాయకుని పరాక్రమం ఎదుట నిలబడలేని కళింగాధిపతులు, ఈ రాక్షసుని తమ దెసకు తిప్పుకోవాలని చాలా ప్రయత్నించి విఫలమనోరథులయ్యారు. అంతటితో వారు తమ ప్రయత్నం మానుకోలేదు. 'మహావీరులు బానిసలై మరొకరిక్రింద సామంతులై వుండడము వీరపురుషలక్షణం కాదనిన్నీ, సంపూర్ణస్వాతంత్ర్యంతో మహారాజై, సార్వభౌముడై చాళుక్యాది ప్రభువులను

మండలేశ్వరేశ్వరుడై మహాసింహాసనం అధివసించడము ప్రజ్ఞా, పౌరుషమూ తెలియజేస్తాయనీ, అందుకు కటకప్రభువులు సర్వసహాయం చేస్తారనీ, ఆంధ్రరాజుల శిరోమాణిక్యమై అతడు కటక ప్రభువుతో పుట్టీగావుండి వారితో వియ్యమందుట రాజలోకంలో మహాయశఃకారణ మనిన్నీ' వేగులు పంపించారు.

కాచనాయుడు ఆలోచించాడు. ఆలోచించి తాను సార్వభౌముడు కావాలని నిశ్చయించుకొన్నాడు. ఆలోచన తిరిగానే, ఎక్కడనుండో ఒక విచిత్రమైన వేగు వచ్చింది. ఆ వేగులో 'ఆడదాని చేతిక్రింద నువ్వు దాసీదానవా మహారాజా?' అనే ప్రశ్న వున్నది. కొన్ని దినాలు పోయిన వెనుక 'సార్వభౌముడు కాటికి కాలుచాచుకుని వున్నాడు' అని వచ్చింది. ఇంకొక వేగు 'ఓరుగల్లు నగరం నూరు గవ్యూతుల దూరంలో వుంది' అని వచ్చింది.

వేగు తెచ్చినవా రెవరినీ కాచయప్రభువు ఎంత ప్రయత్నించినా కనుగొనలేకపోయినాడు. మంచి వెండిపెట్టెలలో పెట్టి తాటియాకు పత్రాలపైన ఆ వేగు ఉత్తరాలువచ్చేవి. ఒకనాడు కాచయప్రభువునకు అలాంటి వేగు వుత్తరంతోపాటు ఎనిమిది లక్షల మాడల ధనంగల పెట్టెలువచ్చాయి. 'ఈ ఎనిమిదిలక్షల మాడలు తనను ఆడవాళ్ళరాజ్యం నాశనంచేసే వుత్తమకృషికి సన్నద్ధులయ్యేందుకు. ఈలాంటి ప్రాభృతాలు ఇంకావస్తాయి! కాని అతిరహస్యం! జాగ్రత్తగా వుండండి మహారాజా!' అని వున్న దా పెట్టెలలో.

కాచయప్రభువు తాను చక్రవర్తి అయినట్లు వుప్పొంగిపోయాడు. చక్రవర్తి కాబోయే అఖండప్రయత్నంలో నిమగ్నుడైపోయాడు.

కాచయప్రభువు పంపిన ప్రణిధులు మువ్వదిమంది మోటుపల్లి రేవుకు, కోరంగి రేవుకు జాతిగుఱ్ఱములను కొనుటకు పోయినారు. కొందరు వర్తకులు ఏనుగుల బేరమాడుటకు కటకపురికి పోయినారు. కొందరు దళపతులు కోయవారిని, శబరులను సన్నద్ధము చేయుటకు పోయినారు.

తన మహాప్రయత్నాలవిషయం ఎవరికీ తెలియకుండా కప్పిపుచ్చడానికి, తాను గణపతిరుద్రదేవుని పేర గోదావరీతీరమందు గోపాదక్షేత్రంలో నెలకొల్పిన గణపేశ్వర మహాదేవునికి కోటిఘటాభిషేకం, శ్రీశ్రీశ్రీ సప్తమ చక్రవర్తులైన గణపతిదేవ సార్వభౌముల దీర్ఘాయురారోగ్యాలకై చేయించబోతున్నానని ప్రకటించాడు. ఆ మహోత్సవానికి కాచనాయకుడు అనేక మండలేశ్వరులను ఆహ్వానించాడు.

తన ప్రయత్నాలన్నీ గోదావరిపై ఎగిరిపోయే తెరచాపలెత్తిన పడవలులా గమ్యస్థానం చేరుకున్నాయని కాచయప్రభువు మేఘాలమీద నడుస్తున్నాడు. రెట్టింపు పెరిగినట్లయ్యాడు.

ఒక దినాన వుదయపూజలన్నీ నిర్వర్తించుకొని, సంతోషముతో అభ్యంతర సభాభవనంలోనికి వెళ్ళగానే అక్కడ చిన్న వెండిపెట్టె వున్నది, ఓహో ! మళ్ళీ ఆ పరమాద్భుతమైన వేగు వచ్చిం దనుకొని, ఆయన ఆ మంజూషను తెరిచాడు. లోన ఒక చిన్న చురకత్తియున్నూ, ఒక తాళపత్ర లేఖయున్నూ వున్నవి.

"కాచయప్రభూ ! కపటరాక్షసుడా ! నీవు చక్రవర్తి అవుతావా ? కటకం వారితో వియ్యమా ? శ్రీశ్రీశ్రీ రుద్రదేవప్రభువు వట్టి ఆడదా ? నువ్వు వీరాధివీర ప్రచండ దోర్బల ఘట్టనఘరట్ట గండరగండడివా ? నీవు వీరాధివీర కదన ప్రచండుడవా ? అభినవ మనుకుల పరశురాముడవా ? పశువా ! నువ్వు చాలాచోట్లనుండి చాలాధనం ప్రోగుచేశావట ? ధనం వుండగానే దొంగలు రారట్రా పరశుధారీ ! నేను గజదొంగనురా, నీ ధనం, నీ వీర్యధనం, నీ మానధనం అపహరించ డానికే వస్తున్నానురా ! ఇవన్నీ భద్రంగా దాచుకో, మహారాజాధిరాజ పరమేశ్వరుడా !" అని వున్న దా లేఖలో.

కాచనాయకుని గుండెల్లో రాయిపడింది. వెంటనే వెఱ్ఱికోపంవచ్చింది. అతని గుప్పెడుమీసాలు గాలివానకు ఊగిపోయినవి. ఆతని విశాలవక్షం భూకంపంలో భూమి పొంగినట్లుగా విస్ఫారితమైంది. వెంటనే సింహగర్జనంతో 'ఎవ్వడురా అక్కడ ?' అని కేకవేశా డా ప్రభువు, దౌవారికుడు గజగజ వణకుతూ వచ్చి ప్రభువుఎదుట సాష్టాంగపడి లేచినాడు.

"ఏమిరా దొంగా, ఇక్కడికి ఈ వెండిపెట్టె ఎలావచ్చిందిరా ? పిలు. ఈ నగరిలో కావలా వుండేవాళ్ళందరినీ కనుక్కో. మీ వీపులమీద చర్మాలు వుండవు. వెంటనే అంతఃపుర రక్షకాధిపతిని పిలు." అని పొలికేకలు పెట్టాడు.

౯

కాచయ్య పొలికేకలలో భయంపల్ల కలిగిన కోపం వుంది. అంతఃపురరక్షకుడు, ద్వారపాలకులు, దౌవారికులు, కంచుకులు, ఆయుధరక్షకులు, రహస్యచారులు, రక్షకస్త్రీలు గడగడలాడుతూ ఆ మందిరంలోనూ బైటా నిండిపోయారు. అంతః పురరక్షక నాయకుడు భయంతో కాచయనాయకుని ఎదుట నిలబడినాడు.

కాచ : ఏమయ్యా, ఈ వెండిపెట్టె ఈ మందిరంలోకి ఎలా వచ్చింది ?

అంతః : చిత్తం మహాప్రభూ ! అది ఎలా వచ్చిందో నాకు తెలియదు మహారాజా !

కాచ : ఇక నీ అంతఃపురరక్షణ ఏం తగలబడిందయ్యా ?

అంతః ; (మౌనం)

కాచ ; రజితపేటిక ఇక్కడకు ఎలావచ్చిందో ఎవరైనా చెప్పగలరా ?

ఒకరక్షకస్త్రీ : మహారాజా ! నేనా పెట్టెను తెల్లవారకట్ల మూడవయామం వెళ్ళిన గదియకు వస్తూ చూచానండి. కాని ఆ వెనుక ఏదో వుత్తరాలతో వచ్చే పెట్టెలవలె ఆ పెట్టె వుండడంచేత అలాంటిదే మళ్ళీ వచ్చిం దనుకొని చూచే ఊరకున్నాను. మహారాజా !

ఇంతలో ఆ మందిరంలోకి చిరునవ్వు నవ్వుతూ గోన గన్నారెడ్డి చేతిలో ఒక పరశువును ధరించి వచ్చాడు. అతని వెనుకే విఠలధరణీశుడు గద ధరించి వచ్చాడు. సురసరెడ్డి వహాఖడ్గం ధరించి వచ్చాడు. వీరి ముగ్గురిని చూచి అక్కడ చేరిన రక్షకభటులు, సాయుధులూ, నిరాయుధులూ అందరూ నిశ్శబ్దం అయిపోయి నారు. కాచభూపతి నోటిలోనుండి రాబోయిన మాట అక్కడే ఆగిపోయింది. తెరి చిన నోరు తెరిచినట్లే ఉంది. అతని బుంగమీసాలు వణకిపోయాయి.

గోన గన్నారెడ్డి నవ్వుతూనే "ఓయీ కాచయనాయక ప్రభూ ! నువ్వు నా వుత్తరంచూచి అంత భయపడిపోయా వేమిటి ? నీకు పనికివచ్చే వుత్తరాలు వస్తే ఆనందమా ? అప్పుడు నీ అంతఃపురరక్షకులు మంచివారా ? ఇప్పుడు ద్రోహులై పోయారేమి ! ఏమి ధర్మవిచారణ ధురీణుడవు ! ఎవరో పిశాచులు కాకతీయ విరోధులు నీకు ధనం పంపిస్తే ధనాగారంలో దాచుకుంటావూ ! నా చిన్న చురకత్తి వస్తే వంటింటికుందేలు వవుతావూ ! 'సర్వ సన్నాహం చేయి' అని ఆ కటక జంతువులు నీకు వార్త పంపిస్తే శ్రీశ్రీశ్రీ గణపతిదేవచక్రవర్తిపై తిరుగు బాటు చేస్తావుగా ! నేనురా, ఈ రాజ్యం దోచుకునేందుకు అధికారం కలవాణ్ణి. నా దొంగతనానికి నువ్వా అడ్డం వచ్చేది ? శ్రీచాళుక్య వీరభద్రప్రభువు, శ్రీమహా దేవప్రభువు నిడుదప్రోలులో లేరవి, ఇదే అద ననుకున్నావు !" అని పక పక నవ్వాడు.

కాచప్రభువు దిగ్భ్రమచెంది, ఓరి దొంగా, కన్నంవేసే ముచ్చూ ! నువ్వట్రా నాకు నీతులు నేర్పేది ?' అని ఆంబోతులా రంకె వేశాడు.

గన్నారెడ్డి 'అవునురా : నేను ముచ్చును, నీబలం దొంగిలించడానికి వస్తు న్నానని వార్త పంపానుగా' అని, ఆశ్చర్య మందినట్లు తమ్మునివైపు చూచి 'విఠలప్రభూ ! మనం వస్తామని వార్త పంపిస్తే ఈలా అంతఃపురరక్షకు లందరిని చుట్టూపెట్టుకొని నాటకమాడుతున్నా దేమిటి ఈ రాజద్రోహి ?' అని మెల్లగా ప్రశ్నించాడు.

విఠలధరణీశుడు సింహగర్జనలా నవ్వుతూ, 'అన్నయ్యగారూ ! మనం వచ్చామని గౌరవం చేయదేమిటి ? రండి పోదాము' అని పలికాడు.

కాచయనాయుడు 'కోటలోకి ఎల్లావీరు వచ్చారు ? ఇంత నిర్భయంగా ఎలా రాగలిగారు : ఎందుచేత వీరి కింత నిర్భయం ?' అని అనుకుంటూ వుండ

గానే దుర్గరక్షకాధికారి పరుగున ఆ మందిరంలోకి వచ్చి, 'మహాప్రభూ, కోటంతా గోన గన్నారెడ్డి గజదొంగలజట్టు నిండిపోయారు. కోటలో ఉన్న మన సైన్యాన్నంతా ఆక్రమించుకొని నిరాయుధుల్ని చేశారు. రాజప్రసాదాలన్నీ ఆ దొంగలు నిండిపోయారు. పురమంతా ఆ దొంగలే! మన ఎక్కడిసైన్యం అక్కడే నిలబెట్టి నిరాయుధుల్ని చేశారు. నేను వారి కందకుండా పారిపోయి తమకడకు వచ్చాను' అని అతడు రొజుకుంటూ చెప్పినాడు. గన్నారెడ్డి అతన్ని చూచి పకపక నవ్వుతూ, 'ఓయి దుర్గరక్షకుడా! నీ ఆయుధం రేచెరువుల ప్రభువు చేతిలో ఉందిలే! మల్లిరెడ్డి ప్రభువును ఎరుగవుకాబోలు! పోనీలే! ఇప్పుడు నీ ప్రభువునకు ఏమి ఆలోచన చెప్తావు?' అని ప్రశ్నించాడు.

సూరన్నరెడ్డి మాట సముద్రంహోరే! 'గన్నమహారాజా! ఈ మాటలన్నీ ఎందుకు? ఏదో మహాయుద్ధం జరుగుతుందని నన్ను అనవసరంగా మన కోట నుండి లాక్కువచ్చారు. కత్తి ఒరనుండి తీయనేలేదు! కోట ఎలాగా పట్టుకున్నారు. ఈ కాచభూపతిని మేడివల్లిపురానికి అవతల విడిదిచేసిఉన్న అతని సైన్యాలకడకు పంపండి. అతడు సైన్యాల నన్నింటిని పంపివేసి తిన్నగా నిడుదప్రోలు శ్రీ ఇందుశేఖర మహారాజులంవారికి లోబడి వారు విధించిన శిక్ష అనుభవిస్తే మనదారిని మనం వెళ్ళదాము. కాదంటారా మనతో యుద్ధం చేస్తాడు' అని అతడు మనవి చేశాడు.

అవునవు నంటూ గన్నారెడ్డి చిరునవ్వు నవ్వుతూ 'ఓయి కాచనాయకా! నువ్వు నా ఆలోచన వినదలచుకొంటే ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని మాకు పది లక్షల బంగారు టంకాలు ఇచ్చి, నీ సైన్యం ముప్పాతికమందిని పంపించివేయి. ఆ వెనుక నిడుదప్రోలు ప్రభువు శరణువేడు, లేదా నిన్ను ఈ పరశువుతో ఖండ ఖండాలు చేసి కాకులకు గద్దలకు విసిరివేస్తాను. నడు, కోటలోనుంచి. నీకు నమ్మకముంటే నీ కుటుంబాన్ని ఇక్కడ ఉంచు. నమ్మకం లేకపోతే కూడా తీసుకుపో. ఏ విషయమూ వెంటనే చెప్పు' అన్నాడు.

ఉగ్రుడై మండిపోతూ కాచయనాయకుడు మాట్లాడకుండా ఆ మందిరంలో నుండి వెడలిపోయాడు.

౧౦

కోటలోనూ నగరంలోనూ ఉన్న తన అయిదువేల సైన్యాన్నీ బందీలు చేసినాడు గాబోలు ఈ గన్నారెడ్డి గజదొంగ. వీ డెక్కడనుంచి వచ్చాడండీ! వీడికి తన విషయాలన్నీ ఎలా తెలిశాయి? వీడిని గురించి తాను విన్న విచిత్రాలన్నీ నిజమేనా? ఇంతదూరం ఎంతసైన్యంతో వచ్చాడు? ఎల్లా వచ్చాడు? ఎల్లా తన

సైన్యం అంతా బందీచేయగలిగాడు? తాను ప్రస్తుతం చల్లగా ఊరుకొని వీలు వచ్చిన వెంటనే మళ్ళీ యుద్ధసన్నాహం చేయడమా, లేకపోతే తెగబడి యుద్ధం చేయడమా?

తాను ఈ రాక్షసితో యుద్ధంచేయడంలో మేళ్ళు చాలా ఉన్నాయి. ఒకటి-వాడికి అందుబాటులో లేనిదేశం. దేశంఅంతా తనవాళ్ళు. తనకు కొత్తసైన్యాలు వస్తాయి. వీడికి ఉన్న సైన్యమే, కోటలోఉన్న తినుబండారపు వస్తువులే వీడికి: తనకు దేశం అంతా ఉంటుంది. తాను మహాయుద్ధాలు చేయడానికి సన్నాహం చేశాడు. తెలిసిఉన్న తనకోట తాను పట్టుకోడం సులభం. ఈ పిశాచిగాడికి కోట అనుపానులు తెలియవు.

అయితే తన ధనం కోటలో ఉంది. తన సైన్యాలకై తెచ్చిన ఆహారసామాగ్రులు నగరంలోనూ, కోటలోనూ ఉన్నాయి. ఆ తిండితో, ఆ యుద్ధసామాగ్రితో వీడూ, వీడి సైన్యమూ ఆరునెలలు యుద్ధంచేయవచ్చును. అయితే తన నగరంలోని ప్రజలందరూ తనపక్షం.

ఈలా చేసినాడేమి? ఇంక నిర్భయంగా తన్ను ఇలా వదలివేయడంలో ఉద్దేశ మేమిటి? ఇంత గజదొంగ ఏదో కారణంలేక తన్నిలా వదలిపెట్టునా? పైనుంచి ఈతనికి సహాయం ఏమివస్తుంది? ఎక్కడనుంచి వస్తుంది?

తాను గజదొంగను నాశనం చేస్తున్నాడు అని లోకం అనుకుంటుంది. గణపతిచక్రవర్తి ఈతని తలచూస్తే చాలా సంతోషం పొందుతాడు. వారందరూ ఈ గజదొంగను పట్టుకోవాలని ఏలాగూ చూస్తున్నారు; అందుకని ఈ దుర్మార్గుడు తెలివితక్కువగా తనకు ఇచ్చిన ఈ సావకాశాన్ని పోగొట్టుకోవడం ఎందుకు? తన నగరాన్ని తాను ముట్టడింపవలసినా, అదీ శుభమే! ఎలా అయినా తాను చక్రవర్తి అయ్యే శకునాలు ఎన్నో కనబడుతున్నాయి.

కాచనాయకుడు గన్నారెడ్డికడనుండి తన అంతఃపురంలోకి వెడుతూ ఆలోచించుకొన్నాడు. భార్యను, బిడ్డలను వెంటబెట్టుకొని శిబికలపై నెక్కి నగరం బైటకు వెళ్ళి అక్కడకు నాలుగుమైళ్ళ దూరంలోఉన్న తన సైనిక శిబిరంకడకు వెళ్ళాడు. అక్కడ ఉన్న తన సైన్యాధిపతులకు గజదొంగ గన్నారెడ్డి నగరమూ, కోటా ఆక్రమించుకొన్నాడనీ, తాము వెంటనే ముట్టడించాలనీ ఆజ్ఞ ఇచ్చి సాయంకాలానకు సర్వసైన్యాలతో నగరం ముట్టడించాడు.

ముట్టడించిన వెంటనే కాచయనాయకుని సైన్యాన్ని గన్నారెడ్డి రెండవ సైన్యం ముట్టడించింది. ఆ రాత్రి జరిగినయుద్ధం గోదావరీతీరంలో ఎప్పుడూ జరుగలేదని పెద్దలు చెప్పుతారు.

గన్నారెడ్డి సైనికులు రాత్రియుద్ధంలో ఆరితేరినవారూ, సర్వవిధాలా నిగ్గులు తేలిన కలుకుబంటులూ. వారికి రాత్రియుద్ధపు మాయలు ఎన్నైనా తెలుసును. కొద్దిమంది దెబ్బకొట్టి పారిపోవడం, ఒక అర్ధగవ్యూతి పారి పోయి వెనక్కు తిరగడం,

అక్కడే పొంచివున్న ఇతర సైన్యాలతో విరోధుల సైన్యంమీద విరుచుకుపడడం తమలోతాము ప్రత్యేకించి ఏర్పరచుకొన్న సాంకేతికాలతో ఒకరినొకరు తెలుసుకుంటూ విరోధిమూకను చెండాడడం! ఈలా కోటను ముట్టడించిన సైన్యంలో గగ్గోలుపుట్టించి కొన్ని దళాలను నాశనం చేసివైచిరి.

కోటతలుపు తెరచి నగరపుద్యాలదగ్గర ఉన్నసైన్యంలోకి రాక్షసులవంటి సైనికులు వచ్చి చేసినయుద్ధం అప్రతిమానం.

గన్నారెడ్డి, విఠలధరణీశుడు, సూరనరెడ్డి ఏబదిమంది వీరులతో కోటలోనుంచి కాచయనాయకునిముందే నగరంవదలి వెళ్ళిపోయారు. వారిప్పుడు వేయిమంది అశ్వికులను వెంటబెట్టుకొని, సైన్యం ఎక్కడ పల్చగాఉన్నదో అక్కడ దౌరపడ్డారు. అశ్వికవీరుల ప్రాణాలు ఒత్తుగాఉన్న విరోధుల ప్రాణాలు ఆకాశానకు ఎగరగొట్టుతున్నాయి. నదికి మధ్యగా ఒక హిమాలయ పర్వతం చొచ్చినట్లు వారు విరోధిసైన్యాలను చొచ్చారు. వారివెంట మూడువేలమంది ఆరితేరిన పదాతులు చొచ్చారు.

మొదటిరాత్రే ఈలా పైనుంచి సైన్యంవచ్చి తన సైన్యాన్ని హిముపుతుంటని కాచయనాయకుడు కలలోనైనా అనుకొనలేదు. తాను మహాగజం ఎక్కి సైన్యాలకు ఎంత ఉత్సాహం కలిగిస్తున్నా కాచయసైన్యాలు తలకొకదిక్కుగా చెదిరిపోయాయి.

గన్నయ్య సురవపుసైన్యం కాచయనాయకుని ఏనుగులదండును చుట్టుముట్టింది. గజయుద్ధంలో ఆరితేరిన ఆ అశ్వికసైన్యం, ఆ ఇరువది ఏనుగులపైన అగ్నిబాణాలుకురిపించింది. ఏనుగులు చెల్లాచెదరై పోయినవి. కాచయనాయకుడధివసించిన భద్రగజంమాత్రం విచిత్రగతులతో గన్నయ్యసైన్యాన్నిచికాకుపరుస్తున్నది. అప్పుడు గన్నయ్య మూడు అగ్నిబాణాలు అంబారిమీద వేయించాడు. ఆ వెంటనే గన్నయ్య అశ్వంమీదఉన్న తాడును అతివేగంతో అంబారీమీదకు విసిరాడు.

కాచయనాయకుని రక్షిస్తున్న అంగరక్షకులు ఆ అగ్నిబాణాలు తిరిగి విసిరివేశారు గాని వానితోపాటు భయంకర కాలనాగంలా వచ్చిన సూత్రాస్త్రమును వారు గమనించలేదు. ఆ సూత్రం చివరఉన్న జారుముడి టక్కునవచ్చి కాచయ నాయకుని శిరస్సుపైనబడి జారి బిగుసుకుపోయింది. ఆ తాడుతోపాటు బంతిలా ఎగిరి కాచయనాయకుడు ఆ అంబారీలోనుంచి కిందకు పడిపోయాడు.

తాడు ఉరై బిగుసుకుపోయి కిందపడడంలో కాచనాయకుని ప్రాణాలు భగవంతునిలో లీనమైపోయాయి.

గన్నారెడ్డి తాడుపట్టుకొనే గుఱ్ఱాన్ని పరుగెత్తించాడు. కాచయుని దేహము బరబర అతనివెంట నలుబదిబారల దూరంలో భూమిమీదకర్రలావచ్చింది.

## సప్తమ గాథ

# కాకతమ్మ

### ౧

కాకతమ్మ ఉత్సవాలు శాలివాహనశక ౧౧౮౫ రుధిరోద్గారి సంవత్సర ఆశ్వయుజ పాడ్యమినుంచి ప్రారంభమయ్యాయి. ఓరుగల్లునగరంలో కాకతమ్మ ఉత్సవాలకు ఆంధ్రదేశం అన్ని విషయాలనుండీ లక్షలకొలది జనం వచ్చిపడతారు. ఆ సమయంలోనే ఏకవీరాదేవి ఉత్సవమూ జరుగుతుంది.

కాకతమ్మ కాకతీయులకు కులదేవత. కాకతీయ బొట్టభేతరాజు కాలానికే కులక్రమానుగతమైన ఈ గాథ ప్రచారంలో ఉంది. కాకతమ్మ గాథ ఆ దసరా పండుగలకు ప్రతిరోజూ మహారాజుల నగరంలో పాడుతూ ఉంటారు.

కాకతీదేవి పురాణకాలంనుంచీ కాకతీయ గణానికి కులదేవత. కాకతీయ గణం ఆర్య క్షత్రియ గోత్రాలలో ఒకటి. ఈ గణం వేదకాలం నుంచీ ప్రసిద్ధికెక్కింది. ఆ పురాతనకాలంలోనే కాకతీయగణం ఆంధ్రదేశానికివచ్చి వారి దేవతను ఆంధ్రదేశంలోనూ నెలకొల్పారు. ఆ దేవతను కొలుస్తూ వచ్చిన ఒక దుర్జయ క్షత్రియవంశం శాతవాహనుల కాలంనుంచీ కాకత్య వంశంవారై చాళుక్యుల కాలంలో సబ్బిసాహిర మండల ప్రభువు లయ్యారు. తూర్పు పశ్చిమ చాళుక్య రాజ్యాల మధ్యస్థమైన ఈ మండలం ఒకసారి వీరికి, ఒకసారి వారికి, ఇంకొకసారి కాంచీపుర పల్లవులకు సామంత రాజ్యంగా ఉండేది.

ఈ సబ్బిసాహిరదేశంలో గోదావరీతీరంలో ఉన్న కొలనిదేశంకూడా ఉండేది. ఈ మండలానికి అనుమకొండ ముఖ్యపట్టణంగా ఉండేది.

బొట్టభేత మహాప్రభువు చిన్నబాలుడై ఉన్న సమయంలో ఆయన తండ్రి అయిన ప్రోలమహారాజు దివంగతుడైనాడు. ఆ సమంలో కాకతివంశ సామంతుడైన గాడయనాయకుని అన్న వచ్చి అనుమకొండను ఆక్రమించుకొన్నాడు.

ప్రోల మండలేశ్వరుని భార్య అనంగదేవి చిన్నకుమారుడయిన బొట్టభేత రాకుమారునితో పిల్లలమట్టి పారిపోయి కాకతీయ సామంతుడైన విర్యాల ఎఱ్ఱనరేంద్రునికడ తలదాచుకొన్నది. ఎఱ్ఱనరేంద్రుడు కాకతీయవంశం అంటే మహాభక్తి కలవాడు. ఆతడు వెంటనే సైన్యాలు పోగుచేసుకొని, అప్పుడు కొలని దేశంలో ఉన్న గాడయనాయకుని అన్న కామయనాయకుని ఎదిరించి,

మహాయుద్ధంచేసి, విజయంపొంది బొట్టభేతనికి తిరిగి కొలనివిదేశం సమర్పించారు. ఇంతల్లో ఎఱ్ఱన చనిపోయాడు. అతని భార్య కామమసానిదేవి పల్లవ చక్రవర్తి కడకు బొట్టభేతని తీసుకువెళ్ళి సమస్తమూ పల్లవచక్రవర్తికి నివేదించింది. బొట్ట భేత దప్పుడు పదునాలుగేండ్ల బాలుడు. అప్పటికే అతని పరాక్రమం కథలు చెప్పు కుంటుంన్నారు. ఆ బాలుణ్ణి చూచి పల్లవ చక్రవర్తి భాస్కరవర్మ ఆనందించి ఏబదివేల సైన్యం భేతనికి ఇచ్చినాడు.

భేతభూపతి కామమసాని కుమారుడు. సూరనాయకుడు మొదలయిన సేనా పతులతో కూడి అనుమకొండ ముట్టడించాడు. గాడనాయకుడు అనుమకొంత ఆక్ర మించి వున్నాడు. బొట్టభేతడు ఎన్నాళ్ళు ముట్టడి జరుపుతున్నా అమమకొండ కోటను పట్టలేకపోయాడు. అప్పు డనుమకొండలో వెలసి వున్న తన కులదైవ తము కాకతమ్మను ప్రార్థించి బొట్టభేతడు తనతోవున్న అ తల్లిపూజా విగ్రహాన్ని పూజించి తన తల పూర్ణాహుతి ఇవ్వబోతే, ఆదేవి ఆకాశవాణిగా 'నాయనా, వీర భద్రతటాకం ప్రక్కన బురుజును రేపు తాకవయ్యా: విజయం లభిస్తుంది' అని పలికినదట.

బొట్టభేతడు తన తల బదులు వేయి నారికేళాలు పూర్ణాహుతి ఇచ్చి, మరు నాడు కాకతమ్మ చెప్పినచోట బురుజును, కోటగోడను అతి ఉధృతంతో తాకి నాడట. పదిఘడియలు యుద్ధం జరుగగానే ఆ కోటగోడ పెళపెళ విరిగి పడి పోయిందట. ఆ దారిని బొట్టభేతడు అనుమకొండ కోటలో జొరపడి గాడయను యుద్ధంలో హతమార్చినాడట.

కాకతమ్మ గాథలు ఈలా ఎన్నో ఉన్నాయి. గణపతిదేవచక్రవర్తి పెద తండ్రి రుద్రమహారాజు కలలో కనపడి కాకతమ్మ రాజధాని అనుమకొండ నుండి ఇంకో నూతన స్థలానికి మార్చు మన్నదట. 'ఆమె ఎక్కడ వెలుస్తుందా' అని చూస్తూఉంటే, అనుమకొండకు కొంతదూరంలో ఒకకాపు దున్నుకుంటూ ఉండగా నాగేటి చాలులో అమ్మవారి విగ్రహం ఒకటి దొరికిందట. అక్కడే వున్న గొల్ల సానికి కాకతమ్మ పూని 'నేను కాకతమ్మను, నాకు గుడి కట్టండయ్యో' అని ఊగిస లాడిపోయిందట. రుద్రమహారాజు వెంటనే ఆమె కక్కడ గుడి కట్టించి, అక్కడే కోట కట్టించాడట. ఆ కోటమధ్య ఒంటిశిలకొండ ఉండడంవల్ల 'ఏకశిలానగరం' లేక 'ఓరుగల్లు' అని పేరు వచ్చింది.

అది మహాపట్టణమై కాకతీయ చక్రవర్తుల నూతన రాజధాని అయినది. కాకతమ్మతోపాటు ఏకవీరాదేవి గుడికూడా ఆ ప్రక్కనే ప్రతిష్ఠ చేయించాడు రుద్రచక్రవర్తి.

ఆ దసరా మహోత్సవాలకు కాకతిమహాదేవి విగ్రహానికి బంగారు తొడుగు తొడుగుతారు, వజ్రవైడూర్యాది రత్నాలు పొదిగిన భూషణాలు పెడతారు. వెల పొడుగుచీరలు కట్టుదురు, కంచుకాలు తొడుగుతారు. దినాని కొక వాహనం చొప్పున

ఆమెను రాత్రి అంతా మేళతాళాలతో, నర్తకీమణుల నాట్యాలతో ఊరేగిస్తారు. దేశ దేశాలనుండి అనేక విచిత్ర వస్తువులను కొనివచ్చి విపణి ఏర్పాటు చేస్తారు. కోనేరు స్నానాలాది భక్తులు, భక్తురాండ్రు అమ్మవారికి పూజలు చేస్తారు.

ఆ మహోత్సవాలకు రుద్రదేవ మహారాజుకూడా వస్తూఉండేవారు. ఆమె స్వయంగా పూజచేస్తూ ఉండేవాడు. ఆమె మనస్సులో ఉన్న ఆలోచనలకు అంతు లేదు. పూజచేస్తూ అమ్మవారిముందు ఒక చందనపీఠంపై అధివసించి తల్లీ! నా కర్తవ్యం ఏమిటమ్మా? అని ప్రశ్నిస్తూ ఉండేది.

ఆ దినాల్లో ఆమె మనస్సుకు నిలకడలేదు, 'చాళుక్య వీరభద్రుని వివాహ మాడడమా, లేక బ్రహ్మచారిణిగా గడపడమా' అనే ప్రశ్నకు ఈ రెండేళ్ళనన్నర నుండి ప్రత్యుత్తరంలేదు. చూస్తూచూస్తూ ఉండగా రెండేళ్ళనన్నర గడిచి పోయింది. తండ్రిగారు మాట్లాడరు. శివదేవయ్యమంత్రి 'ఏమి ఆలోచించావు' అని ఎన్నోసారు లడిగినారు.

౨

చాళుక్య రాజకుమారుడు వీరభద్రప్రభువు, కాచనాయకుని గోన గన్నారెడ్డి ఏనుగుపైనుంచి ఉరివేసి క్రిందకులాగి చంపినవెంటనే సైన్యాలతో మేడిపల్లి పోయి ఆ నగరాన్ని ఆక్రమించుకొని రెండేండ్లయినది. జాయపసేనాని మధుమా వతీదేవితో సంగమేశ్వర తీర్థసేవావ్యాజమున నేగి లకుమయారెడ్డి సైన్యాలను ఓడించి వానిని నాశనంచేశాడు. గన్నారెడ్డి మాయచేసి తన పినతండ్రి లకుమయను పట్టుకొని, శివదేవయ్య మంత్రికడకు పంపెను. ఆయనను తన నగరిలోనే ఉంటూ, శివభక్తుడై కాలం గడపవలసిందని రుద్రదేవ మహాప్రభువు హెచ్చరించారు. గన్నారెడ్డి వంచిభూపాలాది రాజద్రోహ సామంతులను అనేకులను అణచివేసెను.

గోన గన్నయ్య కాచనాయని నాశనం చేయడంతోనే ఊరకొనక, కాచ నాయకునికి సహాయం చేయడానికి సిద్ధపడ్డ కళింగాంధ్రులపైకి ఎత్తిపోయి వర్ధాని దగ్గర వారి సైన్యాలను మూడువైపులనుండి పొదివి హతశేషుల్ని కూడా విడువ కుండా నాశనంచేసినవాడాయెను.

ఆ తర్వాత గన్నారెడ్డి తన కోటకు పోయినాడు. ఆ కోటను పట్టుకోవాలని ఎంతమందో ప్రయత్నం చేస్తున్నారు. ఆ ప్రయత్నం చేసేవారిలో హరిహరదేవ మురారిదేవులు ముఖ్యులు. హరిహర మురారిదేవులు అతిరహస్యంగా లకుమయా రెడ్డిని ఓరుగల్లులో కలుస్తూనే ఉండిరి. లకుమయారెడ్డి ఆ కారణంగా తన ఓరుగల్లు నిర్బంధవాసము తన మేలుకొరకే వచ్చిందని సంతోషించినాడు.

దుర్గాష్టమినాడు ఊరంతా మహోత్సవమై సకల దేవలోకాలు భూమికి దిగి వచ్చి, ఓరుగల్లు అమితోత్సాహాన తాండవించిపోయింది. ఆ మహోత్సవ సమయాన రాత్రి కాకతీదేవిని బంగారు సింహవాహనంమీద నగరం అంతా ఊరేగించారు. ఆ ఊరేగింపులో మండలాధిపులు, సేనాపతులు మొదలగువా రెందరో పాల్గొన్నారు. రుద్రదేవమహారాజు భద్రగజారోహణంచేసి కొంతదూరం ఊరేగింపులో పాల్గొన్నారు.

రాత్రి అర్ధయామం దాటినంతట మహారాజు, మండలేశ్వరులు, సేనాపతులు ఎవరి ఇళ్ళకు వారు పోయి తెల్లవారి స్నానాదికాలు నిర్వర్తించుకొని మహానవమి ఉత్సవానికి కోటలోకి వస్తారు. ఆ మహారాజు తర్వాత వెళిపోయిన సామంతులలో గోన లకుమయారెడ్డి మొదటివాడు. తరువాత ఒక్కొక్కరుగా అందరూ వెళ్ళిపోయినారు. ఆ తెల్లవారుగట్ల కాకతమ్మ గుడిబైట వీధిప్రక్క అక్కడక్కడ ఇరువదిమందియు, నల్గురు మనుష్యులు వీధి మండపంలోనూ చేరారు.

గుడిలో అయిదారు దీపాలు మినుకు మినుకు మంటున్నాయి. గుడిలో, గుడి ఆవరణలో, గుడిబైటా వెలిగించి ఉంచిన కాగడాలన్నీ ఆరిపోయినవి. కొన్ని లక్షలమంది జనులు ఉత్సవంలో పాల్గొంటున్నారు. ఉత్సవమంతా కాగడాలే, ఆముదము కాగడాలు, కొబ్బరి కురిడీ కాగడాలూ, నేతికాగడాలతో నగరం అంతా పగలైంది. కాని కాకతీదేవి గుడిదగ్గరమాత్రం కటికచీకటి. ఆ మండపంలో చేరినది గోన లకుమయప్రభువూ, హరిహరదేవుడూ, మురారిదేవుడూ, లకుమయ మంత్రి రుద్రామాత్యుడున్నూ.

"మనం అతి కష్టంమీద కలుసుకొన్నాము. ఈ మధ్య రహస్యచారులను పెట్టి ప్రసాదాదిత్యుడు అతిజాగ్రత్తగా ఉంటున్నాడు. నేను కదిలితే ఆ విషయం ప్రసాదాదిత్యునకు తెలుస్తుంది. ఈ దినం పుణ్యదినం. అందుకనే కాకతమ్మ గుడే మనకు అనువైన ప్రదేశమైనది. మీ నగరి చుట్టూకూడా ప్రసాదాదిత్యుడు రహస్య చారుల్ని కాపుంచి ఉండాలి. ఎప్పుడు తాము ఈ సింహాసనం ఆక్రమించుకుంటారో అని ఎదురుచూస్తూన్నాము, మేమంతా" అని హరిహర మురారులతో లకుమయారెడ్డి అన్నాడు.

హరిహరదేవుడు ; గోనప్రభూ ! మీరంతా మా పక్షాన పనిచేయడం మాకు లక్ష ఏనుగుల బలంగా ఉంది. మేము యాదవ మహాదేవరాజుకు వేగు పంపించినాము. తమ తండ్రి కృష్ణభూపతి అవసానకాలం సమీపించినదనిన్నీ, తమతండ్రిగారి మూలంగా తాము ఓరుగల్లుపై ఎత్తిరావడానికి వీలుకలగడం లేదనిన్నీ, తమతండ్రి పరమపదారోహణ చేయగానే తాము ఇదివరకే సర్వసైన్య సన్నాహంతో ఉండడంచేత వెంటనే బయలుదేరివచ్చి ఓరుగల్లు ముట్టడించి తీసుకొనుని,

రుద్రమ్మనూ గణపతినీ హతమార్చిన వెనక తమకు తొమ్మిదికోట్ల మాడల ధనం ఇవ్వవలసి ఉంటుందనిన్నీ మాకు యాదవమహాదేవరాజు వేగు పంపించారు.

లకు : మేముకూడా వేగుపంపించి ఉంటిమి. ఈ రుద్రయామాత్యుల వారే మహాదేవరాజుకడకు వేగు తీసుకువెళ్ళి తిరిగి వస్తూఉంటే దారిలో ఆ రాక్షసుడు పట్టుకొని బందీచేసి తీసుకు వెళ్ళిపోయినాడు,

మురారిదేవుడు ; ఎవ డా రాక్షసుడు ?

రుద్రయామాత్యుడు : మరి ఎవరున్నారు ప్రభూ ? గన్నయ్య ! నన్ను బందీగా పట్టుకువెళ్ళి ఏమీ బాధపెట్టనూలేదు, రహస్యములు అడగనూలేదు.

హరిహర : ఎవడండీ ఈ గజదొంగ ?

రుద్ర : మా ప్రభువు వారి అన్న కొమారుడు. ఆ ప్రభువు పేరూ, పవిత్రమైన గోనవంశం పేరూ కళంకం చేస్తూ పుట్టుక చక్కా వచ్చాడు.

మురారి : వీడికి గజదొంగ అని పేరు సార్థకమే ! నెమ్మది నెమ్మదిగా మనలో చేరిన సామంతులనందరినీ చావగొడుతున్నాడు. వాళ్ళదగ్గర ధనం దోస్తున్నాడనుకోండి !

లకు : అది వాడు వేసిన మంచి ఎత్తండీ ! వాడు దోచడానికి చక్కానివీలు. ఏవో అనుమానాలున్న ప్రభువును చూస్తాడు, ఆ ప్రభువుమీదకు వెళ్ళి విరుచుకు పడతాడు.

హరిహర : ఎంతయినా చక్కని యుద్ధం చేస్తాడు. ఆ నేర్పు తండ్రి పినతండ్రుల పోలికలను బట్టి వచ్చి ఉండాలి.

రుద్ర : ఏమి నేర్పులెండి. దొంగతనాలు చేసేవారు మొదట సులభంగా బళ్ళు దోచుకుంటారు. మనుష్యునికి ఉండే సాధారణపు అశ్రద్ధ దొంగకు మంచి వీలువిస్తుంది. అలాగే నాయకుల అశ్రద్ధ ఈ దొంగకు అదనయింది. రహస్య వర్తనం రెండవబలం, దొంగకు రాత్రిబలం అన్నట్లు. ఇకరమ్మనండి. ఈయనగారి కృత్రిమాలన్నీ ప్రతివానికీ తెలిసిపోయాయి. మగవాడైతే బరిమీదపడి యుద్ధంచేయ్యాలి.

హరిహర : తాము చెప్పింది నిజమే మంత్రీ ! ఈ రాజ్యాధిపులంతా, నిమ్మకు నీరెత్తినట్లు గజదొంగను ఈ దేశాన విచ్చలవిడిగా తిరుగనిస్తున్నారు. ఎలా తిరుగనిస్తున్నారు ? అదీ నా కాశ్చర్యం.

రుద్ర : సామ్రాజ్యం దుర్బలం కావడమే ఇంతకూ మూల మనుకోండి, ప్రజ లెవరికీ ఆడది రాజ్యం చేయడం ఇష్టంలేదు. అవిడ సామంతులకు మాత్రం ఇష్టమా ఏమిటండీ ? వారు అదనుకోసం చూస్తూ ఉన్నారు మహారాజా !

లకుమయ్య : శివదేవయ్య అసాధ్యుడు, ఎవరైతేనేమి ? తను వేసే ఎత్తుగడలకు సహాయంచేస్తే సరి ! తన అవసరం తీరిన తరువాత అతన్ని హత మారుస్తాడు.

హరిహర: లకుమయమహారాజా! మీ అన్నగారి కుమారుడని ఇంతకాలమూ సందేహించాము. ఇక ఆ గన్నయ్యను నాశనంచేసే ఎత్తు ఎత్తుదాము.

రుద్ర: మా మహారాజుగారికి అందుకు అభ్యంతరములేదు. అయితే నా మనవి, మనం వేసిన పెద్ద ఎత్తుగడ నెగ్గితే, ఈ దొంగను నాశనం చేయడం ఎంత సేపు అని. జాయప మహారాజు మా సైన్యాన్ని నాశనం చేశాడని అనుకుంటున్నారు. అది వట్టిమాట. ఈ దినాన వర్ధమానపురం పట్టుకోవాలంటే పది లక్షల సైన్యం వెళ్ళాలి!

మురారి: మహారాజా! మీరు వెంటనే ఈ నగరం వదిలి పారిపోయే వీలు కొరకు మేము అన్ని మార్గాలూ సిద్ధం చేస్తున్నాము. మా సైన్యమూ వృద్ధి అయినది.

లకుమయ: అవును, మనకు సర్వవిధాలా సహాయం చేస్తామని ఒక రహస్యమైన వేగువస్తూ ఉంటుంది. వారు ఎవరో తెలియనేదు!

హరిహర: ఆ పురుషు డెవరో నాకూ గ్రాహ్యం కావటంలేదు.

లకు: చోడోదయుడు పూర్తిగా మన పక్షమే చేరినాడు. మధుర పాండ్య మహారాజో, చోడమహారాజో అయి ఉంటాడని నా ఉద్దేశం. కళింగభూపతి కాదు. మేడిపల్లి కాచయనాయకుని విషయంలో వారు బయలుపడినారు. ఈ వార్త దక్షిణా న్నుంచే వస్తున్నదండీ!

లకుమయ: అదే మా అనుమానమున్నూ!

## 3

శ్రీ మల్యాల కుప్పసానమ్మ దేవేరి రెండేండ్ల క్రిందనే బుద్ధపురం వెళ్ళి పోయింది. శివదేవయ్య మంత్రి ఆలోచన ప్రకారం అన్నాంబికాదేవిని, రుద్ర మాంబాదేవి అంతఃపురంలో ఉంచి, కుప్పసానమ్మ వెళ్ళిపోయింది.

ఆవల తల్లి దగ్గరనూ ఉండక, ఈవల తాను ప్రేమించే వీరుని అక్కగారి కడనూ ఉండక, రుద్రమదేవి అంతఃపురంలో ఉండడానికి అన్నాంబిక కొంచెం బాధపడింది. కాని, రుద్రమాంబికాదేవి ప్రేమ చవి చూచీ, ముమ్మడాంబిక అపేక్ష కడుపార గ్రోలీ ఆమె చివరకు రుద్రాంబ నగరిలో ఉండడానికి ఒప్పుకొన్నది.

దుర్గాష్టమి కాకతమ్మ ఊరేగింపుకు రుద్రాంబతోపాటు పురుషవేషం వేసు కొని అన్నాంబిక తానున్నూ పట్టపుటేనుగుపై ఊరేగి తిరిగి నగరు చేరింది. వా రిద్దరూ మాత్రమే ఉన్నప్పుడు అక్కాచెల్లెళ్ళుగా పిల్చుకొంటున్నారు. రుద్రాంబ నిజంగా అన్నాంబికా రాకుమారిని ఒక్క నిమేషం వదలి పుండలేకపోయింది. ఏ విషయం తాను ఆ బాలికతో చర్చించినా ఆమెకూడా చదువుకున్నదే అయినందున దంచేత, ఇద్దరకూ ఎంతో గాఢంగా చర్చ సాగేది.

ఒకనాడు కావ్యవిషయం వచ్చేది. రసము ముఖ్యమా, ధ్వని ముఖ్యమా, రీతి ముఖ్యమా అనే చర్చవచ్చేది. అలంకారానికి ఎక్కువ ప్రాధాన్యం ఈయకూడదని ఒకరంటే, ఇవ్వాలని ఒకరనేవారు. వారి వాగ్వాదాలలో ముమ్మడమ్మ చేరేది. ముమ్మడమ్మ ఒకసారి రుద్రమ్మతో చేరితే, పెక్కుసార్లు అన్నాంబికతో చేరేది. ఆనందానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు అన్నాంబికా ముమ్మడమ్మలు. ఒక్కొక్కప్పుడు రుద్రాంబ భావానికీ, రసానికీ ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చి వాదించేది. ఆ సమయంలో అన్నాంబికా ముమ్మడమ్మలు రీతి, ధ్వనీ ఎక్కువ అని వాదించేవారు. వ్యాకరణం, తర్కం, వేదాంతం, గణితం అన్నీ వారి వాదనలలో నాట్యం చేస్తూ వుండేవి. మత సిద్ధాంతాలను చర్చించేవారు. అన్నాంబికా రుద్రాంబలు మాత్రమే వున్నప్పుడు, అన్నాంబ తన హృదయం అంతా రుద్రాంబకు ప్రస్ఫుటం చేసింది.

అన్నాంబిక : ఒక్క చూపులో హృదయం అర్పించుకోడం సంభవమా అక్కా?

రుద్రాంబ : ఓసి వెఱ్ఱిపిల్లా! ఒక్కచూపులో, ఒక్కమాటలో, ఒక్క వినికిడిలో హృదయం అర్పించుకోవడం సంభవమే! కొన్నిఏళ్ళు కలిసి మెలిసి ఉన్నా, స్త్రీ పురుషులలో స్పందనం ఏమీ కలగకపోవచ్చును.

అన్నాం : ప్రేమ అనేది ఏమిటి? ఒక స్త్రీ పురుషుని కోరడం, ఒక పురుషుడు స్త్రీని కోరడమేకాదా?

రుద్రాం : ఓయి చెల్లీ, అది కామం అవుతుంది. ప్రేమ ఎట్లా అవుతుంది? స్త్రీకి తన పురుషుడు భర్త అవడానికి సావకాశం లేకపోయినా, ఆమె జీవితానికీ, ఆ పురుషుని జీవితానికీ పరమపవిత్ర సంబంధం ఏర్పడిపోతుంది.

అన్నాం : జీవితానికీ జీవితానికీ ఈ ప్రేమసంబంధము పేరవుతుందా లేక ఎన్నోరూపులతో ఆ పురుషుడే తిరిగి తిరిగి ఉద్భవిస్తూ ఉంటాడా?

రుద్రాం : చెల్లీ, ఇవన్నీ గడ్డుప్రశ్నలు. తర్కంప్రకారం ఆలోచిస్తే ఈ కారణాలూ లేవు, ప్రేమలూ లేవు!

అన్నాం : ఉన్నవి?

రుద్రాం : ఆత్మే! ఆత్మలన్నీ ఒక్కటిగదా! అలాంటప్పుడు ఒక ఆత్మ ఇంకో ఆత్మను ప్రేమించడం అనేది లేదుకాబట్టి సంపూర్ణజ్ఞానం లేనివారికే భౌతికమైన ప్రేమవాదన.

అన్నాం : అక్కా! నా వివాహం ఏర్పాటుచేసిన దినాన, ఒక పురుషుణ్ణి చూచాను. ఆ చూచినది మూడు నాలుగు క్షణికాలుమాత్రం. 'ఆ పురుషునికొరకే నేను జన్మఎత్తినది' అని నా హృదయానికి తట్టినది. నా కా వివాహం కాదని, ఆ

పురుషుడే నా భర్త అవుతాడని నాకు తొలకరి మెరుపులా తత్క్షణం తోచింది. ఆ వివాహం జరుగలేదు.

రుద్రాం : ఆ పురుషుడే నీ భర్త అవుతాడు.

అన్నాం : అక్కా ! వేళాకోళం పట్టండి !

రుద్రాం : ఓసి వెఱ్ఱితల్లీ ! నీతో నా వేళాకోళాలు ? నాకు ఏదో అనుమాన రహితమైన భావం హృదయానికి తట్టింది

అన్నాం : ఆ పురుషుడే మొదటిసారి వివాహం తప్పించాడు.

రుద్రాం : రెండవసారి ప్రధానమూ తప్పించాడు. నీ రహస్యం నేను గ్రహించలే దనుకున్నావా ? ఆతడు గజదొంగ ! ఇది నీలో దాగివున్న మనో వ్యధ ! అందుకనే నా సేనాపతులకూ, సైన్యాలకూ ఆ గజదొంగను ఏవిధంగానూ బాధించక బందీగా పట్టుకోవలసిందని ఆజ్ఞయిచ్చాను.

అన్నాంబిక రుద్రాంబమాటలు వినగానే ఎంతో సిగ్గుపడింది. ఒకసారి ఆనందంలో మునిగిపోయింది. ఒకసారి గజగజ వణికిపోయింది. ఆ పేరుకు గజదొంగయై ఈలా అందరికోపానికి గురి అవడమూ దేశాలు దోచుకుంటున్న మను ష్యునిపై తన మనస్సు లగ్నమైందేమి ? అతనిపై అందరూ కత్తిగట్టితే ఇంక ఆయన ఏలాంటి ఆపత్తులో పడిపోవునో ?

ఆయన పట్టుబడెనా ! ఎంత అవమానం ? ఆ అవమానంవల్ల ఏమి వైప రీత్యాలు సంభవించునో ? అన్నాంబిక మౌనం వహించి, కంటనీరు తిరుగు చుండగా క్రుంగిపోయి కూర్చుండుట చూచి రుద్రాంబ 'తల్లీ లోకంసంగతి ఆను వారికి ఏమి తెలుస్తుంది. వారికి తెలిసున్న కొద్దిలోకము పుట్టిల్లూ, అత్తిల్లూను ! అందులో రాజవంశాలవారికి భర్తే సర్వలోకమూ ! ఇంత చిన్నతనంలో నీ కెన్ని మనోవ్యాకులతలు వచ్చినాయితల్లీ ! నీమనస్సులో చీకాకులేమీ పెట్టుకోకులే ! ఈ శరత్కాల జ్యోత్స్నసమయంలో ఈలా కూర్చోవడం ఎందుకు ? కాకతమ్మతల్లిని ప్రార్థించు, మనస్సు నిర్మలంచేసుకో, అన్నీ ఆ దేవికే అప్పజెప్పు. ఆమే చక్క పరుస్తుంది' అని అనునయించింది.

వారిద్దరూ మహానవమిరాత్రి అంతస్తులు గడిచి ఉప్పరిగమీదకుపోయారు.

శారదాకాశంలో చిన్న చిన్న మేఘాలు కలయికలేని భావాలులా అక్క డక్కడ తేలుచున్నవి వెన్నెలమాత్రం మల్లెపువ్వులా, పాలసముద్రంలా అన్నాం బికా రుద్రాంబికల నవ్వులా, మధురంగా పరిమళ పూరితమైన విశ్వం అంతా నిండివుంది.

ఆ వెన్నెలను సర్వాంగాలతో ఆస్వాదిస్తూ ఆ చెలులిద్దరూ ఉప్పరిగమీద ఒక రత్నకంబళిపై ఆసీనులై, ఏదో మాయాప్రపంచంలోకి వెళ్ళినట్లు ఉప్పొంగినారు.

ఆ వెన్నెల సంగీతము పాడినట్లయి, ఆ వెన్నెల కాకతమ్మ చల్లని చూపులై ప్రసరించిపోయినది.

౪

వెన్నెలలో కూరుచున్నవారు ఈలోకమే మరచిపోతారు. దసరా దినాలలో వానలు కురియడం ఆంధ్రదేశంలో ఎక్కువ. ఆంధ్రబాలిక లా దినాలలో బొమ్మల పండుగ చేసుకుంటారు. ఆంధ్రబాలు రా పదినాళ్ళు వీరవిద్యాఖేలనాలలో వువ్విళ్ళూరిపోతారు. ప్రతిఇంటా పండుగే. ఆనాటి ఆంధ్రదేశంలో ఈ నవరాత్రి, దీపావళి, సంక్రాంతి, శ్రీరామనవమీ పెద్ద పండుగలు. ఆంధ్రబాలికలు ఈ నవరాత్రి ఉత్సవాలలో బొమ్మలు చిత్ర విచిత్రరీతుల అలంకరించి ఇరుగుపొరుగు బాలికలను పేరంటానికి పిలిచి, బొమ్మలకు హారతు లిచ్చి, నృత్య గీతాది వినోదా లర్పించి, శక్తికొలది పుణ్య స్త్రీలకు బహూమతు లందిస్తారు.

గణపతిరుద్ర మహారాజులవారి దేవేరుల నగరులలో గణపాంబాదేవి బాల్యమునుంచి ఈ ఉత్సవాలు బాగా జరిగేవి. ఈపడు పెళ్ళికాని బాలిక అయిన అన్నాంటిక ఉండడంచేత రుద్రమదేవి బొమ్మలపండుగ తలపెట్టింది. ఈ పండుగకు నెలదినాల నుండీ రాజోద్యోగులు దేశదేశాల సాలభంజికలు, విగ్రహాలు, చిత్రాలు, విచిత్రాలు, వినోదాలు, కర్రబొమ్మలు, మట్టిబొమ్మలు, కొమ్ముబొమ్మలు, బంగారపు బొమ్మలు, వెండిబొమ్మలు, దంతమంజూషలు, కీలుబొమ్మలు రాచనగరిలో తెచ్చి వేసినారు.

దక్షిణాదినుండి దంతపుబొమ్మలు, ధరణికోటనుండి పాలరాతివిగ్రహాలు, నతనాటిసీమనుండి కఱ్ఱబొమ్మలు, సిందవాడినుండి ఎఱ్ఱచందనపు బొమ్మలు, గాంగవాడినుండి మంచిగంధపుచెక్క బొమ్మలు, కళింగమునుండి కొమ్ము బొమ్మలు, ఉత్తరాదినుండి ఇత్తడిబొమ్మలు, ఆంధ్రదేశమునం దంతటినుండి చిత్రలేఖనములు వచ్చినవి. చీనా, సువర్ణ, యవ, మలయ ద్వీపాల నుండి లక్కబొమ్మలు మోటుపల్లిలో దిగుమతి అయినవి. భారతావనిలో ఏదేశంలో ఏపనులు ప్రసిద్ధికెక్కినవో అవన్నీ వచ్చినవి.

ఒక మహామందిరమందు శిల్పు లీ విచిత్రమైన వస్తువులన్నీ అలంకరించినారు. ధూపకరండాలనుండి ధూపాలు వస్తున్నవి. ఆకాశంలోని నక్షత్రాలులా దీపాలు వేనకువేలు మిరుమిట్లాడుతూ. ఆ మందిరం అంతా స్వర్గలోకం చేశాయి.

అవైపు శివలీలలు, ఈవైపు విష్ణులీలలు, ఈవల పురాణగాథలు, ఇవన్నీ ఆంధ్ర దైనందిన జీవితపట్టాలు. అక్కడక్కడ నర్తకీమేళం, ఇటు రాజసభ, అది సుధర్మ, అల్లదిగో ఆంధ్రగ్రామం ఒకటి. ఆ ఇళ్ళన్నీ బొమ్మలే. ఇళ్ళలోనుంచి రైతులు వచ్చి పొలాలకు పోతున్నారు. అదే గ్రామసభ. అది గ్రామంలోని పశువులు మేసే బయలు. ఈ నూతిలోనుంచి నీళ్ళు తోడుకుంటున్నారు. ఇక్కడ పొలం దున్నుతున్నారు.

ఓరుగల్లునగరంలో పెద్దకుటుంబాల స్త్రీలు, బాలికలూ అందరూ పేరంటానికి ఆహూతులైనారు. సాయంకాలం ఇరువది ఘడియలు కొట్టినప్పటినుండి పేరంటాండ్రు రుద్రదేవ రాజనగరుకు రథాలమీద, అందలాలమీద విచ్చేసినారు. వారు కట్టుకున్న పట్టుచీరలు, వారు ధరించిన రత్నాల ముత్యాల భూషణాల వెలుగులు మిలమిలలతో, జలజలలతో, తళతళలతో ఆ మందిర మంతా నిండిపోయాయి.

రుద్రదేవి బాలికగా వారి కందరికీ ప్రత్యక్షమగుట అదే మొదటిసారి. ఎంత అందమైనది! ఆమె ఫాలము ఎంత విశాలమైనది! ఆమె కన్నులలో సహస్రపత్రకమలాలువికసించాయే! ఎంత తీయనికంఠ మీ రాజకుమారిది! సత్యభామ ఈలాగే ఉండేదా? ఈమెను ఈలా దర్శించడం ఎంతపుణ్యం చేసుకుంటే మనకు సంభవమైంది! శచీదేవి, లక్ష్మి, సరస్వతి ఈలాగే ఉంటారుకాబోలు! ఇదివరకు ఊరేగింపులలో మహాసభలలో దర్శించినప్పు డచ్చముగ సుందరుడగు బాలకునిలా కనపడి, ఈ రాజకుమారి, నేడు ఎంత తీవిగా, గంభీరంగా, సుందరిగా మనలను ఆహ్వానించింది! ఈలాంటి ప్రశ్నలు వేనవేలు ఆనా డక్కడ సమకూడిన ఆంధ్ర రాచభామల, వియోగిమంత్రిల అంగనల! పండితవంశ సుందరాంగుల హృదయాలలో మెరుములు మెరిసి పోయినవి.

ఈ ఉత్సవం చేసేది ముగ్గురు కన్యలు. రుద్రమదేవికన్య, ముమ్మడమ్మ కన్య, అన్నాంబికకన్య. ఈ విషయం ఆ దినాన అక్కడకు పేరంటం వచ్చిన ఆంధ్ర కులాంగన లందరూ గ్రహించారు.

ఒకప్రక్క నృత్యగీత వాద్యాలూ, ఒకప్రక్క తీయని ఆంధ్ర యోషల పాటలూ ఆ మందిరమంతా లలితాదేవి దివ్యమందిరాన్ని చేసినవి.

చెలికత్తెలు బంగారు పళ్ళెరాల ముత్యాలు, వివిధ ఫలజాతులు, వివిధ పుష్పాలు, ఆకులు, వక్కలు, లవంగ, జాజికాయ, జాపత్రి, కస్తూరి, కుంకుమ, జవ్వాజి, పిస్తల, చార, ఆరోటు పప్పులు పట్టుకొని వెనుకరా రుద్రాంబ, ముమ్మడమ్మ, అన్నాంబలు వచ్చిన పేరంటాండ్రకు వాయినాలిచ్చేరు.

వేలకువేలు ఇతర స్త్రీలా నగరిలో నిండిపోయినారు. వారందరికీ చెలులు రాచకన్నెలకు ఇచ్చిన వాయినాలవంటివే ఇచ్చారు. మంగళహారతులు పాడిన వెనుక ఎవరి నగరులకూ, ఇళ్ళకూ, వారు వారు వెళ్ళిపోయినారు.

ఆ రాత్రి రుద్రాంబిక నగరిలోనే ముమ్మడాంబిక భోజనము చేసినది. ఆ వెనుక వారు కావ్యవిచారణ చేసినారు. ముమ్మడమ్మ తన నగరికి వెడలిపోయినది. ఆ వెనుక ఆ మహానవమీ శారదజ్యోత్స్నలో రుద్రాంబ, అన్నాంబిక ఉప్పరిగపై కూర్చుండి ఆ అమృతాల వెన్నెలలో మునిగి తేలుతూ ఏవేవో స్వప్నలోకాలలో విహరించడం ప్రారంభించారు.

వెన్నెలకూ స్వప్నాలకూ దగ్గరి సంబంధం. వెన్నెలలో స్వప్నాలు అమృత తుషారంలా, ముత్యాల రజనులా సుడులు తిరుగుకుంటాయి. ఆ స్వప్నాలు వెన్నెలలో తడిసి పుత్తిల్లి, గాఢపరిమళపూరితాలయి, మధురరసోపేతాలయి హృదయాము, మనస్సు, జీవితమూ నిండిపోతాయి. ఆ వెన్నెల అతిసున్నితంగా యోషల జీవితంలో ప్రసరిస్తుంది. సౌందర్యవంతుల సౌందర్యము ఆ వెన్నెలలో మరింత సుందరమై లోకాల నావరిస్తుంది.

రుద్రాంబిక అన్నాంబికలు ఒక్కసారిగా తమ తమ కలలలోనుండి ఉలిక్కిపడి మెలకువపొంది పక పక నవ్వారు

"అక్కా ఏమిటమ్మా! మీరు కలలు కంటున్నారు?"

"చెల్లీ! ఏమిటే నువ్వు స్వప్నాలలో మునిగిపోయినావు?"

౫

ఒక్క ఓరుగల్లులోనే కాకుండా సబ్బిసాహిరవిషయమూ, పానుగంటి విషయం, పిల్లలమఱ్ఱి విషయం, మానువనాడు మొదలయిన అనేక దేశాలలో కాకతమ్మ ఉత్సవం ఎంతో ఆనందంతో ప్రజలు జరుపుతూ ఉండేవారు. ప్రజలకు కాకతమ్మ అయినా ఒకటే ముమ్మడమ్మ, మారెమ్మ, మాంచాలమ్మ ఎవరయినా ఒకటే. అమ్మవారికి దసరాలలో ఉత్సవం జరపడం భరతదేశాచారము.

పేదలు, సాదలు సాధారణ మనుష్యులు హీనదేవతలనూ, నాగరికజనులు శక్తిని, ఉమను, కాళిని, పార్వతిని, లలితను, రాజరాజేశ్వరిని పూజించేవారు. వామాచారులు మధుమాంసాదులు అమ్మవారికి అర్పించి తాము సేవించేవారు. దక్షిణాచారులు దానిమ్మపళ్ళు, జపాకుసుమాలు, పంచామృతాలు అర్పించేవారు.

యుగయుగాలనుండీ శాక్తేయమున్నది. ఉషోదేవ్యర్చన, మాతృపూజ, సావిత్ర్యర్చన, సురపూజ, దేవ్యర్చన వేదకాలంలోనే ఉండేవి. ఉపనిషత్కాలం లోనూ పరదేవతార్చన కద్దు. పురాణయుగంలో దేవీపూజ ఉచ్చస్థితికి పోయింది. బౌద్ధయుగంలో తార, పారమితషట్కార్చన, జైనులు భగవతి విద్యార్చనలు చేసినారు ఈనాటికీ తెలంగాణపు పల్లెటూళ్ళలో కాకతమ్మ పూజ బ్రతకమ్మ ఉత్సవంగా వెల్లివిరిసింది.

పిల్లలమఱ్ఱికి యోజనదూరంలో నున్న ప్రోలేశ్వరమనే గ్రామంలోను ఆబాలగోపాలమూ కాకతమ్మ ఉత్సవం చేస్తున్నారు. ఊరిమధ్య మఱ్ఱిచెట్టు క్రింద పల్లెలో పూలతో కాకతమ్మ విగ్రహమునుచేసి. తంగేటిపూలు, గోనుగు పూలు, గొబ్బిపూలు, ఇతర అడవిపూలు అమ్మవారిచుట్టూ పేరుస్తూ ఉంటారు. ఏదినాని కాదినము బాలికలందరూ 'కాకతమ్మ నువ్వు బ్రతుకు దేవతవు, ఉయ్యాల జంపాల ఉయ్యాల!' అంటూ పాటలు పాడుతూ, ఏదినాని కాదినం కాకతమ్మను ఊరబావిలోనో, చెరువులోనో, వాగులోనో కలుపుతూ ఉంటారు.

దుర్గాష్టమినాడు ప్రతికుటుంబము కాకతమ్మను ఊరేగిస్తూ ఊరిమధ్య ఉన్న దేవాలయందగ్గర చేరి నాట్యా లాడుతూ, పాడుతూ బాలికలు, ప్రౌఢాంగనలు అందరూ బాజాభజంత్రీలతో అమ్మవారిని నీటకలిపేచోటికి పోయి, పాటలు పాడుతూ నాట్యాలుసల్పి చివరకు బ్రతుకుదేవత కాకతమ్మను నీటిపాలుచేస్తారు. తెచ్చిన ప్రసాదాలను అందరికీ పంచుతారు.

ప్రోలేశ్వరంలోనూ కాకతమ్మ ఉత్సవం దుర్గాష్టమినాడు అఖండంగా సాగినది. ఊరిలోని బాలికలు, ప్రౌఢలు, జరఠలు చేరి కోలాహలముగా కాకతమ్మ ఉత్సవం చేస్తూఉండిరి.

ప్రోలేశ్వరంలో ఆ చుట్టుప్రక్కల గ్రామాలకు దశగ్రామాధికారి ఉన్నాడు. ఆయన కాశ్యపగోత్రీకుడైన మాచయమంత్రి 'చెన్నాప్రగడ వంశీకుడు. మాచయ మంత్రి చదువుకున్నవాడు, ఉత్తమకవి, శాంతచిత్తుడు. ప్రోలేశ్వరగ్రామములో ఉండి దశగ్రామ సంఘాధ్యక్షుడై చల్లని కాకతీయ దవళచ్ఛత్రం క్రింద రామరాజ్యం నెలకొల్పినాడు.

గ్రామభూమి గ్రామ ప్రజలది. ప్రజలందరూ భూమైనా పంచుకునేవారు: లేకపోతే పంటయినా సమంగా పంచుకునేవారు. రాజుకీయవలసిన ఆదాయమంతు గ్రామం పంటలోనే కేటాయించి, తక్కినపంట సమంగా పంచుకునేవారు. తిండికి కావలసిన పంట ఉంచుకొని, తక్కినపంట ఎగుమతికి పంపించేవారు.

ప్రతిగ్రామానికి గ్రామకంఠం--రాజభూమి ఉండేది. రాజభూమి గ్రామప్రజ ఉపయోగించుకొని తమపాలు పోగా తక్కినది ప్రభువునకు పంపేవారు. కొన్ని గ్రామాలకు సామంతప్రభువు ఒకడు ఉండేవాడు. ఆ ప్రభువు తన మహామండలేశ్వరులకు, ఆయన చక్రవర్తికి కప్పం పంపించేవారు. సైన్యాలకు ప్రజలు సహాయాలు చేయవలసి ఉండేది.

కాకతీయ గణపతిరుద్రుడు సింహాచలమునుంచి కంచివరకు, తూర్పుతీరము నుండి కుంతలదేశంవరకు రాజ్యం అంతా జయించి తనకు నమ్మకమున్న మండలేశ్వరుల, మహామండలేశ్వరుల ఆ యా నాడులకు, విషయాలకు అధిపతుల చేసినాడు.

మాచయామాత్యునకు దేశపరిపాలన, రాజనీతి అన్నీ క్షుణ్ణంగా తెలుసును. వైద్యవిషయంలో అందెవేసిన చెయ్యి. చెన్నాప్రగడవారు, చాళుక్య మంత్రి హరితసగోత్రీకుడైన చెన్నయ్యమంత్రి కాలంనుండీ ఉత్తములైనవైద్యులు. ఆ మహోత్తమవిద్య చెన్నాప్రగడవారి కులవిద్య అయినది.

మాచయమంత్రికి ముగ్గురు కొమరితలు, ఇరువురు కుమారులు. కాకతమ్మ ఉత్సవానికి మంత్రిగారి భవనంనుండి ముగ్గురు బాలికలు కాకతమ్మను పట్టుకొని,

మేళతాళాదులు ముందునడువ గణికలు నాట్యంచేస్తూ ఉండగా ప్రోలేశ్వరస్వామి గుడికి వెళ్ళినారు.

ఊరిలోని రాచవారైన రెడ్లు, బ్రాహ్మణులు, వర్తకులు, వ్యవసాయదారులు అయిన ఆంధ్రవైశ్యులు, ఆంధ్ర శిల్పిబ్రాహ్మణులు, కుమ్మరివారు, మంగలివారు, గొల్లలు, చాకలివారు, కురవలు, బోయీలు, ఉప్పరులు ఆ ఉత్సవానికి దేవాలయంకడ చేరినారు.

బాలికలందరూ తీయని కంఠస్వరాల పాటలు పాడుచు, నాట్యంచేస్తూ ఉండిరి. కోలాకోలాలు, కేకలు, నవ్వులు ఆ ప్రదేశం అంతా ప్రతిధ్వనించి పోయినాయి. ఆ వెనుక మేళతాళంతో కాకతమ్మ బొమ్మలను కొనిపోయినారు. ప్రోలేశ్వరము గ్రామం బైటవున్న ప్రోలసముద్ర మను బ్రహ్మాండమైన చెరువులో కాకతమ్మను ఓలలాడించారు.

అటువెనుక ఊరివారూ, బాలికలూ తమ తమ ఇళ్ళకు వస్తూఉండగా, మాచయమంత్రి పెద్దబాలిక పదునారేండ్ల ఈడుగల జవ్వనిఎదురుగా ఒక యువకుడు రావడం గమనించింది. ఆ బాలిక తలవంచేసింది. చిరునవ్వులు పెదవులపై, కన్నులపై, బుగ్గలపై తాండవించిపోయినాయి.

పక్కనునడిచే అక్క అడుగు తడబడడం, అక్క ఏదో అయిపోవడం పెద్దచెల్లెలు గమనించింది. పదమూడేండ్ల ఆ బాలిక అక్క మొగంవైపు చూచి, ఇటు నటు తలత్రిప్పి చూచింది. ఎదురుగా తమ్ముచూచి నవ్వుతూ అక్కినప్రగడ నడిచివస్తూవున్నాడు. కవచం ధరించి కరవాలం నడుముకు వ్రేలాడుతూ ఉండగా చేత శిరస్త్రాణం ధరించివచ్చే అక్కినప్రగడను సీతమ్మ కొంతసేపు ఆనవాలు పట్టలేకపోయింది. ఆనవాలు పట్టిన పిమ్మట నాలుగేండ్ల ఈడుగల తన చెల్లెలు, కల్యాణిని చూచి, చెల్లాయీ! బావే! అక్కినబావే! దొంగబావ! ఎక్కడనుంచి వచ్చాడు?' అని కేక వేసి, అక్కగారివంక చూచింది. అక్కగారు తన చేయి గట్టిగాపట్టుకొని 'అందరూ వింటారు నెమ్మది' అని గుసగుసలాడింది. తల మాత్రం ఎత్తలేదు. సీతమ్మ మాటలకు ప్రక్కనున్న ఆడవారూ, బాలికలూ అక్కినప్రగడవైపుకు చూపులు మరల్చారు.

ఆడవారందరూ తన్ను తేరిపార చూడడం గమనించి, మోమునందు సిగ్గు ఉదయింప అక్కిన వెనుకకు తిరిగి విసవిస నడిచి వెళ్ళిపోయాడు, కామేశ్వరి తనకు కానున్న భర్తగారు అలా వెళ్ళిపోవడం తలవంచే వాలు చూపులు పరపి గమనించింది. ఈమె విషయం ఆమెతోపాటు నడిచే కొందరు బాలికలు గమనించారు. 'ఓహో! అమ్మవారిని పూజచేసిన ఫలం ఇప్పుడే కనబడుతోందమ్మా!' అని ఒక బాలిక అన్నది. ఒక పుణ్యస్త్రీ అలా వస్తుంది కాబోలు

సిగ్గు' అన్నది. ఇంకొక ఇల్లాలు 'అవును, కాబోయే మగడువస్తే సిగ్గుపడక నాట్యం చేయమన్నావా కామేశ్వరిని ?' అని తల తిప్పినది.

కన్ను గిలిపిస్తూ, కామేశ్వరి బుగ్గ గిల్లుతూ 'ఓయమ్మా ? ఎన్నాళ్ళకు వచ్చాడు ? మంచిదినానే వచ్చాడు. కాని వస్తూ వస్తూ మూడు గడియలు ముందుగా ఎందుకు వచ్చాడుకాడు ? కామేశ్వరి నాట్యం చేసే పరమాద్భుత సౌందర్యం చూచేవాడే !' అని వారి దగ్గర చుట్టమైన బిడ్డలతల్లి అన్నది. వారందరూ మాచయ మంత్రి ఇంటికి చేరారు. సభాగృహంలో మాచయమంత్రీ, అక్కినప్రగడా మాట్లాడుకుంటున్నారు. వారి కుశలప్రశ్నలూ, ప్రతివచనాలూ అప్పుడే అయినవి.

బాలికలూ, స్త్రీలూ లోనికి వెళ్ళిపోయినారు. 'బావా బావా పన్నీరు, బావను పట్టుకు తన్నేరు, వీశెడు గంధం పూసేరూ, వీధీ వీధీ తిప్పేరు' అంటూ సీతమ్మ లోనికి కలకల నవ్వుతూ పరుగెత్తింది.

మాచనమంత్రి చిరునవ్వు నవ్వుకొని, మళ్ళీ గంభీరుడై 'ఏమి అక్కినా ! నువ్వు గజదొంగ జట్టులోనే ఉండి మాకుటుంబాలన్నీ తలెత్తకుండా చేస్తూ ఉండ వలసిందేనా ?' అని ప్రశ్నించాడు.

"ఏమి మామయ్యా ! ఇప్పటికి అయిదేళ్ళనుండి మన గజదొంగల సైన్యం పెరిగింది, పెరిగింది. ఇప్పుడు మా ప్రభువూ ఒక రాజ్యం స్థాపించారు. మేము ప్రజలను దోచుకోలేదు. గ్రామాలు కొల్లగొట్టలేదు. రాజ్యాలపేరిట అరాజకంనింపిన వాళ్ళను హతమార్చాము, హతమారుస్తున్నాము, హతమారుస్తాము. అది తప్పా !"

మాచన : అయితే ఎందుకు మీ గన్నయ్య చక్రవర్తిని శరణు వేడరాదు ?

అక్కిన : మాకంత కర్మమేమి ? మేమూ చక్రవర్తికి లోబడే ఉన్నాము. మేము చేసినదంతా ప్రజలను దోచేవారిని దోస్తున్నాము. దానివల్ల అధర్మమేమి కలిగింది ? ఈ రెండేళ్ళనుండీ మా ప్రభువు చక్రవర్తికి కప్పం కట్టుతూనే ఉన్నవాడాయెను.

మాచన : దోపిడీసొమ్ము కప్పమా ? ఏ ధర్మశాస్త్ర ప్రకారం అవుతుంది ?

అక్కిన : (పక పక నవ్వుతూ) మామయ్యా ! ధర్మశాస్త్రప్రకారం మా సొమ్ము 'దోపిడీ సొమ్ము' అని ఋజువు చేయవలసిన భారం నీది.

మాచన : అందరూ అంటున్నారు.

అక్కిన : అపవాదు ధర్మశాస్త్రంలో అనుమాన సాక్ష్యమే అవుతుంది.

మాచన : అబ్బాయీ ! నువ్వు ఉద్దండ పండితుడవు. నీతో నేను వాదించి నెగ్గగలనా ?

అక్కిన : నీ మేనల్లుణ్ణి కానా మామయ్యా ? ఒక్కటిమాత్రం నమ్ము. ఇన్ని శాస్త్రాలు చదువుకొని, అక్కినమంత్రి మనుమణ్ణయి, మాచయమంత్రి

సేవల్లుణ్ణయి, సోమయామాత్యుల కుమారుణ్ణయి అధర్మకార్యం ఒకటి చేయనని మాత్రం నమ్మ. అధర్ముని కొలువులో ఉండను. నేను ద్రోహిని కాను. మా ప్రభువు రామచంద్రప్రభువు అవతారము. అంతకన్న ఎక్కువ నేను వాదించను. ఇక వచ్చిన పని విమ్మల సందరిసీ చూచి చాలాదినాలైనది. ఒక్కసారి అత్తయ్యను, మరదళ్ళను, మరదులను చూడాలనీ, దీవెన లందుకోవాలనీ.

మాచన: (కన్నులనీరు గిరున తిరిగితే, ఉత్తరీయాన తుడిచికొని) నాయనా! మీ అమ్మ ధైర్యమేమిటో చెప్పలేను, నీ విషయం ఏమీ అనుమానం లేకుండా ఎప్పటి రీతిగా ఆనందంగా ఉంది. కాని మీ తాతగారు నీ విషయంలో ఉగ్రుడై ఉన్నాడు. నీ పేరెత్తితే మండిపోతారు. నీమీది కోపం అంతా నామీద చూపించారు. మీ నాన్న ఏదో నిన్ను తలుచుకొని విచారిస్తాడు. కోపం మాత్రం లేదు. మీ అమ్మ బావను గట్టిగా చివాట్లు పెడుతూ ఉంటుంది.

అక్కన: మా అమ్మ అచ్చంగా పార్వతిదేవి. నాన్నగారు తమ కుమారుడంటే అంత అనుమానం ఎందుకుపడాలి?

మాచన; అవన్నీ అలాఉంచు! కామేశ్వరిని చూచావా?

౬

ఉద్దండ పండితులను లెక్కచెయ్యని అక్కనప్రగడ సిగ్గునంది చిరునవ్వు మోమును ప్రఫుల్లం చెయ్యగా 'చూచాను మామయ్యా! బాగా చదువుకుంటోందా?' అని ప్రశ్నించాడు.

"అక్కనా: నీ భార్య చదువుకోదా! నీకు తగినభార్య కావద్దూ? పంచ కావ్యాలు చదువుకుంది. అలంకార శాస్త్రాలు, వ్యాకరణమూ చదువుకుంటున్నది. లే! స్నానంచేసి సంధ్యావందనం చేసుకో."

"ఊరిబయట వాగులోముగించుక వచ్చాను. కాని మళ్ళీ స్నానంచెయ్యాలి."

'అమ్మడూ, సీతా? బావకు స్నానానికి నీళ్ళు తోడించమ్మా వంటలక్కచేత' అని మాచయమంత్రి కేక వేసినాడు.

సీతమ్మ ఈవలకు పరుగునవచ్చి 'బావకు పన్నీరు తోడించా నాన్నగారూ!' అంటూ అక్కనప్రగడవైపు తిరిగి, 'రావయ్యా బావా! నీ సామాగ్రి అంతా నీ సేవకులుకాబోలు పట్టుకువచ్చారు. మిద్దె గదిలో పెట్టించాను. మహానుభావుడవు! మా అక్క మాకే కనపడడం మానేసింది. పెళ్ళయి నాలుగేళ్ళయింది. ఇప్పటికా రావడం అత్తింటికి, మహాపండితుడుగారూ!' అన్నది.

మాచయమంత్రి 'సీతా!' అని కేక వేసినాడు. సీత 'ఏమీలేదండీ నాన్న గారూ! మా బావను నేను అనుకుంటున్నానండీ' అన నవ్వుతూ బావగారిని లోనికి తీసుకొనిపోయినది.

అక్కినప్రగడకు ఇరవైమూడవ సంవత్సరము జరుగుతూ ఉన్నది. అత నికి పందొమ్మిది సంవత్సరాల ప్రాయంలో మేనమామ కూతురు నిచ్చి వివాహం చేశారు. వివాహం అయిన రెండు నెలలకే అక్కినప్రగడ గోన గన్నారెడ్డి జట్టులో కలిసిపోయినాడు.

కామేశ్వరి అందాలముద్ద, విద్యావినయసంపన్న. ఇంత చిన్నతనాన్నుంచి 'మేనత్తకొడుకే తన భర్త' అని ఉవ్విళ్ళూరిపోతూ అతనికి తగిన పండితురాలు కావాలని దీక్షతో ఉభయభాషలయందూ పాండిత్యము సంపాదించుకొంటున్నది. పెద్దలందరూ చిన్నతనాన్నుంచీ అక్కినా కామేశ్వరీ భార్యాభర్తలన్న పేరు పెట్టనే పెట్టిరి. అక్కిన హృదయంలో అంత చిన్నతనంలోనూ మేనమామ కొమరిత, ముద్దుగుమ్మ, కామేశ్వరి సింహాసనం అధివసించి కూరుచున్నది.

మొదటినుండీగన్నారెడ్డికి ప్రాణస్నేహితుడైన అక్కిన, గన్నారెడ్డి తక్కిన మిత్రులతో మాయమై వెళ్ళిపోయినా, తన వివాహం తాతగారూ, తండ్రిగారూ తల పెట్టడంవల్ల అప్పటికి ఆగిపోయి. వివాహం, గృహప్రవేశమూ, మనుగుడుపులూ అయిన వెనుక, ఒక శుభముహూర్తాన మాయమై గన్నారెడ్డి జట్టులో తానూ కలిశా నని తాతగారికిలేఖ పంపినాడు. నాటికి నేడు అక్కినమంత్రి అత్తవారింటికి వచ్చి నాడు. కాని ఈ నాలుగు సంవత్సరములు తాను క్షేమముగాఉన్నాననియు, తనకు ఏమాత్రమూ వీలుచిక్కినా వత్తుననియూ మేనమామకు ఎప్పటికప్పుడు ఉత్తరములు వ్రాయుచూ ప్రతిఉత్తరములు తెప్పించుకొనుచునే ఉండెను.

కామేశ్వరి రహస్యముగా కంటినీరు కుక్కుకొనుచు, తన హృదయంలోని బాధ ఇతరులకు తెలియనీయక అన్నినోములు నోచుకొనుచు, విద్య మరిన్నీ దీక్షగా అభ్యసిస్తూ 'భర్త ఎప్పుడువచ్చునా' అని ఎదురుచూస్తూ ఉండెను. ఆమె భర్తను చూడగానే ఆనవాలు కట్టింది. ఆమెలో ఉప్పెనలా సంతోషము పొంగిపోయింది. ఎలా నడచి తమ భవనము చేరిందో, వెంటనే పూజాగృహములోకి పరుగిడి తమ కులదేవత అయిన కామేశ్వరికి సాగిలబడి కంటినీరు పొర్లిపోగా పరిపరివిధాల ప్రార్థించింది.

ఇంతలో మాచనమంత్రి భార్య గౌరీదేవమ్మ అల్లునికి స్వయంగా వెండి చెంబుతో కాళ్ళు కడిగికొనుటకు నీరము తెచ్చి, 'నాయనా! ఎన్నాళ్ళకు మా యిం టికి రావడం! ఎక్కడనుంచి? ఓరుగల్లులో అన్నయ్యగారూ, నాన్నగారూ క్షేమ మా?' అన్న ప్రశ్నలవర్షం కురిపించింది.

మాచనమంత్రి తన భవనముందు కవచశిరస్త్రాణాలంకృతుడై గుఱ్ఱాన్ని దిగుచున్న ఈ యువకుడెవ్వరా అని తన మేనల్లుని మొదట ఆనవాలు కట్టలేక పోయినాడు. అక్కినప్రగడ శిరస్త్రాణం తీసి చేత బుచ్చుకొని, 'మామయ్యా! నన్నానవాలు పట్టలేదా ఏమిటి? ' అని పల్కరించగానే మాచనమంత్రి 'నువ్వా అక్కినా!' అని వణికిపోయాడు. తక్షణమే దగ్గర వున్న సేవకులు 'సామాను దక్షిణపు గదులలో పెట్టించండర్రా' అన్ని,కన్నుల తిరిగిన రెండు నీటి బొట్టులను కుడిబొటన వ్రేలితో తుడుచుకొని 'వస్తానని వ్రాశావు కాని, ఎప్పుడు వచ్చేదీ వ్రాయలేదే!' అని అల్లుణ్ణి ప్రశ్నించాడు. అక్కిన మామగారికి పాదాభివందనం చేశాడు.

“ నేను ఎప్పుడు వచ్చేది ఎలా వ్రాయను మామయ్యా !” అనినవ్వుతూ అక్కినమంత్రి ప్రతివచనమిచ్చి, 'సీత ఏదీ ' అని అడిగాడు.

“ ఈ దినము బ్రతుకమ్మ అయిన కాకతమ్మ పండుగ—మరిచి పోయావా, అక్కినా ?” అని మాచనమంత్రి ప్రశ్నించాడు.

“ అవునవును, నేను మరిచిపోలేదు మామయ్యా! అయితే ఊరిబయటి ఏటికో, చెరువుకో ఓలలాడింప వెళ్ళివుంటారు. నేనూ వెళ్ళి చూచివస్తా” అని అక్కినప్రగడ లేచి అలా శిరస్త్రాణం చేతిలో ఉంచుకొనే ప్రోలసముద్రం చెరువుకు బయలుదేరినాడు. దారిలో కామేశ్వరీ, మరదలు సీతా, ఇతరులూ రావడం చూచి, తానే సిగ్గుపడి తిరిగి వచ్చేసినాడు.

మొదట తాను భార్యను ఒక్కనిమేషం ఆనవాలు కట్టలేకపోయినాడు. ఆమె తన వైపు ఒక్క క్షణికం ప్రేమనిశితాలైన చూపులు పరపేసరికి అక్కిన ఆమెను ఆనవాలు పట్టి ఆమె సౌందర్యంతో నవయౌవనభాసితయై వెలిగిపోవడం గమనించి తనలోని ప్రేమ, రాకాసుధాకరజ్యోత్స్నలా వెల్లివిరిసిపోవ, కన్నులర మూతలువడ, హృదయము వేగాన నాట్యము చేయ, ఏదో దివ్యానందంలో లయమై మేనమామ ఇంటికి చేరినాడు.

అతను వేడినీళ్ల స్నానం చేస్తూ మేనమామ భవనంనిండా వెలిగింపబడిన దీపాలు గమనిస్తూ, సంధ్యావందనం ఆచరించుకుంటూ, భోజనం చేసి, లేచి మరదలు సీత అందిచ్చే తాంబూలం వేసుకుంటూ తన్నేమీ ఎరగని చిన్న మరదలిని ఒళ్లో కూర్చుండ బెట్టుకొని, భయమూ, సిగ్గూ బాపి, తీయనిమాటలు చెప్పుతూ, పెద్దమరదలితో వేళాకోళాలు సల్పుతూ, మరదలు ప్రశ్నలకూ, మేనమామప్రశ్నలకూ ప్రతివచనమిస్తూ తన సౌందర్యనిధి, ఆత్మేశ్వరిని తలచుకుంటూ, లోపలి ఆలోచనలు ఎవ్వరికీ తెలియనీయకుండా, భార్య ఒక్కసారైనా మళ్ళీకనబడదా అనిఎదురుచూస్తూ ఉండెను.

భోజనము చేసి అత్తగారు వచ్చి 'ఏమయ్యా! మీ విషయం ఏమిటి ప్రజలందరూ విస్తారంగా చెప్పుకుంటారు? మీ గజదొంగల పనేమిటి? మీ నాయకుడు గోన గన్నారెడ్డి తనరాజ్యం తిరిగి స్వాధీనం చేసుకొని, రుద్ర

దేవమ్మగారి పాదాలబడి క్షమాపణ వేడకుండా, పినతండ్రిని పట్టుకొని ఓరుగల్లుకు బందీగా పంపించిమాత్రం ఊరుకొన్నాదేమిటి ?' అని అల్లుణ్ణి పృచ్ఛ చేసింది.

చిన అక్కినమంత్రి చిరునవ్వునవ్వి 'అత్తయ్యా ! ఏమిటి అట్లాఅడుగు తారు ? దొంగలను దొంగతనం ఎందుకుచేస్తావయ్యా అంటే చెపుతారా !'

'అదికాదయ్యా ! నీ అంత చదువుకొన్నవాడు లేడు. నువ్వు మళ్ళీ అవ తారం ఎత్తిన కాళిదాసు వంటారు. నీకు ఇల్లాంటి బుద్ధిపుట్టిందేమా అని మా కంద రికీ తీరని విచారము తండ్రీ !'

మాచనమంత్రి లేచి 'నీ అనుచరులందరూ భోజనాలుచేశారు. ఈ భవనం చుట్టూ వంతులుగా కాపలా ఉంటారట. వారు చీకట్లోకూడా చూడగలరట ! నేను వెళ్ళి విశ్రమిస్తాను. మీ అత్తగారు నీ పడకగది చూపిస్తుంది' అంటూ మేనల్లుడు లేచి తనకు పాదాభివందనం చేయగా ఆశీర్వదించి వెళ్ళిపోయినాడు.

ఇంతలో సర్వాభరణభూషితురాలై, బంగారుపూవులు నేసిన కాశ్మీర పుష్ప వర్ణపు పట్టుచీర ధరించి' ఎఱుపుపట్టు కంచుకము తాల్చి, సరిగలతల తెల్లపట్టుచీర వల్లె వేసుకొని బంగారుబొమ్మలా కామేశ్వరి సిగ్గుపడుతూ వచ్చి భర్తపాదాలకు నమస్కరించింది.

చిన అక్కిన ప్రగడ కరిగిపోయినాడు. తా నామెను అత్తగారి ఎదుట ఏలాగు స్పృశించును ! అయినా ఏదో మొండిధైర్యముచేసి ఆమె రెండు భుజాలుపట్టి లేవనెత్తి 'బాగా చదువుకుంటున్నావట ?' అని ప్రశ్నించాడు.

"ఎవరు చెప్పినారు ?"

"మీ పెద్ద చెల్లి,"

"అది వట్టి అల్లరిపిల్ల !"

"నీ పోలికే ! నీ చెల్లికాదా ఏమిటి !"

"ఆ మరదలిని చూడడానికైనా ఇన్నాళ్ళకుగాని తీరిక కలుగలేదుకాబోలు!"

అత్తగారు మాయమైపోయినారు. అక్కినప్రగడ సౌందర్యనిధియై, వలపుల మిటారియై, నవయౌవన పరమావధియైన భార్యనుచూచి ప్రేమచే వణికిపోయి నాడు. ఆతని సరసత్వ 'మామెను గాఢంగా హృదయానికద్దుకో, కెంపులులా, తామరపూవు మొగ్గలులా, ఎఱ్ఱదానిమ్మగింజల కాంతిలా, తేనెలు ఊరే ఆమె పెదవుల్ని ఆస్వాదించు' అని ప్రబోధించింది. 'కురుగౌరవమయ్యా ! సంప్ర దాయమయ్యా ! నీకు పునస్సంధానం కాలేదయ్యా ! ఆమెను ముట్టరాదయ్యా' అని ఆచారము బోధించింది ఒకసారి స్పర్శానందు అనుభవణువుగా అనుభవించి, అమృత మారగించిన దేవేంద్రునిలా ఉన్న అక్కినప్రగడ ఆచారము ఒప్పదని

అనుకొంటూకూడా, కామేశ్వరిని చటుక్కున దరికి తీసుకొని, గాఢంగా కౌగిలించి, ఆమె చిబుకముపట్టి తలపైకెత్తి 'నువ్వు నా జన్మసాఫల్యలక్ష్మివి కామం!' అని ఆమె పెదవులు ముద్దిడినాడు. ఆమె సంతోషముతో, పారవశ్యంతో, భయంతో, అతని దృఢసంశ్లేషానంద మనుభవిస్తూ' 'చెల్లాయివస్తుంది' అని కౌగిలి నెమ్మదిగా తప్పించుకొని, 'అమ్మవచ్చేవేళ అయింది, రేపు' అని తుఱ్ఱున మాయమైంది.

ఇంతలో మేడ దిగివచ్చి గౌరీదేవమ్మ అల్లుణ్ణి సమీపించి, 'రావయ్యా వందుకొందువుగాని, సీతమ్మ ఇక్కడికి రాలేదూ?' అని ప్రశ్నించింది.

పక పక నవ్వు పుత్తడిబొమ్మ సీత సువ్వున పరుగునవచ్చి 'బావా బావా! వచ్చినాడు' అని ఆరంభించి 'అమ్మతో చెప్పనా?' అన్నది. అతడు నిర్ఘాంతపోయి నాడు. 'అమ్మా! బావేఁ అక్కకు రత్నాలహారం తెచ్చాడే' అంది.

'అమ్మయ్యా' అని అతడు సంతోషాన నిట్టూర్పు విడిచినాడు.

సీత అక్కినప్రగడ తెచ్చిన రత్నాలహారం సంగతి తెలిపి బావగారి వంక చూచి పక పక విరగబడి నవ్వింది. అక్కినకూడా నవ్వుతూ 'అల్లరిదానా, నీపని చెబుతా వుండు' అని లేచినాడు. సీత తల్లివెనుక దాగికొన్నది. అక్కిన మరదలిని చూచి 'ఇదా నేర్పు? అన్నాడు. సరే పట్టుకో నన్ను' అంటూ సీత మేడమెట్లు పైకి దూకింది. ఒక గదిలో దూరింది. అక్కిన వెనకాల! ఆ గదిలో కామేశ్వరి తెల్లబోతూ, నవ్వుతూ నిలుచునిఉంది. అక్కిన గుమ్మందగ్గర ఆగిపోయాడు. అక్కగారి వెనుకనుంచి బావగారిని నాలుకచాపి వెక్కిరించి అక్కగారి గదిలో నుంచి తన గదిలోకి గంతువేసి తలుపు దభాలున వేసింది సీత.

కామేశ్వరికీ మాటలేదు, అక్కినకూ మాటలేదు, కామేశ్వరి ఇదివరకు ధరించిన బట్టలు, నగలు మార్చివేసింది. చక్కని సన్నని తెలుపుచీర ధరించి, తెలుపురైక తొడిగి, నీలివల్లె వేసుకొని, దోమజాలరువేసిన తన తల్పంపై పండు కొన బోతున్నది.

అక్కిన సుందరరూపం చిత్రించిన ఫలకం ఆమె మంచానికెదురుగా ఒక సింహాసనంపైన పెట్టి ఉన్నది. ఆ చిత్రంపైన రాధాకృష్ణుల చిత్రంఉంది. ఆరెండు చిత్రలేఖనాలచుట్టూ పూలదండలున్నాయి. కామేశ్వరి పదిక్షణికా లా లాగున తలవంచి నిలుచుండి, 'అమ్మవచ్చి మీగది చూపుతుంది' అన్నది.

నిట్టూర్పు విడుస్తూ నెమ్మదిగా గుమ్మందాటి ఈవలకు అక్కిన వచ్చాడు. అక్కడ సీతమ్మవచ్చి బావగారి బుజాలుపట్టి, 'బావా! నన్ను పెళ్ళిచేసుకోకుండా మా అక్కను చేసుకున్నందుకు నిన్ను ఈలా ఏడ్పిస్తూ వుంటానులే!' అన్నది.

"ఎంతకాలం?"

"నేను ఇష్టపడినంతకాలం."

"ఎవడో మా తోడల్లుడు ఒకడువచ్చి నిన్నెత్తుకుపోకుండా వుంటాడు గనుకనా!"

"అందాకా అక్క మొగుడే దిక్కు."

"అసి, నీ ఇల్లు బంగారంకానూ, నువ్వు మీ ఆయన్ను ఏ ఉత్సవంలోనో అమ్ముకు చక్కావచ్చేటట్లున్నావు!"

"మా ఆయన్ను నేను ఎందుకమ్ముకుంటాను! మా బావనే అమ్ముకుంటా, కావలసినంత మూల్యం వస్తుంది!"

మీ అక్క నీతో దెప్పలాడదూ!"

"మొగుణ్ణి అమ్మగల నాకు మా అక్క అక్కగాదా?"

"నువ్వు అమ్మనన్నావుగా, అలాగే మీ అక్కా అమ్మడానికి ఇష్టపడదేమో?"

"ఇద్దరం అమ్ముక వచ్చి లాభాలు చూసుకుంటాం!"

"అమ్మో అయితే పారిపోవాలి!"

"ఆఁ! అది సులభమనే నీ ఉద్దేశం! మేము గజదొంగల్ని అమ్మగల సింహదొంగలం!"

అక్కిన పగలబడి నవ్వినాడు. "అమ్మయ్యో, ఇంకెక్కడ దాక్కోవడం?" అన్నాడు.

అక్క ఒక్కో" అంటూ, తుఱ్ఱుమని పారిపోతూ, 'అదిగో అదే నీగది!' అని తనగదిలోనికి వెళ్ళి మాయమై తలుపు వేసుకుంది. ఆమె చూపించిన గదిలోనికి పోయి అక్కిన పాన్పుచేరి ఆలోచిస్తూ, స్వప్నాలుకంటూ నిదురకూరినాడు.

ఆ మరునాడు ఉదయం, తెల్లవారగట్లనే లేచి అక్కినప్రగడ ఊరి చివరకు పోయి, స్నానాదికాలు జరిపి, సంధ్యావందనంచేసి, తిరిగి సూర్యోదయం అవుతూ వుండగానే మేనమామగారి ఇల్లు చేరాడు. ఆతడు లోనికివచ్చి బట్టలు మార్చుకొని, తన పరివారంలోని చారులు తెచ్చిన కొన్ని రహస్యవిషయాలు విని, వారికి తగు సమాధానాలు అందిచ్చినాడు. అతని పనులు తీరగానే మరదలు సీతా, చిన్నమరదలు కల్యాణి బావగారిదగ్గరకు వచ్చారు. కల్యాణి తన చదువూ, పాటలు బావగారికడ ప్రదర్శించింది' అటువెనుక సీత వీణ తీసుకొనివచ్చి బావగారిని తన గానవిద్యలో తేల్చివేయ నారంభించింది.

మరదలు కంఠంలో అప్పుడే ఒదుగులు ఏర్పడుతూ ఉన్నవి. సాంస్కృతిక గీతాలు, ఆంధ్రపదాలు, రాగాలాపన, తానము ఆంధ్రులసొమ్ము. అవన్నీ సీతమ్మ సౌరభాలు సేకరించుకొంటున్న పుష్పముకుళంగా బావగారికి పాడి వినిపించింది.

"బావా! నా పాటకేమిగాని, అక్క సంగీతం వినాలి నువ్వు! అని ముగించింది.

"ఈ సాయంకాలం మీ అక్కను పాడుమను సీతా! నీ పాట అద్భుతము! నీ కేమి బహుమానం ఈయగలను? ఇదిగో ఈ చిటికెన వ్రేలి ఉంగరం నీకు అర్పిస్తున్నాను."

"నాకిస్తావేమి ఉంగరం, అక్కకిడ ఇవ్వాలిగాని?"

"ఆ గొడవ నీ కెందుకు? నీకు ఉంగరం, చిన్నమరదలు కల్యాణికి నేను పట్టుకువచ్చిన బంగారు ఏనుగ బహుమానం" అని అవి తన గుడ్డని తోలుపెట్టెలోనుంచి తీసి ఆ విగ్రహం కల్యాణికి ఇస్తూ సీతవేలికి ఉంగరం తొడిగాడు. మధ్యవేలికికూడా ఆ ఉంగరం కొంచెం వదులయింది.

"బావా! ఈ ఉంగరం వదులైనా, ముద్దులు మూటగట్టుతూంది. ఏదారమో చుట్టు నా వేలినుండి ఎప్పుడూ పోనివ్వను" అని సీత కంటినీటితో అస్పష్ట వాక్యాలు పలికింది.

అక్కిన మరదలు కంటినీటికి ఆశ్చర్యమంది, 'సీతా! అదేమిటమ్మా అలా బెంబేలుపడతావు. ఒక్కటిమాత్రం నీకు మాటఇస్తాను. ధర్మదేవత సాక్షిగా మేము ఏవిధమైన పాపము చేయటంలేదని నీ ఎదుట ప్రమాణం చేస్తున్నాను. రెండవది, నీకు, కల్యాణికి, మీ అక్కకూ నే నిచ్చిన బహుమతులలో ఏ అసత్యార్జనా లేదు. అవి ధర్మవిరుద్ధం కాకుండా నాకు బహుమానాలుగా వచ్చాయి. నేను గజదొంగను కాకమునుపే, నా పాండిత్య దిగ్విజయయాత్రలో వచ్చినవి' అని పలికినాడు.

కంటినీటితో నవ్వుతూ సీత 'బావా! అందుకుకాదు నాకు కన్నీరు వచ్చింది. మా కెవ్వరికీ నీమీద అనుమానం లేదు. అధర్మమైన పని ఏదీ నువ్వు చెయ్యవని మాకందరికీ నమ్మకమే బావా! కాని నువ్వు మళ్ళీ ఎన్నాళ్ళకు వస్తావా అని తలచుకొంటే కన్నీళ్ళు తిరిగాయి. అక్క నీ పేరే మంత్రంగా, నీ చిత్రాన్ని పూజింపని దినం లేనేలేదు. అక్క సాక్షాత్తు సరస్వతీ, లక్ష్మి, పార్వతీనీ! అక్క ఇంకెన్నాళ్ల నిన్నువదలి ఉండగలదు? నీ కష్టాలలో పాలు పంచుకోవడానికి నీతో వచ్చివేస్తానంది అక్క!'

అక్కినప్రగడ ఆనందంతో ఉప్పొంగాడు. ఆశ్చర్యంతో భ్రమాన్నపడినాడు. 'సీతా! ముహూర్త నిశ్చయం పెద్దలచే చేయించే వచ్చాను. మా నగరంలో అందరూ కుటుంబాలు తెచ్చుకున్నారు. ఆలాగే మీ అక్క నాతో తప్పక వస్తుందని, మీ అక్కతో చెప్పు' అన్నాడు.

౮

ఆ మరునాడు గోన గన్నారెడ్డి ఉత్తమాశ్వం ఒక దానిని అధివసించి, ఏబదిమంది వీరులు తన వెంటరా మెరుపు వేగాన శ్రీపోలేశ్వరము వచ్చి, దళ

గ్రామాధికారి అయిన శ్రీ మాచనమంత్రిసత్తముల భవన మెక్కడని తెలిసికొంటూ మాచనమంత్రి భవనం చేరాడు. మాచనమంత్రి భవనంచుట్టూ కావలికాచే తన సైన్యంలోని భటులు తన్నానవాలుపట్టి వంగి నమస్కరింప వారిగి ఆశీర్వదిస్తూ, గుఱ్ఱం చెంగున ఉరికాడు.

ద్వారపాలకునితో ఒక సైనికుడు 'శ్రీ గన్నారెడ్డి సాహిణి మహారాజులుం వారు వచ్చారు ' అని మంత్రిగారికి తెలపవయ్యా అనేసరికి, వాడు ఉలిక్కిపడి, సభాశాలకు పరుగిడి అక్కడ పంచాయతీదారులతో, తన మహామండలేశ్వరునికడ నుండి వచ్చిన ఉద్యోగిలో మాట్లాడుతూ ఉన్న మాచనమంత్రికి 'శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువులవారు వేంచేసినారు ' అని మనవి చేశాడు.

మాచనమంత్రి మొదలైనవారు ఆశ్చర్యాన ఒక్కసారిలేచి 'ఏరి ఏరి ' అంటూ సింహద్వారంకడకు వచ్చారు. గోన గన్నారెడ్డి చిరునవ్వు నవ్వుతూ, 'మాచనమంత్రిగారూ ! నమస్కారాలు ! అని నమస్కరించాడు.

మాచనమంత్రి 'దిగ్విజయమస్తు దీర్ఘాయురస్తు, సత్వర వివాహ ప్రాప్తిరస్తు, సుసంతాన ప్రాప్తిరస్తు' అని ఆశీర్వదిస్తూ 'మహాప్రభూ ! ఎప్పుడు దయచేశారు, లోనికి విచ్చేయండి. ప్రభువుస స్నేహితుడు సుఖముగానే ఉన్నాడు ' అంటూ వారిని లోనికితోడ్కొని వచ్చెను.

గోన : బాబయ్యగారు ! పిల్లలందరూ క్షేమమా ? పిన్నిగారూ క్షేమమా ! మా బావగారూ అత్తవారింటికి వచ్చి మమ్మలనందరినీ మరచి పోయారుకాబోలునని నేనే స్వయంగా ఆయనగారిని కలుసుకొనడానికి వచ్చాను.

మాచ : చిత్తం చిత్తం, మా అక్కినే ఒక నిమేషమైనా తన ప్రభువులను పరిచిపోతాడా ! దినదినమూ ఏవో ఉత్తరాలు తమకు పంపుతూనే ఉన్నాడు ప్రభూ! దినదినమూ ఏవో ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి.

గోన : బాబయ్యగారూ ! బావమరిదిగనుక ఊరికే వేళాకోళం చేశాను ! త్వరగా వెళ్ళి పునస్సందానం చేసుకొని రావలిందని మా పురోహితులచే మంచి ముహూర్తం పెట్టించి పంపాను.

మాచన : ముహూర్త విషయంలో ప్రభువులు నాకు వ్రాసిన ఉత్తరం అందింది. ఈ విషయం మా బావకు, అక్కకు, మామగారికి తెలిపి ఆహ్వానిస్తూ ఓరుగల్లు శుభలేఖలు పంపనా వద్దా అని తటపటాయిస్తున్నాను ప్రభూ !

గోన : శుభలేఖలు పంపి ఆహ్వానించండి, వస్తేవస్తారు. రాలేక పోయినామంచిదే. ఎటువచ్చినా అత్తయ్యగారు రాని లోటు కనబడుతుంది. వెంటనే తాము ఉత్తరాలు వ్రాయించండి. మా చారుడు అని

తీసుకొని వెళ్ళే పురోహితుని తీసుకొని వారికడకు కొనిపోతాడు. మా ఏనుగులు ఊరిచివర ఉన్నాయండి.

మాచన : చిత్తం మహాప్రభూ !

ఇంతలో లోననుండి అక్కినప్రగడ వేగంతో వచ్చాడు. అతని వెంటనే సీతమ్మా, కళ్యాణికూడా ఉన్నారు. అక్కిన రాగానే గోన గన్నారెడ్డి చేతులు చాచి అతన్ని గాఢంగా కౌగలించుకొని వదలి 'ఏమయ్యా బావా! ఏమి ఇంత అందం ఎక్కడనుండి వచ్చింది! ఓహోహో అవిలాసమేమిటి' ఆసిగ్గు, ఆహొయలు! మోము వెలిగిపోతోందే ! అవును, అందంలేనివారు, కొంచెం అందం కలవారిని చూస్తేనే కొంత అందం ప్రసరిస్తుందట, అలాంటిది సౌందర్యనిధి అయిన మా చెల్లెలిని చూచిన ఒక అబ్బాయిగారికి మరీ ఆందం వచ్చిందే : ' అని నవ్వాడు.

అక్కినప్రగడ నవ్వుతూనే 'ఏమండీ బావగారూ ! మీరూ కొంచెం ఓపిక పట్టండి, ఎక్కడో మా అక్కగారు ఎదురిచూస్తున్నారు. మీరువెళ్ళి ఎంత వద్దంటున్నా ఆ క్షణంలోనే తలవంచి మెళ్ళో దండ వేయించుకోకుండా ఉంటారా ? అప్పుడు అందమనే విషయం మీకు బాగా తెలుస్తుందిలెండి ! ' అన్నాడు.

వారందరూ అక్కడి సభాశాలలో రత్నకంబళ్ళపై అధివసించి దిండ్లకాని కూర్చున్నారు. మాచన, గోన గన్నారెడ్డిని చూచి 'మహాప్రభూ ! తాము మా ఇంట ఆతిథ్యం స్వీకరించాలి' అని మనవిచేశాడు. గోన గన్నారెడ్డి 'బాబయ్యగారూ, మీ అబ్బాయిని మీరు కోరడమా, ఆజ్ఞాపించాలిగాని ! తప్పకుండా తమ ఇంటనే నా భోజనం' అని ప్రతివచన మిచ్చారు.

" తమ అనుచరులందరూ ఇక్కడేనండి. "

"వారందరూ ఊరిచివర ఉన్నారు. వారు తక్కిన సైన్యంతోబాటు అక్కడే భోజనంచేస్తే మంచిది బాబయ్యగారూ."

" నా మనవి."

" తమ ఆజ్ఞ అనండి, అలాగే కానివ్వండి."

" ధన్యుణ్ణి."

" మా అక్కినబావగారి వెనుకనే వచ్చి నన్ను చూచి పారిపోయిన అమ్మాయిలు ?"

అక్కిన : మా పెద్ద మరదలు సీతా, మా చిన్న మరదలు కల్యాణి

గోన : బావమరుదు లెంతమంది?

అక్కిన : ఇద్దరు బావగార్లు, ఒకరు ఓరుగల్లులో చదొవుకుంటున్నారు. పెద్ద బావమరిది, చక్రవర్తి కొలువులో లేఖకుడు,అయిదుగురే మా మామయ్యకు బిడ్డలు,

గోన : మా చిన్న చెల్లెళ్ళిద్దరినీ ఇట్లా రమ్మనవయ్యా బావగారూ!

లోనికి తన అతిథులకు భోజనాదికము గేర్పాటు చేయడానికి వెళ్ళిన మాచన మంత్రి సభాశాలలోనికి వస్తూ ఆ మాటలు విని ఒక పరిచారికను పిలిపించి 'అమ్మాయి సీతను, కల్యాణినీ తీసుకొనిరా' అని ఆజ్ఞ ఇచ్చినారు. పది క్షణి కాలకు నూత్నాలంకారాలు తాల్చిన సీతా, కల్యాణీ పరిచారిక వెంట అక్కడకు వచ్చారు. గోన గన్నారెడ్డి వారివంక చూచి, నా చిన్నచెల్లీ ! రావమ్మా కల్యాణీ! మా పెద్దన్నగారిదగ్గర సిగ్గేమిటమ్మా !' అన్నాడు నవ్వుతూ.

సీత ! సిగ్గుకాదండి, అన్నయ్యగారిని దర్శనం చేయడానికి సరియైన వేషంతో రావాలని పారిపోయాం.

గోన : నేను వచ్చేసరికి నువ్వే వీణవాయిస్తూ పాడుతున్నావు కాదూ ! గొంతుక పోల్చుకుంటున్నాను.

సీత : అవునండి. మాబావ పాడమంటే....

గోన : అవును తల్లీ బావే నిన్ను పాడమంటాడు. [illegible] రెండు పద్యాలు చదువ మనలేకపోయినావూ ! ఆయనగారు చేసినవానినే !

అక్కిన : ఆయన మాటలు నమ్మకు సీతా !

కల్యాణి : నువ్వు దొంగవులే, నీమాటలేమి నమ్మములే బావా !

గోన ; నిజం తల్లీ ! వట్టి దొంగబావ ! నమ్మదగిన మనిషికాడు. అతి తియ్యగా అద్భుతంగా కవిత్వం చేయగల కవి ! ఈమధ్య స్కాందము ఆంధ్రావ రచన చేస్తున్నాడు. వినీతిరాలి చెల్లీ !

అక్కిన ! మా ప్రభువు గంభీరకంఠంతో పాడుతూఉంటే మందార కుసుమాలు విరిసి మధువులు ప్రవహిస్తాయి సీతా !

మాచన : ఇద్దరూ ఒకరి రహస్యాలు ఒకరు వెల్లడించుకొంటున్నారు. అయితే ప్రభూ ! ఈ మధ్యాహ్నము వర్జ్యమేమీలేదు. శుభలేఖలు వ్రాయించి పంపుతాను.

గోన : తప్పకుండా పంపించండి బావయ్యగారూ !

౯

భోజనానంతరం గన్నారెడ్డి, అక్కినప్రగడ ఇద్దరూ కూర్చుండి కొంచెం కాలం సీతమ్మ వీణపాట విన్నారు. కొంతసేపు కల్యాణిపాడిన ముద్దులుగులికే పాటలు విన్నారు. గన్నారెడ్డి వారిద్దరకూ చెరి ఒక ముత్యాలహారమూ బహూమానమిస్తూ 'ఈ హారాలు మాకు దొరికిన పాతులోని' అన్నాడు.

ఆ బాలలు వెళ్ళిపోగానే, ఆ యిద్దరే అక్కడ కూరుచుండిరి. వెంటనే అక్కిన గోన గన్నారెడ్డిని చూచి, ప్రభూ ! అన్నీ తెలిసికొన్నాను. హూగినాటి విషయాధిపతి కోట పేర్మాడిరాయుడు, చక్రవర్తికీ తనకూ ఉన్న చుట్టరికమైనా

తెలుసుకోకుండా తనజ్ఞాతి, చక్రవర్తిగారి అల్లుడు, ఆరువేల సీమాధిపతి అయిన శ్రీ కోట భేతమహారాజులుం వారిపైకి, తెరాల ప్రభువు కాటయనాయకునితో కలిసి దండెత్తి వస్తున్నాడని తెలిసింది. మనకు మొదటవచ్చిన వేగులన్నీ వీరిద్దరూ కలిసి మనపైకే వస్తున్నారని వచ్చాయి. అది పొరపాటు. మనం ఎక్కడున్నామో వాళ్ళద్దరికీ సరిగా తెలయదు. అదీకాక మీ పినతండ్రిగారి జైత్రయాత్రాపరిణామం అందరి హృదయాల్లో పిడుగులు కురిపించింది. కాబట్టి వీరిద్దరూ ధాన్యకటకం మీదకే వెడుతున్నారు. ధాన్యకటకం దిగువను కృష్ణవేణ్ణను పడవలమీద దాటడానికి భేతమహారాజుగారి అనుజ్ఞ కోరితే ఆ వెర్రిమహారాజు సరేనన్నారు.

"అవునయ్యా బావా! చిత్రం ఏమిటంటే సైన్యాలన్నీ దాటేవరకూ తన జ్ఞాతికి భేతమహారాజు అఖండాతిథ్యం ఇవ్వ సంసిద్ధుడైనాడట. నీకు వచ్చిన వేగు నిజమయితే వెంటనే మనం పేర్మాడిరాయుని పేరు మాయిరి చేయించాలి. నువ్వు 'అతివేగము' అనగానే అతివేగంగానే వచ్చావు. నాతో ఉన్న సైన్యము అయిదు వేలు. మా విఠలయ్య తక్కిన సైన్యంతో అటు పల్నాటి వైపునుంచి వచ్చి ఆ సైన్యాలను చుట్టుముట్టుతాడు. మూడువేలమందిని కృష్ణవేణ్ణ కీవల కాపుంచి, నాలుగువేలమందితో విజయవాడ దిగువ ఏరుదాటి నేను తమ్ముడికి సహాయంగా వెడతాను. వాళ్ళద్దరి సైన్యాలు భేతమహారాజు సిద్ధంచేసిన పదివేల పడవలలో దాటకుండా మన మూడువేలమందీ సిద్ధంగా ఉంటారు. నువ్వుమాత్రం కదలడానికి వీలు లేదు. బావా! వస్తే కృష్ణ ఈవలి సైన్యాలకడకు రావచ్చును. అంతే! ఇది నా ఆజ్ఞ, బహూశః నీ పునస్సంధాన ముహూర్తంనాటికి వాళ్ళద్దరి వ్యాపారమూ చక్కబెట్టి వస్తాను. వచ్చితీసుకుతానులేవయ్యా, అల్లరిపెట్టకు. మీ తాతగారు వస్తారో, రారో?" అని గన్నారెడ్డి లేచి, 'బావగారూ నేను బాబయ్యగారితో చెప్పి వెళ్తున్నాను' అన్నారు.

"నేను మీతో వచ్చి యుద్ధంలో పాల్గొనరాదనే ఆజ్ఞ?"

"ఆజ్ఞే! ఉల్లంఘించడము పనికిరాదు. వస్తే కృష్ణ ఈవలకు రావచ్చును."

"అక్కడికే వస్తాను."

"మా బాబయ్యగారి అనుమతి అడిగిరావాలి మరి!"

"అనుమతి అడిగితే ఇస్తారా?"

"అయితే ఒక పని చేస్తాను. మూడువేల సైన్యాలు ఇక్కడే ఉంచి. నేను వెళతాను. నువ్వు ఎల్లుండి బయలుదేరి రా!

అక్కినప్రగడ లేచి, వెంటనే లోనికివెళ్ళి మేనమామ మాచనమంత్రిని తీసుకొని వచ్చాడు. మాచనమంత్రికి గన్నారెడ్డి లేచి నమస్కరించి 'బాబయ్యగారూ! నేను వెంటనే వెళ్ళిపోవాలి. పునస్సంధాన మహోత్స

వానికి తప్పకుండా వస్తాము. ఎల్లుండి మా బావగారు ఇక్కడ నేను ఉంచే మూడు వేల సైన్యాన్ని నడుపుకుంటూ ఒకచోటికి వెళ్ళాలి. ఆయన యుద్ధానికిరారు. ముహూర్తం మూడుదినాలుండగా ఇక్కడకు వస్తారు. ముహూర్తం నాటికి మేమందరమూ వస్తాము. ఈలోగా మీరు నిర్భయంగా ఉండండి. ఏమీ భయపడవలసిన అవసరంలేదు" అని మాచనమంత్రికి పాదాభివందనమాచరించి, వా రాశీర్వదిస్తూ ఉండగా వీధిలోనికి వెళ్ళి అక్కడొక వీరభటుడు సిద్ధచేసి ఉన్న గుఱ్ఱంపై చంగున ఉరికి, సహచరులు కూడరా గోన గన్నారెడ్డి సాహిణి వెళ్ళిపోయినాడు.

అక్కినప్రగడ ఆలోచనతో లోనికివచ్చి తిన్నగ మేడమీద తన గదిలోనికి పోయినాడు. ఆతడు అక్కడ ఒక బల్లమీద పరిచిన రత్నకంబళిపై కూరుచుండి దిండ్లనానుకొని ఆలోచనావిమగ్నుడై ఉండెను. మనుష్యుల ఆశకు అంతేమున్నది! పేర్మాడిరాయునికి చక్రవర్తి కావలెననే! దుర్మార్గుడు! శ్రీ శ్రీ గణపాంబదేవి భర్త తెలివైన మహారాజేకాని ముందుచూపు లేనివాడు. కృష్ణార్జునుల ఏకరూపమైనవాడు తన ప్రభువు, గన్నారెడ్డి? కాని ప్రభువు ఎక్కువ జాగ్రత్తగా ఉండాలి.

ఈ మహాపురుషుడు తనకు వివాహం వలదంటాడు. అధర్మం అణచడమునకే తాను పుట్టినాడట. దేవునినామం ధరించినందుకు ఆయన ఆజ్ఞపరిపాలించడమే తన విధి అట. అయన వెన్నదొంగ, ఈయన గజదొంగ. తమలో స్త్రీవాంఛ లేదట. తనకున్న ప్రేమంతా స్నేహితులకూ, సైనికులకూ, ప్రజలకేనట. స్త్రీ తనకవసరములేదట!

ఈ మాటలు నమ్మటెట్లు? ఆయన జాతకంలో సప్తమస్థానమూ, స్థానాధిపతీ, శుక్రుడూ మంచిస్థితిలో ఉన్నారు, ఇంక వివాహం ఎలా తప్పించుకుంటాడు?

అక్కినప్రగడ సేనలను గూర్చుకొని యుద్ధాభిముఖుడై వెళ్ళుదునని చెప్పగానే కామేశ్వరి గజగజ వణికింది. ఆమె కన్నుల నీరుతిరిగింది.

'కామేశ్వరీ! అలా కంటినీరు పెట్టకు. మహావీరుడు ఖడ్గతిక్కన చరిత్ర వినలేదా? నన్నుఆడదానిలా ఇంట్లో కూచుండమంటావా? మగువ మంచాలవలె,

" నాతో బెనంగిన నయమేమిలేదు
కడువడిఁ గలనికిఁ గదలండి మీరు,
కుల వైరముం దీర్ప గురుసాహనుండు
పరికించిచూడ నెవ్వరు మీరుదక్క"

అనాలి. ఆమె ఇంకా ఏమిచేసిందో తెలుసునా, ఆయన కటారితెచ్చి చేతికిచ్చి,

"రతిరాజ్యసౌందర్య! రణరంగధీర
కమలబాంధవతేజ! కరుణాలవాల

వినతాత్మజునిలావు వెనమీకు కలుగు
సామీరిసమమైన సాహసం బబ్బు
గృష్ణుని కెనయైన కీర్తి ఘటిల్లు
శ్రీగిరిలింగంబు, చెన్నకేవుశడు
పరములొసంగగ వర్ధిల్లగలరు
శాత్రవవిజయంబు సమకూరు మీకు
ఈ యాయుధము వదివిచ్చును జయము
కలియుగంబున మీకు ఘనపూజ లమరు"

అన్నదట.

కామే: (రోషంతో) నాకీ పలనాటివీరుల గాథలు తలనొప్పి తెస్తాయి మన దేశంలో రాజ్యాలకోసం పోరి, అన్నదమ్ములు, చుట్టాలు నాశనం అవుతూ ఉంటారు. పలనాటివీరులు మహాపరాక్రమవంతులు కావచ్చును, కాని చిప్పెడు రాజ్యం కోసం తమలోతాము కొట్లాడుకు చస్తే దానిని వీరకర్మ అనడం అధర్మం.

అక్కిన: రాజ్యంకోసం పోరడం అధర్మమంటావు!

కామే: అవును. రాజ్యాన్ని పరులాక్రమింపవస్తే అప్పుడు ధర్మరక్షణకోసం పోరవచ్చు.

అక్కిన: కామేశ్వరీ! నువ్వు పసిదానవు.

కామే: మీరు మహా పెద్దవారా!

వెంటనే అక్కిన ఆనందపూర్ణుడై కామేశ్వరిని చటుక్కున హృదయానికి హత్తుకున్నాడు. నిట్టూర్పువిడుస్తూ, ఆమెను వదలి 'కామేశ్వరీ నేను కత్తిపట్టాలని వెళ్ళడంలేదు. వద్దని నా ప్రభువు ఆజ్ఞ. పరిశీలించడానికి వెడుతున్నాను. అంతే! పరాక్రమవంతుడై, ధర్మపరిపాలనంచేసే శ్రీ కోట భేతభూపతిమహారాజులంవారిని కోటపేర్మాడిరాయుడు నాశనం చేయబోతున్నాడు.

కామే: భేతమహారాజు చక్రవర్తి అల్లుడేకాదూ!

అక్కిన : అవును, అందుకని?

కామేశ్వరి: 'దొంగలకు దర్మం అధర్మం ఉందా?' అని చిరునవ్వు నవ్వేను.

అక్కిన: బాగాఅన్నావు. మరి నేను రేపు వెళ్ళవచ్చునా?

కామే: మీరంతా ఇంత ధర్మంగా ఉంటే, ధర్మావతారులైన అన్నగారు శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువు మీకు నాయకులై ఉంటే మీకందరికీ గజదొంగలన్న ఈ అపవాదు ఏమిటి? ఆమె కంటినీరు తిరిగింది.

అక్కిన: వహ్వా! అదా నీ పరితాపం? సరే మళ్ళీ సుముహూర్తంనాడు నీ దర్శనం. నీనవ్వుముఖమే నాకు కాయెత్తు. నీతీయనివాక్కులే నాకు

పంచాక్షరి. కామేశ్వరీ, కామేశ్వరీ! శుభముహూర్తంవరకూ నిన్ను ఉదయాస్తమానాలు చూడరాదని బాధ! ఈలోగా ధాన్యకటకం దగ్గర కృష్ణకీవల కొంత కాలం ఉండివస్తాను.

భార్య తనకు నమస్కారముచేయ ఆమెను రెండుచేతుల పైకెత్తి పెన్నిధిని వలె హృదయానికి హత్తుకొని, ఆమె కెంజెదవి షణికి మద్దాడి నెమ్మదిగా బయటికేగి ఆ తెల్లవారగట్ల అతడు మూడువేల సైన్యాన్ని నడుపుకొంటూ ధాన్యకటకంవైపు ప్రయాణం సాగించినాడు. ఆతనికి దారిపొడుగునాచిన్నారి భార్య కామేశ్వరి ముద్దుల మోము ఎదుట ప్రత్యక్షమవుతూనే ఉంది. ఆమె మోము చంద్రబింబము వలె స్నిగ్ధమైనది. గుండ్రమూ కోల కాని ఆ మోములో ఆ ఫాలం స్వర్ణది. ఆ ఫాలందిగువ కన్నులు ఇందీవరపత్రాలు. ఆ పత్రాలలో నీలి ఆకాశాలు కనుపాపలు. ఆమె నాసిక వికసించిన బంగారు చంపకము. ఆమె పెదవులు చిన్నవి. వంపులు తిరిగినవి. క్రిందిపెదవి ఎఱ్ఱుపు మందార పూ మొగ్గ. పై పెదవి వికసించిన ఎఱ్ఱకలువరేకు. ఆమె అందము వెన్నెల ప్రవాహము, ఆమె అందము సర్వ సంగీత సారము. ఆమెయౌవనము పారిజాత మల్లికుసుమసంయోగ పరిమళ లహరి.

౧౦

విజయదశమి ఉదయాన్నే. రుద్రప్రభునకు చక్రవర్తి అహ్వానం వచ్చింది. రుద్రమదేవి పురుషువివేషం వేసికొని అంగరక్షకులు కొలిచిరా చక్రవర్తినగరి కేగెను.

చక్రవర్తి పూజ చాలించి విద్యామందిరంలో దిండ్ల నానుకొని ఆసీనులై ఉన్నారు. రుద్రదేవి ఆ మందిరంలోనికి ప్రవేశించి వీరమహేశ్వరుడగు తండ్రి పాదాల వ్రాలింది. ప్రేమతో తండ్రి కుమార్తె నాశీర్వదించి తన ప్రక్క కూర్చుండ బొట్టుకొన్నారు.

"బాబూ! మీ యీ సుందరమూర్ధంపై ఎక్కువభారం ఉంచాను. అందుకు మీకు కోపంగా లేదుకదా!"

"నాకు తమ ఆజ్ఞ భగవదాజ్ఞకదా మహాప్రభూ! నన్నెరగరా?"

"మా అనంతరం మీరు ఈ భారం ఇంకా ఎక్కువ వహించవలసి వస్తుంది."

"తాము ఈభుజాలకు మహాశక్తిని ప్రసాదించారు. ఆ భారం అతి సులభంగా వహించడానికి తగిన రహస్యం శివదేయ్య దేశికులను తెలుసును. అయినా తాము మారేండ్లు ఈ మహారాజ్యభారం వహించి ఉండనే ఉంటారాయెను!"

పెద్దతల్లీ! నేను ఇంకకొద్ది నెలలుమాత్రమే ఉంటానని నాకు పూర్తిగా నమ్మకము. అయినా మన దేశికులు వసిష్ఠసమానులు. ఎన్నిసామ్రాజ్యాలనైనా చిటికెన వ్రేలితో మోయగలరు."

"అదే ధైర్యం నాయనగారూ! లేకపోతే ఈ మహారాజ్యభారం వహించడం స్త్రీమాత్రకు శక్యమా?"

"అవేమిమాటలు తల్లీ! సంపూర్ణబాధ్యతతో రాజ్యభారం సునాయాసంగా వహించగలుగునట్లుగా నీకు శిక్షగరిపాము. మొదట అంత ధైర్యంచెప్పి మళ్ళా సాధారణ స్త్రీవలె భయపడిపోతావేమి?"

"మీరు నాకు అప్పగింతలు చేయుచున్నట్లు మాట్లాడితే భయంవేసింది."

అప్పుడే శివదేవయ్య దేశికు లక్కడకు వస్తున్నారని దౌవారికుడు మనవి చేశాడు.

వెంటనే చక్రవర్తి రుద్రదేవి సహాయంతో లేచి, శివదేవయ్య మంత్రి రాగానే ఇరువురు వారికి నమస్కరించారు.

అందరూ ఆసీనులైన వెనుక ఈ మాటలూ ఆ మాటలూ జరిగాయి. మత విషయికమైన విషయాలేవో వచ్చాయి. శివదేవయ్య అప్పుడు రాజకుమార్తె మోము వంక చూచి, 'రాజకుమారీ! చక్రవర్తికి ఏదో సందేహం కలిగింది. మీరు స్త్రీలు కాబట్టి ధర్మశాస్త్రప్రకారం రాజ్యం పాలించడానికి అర్హత ఉన్నా, ఆచారప్రకారము లేదు. అయినా దేశమూ, దేశపరిస్థితులూ ఆలోచించి చక్రవర్తి మిమ్ము భావిచక్రవర్తిగా నిర్ణయించాడు' అనిగంభీరముగా పలికెను. మరల నామె మోమున చూడ్కి నిలిపి 'ఆ నిశ్చయప్రకారం తమకు వీర విద్య నేర్పి యువరాజులనే లోకంలో ప్రచురించారు. తరువాత రాజనీతిని అనుసరించి తాము స్త్రీలే అని ప్రచురిస్తూ రాజప్రతి నిధిని చేశారు' అనియెను.

రుద్ర : చక్రవర్తి ఆజ్ఞలు శిరసావహించితినికదా గురుదేవా?

శివ : అవును మహాప్రభూ! ఇక చక్రవర్తిగారూ సంపూర్ణంగా లోక వ్యవహారాలు వదలివేయదలచుకొని తమ్ము కొన్ని వాగ్దానా లిమ్మని కోరదలచుకున్నారు.

రుద్ర : మహాప్రసాదం.

శివ : తాము సార్వభౌమత్వ భారం వహించి నవమ చక్రవర్తులు కావాలనీ; రెండు—తాము వివాహం చేసుకున్న పురుషుడెంత మహోత్తముడైనా ఆయన చక్రవర్తి కాకూడదనీ; మూడు—రాజ్యార్హుడైన తమ కుమారుడు రాజ్యం వహించేముందు కాకతీయవంశానికి దత్తుడు కావాలనీ.

రుద్రమ ఇవన్నీ విన్నది. ఏవేవో ఆలోచనలకు లోనయింది. తాను వివాహం చేసుకున్న పురుషుడు చక్రవర్తి కాకుండుటెట్లు? సామ్రాట్టు భార్య సామ్రాజ్ఞి. సామ్రాజ్ఞి భర్త సామ్రాట్టు కారా?

దేశికులిట్లు పలుకునపుడు తండ్రిగారి సర్వప్రజ్ఞలూ వారి కళ్ళలో ప్రతి ఫలించి తన దెస ప్రసరించినాయి. ఆ కళ్ళలో తనపై అత్యంత విశ్వాసము వెల్లి విరిసింది. ఆ కళ్ళలో ప్రార్థన కాంతించినది. ఆ కళ్ళలో దివ్యప్రేమ నర్తించింది. ఆ కళ్ళలో ఒక మహాగర్వము ప్రవహించింది.

వెంటనే రుద్రమదేవి 'నాన్నగారూ! నేను నా పితృపాదులకూ, నా చక్రవర్తికీ, సర్వదేవతల సాక్షిగా నేను తండ్రిగారికి వారసురాలుగా చక్రవర్తిని అవుతాననీ, నేను వివాహం చేసుకున్న పురుషుడు చక్రవర్తి కాడనీ, నా కుమారుడు కాని, నేను దత్తు చేసుకొన్న బాలుడు కానీ కాకతీయ వంశజుడు అవుతాడనీ, నేనూ కాకతీయవంశగానే ఉంటాననీ మాట ఇస్తున్నాను. ఇది నేను అతిక్రమిస్తే ఏడేడు కాలాలు నరకంలో ఉండగలదాన్ని, కాశీలో గోవును చంపినదాన్ని, గురుహత్య చేసినదాన్ని, బ్రాహ్మణధనం దోచినదాన్ని' అని ఆమె గంభీరంగా పలికింది.

ఆ మాటలు విన్న గణపతిదేవ చక్రవర్తి సంతోషం విందిన మోముతో కుమార్తెకు వీడ్కోలొసంగెను, రుద్రదేవి ఏవేవో ఆలోచనల పాలయి నెమ్మదిగా తన నగరు చేరింది.

తనకు సామ్రాజ్యం వదలి, సాధారణగృహిణిగా, ఆనందజీవితం అనుభవించాలన్న కాంక్ష కలగడం తండ్రిగారు గ్రహించారో లేదో! శివదేవయ్య దేశికులు మాత్రం గ్రహించారు. తనకు వివాహం అయితే కాకతీయవంశంలో తా నెట్లా ఉండగలదు? అందుకనే తండ్రిగారా వాగ్దానం అడిగారు. వివాహము నిజం. కాని తనభర్త సామ్రాట్టు కాకూడదు. అలా సామ్రాట్టు అయితే అనేక కలహాలు, అపశ్రుతులు సంభవింపవచ్చు. కాని తనభర్త చక్రవర్తి కాకుండా ఉండుట ఎలా? అది ధర్మమా? నీతియా?

ధర్మశాస్త్రప్రకారం స్త్రీ వివాహంకాకుండా ఎలా ఉండుట? సన్యాసిని కావాలి. తాను వివాహం చేసుకుంటే తనభర్త చక్రవర్తి కాకూడదు! రాజనీతి ననుసరించి, కొన్ని కొన్ని ప్రత్యేక సమయాల మహాసామ్రాజ్య సింహాసనం అధివసించిన స్త్రీ వివాహిత కాకున్నా తప్పేమీ ఉండదు. అందుకే తండ్రిగారు వివాహం చేసుకొనితీరుతాననే వాగ్దానం కోరలేదు. అంతవరకు శుభం! తాను ఆ దివ్యపురుషునే ప్రేమించి వారికి తన హృదయంలో పట్టము కట్టుకొన్నమాట నిశ్చయం. అట్టి ఆ పురుషోత్తముని తాను వివాహం చేసుకొంటే వారికి అర్థసింహాసనమిచ్చి చక్రవర్తిగా చేయకుండు టెట్లు?

ఇంతకూ ఆ వీరోత్తముడు తన్నెట్లు ప్రేమించగలడు? తాను స్త్రీ నని ఈ రెండేండ్లు వా రెరిగిఉన్నమాట నిశ్చయమే. ఆనాడు తోటలో నిజ స్వరూపము చూచినారు. అ చూచినది సన్నేనని వా రెరుగరు. తన్ను వివాహ మాడుమని వారిని కోరితే, తాను చక్రవర్తులు కాకూడదని వారికి నివేదిస్తే.... వారు పరమోత్తమ పురు

షులు కావడంవల్ల చక్రవర్తి అజ్ఞగా ఎంచి ఒప్పుకోకపోవచ్చును. కాని అట్టి అధర్మానికి తా నెట్లు ఒడి పట్టగలదు?

ఈ నిష్ఠుర రాజధర్మాన్ని తాను నిర్వికారయై నిర్వహించి తీరుతుంది. తాను పురుషుడై పుట్టినచో తండ్రిగారికీ విరుద్ధరాజనీతి అవలంబించవలసిన అవసరం ఉండదుకదా!

రుద్రమదేవి పూజాగృహంలోనికిపోయి కాకతిదేవీ పూజాపీఠానికి ఎదుట సాగిలబడి 'భవిష్యత్తు తెరలను తొలగించి కర్తవ్యం ఉపదేశించు తల్లీ' అని ప్రార్థించింది.

## ౧౧

దుర్గాష్టమి మొదలు అన్నాంబిక ఉపవాసవ్రతం చేస్తూ, కాకతీదేవీ పూజ చేస్తూ ఉన్నది. ఉదయం పూజలు కాగానే ఏవో ఖర్జూర, ద్రాక్ష, అత్తి, మారేడు, జామ, అరటి, నారింజ, నారికేళాది ఫలాలను ఆరగించి, సాయంకాలం పూజ చేసి రాత్రి పాలుమాత్రం త్రాగిఉండేది! అలాగు మూడు దినాలు పూజచేసి విజయదశమికి పూజ పూర్తిచేసింది.

విజయదశమి వెళ్ళిన మరునాటికి కోట పేర్మాడిరాయుడు తెలుగాల కాటయ, గుంటూరి నాగవిభుడు కలిసి భేతవహారాజులను హతమార్చడానికి సైన్యాలతో ధాన్యకటకం చేరుతున్నాడని శివదేవయ్య దేశికులకడకు వేగు వచ్చింది.

ద్వాదశినాడు పేర్మాడిరాయుడు భేతమహారాజులను, వారి రాణివాసాన్ని వారి నగరిలోనే బంధించి, ధాన్యకటకనగరం ఆక్రమించాడనీ, ఏదో వంకను భేత మహారాజును కైలాసవాసిని చేయ ఆలోచిస్తున్నాడనీ, గుంటూరి నాగవిభుడు సర్వ సైన్య ఆయత్తంచేసి, ధాన్యకటకంమీదకు వెళ్ళబోతున్నాడనీ, వా రిరువురు,తెలుగాల కాటయ్య కలసి ఓరుగల్లు ముట్టడించడానికి సిద్ధమౌతారనీ వేగు వచ్చింది.

శివదేవయ్యామంత్రి రుద్రమహారాజు దర్శనంచేసి మహారాజుతో మంతనంసలిపినారు. ఇంతలో ప్రసాదాదిత్య ప్రభువును, సబ్బిసాహిరమండల సకల సేనాపతి పట్టసాహిణి పడికము బొప్పదేవప్రభువునకును, జాయపమహారాజునకును వార్త పంపినారు.

వారందరిసభలో రుద్రప్రభువు 'నేను సకలసేనాపతిగా పడికము బొప్పదేవ ప్రభువు సేనాపతిగా గుంటూరుమీదకు దండయాత్ర చేస్తాను. జాయపమహారాజు ప్రసాదాదిత్య ప్రభుసహాయంగా ఓరుగల్లునగరం కాపాడడం, మధ్యరాజ్యాలన్నీ చూస్తూఉండడం చేయవలసింది! జన్నిగదేవుని, వారికుమారులు త్రిపురాంతక అంబయ్య దేవులను కొంచెం జాగ్రత్తగా ఉండవలయునని తెలియచేయాలి! నేను గురుదేవులు ఏర్పరచిన శుభముహూర్తానికి క్షేత్రయాత్రకు వెడతాను. నాతో

నా సవితితల్లి శ్రీ నారాంబా మహారాణీగారు దయచేయగలవారు' అని చెప్పినారు.

శివదేవయ్యమంత్రి చాలా బాగున్నదని సమ్మతించినారు.

అన్నాంబిక రుద్రప్రభువును త్రయోదశినాడు దర్శించినది. 'మహాప్రభూ! తామే స్వయంగా జైత్రయాత్రకు వేంచేస్తున్నారని నగరమంతా వార్త ప్రసరించింది' అన్నది.

రుద్ర : చెల్లీ! ఎన్నిసార్లు నన్ను ప్రభూ గిభూ అని పిలువవద్దన్నాను! అయినా నువ్వల్లాగే పిలుస్తున్నావు!

అన్నా : క్షమించండి అక్కా! ఈ సమయంలో మాకు సర్వసేనాపతులు, మహారాజులు మీరు. ఆ భావంతో అన్నాను. నేను మనవిచేసేది ఏమిటంటే, మిమ్ము వదలి ఇక్కడ ఉండలేను. నేనూ వీరవేషంతో మీకు అంగరక్షకురాలుగా ఉంటాను.

రుద్ర : తల్లీ! నీకు ఏమైనా మొప్పం రావచ్చును.

అన్నా : మీకు రాదు కాబోలు! నన్ను ఇంటిదగ్గర సౌఖ్యంగా కూర్చుండమంటారా? ఏమి పక్షపాతమండీ అక్కా?

రుద్ర : అలాగే చెల్లీ! నువ్వు ప్రయాణసన్నాహంలో ఉండు. నీ అక్కకు అంగరక్షకురాలివిగా ఉండు. ఈ మగవాళ్ళకు స్త్రీలు ఎలా యుద్ధం చేయగలరో చూపిద్దాము.

అన్నా : అక్కా! మీరు ఒప్పుకుంటే మనరాజ్యంలో వీరస్త్రీదళం ఒకటి సిద్ధంచేసి, 'ఆంధ్ర వీరరమణులు శ్రీ శ్రీరుద్రమహాదేవ పరిపాలనంలో ఉన్నారు' అని లోకానికి చాటిస్తాను.

రుద్ర : నీ అభిప్రాయం అద్భుతం. కైకేయి, సత్యభామా మహాయుద్ధాలు చేశారు. దన్యులను వేదకాల స్త్రీలు చెండాడేవారు. మనమూ తక్కువకాదు. ఇప్పుడు నేను స్వయంగా జైత్రయాత్రకు బయలుదేరడంలో పరమోద్దేశం ఒకటి ఉన్నది. అది గురుదేవులూ గ్రహించారు. నేను ఈ మహారాజ్యాలన్నీ పరిపాలించక తప్పదు. నేను నీరసురాలనని తెలిస్తే, ప్రతిసంవత్సరమూ ఈలాగే ఎవరో మాండలికులు తిరుగుబాటు చేస్తూనే ఉంటారు. దేశంలో అధర్మం నిండి, విచ్ఛిన్న శక్తి తాండవం చేస్తుంది. ఒక్కసారి నేను యుద్ధయాత్రచేసి దక్షిణం అంతా సంచారంచేసి దుర్మార్గులైన మాండలీకులను శిక్షించి, తక్కినవారి హృదయంలో 'జాగ్రత్త' అని ప్రతిధ్వనింప చేస్తాను.

అన్నా : ఇంకో రహస్యంకూడా ఉంది. మీరు స్వయంగా ఏ మహాయుద్ధంలోనూ పాల్గొని ఉండలేదు. ఇప్పుడా అవకాశం లభించింది. అదీ గాక మీరు స్వయంగా వెళ్ళితే, రాజద్రోహం అనేకుల హృదయంలో రాజభక్తి తిరిగి ప్రవేశించవచ్చును.

రుద్రా : ఎంతచక్కగా అన్నావు చెల్లీ! ఇక సిద్ధంకా!

పూర్ణిమ వెళ్ళిన తదుపరినాడు మహారాజు పడికము బాప్పదేవమహారాజుతో సైన్యాలన్నీ నడిపికొంటూ మహావేగంతో కృష్ణాతీరంవైపు వెడుతున్నారు. ధాన్య కటకందగ్గర దాటడంకన్న విజయవాటికకు దిగువను కృష్ణానదిని పడవలలో దాట డానికి రుద్రమహారాజు ఆజ్ఞ దయచేయించారు. అపసర్పగణనాయకశ్రేష్ఠులైన గొంక ప్రభువులున్నూ, నతవాటిసీమవారైన మేనత్తల వంశంవారూ అనేకాలైన నావ లను పోగుచేస్తున్నారు.

దారిలో ప్రధానఅంగరక్షకాధిపతిగా ఒక యువకవీరుడు కవచధారియై మహారథం ప్రక్క రథం అధివసించి అంగరక్షక చక్రరక్షక నాయకుడై వస్తు న్నాడు. మహారాజు గుంటూరు పట్టుకుంటే ఆ వెనుక ముమ్మడాంబిక రావచ్చుననీ, అటువెనుక కంచి, కాళహస్తి, శ్రీశైలాది క్షేత్ర దర్శనం చేసి సంక్రాంతినాటికి తిరిగి ఓరుగల్లు రావడానికి నిశ్చయంచేసుకున్నాననీ చెప్పి ముమ్మడాంబికను ఒప్పించెను.

అన్నాంబిక ఉప్పొంగిపోయింది. ఆమె మోము తేజరిల్లిపోయింది. ఆమెకు రుద్రాంబికవలె ఇదే ప్రథమయుద్ధం,

శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువు ధాన్యకటకమహారాజును పట్టుకొన్న కోట పేర్మాడిరాయుడిపైకి వెళ్ళినారని రుద్రమహారాజు తనతో చెప్పినారే! వారు ఎప్పుడూ గన్నారెడ్డిప్రభువుపై కత్తికట్టరే! ఆప్రభువైనా చక్రవర్తివైపు కన్నెత్తి చూడరే! దొంగలు పెద్దప్రభువుల జోలికి పోక చిన్నవారిని దోచుకుంటారు కాబోలు! అయితే ప్రభువులు ప్రజలను రక్షించాలికదా! అందుకేకాబోలు దొంగలూ, ఇళ్ళు తగులబెట్టినవారూ, పంటలు నాశనము చేసినవారూ కఠినశిక్షలకు పాత్రులవు తున్నారు. ఇది దొరతనమా! దొంగతనమా!

గన్నారెడ్డి సమున్నత విగ్రహమూ, ఆయన సింహపరాక్రమమూ, ఆయన పరమాద్భుత యుద్ధనిర్వహణశక్తీ, వ్యూహరచనా చమత్కృతీ లోకసమ్మోహ నకరాలు, అలాంటి ఉత్తమపురుషుడు పినతండ్రి తనకన్యాయం చేసినంతమాత్రాన గజదొంగై పోవాలా?

ఆయన విశాలఫాలం, కన్నులలో కాంతి, వెడదఉరము, సన్నని నడుము, దీర్ఘబాహువులు, బంగారాన్ని నలుపుచేయు పసిమి, సోగమీసాలు, ముత్యాలకోవ పలువరస ప్రతిదినమూ అన్నాంబిక ఒంటిగా ఉన్నప్పుడు తలచుకొంటూ ఏవేవో స్వప్నాలు కంటూ ఉంటుంది.

ప్రతిదినమూ భోజనాలు కాగానే ప్రయాణముసాగును. సాయంకాలమొక నగరంబైట శిబిరములు స్థాపింతురు. రాత్రిఅంతయు, ఆ స్కంధావారంలో విశ్ర మిస్తూ, వారు ప్రయాణం చేస్తున్నారు మహారాజపథం వెంటనే.

మహారాజు శిబిరాలు స్కంధావారంమధ్య ఉంటాయి. దాని చుట్టూ నిరంతరం అప్రమత్తతతో అంగరక్షకులు కాపలాకాస్తూ ఉంటారు. స్కంధావారంతో పాటు గోపాలకులు వేలకొలది గోవులను, వర్తకులు విపణిపస్తువులను తీసుకొని వస్తారు. వేలకొలది కుంభకారులు, రజకులు, మంగలివారూ కూడా వస్తురు. వంట చేయుటకు గొల్ల లుందురు.

ఆంధ్రసైన్యం కదిలిపోవు ఒక మహాపురములా ఉన్నది.

౧౨

గోన గన్నారెడ్డి మహావేగంతో విజయవాడకడ కృష్ణ దాటాడు. కృష్ణ ప్రక్కనే ఇరవైమైళ్ళు ప్రయాణించి ధాన్యకటకపుకోట తాకినాడు. తమ్ముడు విఠలభూపతి ఇంకా రాలేదు. గన్నారెడ్డి తన మామూలు విధానాన్ని రాత్రి వచ్చి కోట ముట్టడించాడు.

ఏయుద్ధాని కాయుద్ధంలో తన్ను తారసిల్లిన ప్రత్యేక పరిస్థితులు ఆలోచించి గన్నారెడ్డి వ్యూహరచన చేస్తాడు తా నెంత గజదొంగ అయినా సార్వభౌమవంశం వారికిగాని, వారిదగ్గిర బందుగులకుగాని ఆపద రాకూడదు అని మొదటినుండీ తన పవిత్రధర్మంగా ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. అందుకు ఎవరు వ్యతిరేకించినా ఓర్పు లేదు. ఆ ధర్మాన్ని వ్యతిరేకించినవాడు ఎంత బలవంతుడైనా గన్నయ్య ఏమీ సందేహించక, అతన్ని ఎదిరించి నాశనము చేయవలసిందే! అతనికి కోపంవస్తే ఒకలక్ష గన్నారెడ్లుగా మారిపోతాడు. ఎక్కడ చూచినా తానే! అంతకోపము లోనూ ఏమాత్రమూ ఉచితజ్ఞత, సమయస్ఫూర్తి మరవడు. అప్పు డా శక్తులు ఇమ్మడియై భాసిస్తాయి.

ఆ రెండువేల సైన్యంతో ధాన్యకటక నగరంపై ఒక వైపున ఒత్తిడి ఎక్కువచేశాడు తనవారు పదునేనువందలమంది నాపనికి చాలించి, తక్కిన అయిదువందలమందినీ కోటచుట్టూ నియోగించెను. ఆరాత్రి గన్నయ్య ఎంత సైన్యంతోవచ్చి కోట తాకినాడో పేర్మాడిరాయునికిగాని, తెణాల కాటయ్యకుగాని తెలియదు. 'గన్నారెడ్డి వచ్చి ముట్టడించా' డని కేకలు వేయించి గన్నారెడ్డి లోకం అంతా వాటినంతపని చేశాడు.

పేర్మాడిరాయుడు, కాటయ్య ఇద్దరు ప్రభువులూ ఏపక్కఅయితే గన్నయ్య కోటముట్టడింపు ఎక్కువ సాగించాడో ఆ ప్రక్కనే అశ్వాలపై వచ్చి చేరారు.

పేర్మాడి: గన్నారెడ్డి మనపై వచ్చిపడ్డాడేమిటి?

కాటయ్య: ఆ రాక్షసునికి నీతి, నియమం ఉందా మహారాజా!

పేర్మాడి: వీడు అసాధ్యుడు. పట్టినపట్టు విడువడు. ఏలాగు?

కాటయ్య: నిజమే. మేడిపల్లి బాచయనాయకునిగతి ఏమయింది మహారాజా! ఉప్పలసోముడు, కోసగమైలి, వందిఘూపాలుడు.... వీడు ఎదుర్కొన్నవాడు బ్రతికి బయటపడలేదు.

పేర్మాడి : ఏమిచేయాలి? భేతరాజునుచంపి ఆ కండలు కోటగోడ నుంచి అవతల పారవేస్తే?

కాటయ్య : ఆ తలపుపద్దు మహారాజా! మనల నిద్దరిని గుఱ్ఱాలకుకట్టి దేశాలన్నీ లాడ్పిస్తాడు.

పేర్మాడి : ఏమయ్యా! మీరు వట్టి పిరికివారై పోయినారేమిటి?

కాటయ్య : రావణాసురుడి ఎదుట నుంచుంటే పిరికివాళ్ళుకాక ఎగరగలరా ఎవరైనా మహారాజా!

పేర్మాడి : అయితే వీడికి లొంబడి శరణువేడుకోవడమే ఉత్తమం. తరువాత మనకు సహాయం చేస్తానని రహస్యవేగులు పంపిన ఆ మహానుభావుడి పనైనా కనుక్కుందాము.

అతివేగంతో, రౌద్రంతో తలపడిన గన్నారెడ్డి సైనికులకు బాసటగా నడిక రేయి దాటిన రెండుగడియలకు ఉప్పెనలా విఠలయ్య, తక్కిన సైన్యముతోవచ్చి ధాన్యకటకాన్ని ముట్టడించాడు.

పేర్మాడిరాయని సైన్యాలలో దొరికిన ఒక దళపతిని పట్టుకొని గన్నయ్య కోటలోనికి వార్త పంపించాడు. 'తెల్లవారేలోపుగా మాకు కోట స్వాధీనం చేయవలసింది. శ్రీ భేతమహారాజులంవారికిగాని శ్రీ గణపాంబాదేవి మహారాణులకుగాని, రాజబంధువులకుగాని, రాజభక్తులకుగాని, రాజప్రియులకుగాని, రాజోద్యోగులకు గాని ఏమాత్రం హానికలిగినా పేర్మాడిరాయని, కాటయ్యను బోనులలో పెట్టి సర్వ దేశాలు తిప్పుతాను' అని.

పేర్మాడిరాయుడు గజగజ వణకిపోయాడు. తెఱాల కాటయ్య చెమటలు కారిపోయాడు. వారు తమ సర్వసైన్యాలను ఆయుధాలను విసర్జింపచేసి కోటతలుపులు పూర్తిగ తెరిచి, కాగడావెలుగులలో తెల్లజెండాలు ధరించి చేతులు కట్టుకు వచ్చి గోన గన్నయ్య పాదాలమీద పడినారు. కోటద్వారాలగుండా గన్నయ్య, విఠలయ్యల సైన్యాలన్నీ ధాన్యకటక నగరంలోనికి వచ్చాయి.

తెల్లవారింది. కోట పేర్మాడిరాయని, తెఱాల కాటయ్యను రక్షకభటులు రాజసభాసమావేశం చేయించారు. స్నానసంధ్యానుష్ఠానాలన్నీ తీర్చి గోన గన్నయ్య తన తమ్మునితో, స్నేహితులతో సభాప్రవేశం చేశాడు. శ్రీ కోట భేతమహారాజును సగౌరవంగా బందునుండి విముక్తి చేశారు. రాజబంధువులు, మంత్రులు, సేనాపతులు మొదలైనవారందరూ విముక్తులయినారు. వారందరూ యథోచితంగా రాజసభను ప్రవేశించినారు. మహావీరులైన చక్రవర్తి జామాత శ్రీ కోట భేతమహారాజులంవారు తమ రాజసభను ప్రవేశించినారు. అందరూ లేచి నిలిచారు. మహారాజు

సింహాసనం ఆక్రమించక పూర్వం గోన గన్నయ్యను సమీపించి ఆ గజదొంగను కౌగిలించి చేయిపట్టుకొని తమతో పాటు అర్ధసింహాసనాన్ని అధివసింపచేసుకొన్నాడు.

మహారాజు : గన్నారెడ్డిప్రభూ ! మాకు బంధువుగా ఈ పేర్మాడిరాయుడు, స్నేహితుడుగా ఈ కాటయనాయకుడూ మా రాజ్యం చొచ్చి, మా నగరం ప్రవేశించి, మా కోటకు అతిథులై దొంగపాటున మేమంతా నిదురపోతున్న సమయంలో మమ్ము బందీచేశారు. మీరు సమయానికి రాకపోతే ఈ కుత్సితులు మా ప్రాణాలే హరించి ఉందురు.

గన్నారెడ్డి : మహారాజాధిరాజా ! ఇందులో నా గొప్ప ఏమీలేదు. మేము కోట ముట్టడించగానే, కోటలో ఉన్న తమ సైన్యం అంతా తిరగబడి దొరికిన ఆయుధాలతో, ఈ దుర్మార్గుల సైన్యాలకడ లాగుకొన్న ఆయుధాలతో యుద్ధంచేయ ప్రారంభించారు. ఈ రెండు అగ్నులమధ్య నాశనంకాలేక వీళ్ళు నాకులోబడినారు. మేము రాకపోయినా మహాప్రభువులు ఈ పిశాచులను నాశనం చేసేవారే.

మహారాజు : ఏమి పేర్మాడిరాయా ! నీకు తగిన శిక్ష ఏది ?

పేర్మాడి : మహాప్రభువుల అనుగ్రహం. బంధుద్రోహం చేసిన నాకు మరణమే శిక్ష !

కాటయ : మహాప్రభూ ! నేను శిక్షింపదానికికూడా తగను.

ఇంతలో దౌవారికుడొకడు ప్రవేశించి మహారాజు సింహాసనం ఎదుట మోకరించి 'మహారాజాధిరాజా ! మహారాణీవారు వీరిద్దరినీ శిక్షించేపని శ్రీశ్రీ గోన గన్నారెడ్డి ప్రభువులకు వదలవలసిందని మహారాజులంవారికి మనవిచేస్తున్నారు' అని మనవిచేశాడు.

మహారాజు ! మా ఉద్దేశమే మహారాణిగారికీ కలిగింది. చాలా సంతోషము. శ్రీ గన్నయ్య మహారాజా ! మా ప్రేమా, మా కృతజ్ఞతా తమకు ఏలాగు తెలియజేయగలం ? తాము మా ప్రార్థనా, మహారాణీగారి ప్రార్థనా అంగీకరించి తమ రాజ్యం తాము స్వీకరించండి. మే మిరువురమూ చక్రవర్తులతో, రుద్రదేవ మహారాజులతో మనవిచేస్తాము.

గోన : మహాప్రభూ ! నావిధి నేను నిర్వర్తించాను. ఈ బందీల విషయంలో శ్రీ గణపాంబా మహారాజ్ఞివారి భావమే ఉత్తమమైనది. ఇదివరదాకా ఈ ప్రభువులిద్దరూ తమకు భక్తిగల సామంతులు. ఈ నాడు ఏదో చెడుబుద్ధి పుట్టి ఈలా అయ్యారు. అదుగో ! మా మంత్రి అక్కినప్రగడ కృష్ణదాటి వచ్చాడు.

అప్పుడు చినఅక్కినప్రగడ సభలోనికి ప్రవేశించి 'మహారాజాధిరాజా ! జయము ! జయము ! నేను రాకుండా యుద్ధం పూర్తి అయినందుకు విచారముగా ఉన్నది. కాని మహాప్రభువులకు, మహారాణీవారికీ ఇంతయినా ఆపత్తు కలుగ

నందుకు యెంతో ఆనందంగా ఉన్నది. శ్రీ స్వయంభూదేవుల పరమకరుణ! మహా రాజా! గుంటూరి నాగయ్యప్రభువు విజయవాడకడ కృష్ణదాటి దెబ్బది అయిదు వేల కాల్బలంతో, పదమూడువేల అశ్వికులతో, యేడువందల గజాలతో ఓరుగల్లును ముట్టడించడానికి సాగిపోతున్నారనిన్నీ, అటు ఓరుగల్లునుంచి శ్రీశ్రీశ్రీ కుమార రుద్రదేవ మహారాజులు, శ్రీ పడికము బొప్పదేవ మహారాజులు నాగదేవ రాజును ఎదుర్కొనడానికి వస్తున్నారనిన్నీ వేగు. మహారాజులు, ఈ పేర్మాడి ప్రభువుకొరకు సిద్ధంచేయించిన పడవలలోనే ససైన్యంగా కృష్ణదాటి వెళ్ళి శ్రీ రుద్రమహారాజులకు సహాయం చేయవలసిందని కోరుతున్నాను. మా మహారాజు, వేమూ అనతిదూరంలో కృష్ణవేణ్ణకు ఈవలి ప్రక్క ఉంది. నాగదేవయ్యను హత మారుస్తాము. ఇక ఈ పేర్మాడిరాయ, కాటయనాయకుల విషయంలో శ్రీ మహా రాణివారి అభిప్రాయం విన్నాను. ఈ పేర్మాడిరాయని రాజకంఠాభరణం నేను ఈ నిండు పేరోలగంలో భటులచే ఒలిపించి మా ప్రభువు కంఠాభరణం చేసెదను గాక. ఈ కాటయ్యానాయకుడు మోకరించి తమ పాదాలు, మా ప్రభువు పాదాలు అంటాలి. తమ తమ సైన్యాలు మహారాజులకు అప్పగించి తమ తమ మండలాలకు వీరు వెళ్ళుదురుగాక. ఇక్కడినుండి మహాప్రభువులకు వారు మూడేళ్ళ వరకు రెట్టింపు కప్పము కట్టుతూ ఉంటారుగాక. ఇప్పుడు అపరాధంగా పేర్మాడి రాయప్రభువు మహాప్రభువులకు ఆరులక్షల టంకాలు, మాకు రెండులక్షలటంకాలు, కాటయ్యానాయకులు మహాప్రభువులకు లక్షటంకాలు, మాకు ఇరువదివేల టంకాలు బంగారము తప్పు చెల్లింతురుగాక' అని సవినయంగా మనవిచేశాడు.

సభ్యులందరూ హర్షధ్వనులు చేసినారు. శ్రీ కోట భేతమహారాజులంవారు అతిసంతోషంతో చినలక్కనప్రగడ ఆలోచన అంగీకరించారు. భేత మహా రాజులు తమ మెడలోనున్న నాయకమణిహారం గోన గన్నయ్య మెడలో వైచి, విఠలధరణీశునికి తమ ముత్యాలహారం అర్పించారు.

పేర్మాడిరాయని రాజకంఠాభరణం మంత్రులు తీసి గోన గన్నయ్యకు అర్పించారు. కాటయనాయకుడు సింహాసనంఎదుట మోకరించి తల భూమిపై వాల్చినాడు.

## ౧౭

గుంటూరు నాగమహారాజు కోట భేతమహారాజులంవారికి ముఖ్య సామంతుడుగానూ, గణపతిదేవ చక్రవర్తికి నమ్మకమైన సేనాపతిగానూ ఉంటూ ఉండెను. కాని చక్రవర్తి అవసానదశలో ఉండడమూ, రుద్రమహారాజు స్త్రీ కావడమూ, అతని హృదయంలోనూ దుర్బుద్ధి పుట్టించింది. అదివరకు గణపతి చక్రవర్తితో కలిసి కమ్మనాటి, ఆరువేలనాటి, సిందవాడివిషయం

పాకనాటి సామంతుల ఓడించడం విషయంలో ఎంతో యుద్ధనిర్వహణ దక్షత చూపించి చక్రవర్తివల్ల ఎంతో మెప్పుపొంది ఉండటంవల్ల, తన సహాయంవల్లనే చక్రవర్తి ఇన్ని విజయాలు సంపాదించాడనే అభిప్రాయం అతని హృదయంలో హత్తుకు పోయింది.

ఒకవేళ చక్రవర్తిలో ఏమన్నా శక్తివుంటే. ఆయన కొమరితకు అశక్తి ఎట్లా ఉండగలదు? ఇదే మంచి అదను. తానా వ్యూహనిర్వహణ చతురుడు; తనకు కలిగినట్లే ఇతరులకు స్త్రీ సామ్రాజ్యంలో ఉండడానికి కష్టం కలిగిఉండాలి. ఇంకనేమి? అతను అతిధీమాతో, నమ్మకంతో ఓరుగంటిని ముట్టడించడానికే బయలుదేరాడు. ఒకసారి ఓరుగల్లు పట్టుకొని సామ్రాజ్యాభిషేకం పొందితే తన్ను కదిలించడానికి ఆ వీరభద్రునికి కూడా తరంకాదు.

గుంటూరు నాగదేవరాజు పూర్ణిమవెళ్ళిన తదియనాడు కృష్ణదాటాడు. ఇక్కడి నుండి పంచమినాటికి నతనాటిసీమకు ఉత్తరపుభాగంలో ప్రయాణం చేస్తూ సప్తమి నాటికి గార్లకు తూర్పుగా పదిగవ్యూతల దూరంలో విడిదిచేసి ఉన్నాడు. ఒకవేళ గార్ల మండలేశ్వరుడు, శ్రీ రేచెర్ల గణనాథుడు 'మీరు ఎక్కడికి, ఎందుకు వెడుతున్నా' రని ప్రశ్నిస్తే 'ప్రసిద్ధికెక్కిన మంత్రకాళేశ్వరము దర్శించడానికి వెడుతున్నా' మని చెప్పవచ్చును అని నాగదేవరాజు అనుకొన్నాడు.

అపసర్పనాథులలో మహోత్తమవిద్యాసంపన్నుడైన గొంకప్రభువు నాగప్రభువు యాత్రవిషయం అడుగడుగూ తెలుసుకుంటూనే ఉన్నాడు. ప్రతిక్షణికము వార్తలు రుద్రమహారాజుకు అందిస్తూనే ఉన్నాడు. రుద్రమహారాజు పడికము బొప్పదేవుని, గొంకప్రభువును పిలిచి వర్ధమానపురం విడిదిలో యుద్ధవిధానం మంతనము సలిపినాడు. ఆమె అంగరక్షకుడగు ఆ యువకుడు కూడా ఆ మంత్రాంగంలో పాల్గొన్నాడు.

తమ లక్ష ఇరువదివేల సైన్యమూ మూడుభాగాలుచేసి, ఏబదివేల సైన్యం నడిపించుకొని తాను గాళ్ళపైనుండి ఉత్తరంగావచ్చి నాగదేవుణ్ణి తాకుతాననీ, రుద్రమహారాజులు ఏబదివేల సైన్యంతో దక్షిణంగావచ్చి అతన్ని తాకవలపిందనీ, గొంకప్రభువు ఇరవైవేల సైన్యంతో గార్ల వెళ్ళి, అక్కడ రేచెర్ల గణనాథప్రభువు సైన్యముతో కలిసి పడమటగా వెళ్ళి నాగయ్యను మార్కొన వలసిందనీ, ఇదివరకే వేగులుఅందిన గాళ్ళప్రభువు నాగదేవయ్య పారిపోకుండా ఇట్లా చేయవలసిందనీ పడికము బొప్పదేవుడు సలహా ఇచ్చాడు.

నవమివెళ్ళిన దశమినాడు ఏమరుపాటున ఉన్న నాగదేవయ్యను మూడు వైపులనుండి మూడు సైన్యాలు తాకినాయి. వెంటనే నాగదేవరాజు తన సైన్యాలను చక్రవ్యూహము రచించి నెమ్మదిగా తూర్పుకు తిరోగమింప జేయసాగినాడు. నాగదేవరాజు మంచివీరుడు, యుద్ధనిపుణుడు. పడికము బొప్పదేవు డెంతవేగంగా

వచ్చి ఎన్నిసార్లు తాకినా, నాగదేవుని చక్రవ్యూహాన్ని బద్దలుకొట్టలేక పోయినారు. దక్షిణమునుండి రుద్రదేవి ఎన్నిసారులో ఆ చక్రబంధనాన్ని తాకి, దానిని చీల్చలేక వేలకొలది వీరులు కూలిపోవడంవల్ల వెనుకను వెళ్ళవలసివచ్చింది. గొంకప్రభువు, గణపతిప్రభువు కూడా నాగదేవరాజు చక్రవ్యూహాన్ని ఏమీ చేయలేకపోయినారు.

ఇంతలో గన్నారెడ్డిప్రభుని వేగువారు దారిచూపిస్తుండగా శ్రీ కోట భేత మహారాజు తన సైన్యాలను పూర్ణిమవెళ్ళిన విదియనాటికి కృష్ణదాటించారు. అక్కడి నుండి వేగంగా ఉత్తరంగా ప్రయాణంచేస్తూ తన మేనమామలయిన నతనాటి ప్రభువుల సహాయం చేసికొని భేతమహారాజు హుటాహుటి ప్రయాణంచేస్తూ ఇల్లింద గ్రామానికి తూర్పున రుద్రమహారాజు సైన్యంతో తన ఏబదివేల సైన్యముతో నతనాటివారి ముప్పదివేల సైన్యంతోనూ వచ్చి కలుసుకున్నాడు. ఈ మహాసైన్యం అంతా నాగదేవరాజు సైన్యాన్ని చుట్టుముట్టింది. ఆ దినమందు జరిగిన మహాయుద్ధం దేవాసురయుద్ధాన్ని జ్ఞాపకం చేసిందని ప్రజలందరూ చెప్పుకొన్నారు.

మరునాడు మధ్యాహ్నానికి బాప్పదేవుడు అతివీరావేశంతో నాగదేవుని చక్రబంధం భేదించి నాలుగువేలమంది వీరులతో విరోధుల నరుకుతూ, పొడుస్తూ మదగజం చెరువులోనికి చొచ్చుకుపోయినట్లు పోయి నాగదేవునితో ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు. ఒకచోట చక్రవ్యూహం నాశనం కాగానే, ఆ బంధం నాలుగువైపులా విచ్ఛిన్నమైంది. రుద్రమహారాజు మహాశక్తివలె తన రథాన్ని తోలించుకుంటూ అంగరక్షకులతో వ్యూహమధ్యమునకు చొచ్చుకుపోయింది.

అటునుంచి గొంకప్రభువు, రేచర్ల గణపతిప్రభువు చొచ్చుకువచ్చారు. భేతమహారాజు మరొకవైపునుంచి వచ్చాడు. ఈలోగా బాప్పదేవుడు మహాగరుడుడు మహానాగాన్ని చీల్చినట్లుగా నాగదేవరాజును నూరుబాణాలతో రథంమీద నిర్జీవుని చేసి పడవైచెను.

"జై గుంటూరి నాగదేవ తలగొండుగండ ! జై పడికము బాప్పదేవా ! జై రుద్రమహారాజా !" అని విజయధ్వానాలు మిన్నుముట్టాయి.

## ౧౪

మహారాజు వేగంతో ప్రయాణంచేస్తూ ఉండిరి. ధరణికోటలో ముమ్మడాంబిక వచ్చి మహారాజును కలుసుకొన్నది. ఎక్కడికి రుద్రమహారాజు వెళ్ళినా అక్కడ సామంతులు మహాగౌరవంతో మహారాజును ఎదుర్కొని అఖండోత్సవాలు చేస్తూ ఉండిరి. కోట పేర్మాడిరాయుడు మహారాజు ఎదుట మోకరించి క్షమాభిక్ష వేడుకొన్నాడు. తెలాల కాటయ్య కీటకమే అయిపోయినాడు

మార్జవాడినుండి పానుగంటివరకు మహాసామంతుడుగా రాజ్యంచేసే జన్నిగదేవుడు చక్రవర్తిని ఎదుర్కొని గౌరవించాడు. ఆయన కుమారులైన అంబయదేవ మహారాజు, త్రిపురాంతకదేవ మహారాజు రుద్రమహారాజుపట్ల భక్తి వెల్లడించారు.

మహారాజు శ్రీశైలం, విక్రమసింహపురం, కంచి మొదలైనవన్నీ చూసుకుంటూ కర్నూలు వచ్చారు. కర్నూలునుండి ఆదవోని వెళ్ళారు. ఆదవోనినుండి బుద్ధపురం, వర్ధమానపురం, అక్కడనుండి కతిపయ ప్రయాణాలు చేస్తూ భీష్మ ఏకాదశికి తిరిగి ఓరుగల్లు నగరం చేరారు. దారిపొడుగునా మహారాజపథంవెంట సేనలకు చలువపందిళ్ళువేసి సామంతులు మహానగరంగుండా ప్రయాణం చేస్తున్నట్లే అనిపించారు సైనికులకు.

అన్నాంబిక దేశాలన్నీ చూస్తూ, దేవుళ్ళను కొలుస్తూ రుద్రమహారాజుకు కుడిభుజంగా సంచరించింది. అయినా ఆమెహృదయంలో ఏదోబాధ కుములుతూనే ఉన్నది. ఆమెకు ఏవిధంగానైనా తాను చూడవలెనని కోరిన ఒక వీరుడుమాత్రం దర్శనం ఈయలేదు. ఆ వీరు దేమిచేస్తుంటాడు? సకలాంధ్ర భూమండలమూ ఏలే చక్రవర్తితనయ ఎదుట ఆ గజదొంగ ఎలా పడగలడు?

ఆ గజదొంగే శ్రీ కోట భేతమహారాజులను నిరిపించారు. ఆ వీరునకట్టి అవసరమేమి కలిగినదో! ఈలా గోన గన్నారెడ్డి ప్రభువు చేశాడనీ, వీరుణ్ణి తాను ఏదో ఉపకారభక్తిలా గౌరవించాననీ భేతమహారాజులు చెప్పినప్పుడు రుద్రమహారాజులు తనవైపు చూచి చిరునవ్వు నవ్వినా రెందుకో? ఆదవోని వెళ్ళినప్పుడు తండ్రి తన్ను చూడలేదు. తన కొమరిత కాలగతి నందినదని దుఃఖించి ఊరుకొన్నానని వారితో అన్నారట!

తనతల్లి ఎంత దుఃఖించింది! పౌరుషంగల రెడ్డి రాజకుటుంబమువారు ఏకష్టాలకైనా ఓరుస్తారు. తండ్రిచేసిన అవమానం రుద్రప్రభువు అర్థంచేసుకొని ఊరుకొన్నారు. ఆ ప్రభువుకు తానేమీ చెప్పకపోయినా అర్థం చేసుకొన్నారు.

రాజకుటుంబాలన్నీ ఇలా బాధపడవలసిందే! మనుష్యుడు తోటిమానవులను తనకు బానిసలుగా చేసుకోవాలనీ, సమస్తవైభవాలూ తానే అనుభవించాలనీ కోరుతూ ఉంటాడు. అప్పుడే ఈ ప్రళయాలు సంభవిస్తాయిగదా!

సాధారణ స్త్రీయే తానై, సాధారణజీవితం జీవించి, మన్నైపోయినా ఒకటే, లేక క్షత్రియకన్యయై రాజ్యానికై పోరే నాయకుని బిడ్డయి, భార్యై, తల్లియై వారి ఆవేదనలు తనకూ సంక్రమిస్తే తానూ ఆవేదనపడుతూ ఏకాలానికి తాను తండ్రి లేనిదిగా, విగతభర్తృకగా, బిడ్డలేని తల్లిగా అవుతుందో తెలియక ఏదో గౌరవం అని, ప్రాణాలు అరచేత పెట్టికొని, బడాయికో, భక్తికో దానధర్మాలుచేస్తూ శాసనాలు చెక్కిస్తూ జీవించినా ఒకటే!

ఇవన్నీ ఒక జీవితనాటకంలో భాగాలు. తానూ పురుషవేషం వేసుకొని యుద్ధం చేసింది. లోకంలో ధర్మం నిలబెట్టుతున్నామనీ, విజయం పొందుతున్నామనీ విఱ్ఱవీగుతూ తోటిమానవుల్ని హతమారుస్తుంటారు. ఆ మానవులు, శ్రీకృష్ణ భగవానుడు వచించినట్లు ఇదివరకే చచ్చినవారు।

చిన్ననాటి తన ఆటలు—చిన్న పూరిళ్ళలో ఆటలకన్న ఏమి ఎక్కువ ఆనందము తనకు సమకూర్చాయి? బీదబాలికకూ, తనకూ ఆనందం ఒకటే। తన చదువులు, బీదబాలిక చదువులకన్న ఎక్కువా? ఎక్కడ ఉన్నదీ ఆనందం? జీవితపరమావధి ఏమిటి?

ఇంతల్లో రుద్రమహారాజు అక్కడికి వేంచేసినారు.

"చెల్లీ, నువ్వు ఆనాడు చేసిన మహాయుద్ధము నేను నా జన్మలో మరువను. నువ్వు రెండుసార్లు నా ప్రాణం రక్షించావు. అలా పల్లగా ఏమీ తెలియనట్లు ఉంటావు. నీకు ప్రతి ఏమిచేయగలను? దారిపోడుగునా నువ్వు నన్ను కోరిన కోర్కెనుగూర్చి ఆలోచిస్తున్నాను."

"అక్కా, నేను మీ ప్రాణం రక్షించానా? ఎందుకు అబద్ధాలాడుతారు?"

"మంచిదానివేలే! నిజం చెప్పనీయకపోవడంకూడా నేర్చేనా? సరే నీపని చెబుతా ఉండు."

## ౧౫

విజయయాత్ర నిర్విఘ్నంగా జరిగినందుకు కాకతమ్మ, ఏకవీరాదేవుల పూజ జరిగింది. సంక్రాంతినాడు. ఆ పూజకు సర్వసామంతులు ఆహూతులైనారు. సర్వ సేనాపతులు, సామ్రాజ్యోద్యోగులు, మహాపండితులు, కవులు, గాయకులు, శిల్ప బ్రాహ్మణులు, తక్కిన నియోగాల నాయకులు అందరూ వేంచేసినారు. నిడుదప్రోలు నుండి చాళుక్యప్రభువు విచ్చేసినారు. విద్యానాథకవీంద్రుని తండ్రిగారు వేంచేసినారు.

ఆ పూజలు మూడు రోజులు జరిగినవి. కాకతమ్మ, ఏకవీరల బంగారు విగ్రహాలు ఊరేగినవి. ఈ ఉత్సవము కేవలం రాజోత్సవము. విజయచిహ్నమైన ఈ ఉత్సాహం యావత్తూ ఆర్షసాంప్రదాయంగా నడిచింది.

ఈ మహోత్సవాలు, సంక్రాంతి పండుగలు రుద్రదేవి హృదయంలో మాత్రం సంతోషం నింపలేదు.

రుద్రదేవి మరల చాళుక్య వీరభద్రమహారాజును దర్శింపగానే ఆమె సంపూర్ణస్త్రీ యైనది. ఆయనకు తెలియకుండా స్త్రీవేషముతో ఆయన్ను సందర్శించవలయునని రుద్రమదేవికి గాఢకాంక్ష కలిగినది. కాని ఆ పని వలన ఫలమేమి? రిక్తకాంక్షలు జీవితములో అనవసరావేదనలు ఉద్భవింప

చేసి, విధానంగా ప్రవహింపవలసిన బ్రతుకునదిని ఎగుడుదిగుడుగా చేసి లోకంలో శాంతిని నాశనంచేస్తాయి.

శివదేవయ్య రుద్రమహాదేవి హృదయంలో జరుగుతూన్న మహాయుద్ధం గమనిస్తూనే ఉన్నారు. బంగారు చాయతో. సన్నగా శలాకలాగ పొడుగిరియై వెలిగిపోయే దివ్యఫాలమూ, పొడుగాటిముక్కూ, లోతుకళ్ళూ, సన్నటిపెదవులూ గల శివదేవయ్యదేశికులు—"ఆ యుద్ధం జరిగితీరవలసినదే, లోకకల్యాణార్థమైన జీవితాన్ని సరితీర్చవలసిందేకాని మనుష్య దంతకన్న ఏమిచేయాలి? రుద్రమదేవి యుద్ధం రుద్రమదేవి నిర్వహింపవలసిందే: కాని ఆమెకు లేనిపోని క్లిష్టసమస్య కలిపించి, ఆమె జీవితనౌక తెరచాపలపై నాలుగువైపుల నుంచీ నాలుగు గాలులనూ వదలి ఆమెనౌక ఆమే నడుపుకోవా లనడం ఏమి ధర్మం?" అనుకుంటూ ఉంటారు.

ఆమెను ఈ మహారాజ్యభారం వహించమన్నారు. ఆమెభర్త ఆమెతోపాటు చక్రవర్తి కాకూడదు. ఆమెకు చక్రవర్తి చిన్నతనములో పెండ్లిచేయకపోయెను. చేయకపోగా, మగవానినిగా పెంచి ముమ్మడమ్మనుఇచ్చి పెండ్లికూడ చేసినారు.

ఈ విషయాలన్నిటికీ తన సలహాయే ముఖ్యమైన కారణమయినది. చక్రవర్తికి ఈ బాలికవల్లనే కాకతీయవంశం నిలవాలనీ, కాకతీయ సామ్రాజ్యం అంతరించకూడదనీ ఉన్నగాఢకాంక్ష ఈ పరిస్థితులకు మూల కారణం. తాను పన్నిన ఎత్తుగడలన్నీ ఆకాంక్షమీద ఆధారపడి ఉన్నవి.

'చాళుక్య వీరభద్రుడే రుద్రమదేవికి తగినభర్త' అని వారియువురనూ దగ్గరకు తీసుకొని వచ్చి వారి హృదయమూల రాగం ఉద్భవింపడానికి తాను వేసిన ఎత్తులన్నీ ఫలించాయి కాని రుద్రమ ఉత్తమురాలవడంచేత తనభర్త తనతోపాటు చక్రవర్తి కావాలని కోరితీస్తుంది. ఆమెభర్త చక్రవర్తి అయినట్లయితే కాకతీయ రాజ్యంలో ఉండాలని ఇష్టపడే సామంతులు చాలమంది చాళుక్యుల పాలనంలో, ఉండుటకు ఏ మాత్రమూ ఇష్టపడకపోవచ్చును. పురుషుడు భార్యతోపాటు చక్రవర్తి అయినట్లయితే స్త్రీ నెమ్మది నెమ్మదిగా అంతఃపురంలో ఉండిపోవడమూ, పురుషుడే ఏకైక చక్రవర్తి అవడమూ జరుగుతుంది' అందుకనే రుద్రమదేవిని 'నీభర్త చక్రవర్తి కాకూడదు' అని కోరవలసివచ్చింది.

కాబట్టి కర్తవ్యం అంతా ఆ యువతీ యువకులమీద ఉంది: కాని కథానాయికా నాయకులిద్దరూ అత్యుత్తమ వంశజాతులవడంవల్ల తా మిరువురూ ఒక్కొక్క అడుగు వేయడానికి. ఒక సంవత్సరము ఆలోచిస్తారు. కనుకనే తన సూత్రధారిత్వము తప్పదు. చక్రవర్తి వృద్ధుడు. ఏక్షణంలో ఏమి జరుగుతుందో? శివదేవయ్య ఆ యా విషయాలు ఆలోచిస్తూ తన పూజామందిరంలోనే ఉన్నాడు. ఉదయం పార్థినం చేసి, యోగాభ్యాసము చేసి, అవసరమైతే సభామందిరానికిపోయి

రాజకీయ వ్యవహారాలు పరిశీలించి, రుద్రమహారాజునో, చక్రవర్తినో దర్శించి మధ్యాహ్నమునకు తిరిగి ఇంటికి వేంచేసి అతిథి అభ్యాగతులతో ద్వితీయస్నానానంతరం భోజనంచేసి, సాయంకాలం వరకూ గ్రంథకాలక్షేపమూ, పండితకాలక్షేపమూ చేసి, సాయంకాలం రాజకార్యాలు పరిశీలించడం శ్రీ శివదేవయ్యదేశికుల అలవాటు.

"ఇంతకూ ఈ రాజ్యానికి ఆపత్తువస్తే దేవగిరి యాదవులవల్ల రాగలదు. ఆగజదొంగ గన్నారెడ్డి పుణ్యమూ అని సంతమందో రాజద్రోహులు హతమారిపోయినారు. ఇంక ఆలోచించవలసిన విషయము ఒకటి ఉన్నది. తెరవెనుక ఉండి ఈ రాజ్యమంతా విచ్ఛినం చేయాలని ప్రయత్నించే ఒక మహావ్యక్తి! ఆ వ్యక్తి ఎవరో చూచాయగా తనకు గోచరించింది.

"కాని అంతమాత్రంచేత ఆయన్ను నాశనంచేయడానికి వీలులేదు. ఆ విజానిజాలు కూడా కొద్దిదినాలలో తేలుతవి.

"యాదవులు ఎప్పుడు వచ్చి పడతారో? అందుకు ఈ రాజ్యాం తట్టుకోవలసిఉన్నది. సామంతులలో ఇంకను కొందరు రాజద్రోహం చేయడానికి సిద్ధపడినవా రున్నారు. వారితోపాటు కాంచీపుర చోడమహారాజు, పాండ్యులుఉన్నారు. వారివిషయం తెల్చుకోవడానికేగదా తాను రుద్రమహారాజును జైత్రయాత్రకు పంపించింది! అప్పుడు ఒక్కరూ ఈ మహారాజ్యంపై తిరగబడెడి సామంతులు గాని ఇతర రాజ్యాలవారుగాని లేకపోయారు.

"ఈ లోగా రుద్రమహారాజుచేత ఓరుగల్లుకోటను సర్వవిధాలా సిద్ధంచేయించడం, రుద్రమహారాజు వివాహం నిశ్చయంచేయడం ఇవి ముఖ్యకార్యాలు" అని శివదేవయ్య దేశికులు అనుకుంటూ తన మహానగరులోని సభామందిరానికి వచ్చి రావడంతోనే, ఒక సేనాపతి వారి పాదాల వ్రాలి, "మహామంత్రీ! కల్యాణపుర చోడోదయుడు తాను స్వతంత్ర చక్రవర్తిననీ, తాను చాళుక్యరాజ్యమైన సకల కుంతల రాజ్యభారం వహించినాననీ, పశ్చిమాంధ్రావనీశులు కుంతల సామంతునకే కప్పము కట్టవలసి ఉంటుందనీ లోకమంతా చాటించినాడట" అని మనవిచేసినాడు.

"ఏమీ! చక్రవర్తి కాలంనుంచీ మనకు కప్పం కట్టే కల్యాణపుర చోడులు ఇప్పుడు మానివేస్తారేమి? ఈ మహాదక్షిణావని అంతా ఏకచ్ఛత్రాధిపత్యం వహించి రాజ్యం ఏలిన చాళుక్యుల రాజధానిలో చోడులు ప్రవేశించడానికి కారణం రుద్రచక్రవర్తి లేదనుకున్నారా? సరే, మీరు వెంటనేపోయి రుద్రమహారాజుతో ఈ విషయం మనవిచేసి అక్కడ ఉండండి. నేను ఇంతలో అక్కడకు వస్తున్నాను" అని శివదేవయ్య దేశికులు ఆ సేనాపతికి సెలవిచ్చినారు.

౧౬

"చాళుక్య వీరభద్రుడు శ్రీ కాకతీయ రుద్రమాంబదేవిని ప్రేమించిన మాట వాస్తవము. గాఢంగా పవిత్రంగా ప్రేమించాడు. సీతామహాదేవిని రాముడు ప్రేమించినట్లే ప్రేమించినాడు. కుణాలుడు కాంచనమాలను ప్రేమించినట్లు ప్రేమించినాడు. ఆమె సామ్రాజ్ఞి కాబోతున్నది, చాళుక్య వీరభద్రుడొక సాధారణ సామంతుడు. మహారాజు కొమరితలను సామంతుల కివ్వడం ఆచారం కావచ్చుగాక! రుద్రమదేవి చెల్లెలు గణపాంబాదేవిని సామంత శ్రేష్ఠుడైన కోట భేతమహారాజుకు ఈయలేదా?" ఈ ఆలోచనలతో శివదేవయ్య మంత్రి తన్ను దర్శించడానికి వచ్చిన చాళుక్య వీరభద్రుని కలుసుకొన్నాడు.

"రుద్రమదేవివారి విషయం అంతా వేరు ప్రభూ! ఆమె చక్రవర్తిని అయి తీరాలి. ఆమె సాటి మహారాజును వివాహం చేసుకుంటే రెండు రాజ్యాలు ఏకమౌతాయి. ఏ కళింగాధిపతినో, ఏ యాదవ మహారాజునో, ఏ పాండ్యభూపతినో, ఆ రుద్రమహారాణి వివాహం చేసుకుంటే ఆంధ్రరాజ్యం అంతరించిపోతుంది! కాబట్టి ఆమెను అత్యుత్తమ సామంతునకు వివాహం చెయ్యాలికాదా మహారాజా?" అని శివదేవయ్యమంత్రి చాళుక్య వీరభద్రుని మోముచూచి ప్రారంభించాడు.

వీర : మహామంత్రీ! మీరన్నది నిశ్చయం. అయినా సకల ఆర్యావర్తంలో, దక్షిణాపథంలో ఆంధ్రమహారాజ్యంవంటిది ఇంకొకటిలేదు.

శివ : చిత్తం మహారాజా, ఎవ్వరికీ తెలియనిదినాల్లో 'రుద్రప్రభువు' స్త్రీ అని తమ కొక్కరికే తెలిపాను. జ్ఞాపకముందా?

వీర : చిత్తం! అప్పుడు నేను పొందిన ఆశ్చర్యానికి పరిమితిలేదు.

శివ : తాము మొదటినుండి రుద్రదేవి బాలకుడనుకొన్నారు. ఆ దినాలలో తాము తమ హృదయాంతరాల జరిగిన స్పందనమిచేత ఆ బాలకునియందు చాలా అనురాగం, ఆపేక్ష చూపిస్తూవచ్చారు.

వీర : చిత్తం. అప్పట్లో చక్రవర్తి కాబోయే ఆ బాలునియందు నాకు జనించిన భక్తి కాబోలు నను కున్నాను.

శివ : ఆమె బాలిక అని తెలియగానే తమ హృదయం, తాళగతులు తప్పింది మహారాజా! అవునా కాదా? మీరు ఉత్తమచాళుక్యులు. ఈ మహాసామ్రాజ్యము దక్షిణ చోళసామ్రాజ్యంతో కలిపి ఏలిన చక్రవర్తి వంశంవారు, ఆ వేంగి సామ్రాజ్యంలోనే, ఇప్పటికీ మహాంధ్ర చిహ్నితంగా రాజ్యంచేస్తూ ఉన్నారు. ఇవన్నీ ఆలోచించండి. ఈ మహాసామ్రాజ్య చక్రవర్తినితో సరిసమానంగా గద్దె నెక్కగల శక్తి తామొక్కరికే ఉందని, నేనూ గణపతిదేవచక్రవర్తీ ఆలోచించాము. అందుకనే ఆమె బాలిక అని చాలాకాలం క్రిందటనే తనకు తెలియజేసి ఉన్నాము.

కాని ఇక్కడ ఎన్నో చిక్కులు తటస్థించాయి. పురుషులు, ఇరువురు ముగ్గురు స్త్రీలను ప్రేమించగలరు. కాని స్త్రీ తన జన్మలో ఒక్క పురుషునే ప్రేమించగలదు! అయినా పురుషులలో మహోత్తములు మాత్రమే ఏకపత్నీవ్రతస్థులు కాగలరు—శ్రీరాముడు, నలుడు, సత్యవంతుడు మొదలయినవారు. మహాప్రభూ! తామెందుకు ఇంతవరకూ వివాహం చేసుకోలేదు? మీ చరిత్ర అంతా నాకు పూర్తిగా అర్థం అయింది. అనేకమంది రాజకుమారులు వివాహం చేసుకోకముందు తమ అంతఃపురంలో ఉన్న సుందర బాలికలతో క్రీడించి తమ మదనజ్వర తాపానికి మందు సంతరించుకొందురు. తాము ఇంతవరకు ఒక స్త్రీనైనా కన్నెత్తి చూడలేదు. మహారాజా! నేను మీకు తండ్రివంటివాడను. నాదగ్గర సందేహించకుండా నిజం తెలియజేయండి. మీరు మా మహారాణి రుద్రమదేవిని ప్రేమిస్తున్నారు. అది నిజం! ఒక మహారాజ్యానికి ఉత్తమస్త్రీ ఒకర్తు సామ్రాజ్ఞి కానుండడం అపూర్వం. అది తమ మనస్సును మిక్కిలి రంజింపజేసింది. ఉత్తమప్రేమ అనే దివ్యానుభూతి మానవ జీవితంలో కలగడం అపురూపం. ఆ సన్నివేశం లభించిన నాయికా నాయకుల చరిత్రలు పురాణాల కీర్తింపబడతాయి. సావిత్రీ సత్యవంతు లొకరికొరకు ఒకరు ఉద్భవించారు. ఒకరి నొకరు చూచుకొన్నారు; ప్రేమించారు. వారి ప్రేమను కాలుడుకూడా విచ్ఛిన్నం చేయలేకపోయాడు. మహారాజా! మిమ్ము రుద్రమదేవి మహారాణి ప్రేమిస్తున్నారు. మీ ప్రేమను సామ్రాజ్యాలు, రాజనీతులు అడ్డుకోలేవు!

వీర : గురుదేవా! నేను తమ ఆజ్ఞానువర్తిని.

శివ : ఇంక తామూ, మా మహారాణీ లోక కల్యాణంకోసం, వివాహం చేసుకొనితీరాలి. మహారాణి సర్వధర్మ స్వరూపిణి అవడంచేత, ఆమెకర్తవ్యం ఆమె నిర్ణయించుకోవాలి. ఈ లోగా తాము సంకల్పించుకున్న కేదారాది యాత్రలు మాని వేయవలసిందని మనవిచేస్తున్నాను.

ఆ మాటలకు చాళుక్య వీరభద్రుడు ఆశ్చర్యమందినాడు. తన మనస్సులోని ఆలోచన ఈ మహానుభావుడు, ఈ శివస్వరూపులు ఎలా గ్రహించగలిగారు? 'మహాభాగా! గురుదేవా! తమ ఆజ్ఞ నా శిరస్సున కిరీటం కన్న ఎక్కువ గౌరవంగా తాల్చబడుతుంది' అని చాళుక్య వీరభద్రుడు శివదేవయ్య మంత్రి పాదాభివందన మాచరించి వెడలిపోయినాడు. ఆ సాయంకాలము వీరభద్ర ప్రభువు తిన్నగా కాకతమ్మ దేవాలయానికిపోయి పూజాదికములైన వెనుక ఆదేవి ఎదుట సమాలింగితభూతలుడై 'తల్లీ కాకతీదేవి! నువ్వే ఈ రాజ్యాన్ని రక్షించడానికి ఆ సుందరగాత్ర, ఆ వీరచరిత్రగా ఉద్భవించినావు

కాపోలు! మేము నీ కనుసన్నల మెలిగే హీనమానవులం! తల్లీ, పరమపావనీ!

"కాకతీయ వంశోద్భవకారిణీం
లోకోద్ధరణ స్వరూపిణీం
కృపామయీం కలుషహారిణీం
శక్తిమయీం రిపువిదారిణీం
నమామి, శర్వాణీం ముక్తిదాయినీం"

అని ప్రార్థిస్తూ కన్నులు మూసినాడు. అతని హృదయంలో సింహవాహనారూఢయై కోటిసూర్యప్రభాసితయైన ఒక నిర్మల తేజోమూర్తి చిరునవ్వుతో ప్రత్యక్షమైనది. హృదయంలోనుండి వేయి బరువులు పటాపంచలుకాగా ఆ ఉత్తమ చాళుక్యుడు లేచి, దేవీప్రసాదము కన్నుల కద్దుకొని ఆరగించి దేవాలయం వెడలి రథము ఆరోహించి తన నగరు చేరినాడు

# అష్టమ గాథ

# కృష్ణవేణి

## ౧

శాలివాహన శకం ౧౧౮౫ రుధిరోద్గారి సంవత్సర మాఘ బహుళ చతుర్దశి రాత్రి శివరాత్రి మహాపుణ్యకాలంలో తన కోటలోనే నమకమంత్ర యుక్తంగా శివాభిషేకం చేస్తూ శ్రీ శ్రీ గణపతి రుద్రదేవ సప్తమ చక్రవర్తి వెనక్కు వాలి పోయారు. పరమ మహేశ్వరులైన శివగురువు 'దేవా, ఏమిటిది?' అంటూ ఒక అంగలో చక్రవర్తిని చూచేసరికి ఆయన విగతజీవియై ఉన్నాడు. బ్రహ్మరంధ్రం పగిలి ఉన్నది. చిరునవ్వుతో తేజస్సుతో ఆయన మోము వెలిగిపోతున్నది.

మరుసటి క్షణికంలో శివదేవయ్యామంత్రి, రుద్రమాంబా విగతజీవుడై పడి ఉన్న చక్రవర్తికడకు ఉరికారు. చక్రవర్తి వెనుకనే నిలుచుండిఉన్న రాణులు నారాంబా పేరాంబలు ఇద్దరూ కూలిపోయారు. గుమ్మం దగ్గర ఉన్న ప్రసాదాదిత్య ప్రభువు వచ్చినాడు.

రాజవైద్యులైన చెన్నాప్రగడ గణపామాత్యుని తమ్ముడు చెన్నాప్రగడ సుబ్రహ్మణ్యమంత్రికి వార్త వెళ్ళగానే వారు వచ్చి చూచి ప్రాణము లేదని ధృవపరిచారు.

శివదేవయ్యామంత్రి ప్రసాదాదిత్యునకు 'నగరము జాగ్రత్త' అని ఆజ్ఞ ఇచ్చి పంపి, తలవరి మేచయనాయకుని 'రక్షణ జాగ్రత్త!' అనీ, పణికము బొప్పదేవునికి 'సైన్యాలు జాగ్రత్త' అనీ హెచ్చరికలు పంపినారు. తంత్రపాలుడు పోలరౌతు నగరపు వెలివాడలకు సైన్యసమేతుడయి వెడలెను.

వేగుదళాధిపతి గొంకప్రభువు శివదేవయ్యామంత్రి ఆజ్ఞలను గొని మల్యాల గుండయమహారాజుకు, మల్యాల చౌండసేనాపతికి, రేచెర్ల గణనాథ ప్రభువుకు, కోట భేతమహారాజుకు, చాళుక్య ఇందుశేఖర మహారాజుకు, కోనభీమ జనవల్లభ నృపాలునికి, జన్నిగదేవ సాహిణికి, అద్దంకి సారంగపాణిదేవ మహారాజుకు, సప్తమ చక్రవర్తి లింగైక్యమందినారనిన్నీ, అందుకు సర్వసేనలతో సిద్ధంగా ఉండాలనిన్నీ, ఏ సామంతులు తిరుగుబాటుచేసినా, ఏ పరరాజులు ఎత్తివచ్చినా వారిని నాశనంచేయడానికి సిద్ధంగా ఉండవలసిందన్నినీ వేగుల పంపినారు.

అన్నాంబిక రుద్రమదేవి ప్రక్కనేవాలి, ఆమెను గట్టిగా హృదయానికి అదుముకొన్నది. రుద్రమదేవి తండ్రిశవము ప్రక్క మోకరించి కన్నులు మూసికొని కొయ్యబారిపోయెను.

శివదేవయ్య దేశికులు రుద్రమాంబను సమీపించి, 'జయము, రుద్రమహా ప్రభూ! జయము. ఇక తాము అష్టమ చక్రవర్తులు. రాజనీతి దుఃఖానికెడ మీయదు. ఒక్కనిమేషమాత్రమైనా దేశము అరాజకం కాకూడదు. సార్వభౌమా! ఈ గడియ నుండి తామే చతుస్సముద్రముద్రిత మహాభూమి భారం వహించినవారయ్యారు. దేవతాస్వరూపులయిన తండ్రిగారి ఆజ్ఞ భగవంతుని ఆజ్ఞగా పరిపాలించండి' అని రుద్రచక్రవర్తిని చేయిపట్టి లేవతీశాడు.

కన్నులు మూసుకొనే ప్రార్థిస్తూ రుద్రమ లేచింది. పూజామందిరంలో నుండి రాజసభామందిరంలోనికి విచారసముద్రములో మునిగిఉన్నా గంభీర వదనయై వచ్చిన రుద్రమహాదేవిని చూడగానే ఆ సభామందిరంలో కూడిన సామంతులు, సేనాపతులు, పండితులు, ప్రజ్ఞ, సభాధికారులు, 'జయ జయ శ్రీ రుద్రమదేవ చక్రవర్తీ! జయ జయ' అని నినాదాలు సలిపారు.

అప్పుడు వందులు ఇరువదిమంది ముందుకు వచ్చినారు. వారి నాయకుడు రుద్రచక్రవర్తికి ఎదురుగా నిలబడి 'జయ జయ సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర పరమమాహేశ్వర! అన్నకొండ పురవరాధీశ్వర! సత్య హరిశ్చంద్ర! చతుస్సముద్రవలయిత దిక్పూరితకీర్తి! అష్టమచక్రవర్తీ! జయ జయ జయ, అంటూ జయజయ ధ్వానాలు చేశారు.

తండ్రి పరమవృద్ధులై రాజ్యంలో ఏవిధములైన కలతలు లేకుండా పవిత్రదినమైన శివరాత్రినాడు లింగైక్యమందినారు అంతకన్న శుభం ఏముంది?

తన దుర్బల భుజాలు, తండ్రిగారు సులభముగా వహించిన భూభారం వహించవలసి ఉంటుంది. అన్నిటికీ బలము పరమశివుడు, కాకతీదేవీ, సర్వజ్ఞులైన శ్రీ శివదేవ దేశికులూ — వారి సహాయమే తనకు సూర్య చంద్రులూ, నక్షత్రాలూ కాగా, తాను ఈ రాజ్యభారం వహిస్తుంది. ఈ కార్యంకొరకేకదా తనకు మొదటినుండి తండ్రిగారు సర్వవిద్యలూ నేర్పించి రాజ్యపరిపాలనా విధానంలో ప్రవీణత ఇప్పించినారు.

తాను సర్వదేవతలు సాక్షిగా మాట ఇచ్చినది.

ఎవ్వరూ చూడకుండా ఆ బాలిక చిన్నబిడ్డలా తన రహస్యమందిరంలో మంచంమీద మేను వాల్చి లోచనాంచనాల సంతతధారగా ప్రవహించే బాష్పప్రవాహంతో కరిగిపోయింది.

౨

శ్రీ గణపతి రుద్రదేవప్రభువు దివంగతు లయ్యాడని ఒక్కసారిగా సకలభారతావని మ్రోగిపోయింది. దక్షిణాన పాండ్యులు, చోడులు,

చల్లాణులు; దేవగిరిలో యాదవులు; కాళింగాన ఒడ్డెరాజులు 'అమ్మయ్యా' అని ఇంతగాలి గట్టిగా పీల్చుకున్నారు.

కృష్ణవేణాతీరంలో తన రహస్యనగరంలో గోన గన్నారెడ్డి ఇక "ఆంధ్ర మహాసామ్రాజ్యానికి ప్రళయం సంభవించింది" అని నిట్టూర్పు విడిచినాడు. ఆ మరుసటిక్షణంలో విశాలమై, మహాపర్వతసానువై, ఆంధ్ర ప్రతాపాలవాలమై ఆంధ్ర క్షత్రియకుల శ్రీనివాసమైన అతని వక్షము ఇంకా విస్ఫారితమైనది. దౌవారికుని చీరి 'మహాసభాఘంటిక మ్రోగింపు' మని ఆజ్ఞ ఇచ్చినారు.

మరి పదిక్షణికాలకు లోకకుహరాలన్నీ మారుమ్రోగుతూ ఒక పెద్ద జయ గంట మ్రోగటం ప్రారంభించింది. ఆ మ్రోత ఆ రహస్యపులోయ అంతా నిండ గానే రాచనగరుకు ఎదురుగాఉండే విశాల ప్రదేశాలలో గజదొంగల సైన్యాలన్నీ బిలబిల చేరడం ప్రారంభించాయి. సేనాపతులు, దళవాయులు, సాహిణులు అందరూ యథోచితవేషాలతో ఆ ప్రదేశానికివచ్చి యథాస్థానాల బొమ్మలులా నిలబడినారు.

మూడుగడియలో గోస గన్నారెడ్డి సైన్యం యావత్తూ సంపూర్ణంగా ఆ ప్రదేశంలో బారులుతీర్చి, రాతివిగ్రహాలులా నిలబడి ఉన్నది. దుష్టతురగ రేఖారేవంతుడు, రాజద్రోహరగండ, గండరగండ మహావీరుడు, యౌవన శ్రీవిష్ణుడు, దుష్టమానవ భీకరుడు, ఆజానుబాహుడు, మనోహరాంగుడు, కామినీ జయంతుడు, అర్జున ప్రతాపుడు అగు గోన గన్నారెడ్డి కోలమోముతో, నొగ మీసాలతో, ప్రత్యక్షమైన కుమారస్వామిలా ఉత్తమ శ్వేతాజానేయము నధివసించి మెరుపులా వచ్చి తన లక్ష ముప్పదివేల సైన్యముఖంలో నిలుచున్నాడు,

ఒక్కసారి ఆ లక్షమంది తామ్ర కంఠాలలోనుండీ 'జయ! జయ! గోన గన్నారెడ్డిప్రభూ! జయ! జయ!' అని రోదసీకుహరం నిండే జయధ్వాను ఉద్భవించాయి. మహావీరుని కుడిప్రక్క అపరభీముడు, మహాసత్త్వుడు, గజబలుడు మేరుశృంగంవంటి రూపంకలవాడు అశ్వత్థతరుకాండాలలాటి చేతులుకలవాడు కండలుతప్ప కొవ్వులేని దేహంగాలు కలవాడు, ఏనుగులతో మల్లయుద్ధంచేసి నెగ్గ గలవాడు, ఉరుమువంటి కంఠధ్వని కలవాడు గోన విఠలధరణీశుడు మహాసేనాపతి కిరీటలాంఛనంతో ఉన్నతమైన గదను ధరించి నిలుచున్నాడు.

గన్నారెడ్డికి కుడిప్రక్కను కదలివచ్చే కొండలాంటివాడు, ముష్టి ఘాతం చేతనే బండరాళ్ళను పిండిగొట్టగలవాడు; విఠలధరణీశుని కుడిభుజు వాడు, సముద్ర గర్జన కలవాడు దోసపాటి సూరన్నరెడ్డి ప్రభువు హిమాలయ శిఖరంలా నిలుచున్నాడు. అవక్రవీరుడు, సింహంలాంటివాడు, మాయలలో గంధర్వులకు విద్యనేర్పేవాడు విరియాల సబ్బారెడ్డి ప్రభువు సూరన్నరెడ్డికి

ఎడమప్రక్క నిలుచున్నాడు. సబ్బారెడ్డికి ఎడమప్రక్క ఉత్తమ వెలమరెడ్డి కుల మనే పాలసముద్రానికి బాలచంద్రుడు, అభిమన్యసత్వుడు, సంతత సంతోష ప్రఫుల్ల వదనుడు, దివ్యధనుస్సుకలవాడు, అతివేగాలయిన బాణాలతో సూటితప్పక ఎట్టివస్తువునైనా ఎంతటిదూరములో ఉన్నా ముక్కలు చేయగలవాడు రేచర్ల బేతి రెడ్డి మహాప్రభు తనయుడు సోమారెడ్డి నిలిచిఉన్నాడు. ఆయనప్రక్కనే రేచర్ల ప్రసాదాదిత్యప్రభువు కుమారుడు చినదామానాయకప్రభువు నిల్చుండి ఉన్నాడు. ఆ ప్రభువు పగతురకు వెన్నిచ్చి ఎరుగడు. యుద్ధప్రారంభమందు ఏమినవ్వునో మళ్ళీ యుద్ధాంతమందే నవ్వుతాడు. ఈ లోగా ప్రచండ సూర్యాగ్ని అతడు; పసి పట్టిన మహానాగము. కత్తియుద్ధములో అతన్ని ఓడించగల యువకు డొక్క గన్నారెడ్డి ప్రభువే!

విఠలధరణీశునకు కుడిప్రక్క అనలక్కినప్రగడ ఉన్నాడు. ఆ బాలపండిత కుమారస్వామికి, వ్యాసునకు తప్పులు దిద్దగల ఆ పండితుడు యుద్ధావసరం వస్తే రామబాణం, చక్రధార, పాశుపతాస్త్రమును.

మల్యాల చౌండసేనాధిపతికి ఇద్దరు కొమరులు, ముగ్గురు కొమరితలుఉన్నారు. వారయిమగురు భీమసంతతివారు. కొమరులిద్దరూ మహాసత్త్వులు, విఠలధరణీశునే యుద్ధానికి పిలువగలరు. ఆ బాలికలు గదాయుద్ధంలో అన్నగారిని, తమ్ముణ్ణి ఒక్కొక్కప్పుడు ఓడించేవారు ఆ యన్నదమ్ములలో కాటప్రభువు గన్నారెడ్డి జట్టులో చేరిపోయినాడు. పదియారేళ్ళ ఆ బాలప్రభువు మహోత్తోమరధారియై అక్కినప్రగడ కుడిప్రక్కను నిలిచిఉన్నాడు.

ఇంకనూ అక్కడ చేరిన ఆంధ్రక్షత్రియవంశ్యులలో మున్నూరు కాపు వీరప్రభువు మలుగంటి రుద్రనాయకుడు గజసాహిణి. గన్నారెడ్డిహృదయం చూర గొన్న ఆ వీరుడు కాటయప్రభువు ప్రక్కను నిలిచి ఉన్నాడు.

రామరాజు, గణపతిప్రభువు, వెలమదొర మందయ్య ప్రభువు, పులపరి బొల్లిరెడ్డిప్రభువు, గోనం కామిసేనాని, వివరము నరహరినాయకుడు, పంట అన్నరెడ్డిప్రభువు, గొచ్చెబమ్మ సేనాని అనే ప్రభువులు వారి వారి సేనాముఖాల నిలుచుండి ఉన్నారు.

గోన గన్నారెడ్డి తన మహాసైన్యాన్ని చూచి, 'ఆంధ్రవీరులైన మీకు ఒక మహావిషాదవృత్తాంతం వినిపించవలసివచ్చింది. మన ప్రభువు శ్రీ గణపతిదేవ చక్ర వర్తి అస్తమించారు' అని విషాదకంఠంతో తెలియచెప్పెను. ఆ మాటలు దగ్గరి వారికే వినబడినవి. అక్కడినుండి చారులు వారిమాటలను సైన్యం అంతకూ అందిచ్చినారు.

"మనం ఎంత గజదొంగలమైనా, హీనత్వానికి పాలుపడలేదు. మన చక్రవర్తులకు ఎప్పుడూ భక్తి చూపించాము. అజభక్తితో, భగవద్భక్తితో

దుర్మార్గులను, రాజద్రోహులను నాశనంచేసే పని పెట్టుకొని ఈ మహాసైన్యం పెంచుకొన్నాము. శ్రీశైల మల్లికార్జునుడు మనపక్షం ఉన్నాడు కాబట్టే మనకు కోట్లకొలది ధననిధులు దొరికాయి. ప్రజలే భగవంతుడు. ప్రజానురంజనమే భగవద్భక్తి. మన చక్రవర్తి, దీనబాంధవుడు కైలాసవాసి అయినాడు. ఈతరుణంలో సరిహద్దుభూములలో కుట్రలు, అరాజకము, కాటకము, దుష్టరోగ తాండవము, చోరవృద్ధి తటస్థిస్తుంది. కాబట్టి ఈ నాటినుంచి మనం శ్రీ రుద్రచక్రవర్తి సింహాసనం అధివసించి సుఖసంవిధానం చేసేవరకూ అప్రమత్తులమై ఉండాలి. ఆ వెనుక మన గజదొంగతనం ఈ రహస్యనగరంలోనే భూస్థాపితం అగుగాక. అలా కాని పక్షంలో మన జన్మలు గజదొంగలుగానే ముగిద్దాము" అనే గన్నారెడ్డి మాటలు కైలాస వాక్కులులా వినబడ్డాయి.

## ౮

ధీరహృదయ, విద్వాంసురాలు, రాజ్యపాలన ప్రజ్ఞావతి అగుటచేత రుద్రమ దేవి తండ్రిపోయిన దుఃఖాన్ని తన బ్రతుకు పడవను ముందుకు గొనిపోయే అనుకూల వాయుశక్తిగా చేసికొన్నది. ఆమె హృదయంలో సంతోషము నశించింది; అనుమానం పటాపంచలయింది; వెనుకటి డోలాయమాన మానసికావస్థ నశించింది. గుప్పిళ్ళు బిగించి, కనుల తీక్ష్ణకాంతులు ప్రసరింప, దేహమంతటా శక్తి పొంగిపొరలగా, దృఢ ప్రతిజ్ఞావతియై కర్యరు రాలైంది.

ఆమె స్త్రీవేషము మానింది. సర్వకాల కవచధారిణియై, సైన్యాలను శంభుంకరాయుధంగా సిద్ధంచేయ సంకల్పించుకొన్నది. ఆమె కోమలత్వం వజ్రకాఠిన్యం సవదరించుకొంది. ఆమె సౌందర్యం మహాదుర్గా సౌందర్యమై వికసిల్లినది.

ఆమెకు ప్రొద్దుపోయినగాని నిదురపట్టదు; పట్టిన పదిగడియలలో మరల మెలకువ.

ఆమె ఆలోచనలు ఆంధ్రవిరోధి సంహరణము, ఆమె కాంక్ష అవధిలేని లోకపురోగమనము.

ఆమె ఉదయాస్తమానాలు అన్నాంబికతో కత్తియుద్ధ పరిశ్రమచేయును. అన్నాంబికతోపాటు విలువిద్యలు, సూక్ష్మతలు నిరంతరపరిశ్రమచేసి సాధించును. వివిధాశ్వారోహణలు, అశ్విక యుద్ధాలు, రథసూత కారిత్వము, రథయుద్ధకౌశలము, వివిధ వ్యూహనిర్మాణము, వివిధ వ్యూహచ్ఛేదము, వివిధాయుధ ప్రయోగము ఇవన్నీ దీక్షతో అభ్యసింప నారంభించినది.

స్వయంగా ప్రసాదాదిత్యునితో కలిసి, ఓరుగల్లుకోట బాగుచేయించసాగిందా మహారాణి. ఏటిసూతకమైనవరకు తాను సింహాసన మధివసించదట. శివదేవయ్య

మంత్రితో వివిధోద్యోగులతో, సర్వనాడులగూర్చి: ప్రజలగూర్చి మోటుపల్లి శ్రీకాకుళం, మచిలీపట్టణము, శంబరదీవి, కుదంగేశ్వరపురం మొదలైన రేవుపట్టణాలనుండి జరిగే సముద్రవ్యాపారాల గురించి. సుంకాలు, రాజభోగము, పన్నులు, కప్పాలు, అడవులు, గనులు, వర్తకము, నాణేలు మొదలైన ఆర్థికవిషయాలగురించి: వానలు, నదులు, చెరువులు, కాలువలు, పంటలు, తోటలు, వ్యవసాయము, గ్రామాలు, పశువులు మొదలగు ప్రజాజీవనం గురించి: గ్రామపెద్దలు, దళ గ్రామాధికారులు, సామంతులు, మంత్రాంగులు మొదలయిన రాజ్యపాలనా నీతినిగూర్చి: మహారాజపథాలు, సత్రాలు మొదలైన సంస్థలగూర్చి: వైద్యశాలలు, పశువైద్యశాలలగూర్చి, విద్యానిలయాలు, ఆశ్రమాలు, పరిషత్తులు, దేవాలయాలు, శాసనాలు, మఠాలు, వివిధ సంప్రదాయాలు, మాతాచార్యులు మొదలయినధార్మికవిషయాలగూర్చి: కవులు, పండితులు, శిల్పులు, గాయకులు, గ్రంథాలు, సరస్వతీ ఆలయాలు, నాట్యకోవిదులు, భోగమువారు, శిల్పబ్రాహ్మణులు మొదలైన మహావిద్యలనుగూర్చి ఆ సామ్రాజ్ఞి సంపూర్ణంగా చర్చించుచు తానే అన్నికార్యాలు నిర్వహింపసాగింది.

అన్నిటిలో అన్నాంబిక ఆమెకు మంత్రి, సేనాపతి, తంత్రపాలిక, తలవరి, అంగరక్షక, తోడునీడయై మెలగుచుండెను.

అన్నాంబిక ఒకొక్కప్పుడు 'ఇదేమిటి, పురుషులు నిర్వర్తించే ధర్మము తాము నిర్వర్తించడమేలాగు? అది ఎలా విజయం పొందగలదు?' అని సంశయముచే వ్యథనొందేది. ఒకొక్కప్పుడు తన మహారాణి అవతారస్వరూపిణి, కారణజన్మ, దేవీమూర్తి కాబట్టి అపరాజితాదేవిలా లోకం యావత్తూ రాజ్యం చేయగలదని సంకోచరహితమైన ఉత్సాహంతో ఉప్పొంగిపోయేది.

పురుషవేషంలో వారిద్దరూ రామలక్ష్మణు లయ్యారు. వరాహలాంఛన యుతమై, ఖడ్గధారిణియైన దేవీమూర్తి విగ్రహంతో, రుద్రదేవి అన్న అక్షరాలతో ముద్ర ఒకటి సామ్రాజ్ఞి అనామికను, మరొకటి అన్నాంబికవ్రేలిని అలంకరించాయి.

అశ్వసైనికులు ఒకరొకరు, ఇరువురిరువురుగా, మూవురుగా, నలుగురుగా. ఇరువదిమంది, వేయిమందిగా చెక్కుచెదరక శ్రేణులుగా యుద్ధయాత్రకు పురోగమించడం, యుద్ధంలో విరోధుల్ని తాకడం ఆమె నేర్పి సేనల సుశిక్షితము లొనర్చెను.

ఢంకానాదాన్ననుసరించి పదాతులు మొదట వరుసతీర్చడం, ముందుకురకడం, డాలు డాలు కలిపి గోడకట్టడం, డాళ్ళు గొడుగులుచేసి నడవడం, ఒక శ్రేణివెనుక ఒక శ్రేణిగా మోహరించడం: మోహరంలో కరవాల భల్లకూల పరశు యుద్ధాలు చేయడం; యెదుర్కొన్న సైన్యాలపై బడడం: పరు

గునబోయి తాకడం, శ్రేణులు విడకుండ వెనుకవారు ముందుకు నర్దుకొనడం ఇవన్నీ శిక్షణ ఇచ్చింది.

జేగంట గుర్తులకు యుద్ధవిధానాలు నడపడం ఆ మహారాణి ఏనుగులకు నేర్పింది.

ఓరుగల్లు వెలివాడలకు, మైలసంతకుచుట్టు గంపకోట కట్టించింది. నగరం చుట్టు ఉన్న కోటగోడల ఇనుమిక్కిలిగా బలిష్టమొనర్చింది. రాచకోట బాగు చేయించింది. అగ్నిబాణాలు అర్పడం నేర్పించింది. అగ్నిబాణాలనుండి కాపాడే తోలుకూర్పాసాలు లక్షలు సిద్ధం చేయించింది.

నగరంనిండా ధాన్యపుగాదెలు నిర్మాణం చేయించి వానిని వివిధధాన్యాలతో నింపించింది. నగరంలో రాచకోటలో ఎన్నో కూరగాయల తోటలు వేయబడి నాయి. ఎన్నో మంచినీళ్ళ బావులు త్రవ్వినారు. చెరువులలో ఎప్పుడూ నీరు ఉండే విధానం పండితులతో ఆలోచించి నిర్వహించినారు.

ఓరుగల్లు నగరం రెండేళ్ళ ముట్టడికి సర్వసిద్ధ మయింది.

౪

శ్రీ కాకతీయ గణపతిరుద్రుడు కాలంచేశాడూ? అతని కూతురు రాచరికమా? క్షత్రియకులానికి ఎంతగతిపట్టింది!” అన్నాడు కల్యాణి చోదోదయుడు.

కల్యాణినగరం పశ్చిమాంధ్ర మహారాజ్యానికి ఒకనాడు ముఖ్యనగరం. కాంచీపురం రాజధానిగా పల్లవులు దక్షిణానా, వాతాపినగరం రాజధానిగా పడమటను చాళుక్యులూ శాతవాహన సామంతులుగా ఉండేవారు.

శ్రీశైలానికి ఈశాన్యంగా పల్లవభోగమూ, తూర్పుగా చళుక విషయమూ ఉండేవి. చళుకవీరుడొకడు చక్రవర్తికి సేనాపతియై కుంతలదేశం జయించినాడు. శాలివాహన చక్రవర్తికి పెద్దకుమారుడు రాజప్రతినిధిగా ములకనాటికి ముఖ్యనగరమైన ప్రతిష్ఠాననగరంలోనూ, ద్వితీయకుమారుడు, మసికనగరం రాజధానిగా శాతకర్ణాటం లోనూ ఉండేవారు. మధ్యకుంతలానికి వాతాపిలో చళుకసేనాధిపతి ఉండేవాడు.

శాలివాహన సామ్రాజ్యం విచ్ఛిన్నంకాగానే, ఇక్ష్వాకులు పల్లవభోగానికి, తూర్పు ఆంధ్రావనికీ స్వామ్రాట్టులైనారు. కంచిలో పల్లవులు స్వతంత్రులైనారు. బాదామిలో చాళుక్యులు స్వతంత్రులైనారు.

ఆనాటినుండి చాళుక్యులు కుంతలము, అశ్మకము, ఆంధ్రము, గాంగవాడి, ఆభీరము, ఘూర్జరము జయించి, మహారాజ్యము విస్తరింపచేశారు, వాతాపినుండి రాజధాని కల్యాణినగరమునకు వచ్చినది.

చాళుక్య సామ్రాజ్యము అంతరించగానే, వారికి సామంతులుగా ఉన్న కందూరులోని తెలుగుచోడులు వర్ధమానపురం రాజధాని చేసుకొని, విజృంభించారు. కల్యాణి, చాళుక్యుల సేనాపతిఅయిన కాలచుర్యబిజ్జలుని హస్తగత మయినది. బసవని వీరశైవంవల్ల కాల్యచుర్యవంశం నశించి కల్యాణి నగరాన్ని తెలుగు చోడులు ఆక్రమించినారు.

వర్ధమానపుర చోడులను గణపతిచక్రవర్తి పెదతండ్రి రుద్రదేవ చక్రవర్తి నాశనం చేశారు. అంతట కల్యాణి చోడులు కాకతీయ సామ్రాజ్యానికి సామంతులైనారు.

గణపతిదేవచక్రవర్తి కాలంలో కల్యాణినగరాన చోడోదయుడు రాజ్యం చేస్తూఉండెను. అతనికి ఎంతకాలమునుంచో తాను స్వతంత్రుడై మహారాజు కావలెనని వాంఛ ఉండేది. బలవంతుడైన గణపతిదేవచక్రవర్తి ముసలివా డయినాడు. ఆయన పేరున ఆయనకుమార్తె రాజ్యం చేస్తూఉంది. ఇంతకన్న అదను ఏమి కావాలి ?

చిన్న చిన్న సామంతులను చేరతీశాడు. గట్టి సైన్యం పోగుచేశాడు. తాను చక్రవర్తినన్నాడు. తనకు పశ్చిమాంధ్ర సామంతులందరూ కప్పము కట్టాలన్నాడు. సైన్యంతో వెళ్ళి కందూరు పట్టుకున్నాడు. ఆ చుట్టుపట్ల ఉన్న రాజ్యం అంతా ఆక్రమించాడు.

ఆ సమయంలో రుద్రమహారాజుకు, శివదేవయ్య మంత్రికీ చోడోదయుని దురంతం తెలిసింది. శివదేవయ్యదేశికులు, మహారాజు, బొప్పదేవుడు, ప్రసాదాదిత్యప్రభువు, జాయపసేనాని ఆలోచించి, కొద్దివారాలలో చోడోదయునిపైకి వెళ్ళడానికి నిశ్చయించినారు. కాని నెలలు జరిగి పోయినవి. చోడోదయుడు నిర్భయంగా విజృంభించిపోయినాడు.

ఇంతట్లో చక్రవర్తిసైన్యాన్ని ఒకదాన్ని చోడోదయుడు నాశనం చేయడం, గణపతిదేవ చక్రవర్తి కైలాసవాసి అవడం రెండూ జరిగాయి.

చోడోదయుడు విజయగర్వంతో రాజు బందీగా ఉన్నాడని మానువనాడు ఆక్రమించుకొని వర్ధమానపురం ముట్టడించాడు. ఈ విషయం అంతా గోన గన్నారెడ్డికి వేగు వచ్చింది. గన్నారెడ్డి మండిపోయాడు. ఎందుకు చక్రవర్తి సైన్యాలు ఊరుకొన్నాయి ? ఇన్ని నెలలు ఈ పామును పాలుపోసి పెంచారు ! చక్రవర్తి సైన్యాన్ని నాశనంచేయగానే గోనమహానగరం ముట్టడించే మొనగాడ నయినాననుకున్నాడా ఈ కీటకము ! అని గన్నారెడ్డి పెదవులు బిగించి నవ్వినాడు.

చోడోదయుడు అశ్వికశ్రేష్ఠుడని ప్రతీతి. అతడు తురగముమీదనే నిద్రపోగలడట. తురగముమీదనే భోజనం చేయగలడట. ఆయన ఎక్కే గుఱ్ఱము 'మహావాయువు' అని పేరుగలది. మ్లేచ్ఛాశ్వాలలో మహోత్తమమైనది. ఆ తురం

గపు మెడలో చోడోదయుడు వజ్రాలుపొదిగిన బంగారు తాడుతో ఆణిముత్యాల హారం అలంకరించాడట.

ఆ ఉత్తమాజానేయ మధివసించి చోడోదయుడు వర్ధమానపురం ముట్టడిని సాగిస్తున్నాడు.

అతని హృదయంలో ఈ వర్ధమానపురాన్ని పట్టుకోవడం అయిదు నిమేషా లని. ఈ పురం ప్రస్తుతం పాలించేది ఒక బాలకుడుకదా? రాజు కావలసిన గన్నా రెడ్డి గజదొంగ అయినాడు. ముసలిరాజు బందీ. వర్ధమానపురం దొరకగానే ఓరు గల్లు కొద్దివారాలలో తన హస్తగతం. చోడచక్రవర్తులు, చాళుక్య చక్రవర్తులు ఆతన్ని ఆశీర్వదిస్తున్నారని ఆతడు భావించి 'ఎవరీ కాకతీయులు?' అను కున్నాడు.

ఆ వెంటనే రొజుకుంటూ అశ్వానెక్కిన ఒక చారుడు చోడోదయ మహా రాజుకడకు పరుగిడివచ్చి 'జయ! శ్రీ మహారాజాధిరాజునకు జయ! గోన గన్నా రెడ్డి సైన్యాలతో మహాప్రభువుమీదకు వస్తున్నాడు!' అని వార్త తెచ్చాడు.

"ఏమిడీ, గన్నారెడ్డా! ఆ గజదొంగా? ఎందుకు వస్తున్నాడు? ప్రాణాల మీద ఆశపోయిందా? లేక తనకు దక్కని వర్ధమానపురం మావలన దక్కుతుం దనా? మాతోచేరి, మాకు దాసుడైతే ఈ నగరాన ఈ దొంగను సామంతుణ్ణి చేద్దాము" అని చోడోదయ మహారాజాధిరాజు తన్ను కొలిచిఉన్న సేనాధికారులతో అన్నాడు.

ఆ ముక్కలు అత డంటున్నాడు. మరుసటిక్షణంలో తృణావర్తుడులా గోన గన్నయ్య ససైన్యంగా వచ్చి చోడోదయుని సైన్యాలపై విరుచుకు పడినాడు.

ఎంత సిద్ధంగాఉన్నా ఆ తాకకు చోడోదయుని సైన్యాలు ఉప్పెన కెరటానికి విరిగిన తాళవనంలా అయిపోయినాయి.

౫

ఎప్పుడు గోన గన్నారెడ్డి సైన్యాలువచ్చి తన సైన్యాలను తలపడినా యని విన్నాడో, ఆ వెంటనే తన ఆశ్విక సైన్యాలు గన్నారెడ్డి సైన్యాలను చుట్టుముట్టవల సిందని ఆజ్ఞఇచ్చి, ఆ సైన్యాలను తానే స్వయంగా నడుపుకుంటూపోయి కళ్యాణి చోడోదయుడు గన్నారెడ్డిసైన్యాలను ఆరుగవ్యూతులదూరంలో మధ్యను తాకినాడు. ఆవెంటనే గన్నారెడ్డి సైన్యాలు ఇటుతిరిగి భల్లూకవ్యూహం రచించాయి. ఆసంకుల సమరంలో చోడోదయుని ఎడమవైపునుంచి గన్నారెడ్డి తానుస్వూ తెల్లని అజానే యంపై అధివసించి, తన ఆశ్విక సైన్యాలను నడుపుకొని వచ్చి మధ్యనే తాకినాడు

గన్నారెడ్డి ఆశ్వికసైన్యాన్ని పొదుపుకొని ముప్పది వేలమంది పదాతులను నడుపుకొని విశలధరణీశుడు—చోడోదయుని ఇతర సైన్యాలు గన్నారెడ్డి సైన్యాలను వెనుకనుండి తలపడకుండా—అడ్డుపడినాడు. చోడోదయుని ఆశ్వికులు గన్నారెడ్డి ఆశ్వికులు ఆ దినమంతా జరిపిన యుద్ధము దేవతలు విమానాలపై వచ్చి తిలకించినారని కవులు గానం చేసిరి.

ఆ పిమ్మట ప్రవర్తిల్లిన సంకులయుద్ధంలో గన్నారెడ్డి కొద్దిమంది ఆశ్వికులతో గోదావరిని ఈదే ఏనుగులా తక్కిన ఆశ్వికసైన్యాల మధ్యనుండి చొచ్చుకుపోయినాడు. ఆవీరుడు చేసిన దారిని ఆరువేలమంది ఆశ్వికులు చోడోదయుని ఇరువదివేలమంది అశ్వసైన్యాన్ని రెండుగా చీలుస్తూ చొరబడినారు. ఈ సైన్యాన్ని ఎదుర్కొనడానికి తిరిగిన చోడోదయుని సైన్యాన్ని మల్యాల చినదామానాయుడు తన సైన్యంతో వెనుకవైపున తాకినాడు.

ఈ కారణంచేత రెండుగా చీలిన చోడోదయుని అశ్వికసైన్యాలు మూడుగా చీలినవి. గోన గన్నయ్య ఇట్లు శరవేగంతో ముందుకు చొచ్చుకుపోయి చోడోదయుని తాకినాడు. ఆఇద్దరు వీరులూ ఆశ్విక శ్రేష్ఠులే కాని గన్నారెడ్డి అశ్వపుసడక మెరుము వేగము.

రెండుమూడుసారులు గన్నారెడ్డి చోడోదయులమధ్య ఇతరాశ్వికులు యుద్ధం చేస్తూ అడ్డం వచ్చినారు కాని గన్నారెడ్డి వారిని తప్పించుకొని చోడోదయుని మరల తాకినాడు. చోడోదయుడు, ఎడమ ముష్టితో మణులు పొదిగిన బంగారుకళ్ళెము బూని గుఱ్ఱాన్ని విచిత్రగతులు నడిపినారు. గన్నారెడ్డి గుఱ్ఱము సూర్యుని గుఱ్ఱములా చరించినది. చోడోదయుని కత్తి ఘాతాలను తనఫలకాన్ని అందిస్తూ గుఱ్ఱాన్ని మాటచేతనే నడుపుతూ గన్నారెడ్డి, చోడోదయునికి, వానిగుఱ్ఱానికి గాలి పీల్చుకునేందుకన్నా వ్యవధి ఈయలేదు.

ఇరవై క్షణములలో చోడోదయునిచేతి పట్టుసూత్రము రెండు ఖండములై పడిపోయినది. పదిక్షణములలో కత్తి అతనిచేతినుంచి ఎగిరి క్రింద పడినది. ఇక రెండు నిముషములలో చోడోదయుడు క్షతగాత్రుడై క్రిందపడిపోయినాడు. గోన గన్నారెడ్డికి అంగరక్షకుడుగ ఉన్న అక్కినప్రగడ ఒకదే ఉరుకున చోడోదయుని సమీపించి, అతని చేతులకు బంగారు గొలుసులు తగిల్చినాడు.

చోడోదయుడు బందికావడంతోటే సేనాపతులు చేతులెత్తి యుద్ధమాపు చేసినారు.

చోడోదయుని బందీగాగొని గోన గన్నారెడ్డి చోడోదయుడు నిర్మించుకొన్న రాజశిబిరానికి వెళ్ళి అక్కడ కొలువు తీర్చినాడు చోడోదయుని ఉత్తమాశ్వాన్ని గోన గన్నారెడ్డి సైన్యాలు తమప్రభువు గుఱ్ఱంతోపాటు అశ్వశాలలో పెట్టి సంరక్షణ చేస్తూ ఉండిరి.

"ఏమయ్యా చోడోదయా, ఉదయచోడ మహారాజుకు మనుమడవు. ఉదయచోడుడు రుద్రచక్రవర్తికి లోబడిన నాటినుండి, మీతండ్రి గోకర్ణ చోడుడు శ్రీ కాకతీయవంశానికి భక్తితో సేవచేస్తూ ఉంటే, నీకు ఈ దుర్బుద్ధి పుట్టిందేమి? నువ్వు పదివేలసైన్యంమాత్రం ఉంచుకో, తక్కిన సైన్యం మా దగ్గర ఉంటుంది. ఖర్చు నీవే భరించాలి. నీ గుఱ్ఱాలన్నీ మావి, నీ పట్టుసూత్రము, నీ అశ్వము మావి. నీకిష్టమైతే ఇవి ఒప్పుకొని మాకూ, చక్రవర్తికీ సామంతుడుగా ఉండు. లేదా, దేశాలు విడిచి కాశీయాత్ర చేసుకో" అని చెప్పెను.

చోడోదయుడు తలవాల్చుకున్నాడు. అతని హృదయంలో ప్రళయం నాట్యం చేస్తున్నది. ఈ గజదొంగ చేతిలో పాలువిరిగినట్లు తనవిధి విరిగిపోయినది. ఈతనికింత అదృష్టము ఎలాపట్టినది? ఈతడు ఇంతటి వీరుడవడమేమిటి? చోడోదయుని హృదయం దహించుకుపోతున్నది. పైకి నవ్వుమొహంతో,

చోడో: మహారాజా! నేను శ్రీరామునివంటి మహావీరునిచేతిలో ఓడిపోయాను.

గోన; చోడోదయరాజా! మీరు నన్ను భట్రాజులా పొగడనవసరంలేదు. మనం ఆంధ్ర క్షత్రియ వంశాల్లో ఉద్భవించాము. మనకు ధర్మము, అధర్మమూ అవసరంలేదు. రాబందుల్లా ఒకళ్ళనొకళ్ళం పీక్కుతింటాము:

చోడో: మహారాజులకు కోపంవద్దు. నేను చేసినతప్పు నేను గ్రహిస్తున్నాను. ఆంధ్రచోడులూ ఒకనాడు చక్రవర్తులు....

గోన: అంతకుముందు చాళుక్యులు, అంతకుముందు పల్లవులు, అంతకుముందు ఇక్ష్వాకులు.... వెళ్ళిపోయిన చక్రవర్తివంశంవారు, మళ్ళీ చక్రవర్తులవటం కాలధర్మం కాదుప్రభూ!

చోడో: అదే నేను మనవిచేసేది. కాని పొరపాటుపడి ప్రయత్నాలు చేయడంమానవస్వభావం, క్షంతవ్యుణ్ణి! తాము చక్రవర్తి కాదగిన మహానుభావులు.

గోన: కరటక దమనకులనీతి నేర్చుకుంటున్నారా?

చోడోదయుడు పెదవి కొరుక్కున్నాడు. కళ్ళల్లోమంటలు లేచాయి. వెంటనే చప్పబడ్డాయి.

గోన: చోడోదయప్రభూ! నేను గజదొంగను నా నీతి నాది. దానికి వీసం తప్పను. భగవత్స్వరూపిణి శ్రీ శ్రీ శ్రీ రుద్రమదేవి నాకు చక్రవర్తిని. అందుకు ఇంద్రుడు కాదన్నా అతన్ని హతమారుస్తాను. ఇకచాలు. విఠలప్రభూ! చోడోదయుని తురంగాలన్నీ మనవి. చోడోదయుని తురంగము మీది. ఆ తురంగసూత్రము మా అశ్వానికి తగిలించవలసిందిగా సూతునికి ఆజ్ఞ ఇవ్వండి. చోడోదయుని బందీగా వదలి ఆయన సైన్యాలు మన సైన్యంలో చేరేవి చేర్పించండి. తక్కిన

సైనికుల్ని పొమ్మనండి. కల్యాణి తాము ఆక్రమించి చోడోదయ ప్రభువునే రాజ్యం చేయనియ్యండి. ఆయనధనాగారంలో ఉన్న ధనం మనధనాగారంచేర్పించి; అందులో సగం ఈ నాడులోని ప్రజలకు పంచండి.

గోన గన్నారెడ్డి సింహాసనంమీదనుంచి లేచినాడు.

"జయ! చోడోదయ పట్టసూత్రతురంగాపహరణా! జయ! జయ! అని భటులు జ్వయధ్వానాలు చేసినారు.

గన్నారెడ్డి మహావేగంతో చోడోదయుని అశ్వసూత్రంచే అలంకరింపబడిన తన అశ్వము అధివసించి, అక్కినప్రగడకూడా రాగా స్కంధావారం దాటి ఎక్కడి కేని పోవసాగినాడు.

వా రట్లు ఒక గవ్యూతిదూరం పోగానే గోన గన్నారెడ్డి అశ్వవేగం తగ్గించి 'అక్కిన బావగారూ, ఇకపదండి, ఇంత ఆలస్యమైన తమ పునస్సంధాన మహోత్సవానికి, మీ తాతగారి మనస్సు తిరిగినదే చివరకు! మన రహస్యం తెలిసి తిరిగిందా, లేక ఆర్ద్రిత తాల్చిందా?' అన్నాడు.

"బావగారూ! ఆయన మనస్సే కరిగిందనుకొంటాను. మా బామ్మగారు కంటినీటితో, మాతాతగార్ని చూచి, 'మీరు బ్రాహ్మణు లనుకొన్నాను. పై స్వరూపం చూచి మోసపోవడం ఉంటుంది. కొన్ని మేఘాలు బాగావర్షిస్తాయి. అనుకుంటాము. అవి వృధాడంబర జీమూతాలని తెలియడం కష్టం' అన్నదట. ఆ రాత్రి మా తాతగారు భోజనం చేయలేదట. ఆ మరునాడు నిరశనవ్రతమేనట. ఆ మూడవ నాడు, వారితోపాటు నిరశనవ్రతం చేసే మా బామ్మదగ్గరకు మా తాతగారు వెళ్ళి 'అక్కిన ప్రస్తుతానికి మనం అందరం వెడుతున్నాము' అన్నారట."

## ౬

గోన గన్నారెడ్డి, అక్కినప్రగడ మొదలయినవారు అంతా, అక్కిన ప్రగడ అత్తవారి ఊరు ప్రోలేశ్వరము చేరిరి.

ఓరుగల్లునుంచి పెద్ద అక్కినప్రగడ, సోమయామాత్యులు, చుట్టాలు పక్కాలు అందరూ వేయిమంది మెరికలవంటి ఆంధ్రసైనికులతో వచ్చిరి.

వారికందరికీ చెన్నాప్రగడ మాచయమంత్రి తగిన విడుదులు ఏర్పాటుచేసి ఉంచినాడు. ఊరంతా పచ్చని తోరణాలతో, పందిళ్ళతో, అలంకారాలతో నిండి పోయింది. ఇరువంకలా చుట్టాలు వందలు వందలు వచ్చారు. ముఖ్యంగా ఆడవారు ఎక్కువమంది ఈ శుభకార్యానికి చేరారు. ఈ శుభకార్యం ఆడవాళ్ళకు పండుగ. ఆంధ్రు లీ ఉత్సవంలోనూ, పెళ్ళినాడూ పొందే ఆనందం ఇంతా అంతా కాదు. వారి వేళాకోళాలు, వేడుకలు; విందుభోజనాలు దేవతలకుకూడ ఒడళ్ళు మర

పిస్తవి. శుభముహూర్తకాలంలో ఉదయం భార్యాభర్తలను పీటలమీద కూర్చోపెట్టి దేవతాపూజ, అగ్నిహోత్రము చేయించారు. పెళ్ళికొడుకు ప్రద్యుమ్నుడులా, పెళ్ళికూమార్తె కామేశ్వరి, రతీదేవిలా ఉన్నారు. ఉద్దండ పండితుడైన అక్కిన ప్రగడ పునస్సంధాన మహోత్సవానికి పేరుగన్న పండితులందరూ వచ్చారు. ఆంధ్రపండితులు జగత్ప్రసిద్ధులు, నిష్ఠాగరిష్ఠులు, ఆంధ్రవైదికపాఠము జగత్ప్రసిద్ధము. కాశిలో, నవద్వీపంలో, బృందాలో, కంచిలో, ఢిల్లీలో, ఉజ్జయినిలో, ద్వారకలో, హరిద్వారంలో ఆంధ్రపండితుల కున్న గౌరవము అప్రతిమానము.

కవిసార్వభౌముడు, శబ్దవిద్యావిశారదుడు, యజుర్వేద పారగుడు ఈశ్వర భట్టోపాధ్యాయులు సభకు అధ్యక్షుడైనాడు. విద్యావాచస్పతి, త్రయీపాఠి, సోమనాథభట్టోపాధ్యాయులు, హరితసగోత్రుడు, వ్యాకరణ బృహస్పతి, బొమ్మనభట్టోపాధ్యాయులు, సకలశాస్త్రపారంగతుడు సూరదేవలుంగారును, గౌతమగోత్రులు షట్ఛాస్త్ర పారగులు దేవనభట్టోపాధ్యాయులు మొదలైన ఉద్దండపండితులు విచ్చేసిరి. శివాచార్యులు ఆరాధ్యదేశికులు విచ్చేసినారు.

శుభముహూర్తానికి వధూవరులు పీటలపై అధివసించినారు. కామేశ్వరి అప్పుడే పాలసముద్రస్థ అయిన లక్ష్మిలా ఉన్నది. అక్కినప్రగడ లక్ష్మినిచేబట్టిన నారాయణుడే!

ఆడవారు వైకుంఠంలా అలంకరించిన శయనమందిరంలో చేసిన వేడుకలు, ఆనందమహావీచికలే!

అందరూ వెళ్ళిపోయి తలుపులు వేసినారు. వధూవరుల తలుపులు విప్పారినవి. అక్కిన తన భార్యను హృదయానికి అదుముకొని 'కామేశ్వరీ! ఈ గజదొంగను ఇప్పటికైనా క్షమించావా?' అని అస్పష్టవాక్యాలతో అడిగినాడు.

"మీరే నన్ను క్షమించాలి" కామేశ్వరి భర్తమోము లేత తమలపాకుల వంటి తన చేతులతో అదిమిపట్టి తన దెసకు తిప్పుకొని అన్నది.

"ఎందుకు?"

"మీకు అడ్డం రాబోయినాను."

"నేను గజదొంగను అనుకొని, నన్ను శంకించినానంటావు?"

"అందుకు శిక్షవిధించండి."

"రా, ఈ బాహువుల్లో నీకు ముందర బంధనము విధిస్తున్నాను! ఈ శిక్ష చాలునా?"

"ఇంతేనా మీ ధర్మశాస్త్రపారీణత?"

"ఏమిలోటు వచ్చింది?"

"నాకు మీరు చేసిన అపరాధానికి?"

"అదేమి చెప్మా !!
"నన్ను వదలిపెట్టి అంతకాలం ఉండడం ?"
"పెళ్లయినప్పటినుంచే వెంటపెట్టుకొని తిరగమన్నావా ?"
"ఎదురుప్రశ్న ప్రత్యుత్తరం కాదు ?"
"తర్కపండితురాలవుకూడా !"
"మీ అర్ధదేహాన్ని కాదూ !"
"మరి నాకు శిక్ష ?"
"నా హస్తాలలో బంధనము ఒకటి !"
"నీ హస్తాలు వల్లీలతలు ! రెండవశిక్ష ?"
"రెండా ? ఆరుశిక్షలకు మీ రర్హులు !"
"అమ్మయ్యో ! ఏ సూత్రం ? ఏ ధర్మశాస్త్రం ?"
"వాత్స్యాయనం."
"అమ్మదొంగా"
"మీరు గజదొంగలు, మీ ఇల్లాలిని నేనూ దొంగనే: మళ్ళీ దొంగా అంటారేమిటి !"
"నేను ఓడిపోయాను కామేశ్వరీ !"

కామేశ్వరి ప్రేమతో ఉప్పొంగిపోయింది. ఆమెకు తన భర్త తక్క మరో ప్రపంచమే లేదు. ఆ భర్త తనకు సన్నిహితుడై, విధేయుడైనప్పుడు, ఆమె ఆనందం మేరమీరినది.

ఆమె వెంటనే వంగి భర్తపాదాలంటి కళ్ళ కద్దుకొని 'మీ పాదాలు సర్వ సౌందర్యనిధులు! వానిని పూజించి ఆత్మలో ధరించడానికి నేను తగను అని కన్నుల ఆనందబాష్పాలు రాల్చినది. ఆమెకు ఒడిలో కూర్చుండబెట్టుకొని అక్కన గాఢంగా హృదయాని కదుముకొన్నాడు.

## ౭

మూడుదినాలు, ఉత్సవాలు అఖండంగా జరిగాయి. నాల్గవదినాన మగపెళ్ళి వారు ఓరుగల్లు ప్రయాణం. అక్కన ఓరుగల్లు వెళ్ళడమా, వెళ్ళకపోవడమా ? అక్కనకు వెళ్ళడము ఇష్టంలేదు. వెళ్ళవలసిన ధర్మం. వెళ్ళితే అక్కనను బంది చేసి రుద్రచక్రవర్తి శిక్షిస్తుందా అనే ప్రశ్న సోమయామాత్యుల హృదయంలో ఆవేదన కలుగజేసింది. ఆయనకు తోచక కాలుగాలిన పిల్లిలా అయిపోయాడు.

పెద అక్కనప్రగడ రాతివిగ్రహంలా బిర్రబిగుసుకొని ఉన్నాడు. మాట లాడడు. ఆయన ఎదుటికి వెళ్ళడమంటేనే అందరికీ భయం.

గోన గన్నారెడ్డి చిన అక్కనప్రగడ పిలిచి 'బావగారూ, నువ్వు నా చెల్లెలి ఆలోచనను అనుసరించు నేనువెడుతున్నాను. కృష్ణవేణి నన్నుపిలుస్తున్నది.

ఏదో రహస్యము నాతో చెప్పదలచుకున్నది. నువ్వుమాత్రం తొందరపడి రాకు. అవసరమైతే నేనే వార్త పంపుతాను" అని అక్కినతో చెప్పి, మాచనమంత్రివద్ద సెలవుతీసుకొని పెదఅక్కినప్రగడ కడకు వెళ్ళినాడు.

గోన ; తాతగారూ ! నమస్కారాలు, నేను సెలవుతీసుకొని వెళ్ళవస్తాను.

పెదఅక్కిన మంత్రి : దొంగవాళ్ళకూ, మాకూ ఏమీ సంబంధంలేదు. అవసరంలేదు, వారు మాదగ్గర సెలవుంతీసుకొనే, మేము ఇవ్వవలసిన అవసరంలేదు.

గోన : అక్కినమంత్రిగారూ ! మీ కోపము మా కాశీర్వాదము. త్వరలోనే దర్శనము వాంఛిస్తాను.

పెద : నేను మీ మంత్రి చినఅక్కినప్రగడను, నాపేరు పాడుచేయడానికి పుట్టినవాణ్ణి. మా వంశానికి అపఖ్యాతి తెచ్చేందుకు పెరిగినవాణ్ణి, ఇప్పుడే బందీ చేసి ఓరుగల్లు తీసుకొని వెడుతున్నాను.

గోన : తాతగారూ, బందీచేసి తీసుకొని వెళ్ళగలరా?

పెద : నేను ప్రసాదాదిత్యప్రభువునడిగి వేయిమంది వీరుల్ని తీసుకొని వచ్చాను.

గోన : ఈ గ్రామంచుట్టూ నా సైన్యాలు పదివేలు సిద్ధంగా ఉన్నాయి.

పెద : మిమ్మూ చక్రవర్తి పేరుచెప్పి బందీచేస్తున్నాను.

గోన : (పకపక నవ్వుతూ) తాతగారూ ! మీ ధర్మబుద్ధి ప్రశంసనీయం. కాని మమ్మ బందీచేయగలవా రొక్కరే ఉన్నారు. చక్రవర్తే స్వయంగా నిన్ను బందీచేశానంటే లోబడగలను. లేకపోతే హరిహర బ్రహ్మలు అడ్డంవచ్చినా గోనగన్నారెడ్డి పీల్చివదలే గాలినైనా స్పృశించలేరు.

పెద : అంత విఱ్ఱవీగటం ఎవరికీ తగదు.

గోన ; తాతగారూ ! మీ మాటలు నాకు నవ్వుకలుగజేస్తున్నవి. మీఅక్కిన మీతో వస్తాడు. అక్కడ మూడునా ళ్ళుంటాడు. ఆ తర్వాత శ్రీశ్రీ రుద్రదేవ స్వారభౌములు స్వయంగా ఆజ్ఞఇస్తే తప్ప ఏశక్తీ అతన్ని అక్కడ ఆపలేదు. సెలవు.

గోన గన్నారెడ్డి నవ్వుతూనే నెమ్మదిగా నడిచి, సింహద్వారంకడకువెళ్ళి, అక్కడ తనకై నూతుడు సిద్ధంగా ఉంచిన ఉత్తమాశ్వం ఎక్కి వెళ్ళిపోయినాడు. పెదఅక్కినప్రగడ మరుమాటలేక నిలిచిపోయెను.

అక్కినను బందీగా తీసుకొని వెళుతున్నారు అన్న ప్రతీతి ఆ గ్రామం అంతా పాకింది. కామేశ్వరి భర్తను కలుసుకున్నది.

కామే : మీరు ఓరుగల్లుకు బందీగా వెడుతున్నారటకాదా ?

అక్కి : అవును నారాణీ !

కామే : మీరు బందీగా వెడితే ఇంక నాకు రాణివాసం ఎట్లా ?

అక్కి : రాజ్యంవదలి రాజు పోతే రాజ్యం పాలించేది ఆయన తరఫున రాణియేకదా !

కామే : మీరు పాలించేరాజ్యం ?

అక్కి : మన్మథ సామ్రాజ్యం !

కామే : (ఒళ్ళుఝుల్లుమనగా) వేళాకోళం కాదండీ ! మీరు బందీగా ఏకారాగారంలోనో పడితే, ఆ వెంటనే....

అక్కిన : అగు ! చటుక్కున మాటలనకు, హృదయేశ్వరీ ! పండితురాలవు. మాటలకున్న విలువ, శక్తి చేతలకు లేదు దేవీ ! నన్ను ఎవ్వరూ కారాగారంలో పెట్టలేరు. పెట్టదలచుకొన్నది తాతయ్యగారు. ఓరుగల్లు వెళ్ళగానే నన్ను చెఱసాలలో పెట్టాలని ఆయన ప్రయత్నం చేయవచ్చు. ఆ వెంటనే నేను మాయమౌతాను. నీకు వార్త పంపుతాను. నువ్వు వెంటనే నేను ఉపదేశించిన విధాన వచ్చి నన్ను కలుసుకో.

కామేశ్వరి ఇటుజూచి, అటుజూచి, భర్తమెడ కాగిలించుకొని, నవ్వుతూ కన్నులనీరు తిరుగగా 'నా ఆత్మేశ్వరులైన మీతో ఒక్క మనవి. మిమ్ము విడిచి బ్రతుకలేను. మీ కోసం నా తపస్సు, తెలుసునా !' అన్నది. అక్కిన భార్యను బిగియార కౌగిలించి గాఢచుంబనము వరము పొందినాడు.

ఇంతలో సీత పరుగు పరుగున అక్కడకువచ్చి 'అక్కా ! దొంగబావను ఒక్క నిమేషమూ వదలదలచుకొనలేదు చే ! నేను బావను విడిపిస్తానని భయమా?' అన్నది. 'నువ్వు వెళ్ళు, నీకు క్రొత్తచీరలు ఇస్తారట. బావను నేను కనిపెట్టి ఉంటాను. నన్ను చేసుకుంటేనా, బావను మూడుచెరువుల నీళ్లు తాగిద్దును. నువ్వు వట్టి దద్దమ్మవు. నీ లోకువచూచి బావ కోడిపుంజులా కూస్తున్నాడు' అంటూ విరగబడి నవ్వింది.

అక్కిన : అమ్మో ! నిన్ను నేను పెళ్ళిచేసుకుంటేనా ! నా తలంతా బొప్పెలుకట్టి ఉండును. నేను దినానికి వేయి చీపురుకట్టలు, పదివేలు బిందెలు, అయిదువేల కుంచాలు కొనవలసి ఉండును. భోజనం అతిరుచిగా నువ్వు వండడం వల్ల పూర్తిగా మానివేసి ఉపవాసం చేయవలసి ఉండును.

సీత : అదిగో మాఅక్క పారిపోతోంది ! ఇకరా ! నీపని కనుక్కుంటాను. ఇవాళ మళ్ళీ నీకు తలంటులే !

అక్కిన తన మరదలిని చేరదీసి 'దొరికావా దొంగా ! నీకుకావలసిన భర్త ఏ కుంభకర్ణుడో.'

సీత : లేకపోతే నీబోటి ఏ వృశ్చికరోముడో.

అక్కిన : హరహరా ! ఆడపిల్లకు ఓడిపోయానురా దైవమా.

చిన్నమరదల అంతటిలో 'బావా బావా ! పన్నీరూ, బావను పట్టుకు తన్నేడు' అంటూ అచటికి వచ్చినది.

౮

కృష్ణవేణానది నీలమణిహారంలా కొండలమధ్య ప్రవహించి వెడుతున్నది. పూర్వం కన్నబెన్న అనే ఈ మహానది ఆంధ్రదేశానికి మొలనూలు. గోదావరి కంఠహారము. తెలివాహ శిరోహర లంబకము. వేణా (పెన్న) నదులు రెండూ మంజీరాలు.

గన్నారెడ్డి కృష్ణానదిలో స్నానంచేసి, పొడిబట్టలు కట్టుకొని, తడిబట్టలు సేవకుని చేతికిచ్చి కృష్ణానది అందం గమనిస్తూ ఒక రాతిమీద ఆసీనుడైనాడు. కృష్ణానది అందకత్తె. శ్రీకృష్ణునిపేరు ఆమె తండ్రి పెట్టినాడు. ఆ నందబాలుని పేరు కలిగినది సుందరి కాకుండునా? ఈ దివ్యసుందరిపై తనకింత ప్రేమఏమి? శ్రీకృష్ణభగవానునకు యమున రాధాదేవితోపాటు ప్రియురాలు. తనకు క్రష్ణ ప్రియురాలు. ఈ నదీమతల్లి కోట్లసంవత్సరాలనుంచీ ఏమేమి చరిత్రలు కన్నులారా కన్నదో! ఎందరిప్రాణాలు తనలో లయం చేసుకొన్నదో! ఎందరి ప్రేమలు చూఱగొన్నదో?

వెనుక గంగానది శంతనుని ప్రేమించి బాలికగావచ్చింది. అతన్ని వివాహమై బిడ్డలను కన్నది. కావేరి అగస్త్యుని ప్రేమించింది. నర్మద పురుకుత్సుని ప్రేమించింది. సంవరణుని తపతి ప్రేమించినది. అలాగే కృష్ణ మనుజ బాలికా రూపము తాల్చి తన్నేల ప్రేమింపగూడదు? తన హృదయంలో ప్రేమ ఉన్నదా? ఇందరి ప్రాణాలు తీసిన ఈ కఱకు చేతులు, వారి ప్రాణాలు కాంక్షించిన తన కఱకు హృదయం ప్రేమరహస్యాలు ఎలా తెలుసుకోగలవు?

తన కీనాడు ప్రేమవిషయం ఆలోచనాపథానికి వచ్చిందేమి? అవల తన ప్రాణస్నేహితుడు అక్కిన దివ్యప్రణయంలో ఓలలాడిన ఉత్సవాలనుండి రావడం వల్ల తనకూ ఈ ఆలోచనలు ఉద్భవించాయి. తాను ప్రేమకు తగడు. ప్రేమ అమృతము. తాను కాలకూట విషము. ఎంతోమందినో తాను దహించివేశాడు. వాళ్ళు దుష్టులని తాను అనుకొన్నాడు. దుష్టత్వ శిష్టత్వములు సాపేక్షకాలు, ఈ ద్వంద్వాలనుగూర్చి నిర్ణయించడానికి తానెవరు? అయినా తా నెవ్వరిమీద దండువిడిసినా ఏదో ఒక అలౌకికశక్తి ప్రేరణచేతనే అనుకొన్నాడు.

కృష్ణవేణి తన్ను ప్రేమించగలదా? ఆమెను తన హృదయానికి అదుము కొని స్నాన మాచరించే సమయంలో తనకు కర్తవ్యము గోచరించింది. ఈ నదీ సుందరి కోలమోముతో, ఆకాశ నీలాల కన్నులతో, ఉదయ సంధ్యారుణాధరోష్ఠంతో దివ్యసుభగ శరీరముతో బాలికయై ప్రత్యక్షం అవుతుందికాబోలు!

"ఓ స్వామీ! మీపేరు ఎవరండీ" అన్న ఒక బాలికాకంఠము అతనికి వినబడింది. గన్నారెడ్డి ఉలికిపడి వెనుకకు చూడ పదియారు, పదునేడు సంవత్స

రాల ఈడుగల ఒక బాలుడు, కవచ శిరస్త్రాణాదులు ధరించి నడుమున కరవాలముతో వీపున డాలుతో గుఱ్ఱాన్ని నడుపుకొంటూ ఆ రాళ్ళలో నెమ్మదిగా దారి చూచుకుంటూ వస్తున్నాడు. అతని వెనుక ఇంకొక్క యువకుడు ఇరవై ఏళ్ళ ఈడుగలవాడు అంగరక్షకుడు కాబోలు తనగుఱ్ఱాన్ని నడిపించుకొంటూ వస్తున్నాడు.

గోన : ఎవరు కావాలి మీకు ?

బాలుడు : నాకు శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువర్యుల దర్శనం కావాలి. చూస్తే బాలుడు, గొంతు బాలికాకంఠం। అలాంటి బాలకులను గన్నారెడ్డి ఎరుగును. యవ్వనము వచ్చేముందు చాలమంది బాలురకు స్త్రీ కంఠమే ఉంటుంది.

గోన : ఏమిపని వారితో ?

బాలు : నేను వారి కొలువులో చేరడానికి వచ్చాను.

గోన : వారికి రాజ్యంలేదే.

బాలు ; స్వామీ । మీరుకూడా వారి సైన్యంలో ఉన్న వారిలా కనబడుతున్నారు. వారి రహస్యనగరానికి దారిచెప్పండి.

గోన ; ఓయి వెఱ్ఱివాడా । నా మొగముచూస్తే నేను గన్నారెడ్డి ఱట్టులో వాడనని తోచిందా ? లేక నీకు తెలిసే మాట్లాడుతున్నావా ?

బాలు : స్వామీ । ఈ చుట్టుప్రక్కల నెక్కడనో వారికోట ఉందని వినికి. వారి సైన్యంలో చేరాలని ఎన్నాళ్ళనుండో నాకు కోరిక. ఇంటిదగ్గర చెప్పకుండా పారిపోయి వచ్చాను.

గోన ; నీవు ఇంత చిన్నతనంలో వస్తే, ఆయన నీ తల్లిదండ్రుల అనుమతి లేనిదే సైన్యంలో చేర్చుకోడే.

బాలు । వారికి ఎవరు అనుమతి ఇచ్చారు ? వారిలోచేరిన యువకవీరులందరికీ వారి తలిదండ్రులు అనుమతి ఇచ్చారా ?

గోన : బాగుందయ్యా । నీ పేరు ?

బాలు : నా పేరెందుకు స్వామీ ?

గోన : మరి మా సేనలో చేరేవారి పేరు మా కక్కరలేదా ?

బాలు ; అలాగే ? నా పేరు విశాలరెడ్డి.

గోన : మీ ఇంటి పేరు ?

బాలు ; మా యింటిపేరు అనుమకొండవారు.

గోన : ఆ ఆబ్బాయి ?

బాలు : ఆ అబ్బాయి నా మంత్రి.

గోన ; నీకు మూక్కుపచ్చలన్నా ఆరలేదు. నువ్వు గన్నారెడ్డి సైన్యంలో ఏం చేయగలవయ్యా రెడ్డివర్యా ?

బాలు : అలాగే ? అదిగో కృష్ణ ఆవలిఒడ్డున ఆ చెట్టు చూచారా ? మామిడి చెట్టు, ఆ చెట్టుక్రింద క్రొమ్మకు క్రిందుగా వేలాడే మామిడిపండు చూచారా ? ఆ పండు పడకుండా, ఈ బాణం దానికి గుచ్చుకుంటుంది. చూడండి, అనుచు ఆ బాలుడు చెలికాడందిచ్చిన ధనుస్సు అంబులపొది అందుకొని, ఆ పొది తగిలించుకొని వక్షానికి బిగించుకొని, ధనుస్సు ఎక్కుపెట్టి, బాణంతీసి గురిచూచి వదిలాడు. రివ్వున ఆ బాణంపోయి, ఆ మామిడికాయకు తగుల్కొన్నది.

గోన గన్నారెడ్డి 'ఓహో' అన్నాడు. వెంటనే ఆ బాలకుడు చెలికాడందిచ్చిన మామిడికాయ నొకదానిని పైకెగురవేసి కత్తి ఝళిపించి పైనుండి క్రిందికి తిప్పినాడు. ఆ లేత మామిడికాయ రెండు సమానపు చెక్కలై క్రిందకు పడింది.

"ఇప్పుడైనా నన్ను చేర్చుకోరా మీ ప్రభువు?" అని బాలుడు ఎక్కువ ఆతురతగా అడిగాడు.

గోన : బాగుందయ్యా ! నేను మాట ఇస్తానుగాని కన్నులకు గంతలు కట్టి తీసుకుపోతాను.

బాలు ; మంచిది.

గోన గన్నారెడ్డి గొంతుఎత్తి 'ఓహోహో' అని అరచెను. పదిమంది మనుష్యులు అక్కడకు పరుగునవచ్చారు. వారందరు గన్నారెడ్డికి నమస్కరించారు.

గోన : చిన్న పుట్టితియ్యండి, నేనేస్వయంగా నడుపుకొని వీరిని తీసుకువెడతాను.

'చిత్త' మని అందులో ఒకవీరుడు నీటికడఉన్న రాళ్ళలో ఒకరాళ్ళ గుంపు కడ వంగి తీగలుతీసి, ఒక చిన్న పుట్టిని ఈవలకు లాగినాడు. అందులో గనారెడ్డి, ఆ బాలుడూ, అతని మంత్రి అధివసించినారు. గన్నారెడ్డి ఆబాలు డందిచ్చిన రుమాలును అతనికళ్ళకు, చెలికా డందిచ్చిన రుమాలును చెలికాని కళ్ళకు కట్టి బిగించి పుట్టి నడుపుకొంటూ నదిలోకి పోయినాడు.

౯

ఆ యువకప్రభువు కండ్లకు గంతలు కట్టుచున్నపుడు గన్నారెడ్డికి ఒళ్ళు ఝల్లుమన్నది. ఆ బాలునిమోము ఎక్కడో చూచినట్లున్నది. మీసాలులేవు. శిరస్త్రాణం నుదుటి నంటి ఉండడంచేత పోలిక అంతుపట్టడానికి వీలులేకుండా ఉంది.

"ఓ బాలప్రభూ ! మీ రాజ్యం ఎక్కడ ?"

"మారాజ్యమా? మాది చోడమహారాజ్యపు సరిహద్దున, ఒక చిన్న రాజ్యం. మాది చక్రకోట్య దేశంలోనిది; నేను ధారావర్షులకు దూరపు చుట్టమైన రాజకుమారుణ్ణి."

"అంతదూరమునుంచి మా సైన్యములో చేరడానికి వచ్చారా?"

"చిత్తం స్వామీ! మీ నాయకుని పక్కనఉండి యుద్ధం చేయాలని కోర్కె. ఇంటికడ ఒక లేఖ వ్రాసిపెట్టి బయలుదేరివచ్చాను."

"ముట్టుకుంటే కందిపోయే రీతిగా ఉంది మీ దేహం!"

"ఇది రెండవసారి తాము అముక్క అనడం. ఇప్పుడేకదా నాబలం కళ్ళారా చూచారు. మన శిబిరానికి వెళ్ళినతరువాత నా బలం మీకు చూపిస్తాను."

"మంచిది."

"తమ పేరు ఎవరో?"

"నా పేరు ఎవ్వరూ ఉచ్చరించరానిది!"

"అదేమిటి 'అట్లాంటారు?"

"నేను చేసిన పాపాలు అనంతం. నేను హీనుణ్ణి. మా ప్రభువే హీనుడు...."

"స్వామీ, మీరు గన్నారెడ్డి మహారాజునే అంటూ ఉన్నట్లయితే, ఆ మాటలు రానీయకండి."

"అదేమిటి రాజకుమారా?"

"నాకు శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువంటే భగవంతుని అవతారమని ఊహ. నా భగవంతుని నా ఎదుట ఎవ్వరూ తూలనాడటానికి వీలులేదు."

"కాలుదువ్వి కజ్జా తెచ్చుకుంటావేమయ్యా ప్రభూ."

"నేనా కాలుదువ్వుతా? ధర్మమైనదీ, నా హృదయానికి అతి సన్నిహితమైనదీ ఒక విషయం మనవిచేశాను. ద్వంద్వయుద్ధంవలన మనలోని అమరజ్యోతికి కళంకం రాదు, వెూగమూరదు. కాబట్టి సంతోషంగా మీతో సమస్త ఆయుధాలతో ద్వంద్వయుద్ధము చేస్తాను."

"నావల్ల మీరు ఒక వేళ ఓడిపోతే?"

బాలుడు: స్వామీ! అలా ఓడిపోతే, మీవంటి ఉత్తమ వీరునివల్ల ఓడిపోయి నందుకు, నాకు కించలేదు. మీవల్ల విద్య నేర్చుకున్నట్లవుతుంది.

గోన: నేను ఉత్తమ వీరుణ్ణని ఎలా తెలిసిందయ్యా?

బాలుడు: మామిడిపండును చూచి, ఇది మామిడిపండు అని తెలుసుకోవడం కష్టమా!

గోన: నేను మీవల్ల ఓడిపోతే?

బాలుడు: (పక పక నవ్వుతూ) నావల్ల.... మీరా ఓడేది? ఓహో!

ఆ బాలుని నవ్వు అతని హృదయాన్ని కలవరపరచినది. అది నవ్వా, గాంధర్వమా? కోయిలలు కువకువ కూసినవా? లేక బంగారుమువ్వలు మ్రోగినవా? కిన్నెరతంత్రులు మీటినారా? వేణుస్వనాలు వినవయినవా? గన్నారెడ్డి ఆ బాలుని మోము తేరిపారజూచినాడు.

పుట్టిని ఒడ్డుకుబట్టి గోన గన్నారెడ్డి రెండుసార్లు కోకిలలా, 'కూ! కూ! కో! కో!' అని కూసినాడు. మళ్ళీ రెండుసార్లు కోకిలకూత వినబడింది. ఆ వెంటనే నలుగురు భటు లక్కడికి వచ్చిరి.

వెంటనే గన్నారెడ్డి ఒడ్డుకు ఉరికి, వీరిద్దరినీ చేతులందించి ఒడ్డుకు దింపి, తాను బాలునీ, వచ్చిన వీరులలో ఒకరు బాలుని అనుచరునీ పట్టుకొని నడిపించి కొనిపోవ నారంభించినారు.

అడుగడుగుకు ఆ అడవిలో, గుట్టలలో, రాళ్ళలో, చిన్న లోయలలో, కోకిల కూతలు రెండుసార్లు చొప్పున విన బడుతూనే ఉన్నాయి.

ఎప్పటికప్పుడు వారు నడిచే దారి అంతమైనట్లే కనిపిస్తుంది. మరల ఒక రాయి తిరిగితే, ఒక పొద మళ్ళితే, ఒక లోయ దాటితే, మరో క్రొత్తదారి.

అలా నడిచి నడిచి, జామున్నర ప్రొద్దు ఎక్కేసరికి, వారు కొండ శిఖరం చేరారు. అక్కడనుండి, వారు ఆ కొండ శిఖరమునుండి ఒత్తయిన చెట్లలో, గుట్టలలో, రాళ్ళలో ప్రయాణం చేశారు. ఇంతలో ఒక చెట్లగుంపు దాటగానే ఎట్టఎదుట ఒక మహానగరం ప్రత్యక్షం అయింది. గోన గన్నారెడ్డి అక్కడ వారి గంతలు విప్పాడు.

ఆ బాలుడూ, అతని స్నేహితుడూ కళ్ళు చిట్లించుకొంటూ ఆశ్చర్యముతో ఆ నగరం చూచారు. కొంతకాలంవరకూ వారి చూపులు నల్లపడి, పచ్చపడి చివరకు స్పష్టత తాల్చాయి. ఆ నగరం అందం, ఆ నగరం కోటగోడలు, ద్వారాలు, కందకము వారు చూచారు. చుట్టూఉన్న ఎత్తయిన కొండలూ, ఆ కొండలు నిండి ఉన్న అడవులు చూచారు.

గన్నారెడ్డితో వచ్చిన వీరుడు వీపున తగిలించిన కొమ్ము నొత్తగానే ఆ కోట ద్వారం తలుపులు విడి కందకంమీద వంతెన వాలింది. వారంద రావంతెన దాటి నగరంలోకి పోయినారు.

వారందరు అశ్వారూఢులై నగరంమధ్యనున్న కోటగోడలదగ్గరకు చేరిరి. రథికులు, అశ్వికులు, పదాతులు, వర్తకులు, సేవకులు—ఎదురైనవారందరు తన్ను తీసుకొనివచ్చిన వీరునకు నమస్కారం జేయడం చూచి, ఆబాలుని ఆనందం వర్ణనాతీతమైనది.

కోటలోనికిపోయి మహారాజభవనప్రాంగణంకడ వారందరు అశ్వాలను అవరోహించి, అక్కడ ఉన్న భటులు గుర్రాలను స్వాధీనంచేసుకోగా, సభామందిరం ప్రవేశించారు. వెంటనే అక్కడ వివిధాసనాల అధివసించిన యువక వీరు

లందరూ లేచి నిలుచుండి 'జయ జయ। గోనవంశకలశాంబుధిరాకాచంద్రా।' అన్నారు. వందిమాగధులు 'సమస్తగుణగణాకర జయ జయ। సత్యజ రత్నాకర, జయ। సౌజన్యగంభీర, జయ। అరిగండభైరవ, జయ। సాహసోత్తుంగ జయ। వీరవితరణోత్సాహ, జయ। కదుపులూరిపురాధీశ్వర, జయ। వీరలక్ష్మీ నిజేశ్వర, జయ। మనుమకులమార్తాండ, జయ। మీసరగండ, జయ। కామినీజయంత, జయ। కోసగిమైలి తలగొండుగండ, జయ। ఉప్పలసోముని తలగొండుగండ, జయ। వందిభూపాలుని తలగొండుగండ, జయ। అక్కినాయకుని తలగొండుగండ, జయ। మేడిపల్లి కాచనాయ కురిశరనుండ, జయ। కందూరి కేశి నాయకుని తలగొండుగండ, జయ। తెఱాల కాటయశాపట్ట, జయ। బేడవెలుకినాయని నిస్సాణాపహరణ, జయ। సహజశౌర్యాభరణ, జయ। కోట పేర్మాడిరాయ కంఠాభరణ చూరకార, జయ। చోడోదయ పట్టసూత్రతురంగాపహార, జయ। జయ।, అని దిక్కులు మారుమ్రోగ పలికినారు.

ఆ బాలుని చేయి పట్టుకొని గోన గన్నారెడ్డి సింహాసనమెక్కి ఆబాలుని తనప్రక్క కూరుచుండబెట్టుకున్నాడు.

౧౦

ఆ బాలకుని తనప్రక్క అర్ధసింహాసనమిచ్చి గౌరవించుట గన్నారెడ్డికే ఆశ్చర్యంవేసింది. తమ నాయకుడు కారణం లేక ఏపనీ చేయడని తక్కిన వీర ప్రభువులందరు అనుకొన్నారు.

ఆ నిండు సభలో గోన గన్నారెడ్డి అక్కినప్రగడ లేకపోవడంవల్ల చెప్పవలసిన విషయము సబ్బప్రభువే చెప్పవలెనని ఆయనవైపుచూచి తల ఊపినాడు. వెంటనే సబ్బనాయకుడు లేచి సింహాసనముందు వచ్చి నిలుచుండి, 'ఆంధ్ర క్షత్రియోత్తములైన మీ కందరకూ మన సేనాపతి, నాయకులు అయిన గోన గన్నారెడ్డి ప్రభువు పక్షాన జయము పలుకుతున్నాను. మీలో యువక ప్రభువులు, యువరాజులు, రాజకుమారులు ఉన్నారు. గన్నారెడ్డి ప్రభువుతోపాటు ఏలాంటి వీరవిక్రమకార్యాలకన్నా వెనుదీయకుండా అనేక విజయాలు సముపార్జించారు. ఇప్పుడు మనకు తెలిసిన వేగువల్ల చోళమహారాజుకు శ్రీ ఆంధ్రదేశంపై కన్నెత్తి చూచేటంత సాహసం వచ్చింది. వినండి. పూర్వకాలంలో మన రుద్రచక్రవర్తి పెదతాతగారు శ్రీశ్రీ రుద్రదేవ చక్రవర్తి రాజ్యంచేస్తూ ఉండిరి. వారు శౌణరాజైన జైత్రపాలు యాదవునితో యుద్ధానికి వెడుతూ శ్రీ రుద్రచక్రవర్తి తాతగారైన శ్రీ మహాదేవ రాజును చక్రవర్తిగా నిలిపి తాము వెళ్ళినారు. ఆ సమయంలో చోళులు కృష్ణాతీరం వరకువచ్చి, వారిరాజ్యం అల్లకల్లోలం చేశారు. రుద్రచక్రవర్తి శౌణరాజుతో

యుద్ధంచేస్తూ మూడు సంవత్సరాలు ఉండినారు. మహాదేవ చక్రవర్తిపై చోళుల ప్రేరేపణవల్ల అనేకమంది సామంతులు తిరగబడినారు. ఆ యుద్ధాలలో మహాదేవ రాజు వీరస్వర్గ మలంకరించారు. ఇంతలో శ్రీ రుద్రదేవ చక్రవర్తి శౌణరాజును ఓడించి తిరిగి అనుమకొండవచ్చి, సింహాసనం ఆక్రమించి చోళులతోయుద్ధంచేస్తూ మరణం పొందారు. చోళులవల్ల కారాగారంలో పెట్టబడిన శ్రీ శ్రీ గణపతిదేవ చక్రవర్తిని విడిపించి శ్రీ రేచెర్లరుద్రప్రభువు అనేక సామంతులతోకూడి చోళుల ఓడించి బాలులైన మన సప్తమ చక్రవర్తిని సింహాసనంమీద కూర్చుండబెట్టినారు.

"ఈలా మనకు చోళులు ఎన్నోసారులు అవమానం చేశారు. ఇదంతా ఆలోచించి శ్రీశ్రీ గణపతిదేవ చక్రవర్తులు శౌణయాదవులను నాశనంచేసి ఈ మహదాంధ్రదేశం యావత్తూ తమ ఏకచ్ఛత్రం క్రిందకు తీసుకువచ్చి చల్లనిపరిపాలనము నెలకొల్పారు. కాని చోళుల రాజ్యకాంక్షపోలేదు దక్షిణాన పాండ్యులు విజృంభించి చోళరాజ్యం ఆక్రమిస్తూ ఉండడంవల్ల చోళులు మన రాజ్యంమీదకు రావడం ప్రారంభించారు. తెలుగుచోడులందరు ఇదివరకు చక్రవర్తికి దాసోహమ్మని సామంతులయ్యారు. ఇంక మిగిలింది కాంచీ మహాపుర రాజ్యం. కాంచీపురంలో అదివరకు చాళుక్య మహారాజైన కులోత్తుంగుని వంశమువారు కాంచీపురం రాజధానిగా ఆంధ్రదేశానికి చక్రవర్తులుగా ఉండేవారు.

"అలా ఉంటూఉంటే పాండ్యులు విజృభించి కాంచీపురంమీదకు దండెత్తి వచ్చారు. తెలుగుచోడులు మన సప్తమ చక్రవర్తి సహాయం అపేక్షించారు. వారు వెళ్ళి పాండ్యులను ఓడించి, తరిమి, కాంచీపుర చోడులను తనకు సామంతులను చేసుకొని, అరవ చోడదేశంపై దండెత్తిపోయి ఇన్నాళ్ళనుంచీ వారు తమ దేశానికి చేసిన అపకారాలన్నిటికీ బుద్ధి వచ్చేటట్లు చావగొట్టారు. కంచిలో తమ పక్షాన సామంతభోజునీ, సింధ మార్జవాడులలో తమ పక్షాన గంగయ సాహిణి మహారాజును ఉంచారు.

"వీరనాయకులు మీరందరూ ఇప్పుడే జాగ్రత్తగా వినండి. తెలుగు చోడ సామంతులు తమలో తాము కలహాలలోపడి చక్రవర్తి గారి సహాయం కోరేబదులు దక్షిణాన పాండ్యులను, చోడులనూ సహాయం కోరినారు. అప్పుడు దక్షిణాంధ్ర మంతా అల్లకల్లోలం బయలుదేరింది. అప్పుడు మన సప్తమ చక్రవర్తులు విజయ గండ గోపాలునికి, గంగయసాహిణికి సైన్యాలు పంపి సహాయం చేసి, అటు పాండ్యుల్ని, ఇటు దక్షిణ చోళులనుకూడా ముక్కలు చేశారు.

"పాండ్యులకు బుద్ధివచ్చి దక్షిణానికి మధుర వెళ్ళిపోయారు. కాని దక్షిణచోళుడైన రాజేంద్రచోళుడు తనఆశ వదలక రెండేళ్ళక్రితంవచ్చి త్రిపు

రాంతకం పట్టుకొని, అక్కడ శాసనం వేయించాడు. మళ్ళీ ఇప్పుడు ఇంకా ఎక్కువధైర్యం వహించి, పదివేల ఏనుగులతో. లక్ష ఏబదివేల కాల్బలంతో వచ్చాడట. రెండువేల అశ్వికులట, వేయి రథాలట, పదివేల ఏనుగులలో చేర భూపతివీ, గాంగులవీకూడా ఉన్నాయట. ఈ ఏనుగులబలం ముందు నడిపించు కుంటూ, తిరుగులేకుండా త్రిపురాంతకం పట్టుకున్నాడట.

"కృష్ణకు దక్షిణాన్ని ఉన్న సింధవాడి, మార్జవాడి ఆక్రమించాడట. పొత్తపినాడు ఆక్రమించి పురందలూరు పట్టుకున్నాడట. అంబయదేవ త్రిపురాంత కులు సైన్యాలతో పారిపోయి జన్నిగదేవుని కలిస్తే ఆయున కూడా సైన్యాలతో ఆ ఏనుగులముందు మనమేమి చేయగలము అని వెలనాటికి వచ్చేశారట. ఏరువ నాడు రాజేంద్రచోడుని హస్తగతం మొదటే అయింది. ఆతనితో ఏరువనాటి చిన్న సామంతులు, తొండై మండలం మండలం చిన్నసామంతులు అనేకులు కలిశారట. ఈలా కలిసిన సైన్యాలు డెబ్బదివేల కాల్బలము, రెండువేలమంది అశ్వికులు, వేయి ఏనుగులు, .అయిదువందలమంది రథికులూనట. సంగమేశ్వరానికి దిగువ ఎక్కడో కృష్ణానదినిదాటి ఓరుగల్లు పట్టుకుంటారట !

"వీరప్రభువులూ, యువకులూ, లవకుశ సమానులు, కుమారస్వాములూ వీరభద్రులూ అయిన తమరు, ఇంతవరకు ఓటమి ఎరుంగని తమరు శ్రీ గోన గన్నారెడ్డి ప్రభువు నాయకత్వాన ఈ ఉప్పెనను అరికట్టవలసి ఉంది" అని గంభీర వచనాలతో మనవిచేసి తన ఆసనం అధివసించాడు.

అప్పు డొక పండితబాలుడు (విద్యానాధుని తండ్రి) లేచి,

"త్రిపురసంహారకమైన శివుని మూడవ నేత్రము మీయందు నిలుచుగాక !

"దక్షగర్వాపహారి వీరభద్రుని అఖండ విక్రమము మీ బాహువులయందు నిలుచుగాక !

"తారకాసురసంహారి కుమారస్వామి ఉద్దండ పరాక్రమము మీ హృదయాల యందు నిలుచుగాక !

"గోన గన్నారెడ్డి చోళగజాసురుల చెండాడు దివ్యగజాననావతారుడుగు గాక !" అని చేయెత్తి ఆశీర్వదించెను.

## ౧౧

రాజేంద్రచోడుడు అడ్డులేని పురోగమనంతో చొరబారివచ్చుచున్నాడు. ఆంధ్ర కమలాకరములో చోళహస్తి చొరబడి తామరపూవుల, ఆకుల, తూండ్ల చిందరవందర చేస్తున్నది.

ఉద్ధురగమనములు, పర్వతసమానములు, కుపితములు, నిర్భీకములు అగు గజతండములు యిత్తడి మొనలు తాపడంచేసిన నిశితదంతాగ్రములతో, ముఖ ఫలకములతో, ఆ ఫలకములందు కొండల బద్దలుకొట్టగల నిశితములైన

ఖల్లాయుద్ధములతో, నలుగురు, ముగ్గురు, ఇరువురు వీరులను దాల్చి, మహా ప్రళయమువలె కదలివచ్చుచున్నవి.

ఆ సేనను పొదవికొని పదాతులు, ఇటు నటు అశ్వికసైన్యాలును, వెనుక రథములు, ఆ వెనుక ఎడ్ల బళ్లు, సామానులు మోయు ఎద్లు, గాడిదలు, గుఱ్ఱాలు, సాధారణ జనసమూహం, ఇట్లు చోళసైన్యము పదునయిదు గవ్యూతుల పొడవున, అయిదు గవ్యూతుల వెడల్పున వచ్చుచున్నది.

అడ్డులేని ఆ చోళయుద్ధయాత్ర గమనించుచు హిమపర్వతమువంటి ఏనుగును అధివసించి రాజేంద్రచోడ చక్రవర్తి ఠీవిగా వచ్చుచున్నాడు.

ఆ గజయూధాలలో మొదటివరుస కృష్ణఒడ్డును చేరెను. వసంతకాలపు కృష్ణ కృశాంగియై, కొండలలో, రాళ్ళలో, ఇసుక తిన్నెలలో చిన్న చిన్న పాయలుగా జలజలా ప్రవహిస్తున్నది.

రాజేంద్రచోళునికి ఆంధ్రప్రతాపము, యుద్ధరచనాశక్తి పూర్తిగా తెలియును. కావుననే అతని చారసైన్యాలలో కొన్నిదళాలు ఏనుగులకన్న ముందుగనే కృష్ణ దాటి సైన్యాలను రక్షించుటకు వేయి ఆరితేరిన గజాలపై, నాల్గువేల విలుకాండ్రు సిద్ధముగా నున్నారు.

కృష్ణదాటిన చారసైన్యాలు ఈవలిఒడ్డు నిరాటంకము అని తెలుపుచు కొమ్ము లొత్తిరి. కాపుగా ఉంచిన వేయి గజాలుకాక, తక్కిన ఏనుగులు మూడు గవ్యూతుల వెడల్పున కృష్ణలోకి దిగినవి.

ఇంతలో బ్రహ్మాండము పగులునట్లు ఆర్పులతో, ఢంజల మ్రోతలతో, అల్లల్లభేరా అను పెడబొబ్బలతో ఏబదివేలమంది అవక్రపరాక్రములైన ఆంధ్ర వీరులు చెట్లపైనుండి, గుట్టలపైనుండి, రాళ్ళ ప్రక్కలనుండి లేచిరి. నదిలోనికి దిగిన ఏనుగులపైకి నూనెగుడ్డలుకట్టి వెలిగించిన కాగడాలుగల బాణాలు సువ్వు సువ్వున మహావేగంతో గురిచూచి వేయ ప్రారంభించినారు. గట్టుమీద కాపున్న ఏనుగులను ఆ వైపునుండి ఇరువదివేల సైనికులు అగ్నిబాణాలతో ఎదుర్కొనిరి. ఆ గంధకబాణాలకు నిశితమైన మొనలుగూడ నున్నవి.

ఆ రీతిగానే ఎడమవైపున ఇరువదివేలమంది పోటరులు తాకిరి.

నదిలో దిగిన ఏనుగులు ముందుకు సాగలేక వెనుకకు వెళ్ళలేక అటు ఇటు చెల్లాచెదరై పోవుట కారంభించినవి.

రాజేంద్రచోడుడు ఏనుగుల నిలబెట్టుటకు మహాప్రయత్నాలు చేయుచుండెను. నదిఒడ్డునఉన్న సైన్యాలలో ఒకభాగము తమ్మెదిరించువారిని తలపడవల వచ్చెను. అటులనే ఎడమభాగపు సైన్యమూ చేయవలసివచ్చెను. మధ్యనున్నవారు మాత్రమే నదిలో దిగినవారిని రక్షించుకోగలరు. ఆ స్థితిలో నదిలోఉన్న సైన్యాలను దిగువను, ఎగువను అయిదువందల చొప్పున ఏనుగు దళాలు వచ్చి తాకినవి.

గన్నారెడ్డి అశ్వికదళాలతో చోళసైన్య మధ్యమును తాకినాడు. చోళసైన్య పృష్ఠాన్ని రేచర్ల చినదామానాయుడు తాకినాడు. విశలధరణీశుడు చోళసైన్యాల ఎడమభుజము తాకినాడు. ఓరుగల్లునుండి భార్యతో పారిపోయివచ్చి గన్నారెడ్డి సైన్యాలను కలుసుకొన్న అక్కినప్రెగడ ఒకవైపునా, విరియాల సబ్బనాయకు దొకప్రక్కనా నదిలోని ఏనుగుల యూథాలను తాకినారు కృష్ణ కీవలిఒడ్డున సూరనరెడ్డి సైన్యాలు గట్టుఎక్కి ఏనుగుదళాలను వెనుకకుత్రిప్పి నదిలోకి దిగి అవలిగట్టున ఉండే ఏనుగులపై విలుకాండ్రను 'ఒక్కొ ఓ చెలియా' అంటూ ఆక్రమించి ప్రాణాలు హరిస్తున్నవి.

“గన్నారెడ్డి! గన్నారెడ్డి!” అని చోళసేనలలో గగ్గోలుపుట్టింది. కొండలలో యుద్ధమన్న గన్నారెడ్డికి చెలగాటము. అతనికి వేలకొలది చెంచుల సహాయము!

మూడుదినాలు రాత్రింబగళ్ళు సంకులసమరము ప్రవర్తిల్లెను. సబ్బ ప్రభువు అక్కినప్రగడలు నదిలోదిగిన వేలకొలది గజాలను తిరిగి తరిమికొట్టిరి. కొన్ని నాశనమైపోయాయి. కొన్ని తమ సైన్యాలమీదే విరుచుకుపడినాయి. చెట్లు, గుబురులు, గుట్టలు, రాళ్ళు గన్నారెడ్డికి పెట్టనికోటలు.

చోళసైన్యాలకు కలిగిన నష్టము విపరీతము. గన్నారెడ్డి వీరులలో వేలకొలది మడిసినారు. చోళసైన్యాలు పలుచబడిపోయినవి. గజములను నాశనముచేసే విధానము గన్నారెడ్డికే తెలియును. వచ్చిన గజములలో వేలకొలది యుద్ధభూమికి బలి అయిపోయినవి. రాజేంద్రచోడుడు నాల్గవనాటి ఉదయము హతశేషమయిన సైన్యాలతో త్రిపురాంతకము దారిని పారిపోయినాడు.

నూతనంగా గోన గన్నారెడ్డి జట్టులో చేరిన ఆ బాలుడు గన్నారెడ్డికి అంగరక్షకుడుగా నుండి తననేర్పు ప్రకటించెను. ఆ బాలకుడు, వాని స్నేహితునితో గన్నారెడ్డిచుట్టు దుర్గమై నిలిచినాడు. జీవకవచమై కాపాడినాడు. గన్నారెడ్డిని రెండుసారులు తనప్రాణమునొడ్డి కాపాడెను. ఒకసారి ఒక ఏనుగు గన్నారెడ్డిపై బడెను. గన్నారెడ్డి గుఱ్ఱము ఆ తాకును తప్పుకోలేకబోయే సమయములో, ఒక శవము తగిలి తూలిపోయింది. మరు నిమిషములో గన్నారెడ్డి తూలి క్రింద పడినాడు. ఆ క్షణములో ఆ ఏనుగు గన్నారెడ్డిపై కాలు వేయబోయెను. అంతట ఆ నూతన బాలుడు మెరుపువేగాన గన్నారెడ్డికడకు ఉరికి ఏనుగు కాలును ఖడ్గమున కెరగావించెను. ఆ గజము కోపముతో ఈ నూతనశత్రువును హతమార్పనెంచి తదభిముఖముగా రెండు అడుగులు వేసెను. ఇంతలో గన్నారెడ్డి చెంగున లేచి, ప్రక్కనే నిలిచియున్న తన గుఱ్ఱముమీది కెగిరి ఒక్కయమ్మున మావటీని ప్రాణాలు దివి కెగురవేసినాడు. మావటీడులేని ఏనుగు వెనక్కుతిరిగి పారిపోయెను.

గన్నారెడ్డి చిరునవ్వుతో ఆబాలుని 'ప్రాణదాతా!' అని మెచ్చుకొని ముందుకురికినాడు.

౧౨

గోన గన్నారెడ్డి రాజేంద్రచోడుని సైన్యాలు వెనుకకు మళ్ళగానే, తన సైన్యాలను కూర్చుకొని అందరకు బహుమతులు, విజయబిరుదావళులు సమర్పించి మరల సైన్యాన్నంతటినీ సుసంఘటితముచేసి, రాజేంద్రచోడుని పూర్తిగా దాసోహ మనిపించుటకు బయలుదేరెను. రాజేంద్రచోడుని, మూడుచోట్ల తలపడి పూర్తిగా ఓడించినాడు. రాజేంద్రచోడుడు వేయి ఏనుగులు, పదివేల గుఱ్ఱములు, ఏబదిలక్షల బంగారునాణెములు సమర్పించి తన దేశం వెళ్ళిపోయినాడు.

గోన గన్నారెడ్డి, ఆ యూపుననే ఏరువనాడంతయు నాక్రమించెను. ఏఱువనాటి సామంతుడు భీమప్రభువు రెండు సంవత్సరాలక్రితం తొండమండల ప్రభువైన కొప్పరుజింగ పల్లవుడు ఆంధ్రదేశంపై దండెత్తివచ్చి కంచి పట్టుకొన్నప్పుడు అతనికి సహాయము చేసెను. (ఏఱువనాడు ఇప్పటి కడప, నెల్లూరు, కర్నూలు జిల్లాలలోని భాగాలు కలిసినదేశం) కొప్పరుజింగ పల్లవుడు విక్రమసింహపురం పట్టుకొని మనుమసిద్ధి అనే మనుమగండ గోపాలుని తరిమివేసి పాకనాడు, ఆరువేలనాడు, గృధవాడ విషయాలు గడచి రాజమహేంద్రవరము చెంత గోదావరి దాటి ద్రాక్షారామపురములో తన శాసనము వేయించెను.

ఇంతలో కాకతీయ సామంతులయిన చాళుక్యులు, కోన హైహయులు, వెలనాటిచోడులు, అంబరదేవుడు కొప్పరుజింగని సైన్యాలను నాశనముచేసి తొండమండలమువరకు తరిమివైచిరి.

రాజేంద్రచోడుడు ఎత్తివచ్చుటకుముందే ఏఱువభీముడు తన సైన్యాలతో దొంగచాటుగా కొప్పరుజింగని దారినే వెళ్ళి, ద్రాక్షారామములో శాసనము వేయించి గోదావరితీరమున మంత్రకూటమువరకు పోయి, దొంగదారులను కాకతీయ సైన్యాలను తప్పించుకొనుచు ఏఱువనాడు చేరెను.

రాజేంద్రచోడుని తరిమి కప్పము పుచ్చుకొని, ఏఱువభీమునిపై గోన గన్నయ్య ఇంద్రాయుధమువలె పడినాడు. భీముని సైన్యాలు దూదిపింజలై ఆకాశములోనికి చెదరిపోయెను. ఏఱువనాడంతయు గాలించి, భీమనృపుని సామంతులను కొల్లగొట్టి భీముని పట్టుకొన్నాడు. భీముడు గన్నారెడ్డి పాదాల వ్రాలి, సన్యాసియై దేశాంతరగతుడయ్యెను.

ఏఱువనాటికి సబ్బప్రభుని సామంతునిచేసి సింహాసన మెక్కించి ఆంధ్రదేశమును కన్నెత్తిచూచిన తొండమండలపు కొప్పరుజింగనికి బుద్ధి చెప్పుటకు గన్నారెడ్డి తొండమండలముపై దాడిచేసెను.

ఆంధ్రసైన్యాల వేగ మప్రతిహతము. హిమాలయపర్వతపు లోయలనుండి పరవళ్ళుత్రివచ్చే గంగానదివలె తొండమండలముపై బడిన గన్నారెడ్డి ధాటికి నిలువలేక కొప్పరుజింగని సైన్యాలు చెల్లాచెదరై పోయెను. ఆ మహా సంగ్రామములో కొప్పరుజింగని బందీచేసి గన్నారెడ్డి రాజధనాగారము దోచినాడు. సాధారణ ప్రజలకు ఇబ్బంది కలుగకుండ యుద్ధము నెరవేర్చి, కొప్పరుజింగని కోరలు ఊడబెరికి, విషం పిండి, ముందు ఆంధ్రదేశముపై కన్నెత్తితే తొండమండలము సముద్రమట్ట మొనర్తునని ప్రతిజ్ఞచేసి అయిదువేల ఏనుగులతో, వజ్రవైడూర్యాది రత్నరాసులతో, ఏనుగులు మోయలేని బంగారు రాసులతో వానకాలము రాకమున్నే తన రహస్యనగరం చేరెను.

గన్నారెడ్డి దుర్నిరీక్ష్యతేజస్కుడై సకల ధనరాసులతో, సర్వసైన్యాలతో తన నగరం చేరి సైనికులకు, నాయకులకు వెలలేని బహుమతు లిచ్చి కాకతీయ రుద్రదేవి సామ్రాజ్ఞికి పదిలక్షల ఫణాలు, రెండువేల ఏనుగులు, పదివేల గుఱ్ఱాలు, రత్నాలు కప్పముగా పంపించెను.

ఓరుగల్లు కోటలో రుద్రమహారాజు. శివదేవయ్యమంత్రి, బొప్పదేవుడు, ప్రసాదాదిత్య నాయకుడు గన్నారెడ్డి యుద్ధయాత్రలకు ఆశ్చర్యము పొందినారు. రుద్రదేవి సామ్రాజ్ఞి సకల భారతావనిలో కీర్తినందిన ఈ గజదొంగ విషయము ఆలోచింప పేరోలగమున రాకాచంద్రునిలా తేజరిల్లుచు పురుష సింహాసనాసీన యయ్యెను.

శివదేవయ్యమంత్రి లేచి, "శ్రీ శ్రీ రుద్రదేవ మహాప్రభూ! గోన గన్నారెడ్డి గజదొంగ కావటం మన దురదృష్టమూ అదృష్టమూ కూడా! ఆలాంటి వీరుడు తమకు దక్షిణభుజంగా ఉండవలసినవాడు. ప్రజలు అతని పేరుచెప్పి దీపం పెట్టుకుంటారు. ఒక్కరైతు కష్టంలో ఉన్నాడని గన్నారెడ్డికి వార్త వెళ్ళినదా, ఆ రైతుఇంట ధనరాసులు కురిసినవన్నమాటే! బ్రాహ్మణుడు వ్యధపడుతున్నా డంటే ఆ వెంటనే గన్నారెడ్డి ఆ బ్రాహ్మణుని ఇంట కల్పవృక్షము పాతినాడన్న మాటే! ఎక్కడైనా మన సామంతుడెవర్నా ప్రజలను పీడిస్తున్నాడంటే గన్నారెడ్డి స్వయంగా అక్కడ ప్రత్యక్షం. ఆ సామంతుడు క్షమాపణ అర్పించాలి. ప్రజలఎదుట దోషిగా నిలబడాలి, లేకపోతే గన్నారెడ్డే ఆ సామంతుని ప్రజల ఎదుట మునికోలతో శిక్షించినాడన్నమాటే!

"ఏ మహాదేశానికైనా ఒక్కొక్కప్పుడు చిక్కులు సంభవిస్తూ ఉంటవి. గద్దె దిగే ప్రభువు ముసలివాడై, ఎక్కే ప్రభువు బాలకుడైనప్పుడు ఈ ప్రళయం సంభవిస్తూ ఉంటుంది. శ్రీ రుద్రమహాప్రభువు పృథ్వీ అదృష్టం వల్ల సింహాసనం అధివసించారు. ఆమె స్త్రీ అనే ఉద్దేశంచేత అనేకమంది సామంతులు రాజద్రోహు లైనారు. వెంటనే ఈ మహదాంధ్రభూమి అట్టి ద్రోహులను గన్నారెడ్డి పట్టి

పాలార్చి, దేశాన్ని నిష్కంటకం చేశాడు. ఆంధ్రసామ్రాజ్యానికి శిలావప్రమై నిలిచినాడు.

"ఈ మధ్య రాజేంద్రచోడుని ఓడించి, ఏఉువఛీముని దాసోహ మనిపించి, కొప్పరుజింగని పారద్రోలి, సామ్రాజ్యంలో ఛిద్రాలను నాశనం చేశాడు. గజదొంగ అయినందుకు నిజంగా గజాలు వేలకొలది ప్రతి యుద్ధంలో అపహరించినాడా యువకప్రభువు. చక్రవర్తి సింహాసనం ముందు కోట్లకొలది బంగారురాసులు, రత్నరాసులు కానుక అర్పించినారు.

"అలాంటి మహావీరుడు నిజరాజ్యాన్ని చేపట్టి ఏలుకోవలసిందని శ్రీ చక్రవర్తి కోరదలచుకొన్నారు.

"ఇది ఒక విషయం. రెండవది: దక్షిణాన్నుంచి వచ్చిన ప్రళయాన్ని గన్నారెడ్డి అడ్డుపెట్టినాడు కాని అంతకన్న మహత్తరమైన ప్రళయం ఉత్తరం నుంచి వస్తున్నది. దేవగిరి యాదవరాజు కృష్ణభూపతి మరణించాడు. ఆయన కుమారుడు మహాదేవరాజు దేవగిరిపతి అయినాడు. తండ్రిమరణాన్ని ఎదురు చూస్తున్న మహాదేవరాజు సర్వసన్నద్ధుడై ఉన్నాడుగనుక ఇక మన దేశంపై పడడానికి అడ్డుఏమీలేదు.

"అదీగాక ఆయన సింహాసనం ఎక్కిన దినాన కవీశ్వరులు ఆయన్ను పొగడుతూ 'మహాదేవరాజ వీరకంఠీరవుని ప్రతాపానికి భయపడి మాళవులు ఒక, బాలకుని, ఆంధ్రులు ఆడదాన్ని సింహాసనం ఎక్కించారు' అని కావ్యాలల్లారట. పిల్లలను, ఆడవారినీ మహాదేవరాజు ఏమీ చేయడట. కాని వారి వారికి రాజ్యార్హత లేదు. కాబట్టి వారి రాజ్యాలుమాత్రం తాను తన ఛత్రచ్ఛాయలకు తీసుకొని అనుగ్రహిస్తాడట."

అని శివదేవయ్యమంత్రి చెప్పగానే ఒక్కసారిగా 'మహాదేవరాజును పిండి గొట్టండి. ఆంధ్రులు పిల్లులో, బెబ్బులులో చూపండి. రుద్ర చక్రవర్తికి జయ! జయ!, అని కోలాహలం వినబడింది.

## ౧౭

కృష్ణవేణ్ణానది అందాలు, విలాసాలు అన్ని ఋతువులలోనూ గోన గన్నారెడ్డి సందర్శించి ఆనందపరవశుడు అయ్యేవాడు.

గన్నారెడ్డిని వీరాధివీరునిగా ఎంచి, చూపులతో, మాటలతో, చేతలతో పూజించే ఆ బాలునితో కలిసి నిప్పులు చెరిగే ఆ వేసంకాలపు సాయంవేళల గన్నారెడ్డి కృష్ణాతీరానికి వచ్చేవాడు. గన్నారెడ్డితోపాటు వంతులచొప్పున సైనికులు గూడ కృష్ణాతీరానికి వచ్చేవారు.

తొండమండల జైత్రయాత్రానంతరం చాలమంది వీరులు, నాయకులు, సేనాపతులు తమ తమ నాడులకు: గ్రామాలకు వెళ్ళిపోయారు. గన్నారెడ్డి

మాత్రము తన రహస్యనగరంలోనే ఉన్నాడు. విశలధరణీకుడు తన అక్కకుప్పమాంబాదేవిని, బావ గుండయమహారాజును చూడడానికి వెళ్ళాడు.

ఆంధ్రదేశంలో స్వతంత్రత సంపాదించుకొందామని ఆశించిన సామంతులలో కొందరు నాశనం అయ్యారు. కొందరు దాసోహమన్నారు. కొందరు పారిపోయి దేశాలు పట్టారు. తన గజదొంగతనం ఇక దేశానికి అవసరం లేదా కృష్ణవేణీ అని ప్రశించుకుంటూ ఏదో నిర్వచింపలేని హృదయవేదనలో గన్నారెడ్డి కృష్ణఒడ్డున కూరుచున్నాడు. ఆయన మౌనం బరువుగా కృష్ణానదీ జలాలలోనికి ప్రవహిస్తున్నది. ఆయన ప్రక్క నీలజలాలను పారకించి చూస్తూ గోన గన్నారెడ్డికి అంగరక్షకుడైన విశాలరెడ్డి ప్రక్కనే కూరుచుండి ఉన్నాడు.

వీరిద్దరికి దూరంగా నీళ్ళలో కాళ్ళుఆడిస్తూ ఆ బాలుని స్నేహితుడు మల్లికార్జుననాయకుడు ఒక బండరాతిమీద కూర్చొని అన్నాడు.

వేసంకాలపు మత్తు ఆ నదిమీదనుండి ప్రసరించే గాలిలో నిండి ఉన్నది. అడవిపూవుల సువాసన ఆ మత్తుకు ఇంకను భారము సమకూరుస్తున్నది. ఆ పరీమళములు నీటి పరీమళాలు. చిగురులసౌరభాలు, మోదుగపూలు, తంగేడులు ఆ ప్రదేశాన్ని వైకుంఠవనంగా చేస్తున్నవి. వేసవి సాయంకాలాలలో, శీతకాలపు రాత్రులలో, వానకాలపు పగళ్ళలో, వసంతకాలపు దివారాత్రాల పొడుగునా స్వప్నాలు లోకం అంతటా ప్రసరిస్తూ ఉంటాయి. గన్నారెడ్డి హృదయంలోనికి మూడు స్వప్నాలు ఒక్కసారిగా వొచ్చినాయి.

తాను వర్ధమానపుర సింహాసనం అధివసించి తన రాజ్యం యావత్తూ నందనవనసదృశం చెయ్యాలని ఒక కల. రెండవ స్వప్నం తన చక్రవర్తి మహాసభలో సర్వదేశాలవారు రుద్రచక్రవర్తి పాదాల తమ తమ కిరీటకాంతులు వెలిగింపగా నమస్కారాలు సలిపి జయధ్వానాలు పలుకుతూ ఉండగా చూడాలని. మూడవ స్వప్నానికి స్పష్టత లేదు రాసిపోసిన పూలకు రూపములేనట్లు ఆ స్వప్నమొక కదంబము. దూరాన ప్రత్యక్షమయ్యే ఒక ప్రకృతిదృశ్యం; రేకలులేని ఒక వెన్నెలప్రవాహము. దరులుముంచెత్తే సువాసనల వాన. ఒక మధుర ప్రళయం.

యుద్ధం అతనికి సుపరిచితం. యుద్ధంలో అతనిబుద్ధి నిశితము. అతనిశక్తి నిరుపమము. అతనిధాటి అప్రతిహతము. మనస్సు వినిర్మలము,

యుద్ధవ్యవహారాలు, రాజకీయాలు, వ్యవసాయము, పరిపాలన ఆ యువకునకు బాగా తెలుసును. చదువుకున్నాడు. కాని మతాలు, ధర్మాలు, తత్వవిచారణ, పరలోకము వీనినిగూర్చి ఆ ప్రభువు ఎప్పుడూ ఆలోచించలేదు. రాచరికము,

ప్రజాసంసారము ఆయన నిర్వహించగలడు. స్త్రీ ఏమి? పురుషుడేమి? వారి సంసారమేమిటి? అన్నప్రశ్న ఆలోచించడానికే ఆయనకు భయం.

తన మంత్రి, స్నేహితుడు అగు అక్కిన యుద్ధంకాగానే అత్తవారింటికి పరుగెత్తినాడు. యుద్ధసమయంలో మూడుదినాల కొకపర్యాయం చారులచే మామ గారికి, భార్యకు కమ్మలు పంపేవాడు. భార్యను కలుసుకున్నప్పటి నుండి అక్కిన పూర్తిగా మారిపోయాడు. అంతకుపూర్వం సూర్యరశ్మిలా ఉన్నాడు. ఇప్పుడు పట్టివెన్నెల్లా మూర్తితాల్చాడు. యుద్ధంలో ఇదివరకు ప్రాణలక్ష్యం లేకుండా పోరాడేవాడు. ఇప్పుడు జాగ్రత్త ఎక్కువయింది.

ఓరుగల్లులో అక్కినచరిత్ర దశకుమారచరిత్రలో ఒకకథవంటి దయింది. చక్రవర్తి పేరన చినఅక్కినను ఆయన తాత బందీచేశాడు. అతన్ని కారా గృహంలో ఉంచవలసిందని నగరపాలకుడగు ప్రసాదాదిత్య ప్రభువునకు మనవి చేసెనట. ఆయన ఈ విషయంలో తమకు సన్నిహిత సంబంధం ఎక్కువ ఉండటంవల్ల కార్యనిర్ణయభారం ముఖ్యమంత్రిపై విడెనట.

శివదేవయ్య దేశికులు, ఆ భార్యాభర్త లిద్దరికి యింటిలోనే బంధనమని ఆజ్ఞ పంపించారట. ఆ ఆజ్ఞ వచ్చిన మూడవదినాన భార్యాభర్త లిరువురూ కావలి కాచే వీరభటుల కన్నుగప్పి, ప్రోలేశ్వరము పారిపోయి వచ్చారట. అక్కడ భార్యను వదలి అక్కిన తన్ను కలుసుకున్నాడు.

రాజవ్యవహారాలు మాట్లాడేటప్పుడు తక్కతక్కిన సమయాలలో అక్కిన ఏదో విధంగా తన భార్యాప్రస్తావన వచ్చేమాటలే మాట్లాడుతాడు. స్త్రీ ఎలాంటి వీరుణ్ణయినా భీరువును చేస్తుందికాబోలు!

గోన గన్నారెడ్డి అక్కినను తలచుకొని అసహ్యించుకొన్నాడు. అక్కినకు ఈ మధ్య కవిత్వపు పెట్టి ఎక్కువైంది. ప్రౌఢప్రమానమూ గాథాసప్తశతి, శృంగార శ్లోకాలు చదువుతున్నాడు.

ఒక దినాన వారిద్దరికి జరిగిన సంభాషణలో అక్కిన అన్న ముక్కలు చటుక్కున జ్ఞాపకం వచ్చినవి గన్నారెడ్డికి.

"బావగారూ! జీవితానికి పరమావధి మోక్షం. మోక్షానికి దారి జ్ఞానపూర్ణ భక్తి. భక్తికి ఉత్తమరూపం కావ్య సంగీత, నాట్య, చిత్రశిల్పాది విద్యలు. ఈ విద్యలకు ప్రాణం రసము. ఈ రసాలలోకి మకుటము శృంగారరసము. అది తెలియడానికి స్త్రీని ప్రేమించాలండీ!" అని.

సంతానంకోసం స్త్రీని కామింపవచ్చును. అది మానవజీవిత యుద్ధంలో ఒక వ్యూహరచనవంటిది. వివాహం ఒక సంస్కారం. ఇష్టమున్నట్లయితే ఆ సంస్కారం నెరపవచ్చును; లేకపోతే బ్రహ్మచారిగా ఉండవచ్చును. పున్నామ నరకం తప్పించుకొనటానికి పెళ్ళిచేసుకునేవారు చేసుకోవచ్చును.

కావ్యాలలో నాయికా నాయకులు పరస్పరం చూడగానే ప్రేమించారు. కాళిదాసాదులు రచించిన కావ్యసౌందర్యాలేగాని జీవితసత్యా లెట్లాఅవుతాయి?

ఈ ప్రశ్న మనస్సులో ఉదయించగానే, గన్నారెడ్డికి పక్కున నవ్వు వచ్చింది.

## ౧౪

గన్నారెడ్డి పక్కున నవ్వగానే ఆ ప్రక్క కొంచెం దూరంగా కూర్చుండి తన పెద్ద కళ్ళతో మధ్యమధ్య గన్నారెడ్డిని చూస్తూఉన్న విశాలరెడ్డి ఆశ్చర్యముతో, "ప్రభూ, ఎందుకు అలా నవ్వుతున్నారు? " అని ప్రశ్నించాడు.

గోన గన్నారెడ్డి ఉలిక్కిపడి, స్త్రీకంఠంలా విని ఆ బాలుని మోము తేరిపారచూచి, 'ఎక్కడనో చూచినట్లు ఉంది? నువ్వుకూడా ప్రేమ అనే శక్తి ఒకటి ఉందని నమ్ముతావా?' అని ప్రశ్నించాడు.

విశా: నమ్ముతాను ప్రభూ!

గోన: ఎలా నమ్ముతావు? నీకు తార్కాణం ఏముంది?

విశా: నేనూ జీవితంలో కొన్ని ప్రేమసంఘటనలు దర్శించాను.

గోన: నీ యీడు?

విశా: పందొమ్మిది ఏళ్ళు.

గోన: నిన్ను చూస్తే పదారేళ్ళ బాలకునిలా ఉన్నా, నీ విక్రమం మాత్రం ఈడును మించినదయ్యా!

విశా: నన్ను పొగడకండి మహారాజా!

గోన: నేను పొగడేవాణ్ణికాను. ప్రేమవిషయంలో నీ అనుభవమేమిటి?

విశా: మహాప్రభూ! నాజీవితంలో ప్రేమ అనే ఒక విచిత్రశక్తి ప్రవేశించింది. అంతవరకూ మీకు మనవిచేయగలను. తక్కిన విషయాలు రహస్యమైనవి.

గోన: నాకు ప్రేమ విషయం చెప్పవయ్యా వీరబాలుడా అంటే, నీ ప్రేమను గురించి చెప్పమని నేను కోరటంకాదు. మన అక్కన 'ప్రపంచములోని శక్తులన్నిటికన్న ప్రేమ అనేది మహోత్తమ, మహత్తర శక్తి' అని వాదిస్తాడు.

విశా: ఆయనమాట నిజమనే నా నమ్మకం.

గోన: ఎట్లా?

విశా: పశువులలో స్త్రీ పురుషాకర్షణ జంతుధర్మం. మనస్సు కలిగిన మనుష్యుడు ఆ జంతుధర్మాన్ని దివ్యధర్మం చేసినాడు. దానినే ప్రేమ అంటాము.

గోన: జాగ్రత్తగా ఆలోచించి ఒక ధర్మం నిర్ణయించినట్లా?

విశా: అదికాదు ప్రభూ! పశువులలో తల్లిబిడ్డల ప్రేమ, బిడ్డల చిన్నతనం వరకే! ఆ పైన ప్రేమలేదు. ఆ భావమే ఉండదు. బిడ్డ తల్లికి భర్త కావచ్చును.

గోన: కావచ్చు నేమిటి? అవుతున్నాయి!

విశా: జంతువులలో సహోదరప్రేమ లేనేలేదు!

గోన: సరే, ఇంక నీ వనేది మానవులలో మాతృప్రేమ, సోదరప్రేమా ఉన్నట్లు స్త్రీ పురుష ప్రేమా ఉందని. ముసలివారలైన స్త్రీపురుషులకు దాంపత్య ప్రేమ ఎట్లా సాధ్యమవుతుంది?

విశా: మహాప్రభూ! స్త్రీపురుష ప్రేమ సర్వకాలమూ దాంపత్య ప్రేమగా ఉండాలనేదిలేదు.

గోన: ఓయి యువకనాయకుడా! ఇంత చిన్నతనంలోనే ఇంత విచిత్రభావాలు నీ కేల్లా అలవడినాయి?

విశా: మహాప్రభూ! ప్రచండ విషయాలు గమనించడానికి ఈడుకూడా అడ్డంరాదు ఒకప్పుడు.

గోన: జ్ఞానమౌక్తికాలు ఒలికిస్తున్నావు విశాలప్రభూ! నువ్వు నా మనస్సును దొంగిలించినావు. గజదొంగకే దొంగవయినావు!

విశా: (చిరునవ్వు నవ్వుతూ) మహారాజా! మీ వస్తువు లెవ్వరు దొంగతనం చేయగలరు?

గోన: ఈ వేసవికాలం పూర్తికాకుండా ఆంధ్ర సామ్రాజ్యాన్ని దొంగతనం చేయడానికి దేవగిరి యాదవుడు వస్తున్నాడు. మన సైన్యాలన్నీ చెల్లాచెదరై ఉన్నాయి. ఇంక పదిహేనురోజులలో మళ్ళీ సైన్యాలన్నీ చేర్చవలసి ఉంటుంది. సరేకాని విశాలాక్షనాయక అనేపేరు మీకు ఎలా వచ్చిందయా? మీ తండ్రిగారు కాశీ వెళ్ళారా?

విశా: అవును మహారాజా! మా తాతగారు కాశీ వెళ్ళారట. అక్కడ నుంచి వచ్చిన నెలరోజులకు నేనుపుట్టితినట.

గోన: బాగుంది. చీకటిపడింగి. మనవారిని కాగడాలు వెలిగించమనండి. వెగళ్ళుచేసి మన శిబిరంచుట్టూ అప్రమత్తులుగా ఉండమనండి. మనం భోజనానికి వెడదాం.

కృష్ణఒడ్డునే ఒక ఇసుకతిప్పపై గోన గన్నారెడ్డికి, విశాలాక్షప్రభువుకు మల్లికార్జున నాయకునకు విడివిడిగా పటకుటీరలు నిర్మించారు. ఆ ప్రక్కనే వంటకుటీరా లున్నాయి. దూరంగా సైనికుల కుటీరాలు నిర్మించినారు,

భోజనశాల వేరు. స్నానశాలలు వేరు. విశాలాక్షప్రభువు విడిగా కృష్ణలో ఎక్కడో స్నానంచేసి వచ్చేవాడు.

ముప్పురూ కలసి భోజనాలుచేసి ఆ సైకతాలలో కొంతకాలము కూర్చుండి మాట్లాడుకొన్నారు. గన్నారెడ్డికి ఉద్భవించిన ఆవేదన ఇట్టిదని ఆయనే విర్ణయించు కోలేకపోయినాడు. మంచముపై మేనువాల్చి, ఎంతకూ నిద్దురపట్టక లేచి కూర్చుండి నాడు. పక్కపై మేనువాల్చిన మరునిమేషాన గాఢనిద్రబోయే తాను నేడు నిద్దుర పట్టక ఇలా రాత్రించరుడగుటకు కారణము రేపు రాబోయే మహాదేవరాజు జైత్రయాత్రవల్లనా ?

అతడు రావచ్చును కాని తిరిగి వెళ్ళుట ఆతనికి వశమా ? ఇంక ఎవరో మహారాజద్రోహి ఒక డున్నాడు తమకు ఒకనిపై చాల అనుమానమున్నది. నిశిత బుద్ధికల అపసర్పులను నిజము కనిపెట్టుడని తాను పంపించాడు. తన అనుమానము నిజమయితే, కర్తవ్యము వెంటనే తనవారందరితో ఆలోచించి తగిన ప్రతీకారము సలుపవలసియుండును.

ఈ బాలుడెవ్వడో ఉత్తముడు. కాని తన జీవితములో ఏదో దాచుచున్నా డేమో ? నుడికారము చూడగా ఈతడు ఈ చుట్టుప్రక్కలవాడేనని స్పష్టము. కొలనిదేశంనుంచి, సబ్బిసాహిరమండలంనుంచి వచ్చినట్లు నమ్ముటకు వీలులేదు. ఇంతలో గోన గన్నారెడ్డి ప్రభువు నిద్దురకూరినాడు.

౧౫

తన మందిరములో విశాలాక్షరెడ్డి నిదురపట్టక చాలసేపు మేలుకొని ఆలో చించుకొనుచు కూరుచున్నాడు. గన్నారెడ్డి ప్రభువు తన హృదయములో ప్రేమ లేదందురేమి ? మనుష్యుని జీవితం ప్రేమ లేకుండ ఉండగలదా? ప్రేమలేని మనుష్యుడు మనుష్యుడా ? ప్రేమగలవాడు మనుష్యుడు కావచ్చును. ప్రేమకు వ్యతిరేకమైన ద్వేషముకలవాడును మనుష్యుడు కావచ్చును. కాని ఈ రెండునూ లేనివారు లోకాతీతులై ఉండవలె. లేక ప్రేమ ఎరుగని జంతు స్వరూపులు కావాలి!

గన్నారెడ్డి ప్రభుని ప్రేమను చూరగొనగల బాలిక ఉదయించలేదు కాబోలు ! అందులో ఈ ఉన్నతవంశాలలో సాధారణంగా ప్రేమకు తావులేదు. రాజకీయావసరాలకు వివాహాలు జరుగుతాయి. ఆ దాంపత్యములో భార్యాభర్తలు బిడ్డలగనుచు స్నేహితులౌతారు. స్నేహితులుకాకుండ విరోధులయ్యే భార్యాభర్తలు ఉన్నారు. ఒక్కొక్కప్పుడు స్నేహము ఉత్తమ ప్రేమగా మారిపోతుంది.

రుద్రదేవ చక్రవర్తిని శ్రీ చాళుక్య వీరభద్ర మహారాజును గాఢముగా ప్రేమించుచున్నారు. వారిరువురకు వివాహమయినచో మహోత్తమ ప్రే[illegible]గల దంపతులు లోకానికి ప్రత్యక్షమగుమరుగదా !

గన్నారెడ్డి ప్రభువు హృదయము చాల గుప్తమగుట యేలనో? ఆయన హృదయము నవనీతము. శత్రువును నాశనము చేయుటలో ఎంత దుర్నిరీక్ష్య తేజోవంతు లాయన కాగలరో, యుద్ధేతరకాలంలో అంత సుకుమార చరిత్రులు అయిపోతారు. యుద్ధములో దెబ్బతిన్న శత్రువులకుకూడా తల్లివలె ఆయన వైద్యము చేయించును. గ్రామాలజోలికి, పశువులజోలికి వెళ్ళనే వెళ్ళడు. ఇట్టివాడు గజదొంగయా?

తన కీ సమస్య కృష్ణవేణీదేవియే ఒకనాడు విడదీయవలసి ఉండును. ఓహో కృష్ణవేణి అంటే గన్నారెడ్డి ప్రభువుకు ఎంతప్రేమ! ఒకవేళ ఆ దేవి ఆయన మనస్సు పూర్తిగా చూరగొన్నదేమో?

ఇంతలో విశాలాక్షప్రభువు స్నేహితుడు ఆ ప్రక్క మందిరంలో పండుకొన్నవాడు లేచివచ్చి, 'ప్రభూ! నిద్రపట్టలేదా తమకు? మంచినిద్దురలో ఉన్నాను మెలకువ వచ్చి, మీరు మేలుకొని ఉండుట చూచి లేచివచ్చాను.'

విశా: అవును మల్లికా! ఈలా పురుషవేషాలతో అతల్లి విశాలాక్షి మీదే భారంవైచి వచ్చాము.

మల్లి: నిదురలోనున్నా మనం ఏమరుపాటుగా ఉండకూడదనుకుంటే మీరు తేలిపోతున్నారేమి అమ్మా?

విశా: దినదినమూ వారితో ఉండి, ఆ మహాపురుషుని చరిత్ర గమనిస్తూనే పడే వేదన అణచుకుంటూ, పైకి పురుషునివలె నటించడం దుర్భరమే అవుతూ ఉంది మల్లికా!

మల్లిక: రాజకుమారీ! ఏంచేద్దాము? వెళ్ళిపోదామా? అయినా, మనం వచ్చిన పవిత్రదీక్ష విజయం పొందకుండా వెళ్ళిపోతే తలవంపుకాదా?

విశా: మల్లికా! నీ కది పవిత్రదీక్షయేమో, నాకుమాత్రం ఇదంతా స్వలాభపూరితమైన పనికాదా అనిపిస్తున్నది,

మల్లిక: మీరది ఏమనుకున్నాసరే. మనం వేసిన వేషాలు కట్టుదిట్టంగా ఉన్నాయి. అందుచేతనే గన్నారెడ్డిప్రభువు మిమ్ము ఆనవాలు పట్టలేకపోయారు. వచ్చినందుకు ఈ మధ్యను జరిగిన గజయుద్ధంలో పాల్గొన్నాము. తాము రెండు సారులు గన్నారెడ్డిప్రభువు ప్రాణం రక్షించారు.

విశా: అదే మరింత కష్టంగా ఉంది మల్లికా! ఒకవేళ నేను ఎవరో ఆ మహాపురుషుడు గుర్తించి కృతజ్ఞతతో నన్ను ఉద్వాహం చేసుకుంటానని అనవచ్చు. వ్రతనియమం పాలనచేయలేనివాడు వివాహమే చేసుకొనకపోవచ్చు.

మల్లిక: ఏమి అనుమానాలండీ మీవి?

విశా: వచ్చాము, ఇంతవరకూ గౌరవంగా బయటపడ్డాము. ఇంక ఈ విషయంలో గటిబిజిలు రాకుండా చల్లగా రుద్రదేవి మహారాజ్ఞికడకే వెళ్ళిపోదాము.

మల్లిక: అదీ నిజమేనండీ! నాయనగారు తాముచేసేపనికి విచారిస్తున్నామనీ, అమ్మాయి ఇష్టములేకుండా ఏపనీ చేయమనీ, రుద్రదేవ చక్రవర్తికి తామిక ముందు నమ్మకమయిన బంటుగా ఉండి వారిఆజ్ఞ శిరసావహిస్తామనీ తెలుపుతూ ఓరుగల్లు రాయబారం పంపారని విన్న ఇక్కడకు వేగు వచ్చింది.

విశా: మల్లికా! అమ్మగారినీ, నాన్నగారినీ చూడాలని ఉంది. అయినా మహాదేవరాజు ఓరుగల్లుమీదకు దండెత్తి వస్తున్నాడట. ఈ సమయంలో శ్రీ రుద్రదేవి గారిదగ్గర నేను ఉండా లనిపిస్తున్నది.

మల్లిక: మంచిది రాజకుమారీ!

మల్లిక లేచివెళ్ళి తన ప్రక్కమీద పండుకొని, అన్నాంబిక అన్నమాటలే ఆలోచించుకొనుచు కళ్ళు తెరిచియే ఉన్నది.

అన్నాంబిక హృదయమూ, గన్నారెడ్డిప్రభువుపై లగ్నమైనది. అందులకే కదా రుద్రదేవి చక్రవర్తిని ఆలోచనపై ఈ బాలిక వేషాలతో వారిరువురు గన్నారెడ్డిప్రభువుకడకు వచ్చినది. మన మనోరథాలు నెరవేరుచున్నంత వరకూ తికమకలేమీ లేక ఆనందము ప్రసరించుచుండును. ఏమాత్రము తారుమారైనను మనుష్యుని దినచర్యలో ఎన్నిమార్పులో వచ్చునుగదా! అన్నాంబిక, మల్లిక వెళ్ళగానే బిడ్డవలె నిద్రపోయెను.

న వ మ గా థ

# ఉత్తమ చాళుక్యుడు

౧

ఉత్తమ చాళుక్యుడైన వీరభద్రమహారాజు శ్రీ శివదేవయ్య దేశికుల ఆజ్ఞచే ఓరుగల్లులో ఉండిపోవలసి వచ్చినది. రుద్రచక్రవర్తి ఓరుగల్లుకోట బాగుచేయించే ముఖ్యకార్యమునకై వారిని నియోగించిరి.

ఆ మహారాజు ఒక్కక్షణికమేని విశ్రాంతి ఎరుగక నిరంతర కృషిలో మునిగిపోయినాడు. ఓరుగల్లు దుర్గసంరక్షణ కాకతీయమహాసామ్రాజ్యానికి మూల స్తంభము. ఆంధ్రక్షత్రియవంశాలు తమ ప్రాణాలేని ఒడ్డి ఆ కోట కాపాడవలసినదే!

యుద్ధవ్యూహరచనావిధానమునుగూర్చి, దుర్గసంరక్షణగూర్చి సమాలోచించుటకు రుద్రదేవి, శివదేవయ్యమంత్రి, చాళుక్య వీరభద్రుడు, ప్రసాదాదిత్యనాయకులు, జాయపసేనాని, పడికము బొప్పదేవులు రహస్యాలోచన మందిరంలో కూడినారు.

యాదవ మహాదేవరాజు ఓరుగల్లుపై ఎత్తివచ్చుటకు సర్వసన్నాహాలు చేయుచునట్లు ఏదినాని కాదినము వేగు వచ్చుచున్నది.

రుద్రదేవి సింహాసనముమీద, తక్కినవారు యథోచితాసనాలమీద అధివసించారు. అన్నాంబిక కూడా రుద్రదేవితోపాటు పురుషవేషముతో ఆమె ప్రక్కనే వేరొక పీఠముపై ఆసీన అయిఉన్నది. గొంకప్రభువు అప్పుడే వచ్చి చక్రవర్తికి, మహామంత్రికి, పెద్దలకు నమస్కరించి ఆసనము నధివసించెను.

గొంకప్రభువు: మహాప్రభూ! మహాదేవరాజు జైత్రయాత్ర విజృంభించింది. అతడు గోదావరిని ప్రతిష్ఠానపురందగ్గర దాటి సర్వసైన్యాలతో నాదీతీరంవెంబే వస్తున్నాడు.

శివదేవయ్య: నిన్నటి మీవార్త ఆయన గోదావరి దాటుతున్నాడనే కదా?

గొంక; అవునండీ. అది నాలుగుదినాల క్రిందటిమాట. ఇంక శంఖచారత్వము నడిపించి నిశ్చయం చేసుకొన్నాము.

చాళుక్య: నేను మా లక్ష సైన్యంతో వెళ్ళి మంజీరదాటకుండ మహాదేవుణ్ణి అరికట్టాలని ఉంది, మహామంత్రీ!

రుద్ర : తామందరు మా అభిప్రాయం వినండి. మనకు కోటలోనూ, చుట్టుప్రక్కలా ఉన్న సైన్యము నాలుగులక్షలు మాత్రమే. మహాదేవరాజు ఎనిమిది లక్షల సేనతో వస్తున్నాడు.

శివ : దారిలో అడ్డగించడం ఉత్తమం కాదంటారా ?

ప్రసా : తెలుగువీరులు ఒక్కొక్కరు ఇరువదిమందిపెట్టు అని మహాప్రభువులకు మనవి చేసుకుంటున్నాను. నాకూ, చాళుక్య మహారాజులుంగారికీ వారిని ఎదుర్కొనే ఆజ్ఞ దయచేయండి.

బాప్పదేవుడు : మహాప్రభూ ! నే నీమధ్య వీరభోజనం లేక వస్తుఉంటున్నాను. నాకున్నూ సెలవు దయచేయ కోరుతున్నాను.

రుద్ర : తమకందరికీ మేము కృతజ్ఞులం. కాని, ఇప్పుడు ఏ ఒక్కరికి గాని, అందరికిగాని, కొందరికిగాని, మహాదేవరాజును ఎదుర్కొనే అనుమతి యివ్వలేము. ఒక వార్తకోసం ఎదురుచూస్తున్నాము. అది రాగానే మేము తమ అందరికి కర్తవ్యం విశదీకరించగలం.

అన్నాంబిక అప్పుడు చక్రవర్తిని తనవైపు చూడదని గ్రహించి, లేచి, వారికి నమస్కరించి, లోనికి వెళ్ళిపోయెను. ఆమె పదిక్షణికములలో తిరిగి ఒక కమ్మ చేతపుచ్చుకొని, లోనికివచ్చి అది చక్రవర్తికి ఇచ్చెను. పట్టువస్త్రము వలె మెత్తగా, పొడుగుగా ఉన్న మొగలిరేకుపై మషీవర్ణాలతో లిఖింపబడిన ఆ లేఖను చక్రవర్తి గొంకప్రభువును చదువ నియమించినారు.

గొంకప్రభువు ఆ కమ్మను సవినయంగా మోకాలిపై వంగి అందుకొని తన స్థానము చేరి నిలిచి చదువ నారంభించెను.

"మహారాజాధిరాజా, అష్టమ చక్రవర్తీ ! నిన్నటిదినం అనగా శక సంవత్సర ౧౧౮౨ రక్తాక్షి సంవత్సర జ్యేష్ఠ బహుళ పాడ్యమి బుధవారం నాడు రాత్రి మహాదేవరాజు గోదావరీతీరంలో దండువిడిసి ఉండగా గోన గన్నారెడ్డి అనే ఒక గజదొంగ ఏబదివేల సైన్యంతో విరుచుకుపడి మహాదేవరాజు సైన్యాలను డెబ్బదివేలవరకూ హతమార్చి, మహాదేవరాజు సంసిద్ధుడయ్యేలోపునే సైన్యంతో మాయమైపోయినాడు. అతన్ని వెంబడించి నాశనం చేయవలసినదిగా రెండులక్షల సైన్యాన్ని మహాదేవరాజు వాండ్ల వెనుక పంపించినవా డాయెను. ఇది మమ్మేలిన వారికి మనవిచేస్తూ మహాప్రభువుల సేవకుడు మిరియాల ముమ్మరాజు."

ప్రసాదాదిత్య ప్రభువు శివదేవయ్య దేశికులవంక చూచి, 'గురుదేవా ! గోన గన్నారెడ్డి మనం చేయవలసిన పనిని మనకోసం చేసిపెడుతున్నాడు! ఇది విచిత్రమే !' అని మనవి చేసెను.

శివ : వీరభద్రమహారాజా ! తమ అభిప్రాయం సెలవియ్యండి.

వీర : గన్నారెడ్డి ప్రభువు చాలా ఉత్తమకార్యం చేశారు. అంత చిన్ని సైన్యంతో అతితేలిక ఉత్తమనాయకునిలా యుద్ధం నడిపారు.

శివ : ముందు మన కర్తవ్యం ?

వీర : అవసరమైతే గన్నారెడ్డి ప్రభువుకు మనం సహాయం పంపించి మహాదేవరాజు బలం తగ్గించాలి. ఓరుగల్లు ఎంత దుర్భేద్యమైనా చాలా కాలం ముట్టడి జరుగకూడదు.

శివ : మీ ఉద్దేశ్యము మాకు అవగతమైంది. జాయపమహారాజుల వారూ! వెంటనే ఏబదివేల సైన్యము గన్నారెడ్డి సహాయానికి పంపండి, ఆ సైన్యానికి తంత్రమాల మల్లినాయకులు నాయకత్వం వహిస్తారు. మనం దుర్గరక్షణ నిర్వహిద్దాము.

సభ పూర్తికాగానే చాళుక్య వీరభద్రమహారాజు తమ నగరు చేరిరి. గుఱ్ఱపు స్వారి, ధనుర్యుద్ధపరిశ్రమ, ఖడ్గయుద్ధము, సూర్యనమస్కారాలు చేసి స్నానము చేసి పూజసలిపి, భోజనమాచరించి, కొందరు పండితులతో శాస్త్రచర్చచేసి, ఆ వెనుక వీణావాదనము విని, రాత్రి రెండవయామమధ్యమున శయనమందిరమున కేగిరి.

తెల్లవారుటకు రెండుఘడియ లున్నదనగా తీయని మేలుకొలుపులు మురళితో ఒక గాయకుడు పాడుచుండ చాళుక్య వీరభద్రమహారాజు లేచి, కాలోచితకృత్యా లాచరించి, అలంకృతులై, సపరివారులై, నగరపాలకుడైన ప్రసాదాదిత్య ప్రభువుతో, మహాతలవరితో బయలుదేరి నగరసంచారముచేసి, సర్వ యుద్ధసన్నాహాలు, నగరరక్షణసన్నాహాలు స్వయముగా చూచి, పరిశీలించి, కావలసిన మార్పులు ఆజ్ఞాపించి ఇంటికి వేంచేసిరి.

స్నానమాచరించి, పూజాదికము లొనర్చి, సభలోనికివచ్చి ఇష్టాగోష్ఠి సలిపి, రాజకీయ వ్యవహారాలు చర్చించి, భోజనానికి దయచేసిరి. ఆయన పంక్తిలో సేనాపతులు, రాజబంధువులు—ఎవరో పదునైదుగురు ఎప్పుడూ ఉండవలసినదే!

భోజనానంతరము తాంబూలచర్వణకాలమందు మరల గాంధర్వ గోష్ఠి ఇతరుల నగరులకు అతిథి అయినప్పుడుమాత్రము నర్తకీమణుల నృత్యగోష్ఠి చిత్తగింతురు. తమ ఇంటిలో స్త్రీ లుండగూడదని విషేధించిరి.

౨

చాళుక్య వీరభద్రమహారాజు రుద్రమదేవి రాజ్యపాలనము నిష్కంటకము చేసి తాను హిమాలయాలకు పోవుటే యుక్తమని నిశ్చయించుకొనెను. తాను సామ్రాజ్ఞిని ప్రేమించినాడు. ఆమె తన్ను ప్రేమించుట ఎట్లు? ఒక స్త్రీ తన్ను ప్రేమించగలదని ఆశపడు పురుషుడు ఉత్తమహృదయము కలవాడు కాడు; స్త్రీ పురుషులు ఒకరికొకర కొకరయినప్పుడు ప్రేమింపజేయు నవసరమేమి? ప్రేమ అద్వంతరహితము. ప్రేమికులు ఒకరినొకరు అనాదిగా జన్మజన్మలుగా

ప్రేమించుచుందురు. అట్టివారు చూచుట, ప్రేమించుట రెండును ఒకేక్షణంలో సంభవించును.

ఒకరినొకరు ఎరుగకుండగనే ఒకజన్మంలో స్త్రీ పురుషులు ప్రేమింతురు. వారు చూచుకొనుట అనగా, రహస్యముగా ప్రవహించేనది బాహ్యాన వ్యక్తమగుట మాత్రమే. దానిని ప్రేమ అని మన మందుము.

ఒక స్త్రీ తన్ను ప్రేమించిన పురుషుని చూడనేని చూడకపోవచ్చు. ఒక పురుషుడు తన్ను ప్రేమించిన స్త్రీని ద్వేషించియుండవచ్చు, ఆ ప్రేమను గమనిం పకపోవచ్చు. అప్పుడు ప్రేమధర్మము సంపూర్ణము కాలేదని నిశ్చయమేకదా। అటు లయ్యు భగవంతుని మనము తెలిసికోనట్లే, భగవంతుని వ్యక్తరూపమయిన ప్రేమను తెలిసికోలేము.

చాళుక్య వీరభద్రుడు రుద్రమదేవి కాత్యాయనీదేవి అవతారమే అని నమ్మి నాడు. ఆమె తన్ను ప్రేమించుట అసంభవము. అవతారమూర్తి కానిచో ఏస్త్రీ తన స్వీయస్వత్వముచే సామ్రాజ్ఞి కాగలదు? చక్రవర్తులకు కుమారులు కలుగక, బాలికలు మాత్రమున్న చరిత్ర లెన్నియో ఉండినవి. వారందరు చక్రవర్తినులగుదురా?అట్టి పదవికి అర్హులు పుట్టుకతోనే వ్యక్తమగుట కద్దు.

పురుషవేషముతో ఉన్నప్పుడు ఆ అవతారస్వరూపమును చూచినాడు. అప్పుడామె ఒక దివ్యమూర్తిగా తనకు వ్యక్తమః కాలేదా? ఆమెకు రాని భాషలు, శాస్త్రాలు లేవు. ఆమె సౌందర్య పరసీమ, అల్పుడయిన తా నెక్కడ, ఆమె ఎక్కడ? ఒక మహావంశమునకు తుదిరెమ్మలు తాను, తన తమ్ముడును. దివ్య త్వము జారిన వంశమునుండి చక్రవర్తి పదియారు చిహ్నాలూ విడిపోవును. అవి యెల్ల కాకతీయవంశమును వరించెను. ప్రతి వాంశానికి చక్రవర్తిత్వ. ధనేశత్వాలు ఏనాడో వదలిపోవలసినవే. వానికి ఇంతకాల మాయుర్దాయము అని ఉన్నది. ఇక్ష్వాకువంశము, హైహయవంశము, కురువంశము, శిశునాగవంశము, నంద వంశము, మౌర్యవంశము, శాతవాహనవంశము, దక్షిణేక్ష్వాకువంశము, సాలంకా యన విష్ణుకుండిన బృహత్పాలాయన, పల్లవచాళుక్య వంశాలు సామ్రాజ్య సింహా సనాలు అధివసించాయి, అంతరించాయి. ఈనాడు కాకతీయులు చక్రవర్తులు.

తన చేయి చూచి, జాతకము చూచి గోపాదక్షేత్రాన కొలదికాలము నివ సించిన ఒక మహాయోగి ఏమి వర్ణించినాడు? నీ వంశాన ఇంకొక చక్రవర్తి పుట్టును. ఆతనికి, నీకు విచిత్ర పితామహసంబంధ ముండును అవి ఏమో। భవి ష్యత్తు తనబోటి మూఢమానవులకు మూడడుగుల దూరములో ఉన్నను కనబడదు కదా।

చాళుక్య వీరభద్రుడు నిదురజెందినాడు. ఆ మరునాడు శ్రీ రుద్ర చక్రవర్తి ముమ్మడాంబికాదేవితో కలసి వడ్డంగలకు బుద్ధగణపతిని పూజింప బయలుదేరినారు.

ఆ దేవుని పూజించి ఆ దిన మక్కడ విడిదిచేసి, ఆ తెల్లవారుగట్ల బయలుదేరి ఏకవీరామహాదేవీ దర్శనార్థము మొగిలిచెర్లకు పోయి అక్కడ అయిదుదినాలు ఉత్సవార్చనలు జరిపించ నిశ్చయమైనది. శ్రీ రేచర్ల ప్రసాదాదిత్యుని కుమారుడైన రుద్రసేనాని మూడువందలమంది వీరులతో ఆమెకు అంగరక్షకుడుగా వెళ్ళినాడు.

ఆమె వెళ్ళి అయిదురోజు లయినది. చాళుక్య వీరభద్రమహారాజునకు ప్రతిదినము తన ఇష్టదేవతను చూడకపోవుటచే మతిపోయినట్లే అయినది. ఆయనకు ఏదియో ఆవేదన కలిగెను. తన దేవతామూర్తితో ఏకాంతనిముషములు తలపడుదురో? ఆమెను తేరిచూడజాలువా రెవ్వరు? అయినను రాక్షసత్వానికి ఉచితానుచితాలు ఏమి తెలియును? తన బలము తా నెరుంగలేని రాక్షసహృదయుడు ఏమి చేయునో! అటుపిమ్మట లోకము నెంత తలక్రిందు లొనర్చినను ఏమిలాభము?

ఆయన వేగముగా శివదేవయ్య దేశికులకడకు పోయినాడు. వారికి పాదాభివందన మాచరించి, ఉచితాసనముపై కూరుచుండి, 'గురుదేవా! హృదయములో ఏదో గాఢమైన ఆవేదన కలుగుతున్నది' అన్నాడు.

"రాబోయే భయంకరయుద్ధం ప్రతి ఆంధ్రవీరుని హృదయంలోనూ ఆవేదన కలుగజేస్తూ ఉన్నది."

చాళుక్య: స్వామీ! యుద్ధావేదనకన్న ఇంకనూ తీవ్రమైనదిది.

శివ: యుద్ధంలోకి ఉరికే ప్రతివారికీ ఆలాగే ఉంటుంది. మహారాజా! యుద్ధంలో ప్రవేశించిన వెంటనే ఈ ఆవేదన తీరుతుంది. అప్పుడు యుద్ధతంత్రం నడిపే ఆతురత ఒక్కటే ఉంటుంది. ఈ ఆతురతా, యుద్ధపూర్వకాల వేదనా కలసి, భరింపలేని బాధ హృదయంలో కుములుతూ ఉంటుంది.

చాళుక్య: చిత్తం. కాని నా ఆవేదన యుద్ధానికి సంబంధించిందే కాదు, భగవాన్!

శివ: దాని స్వరూపం ఏమాత్రమూ తెలియదా తమకు?

చాళుక్య: చక్రవర్తి కొద్దిమంది అంగరక్షకులు కొలుస్తుండగా మాత్రమే మొగలిచర్ల గ్రామం దయచేసిఉన్నారు.

శివ: లక్షలకొలది ఆంధ్రవీరులు! ఆంధ్రనాయకులు, సుక్షత్రియులు నిండి ఉన్న ఈ ప్రదేశాలకు విరోధు లెవరు రాగలరు మహాప్రభూ!

చాళుక్య: చిత్తం. అయినా ఏదో నిర్వచింపలేని ఆవేదన భగవాన్!

శివ: ప్రభూ, మీబోటి ఉత్తములకు వట్టి ఆవేదనలు కలుగవు. నేను మహారుద్రుని ధ్యానిస్తాను.

చాళుక్య వీరభద్రుడు వారి పాదాలు కెరిగి ఆశీర్వాదమంది తన నగరు చేరెను. ఆ రాత్రిఅంతయు ఆ గాఢావేదన అణుచుకోలేకపోయెను. వణు

వాతనే లేచి ద్వారపాలకునికి తన ఉత్తమాశాన్ని సిద్ధముచేయుమని ఆజ్ఞ యిచ్చి, తాను సర్వాయుధోపేతుడై ఆ అశ్వరాజమును చెంగున అధివసించి మొగలిచర్లాభిముఖుడై ప్రయాణము సాగించెను.

## 8

కాకతీయ దేవాలయశిల్పము చాళుక్యశిల్పమున గొన్ని మార్పులు కల్పించినది. ఆంధ్ర శాతవాహనుల కాలములో గుహావాస్తు, స్తూపవాస్తులతోపాటు, దేవాలయవాస్తుకూడా వర్ధిల్లినది. ఆంధ్రులు బౌద్ధులుకాకముందున్న అనాదియగు శైవమత మవలంబించినారు. ఆర్యజాతియగు ఆంధ్రజాతి వేదధర్మాన్నీ అసురికమైన శైవధర్మాన్నీ సమన్వయముచేసి ఉత్తమధర్మపథ మొకటి సృష్టించెను. ఆంధ్రులు కాకతీయులకు రెండువేల సంవత్సరాలకు పూర్వమే గోదావరీ కృష్ణాతీర భూములన్నియు ఆక్రమించి ఆ ప్రదేశాలలో అదివరకే నివాసంచేసే రాక్షస జాతులను లోబరచుకొని వారిని తమకు దునులను చేసికొనిరి.

ఆంధ్రులు తమతోపాటు తెచ్చిన దేవాలయశిల్పము అద్భుతమయినది. వారు గోడలు కట్టుటకు రాళ్ళను ఉపయోగించలేదు. వివిధ మృత్తికలను కలిపి, ఇటుకలుచేసి వానితో నాలుగైదు అంతస్తుల భవనాలు నిర్మించేవారు. అటుల ఇటుకలతోనే వారు దేవాలయాలు నిర్మించుకొనేవారు.

బౌద్ధయుగంలోను ఆంధ్రులు స్తూపాలు ఇటుకలతోనే నిర్మించిరి. విగ్రహాలకు, ద్వారాలకు, ఆయక స్తంభాలకు శిలలను ఉపయోగించెడివారు. కొండలు తొలిచి చైత్యాలుగా, విహారాలుగా, గుహలు నిర్మించేవారు; ఇక్ష్వాకుల కాలములో రాతిలో ప్రథమచైత్యగృహ నిర్మాణము జరిగెను. పల్లవులకాలములో ఒకేరాతితో చెక్కిన దేవాలయాలు నిర్మాణము చేసినారు. ఆంధ్రశిల్పులు చాళుక్యుల కాలము నాటికిగూడ పూర్వరీతినే దేవాలయాలు ఇటుకలతో, సున్నముతో కట్టుచు, యండపాలు, స్తంభాలు, విగ్రహాలు రాళ్ళతో నిర్మింపసాగిరి. రాను రాను చాళుక్య కాలపు టంతమున ఆంధ్రశిల్పులు ప్రతిభతో గర్భాలయ ముఖమండప మధ్యమండప వివాహమండపాలు శిలలతో నిర్మించి, శిఖరాలుమాత్ర మిటుకలతో నిర్మించిరి.

కాకతీయ చక్రవర్తుల కాలములో స్తంభశిల్పము, ద్వారశిల్పము ఇంకను అపూర్వకౌశలముతో ముందునకు సాగెను. దేవాలయశిఖరము గూడ చాళుక్యకాలపు రూపమునుండి, మార్పుపొందెను. చాళుక్యశైవము, సాధుశైవము, కాకతీయశైవము, వీరశైవము, వీరశైవశిల్పము వైష్ణవవ్యతిరేకముకాదు; జైనవ్యతిరేకము వీరశైవ శిల్పములో వీరభద్ర నందికేశ్వర లింగమూర్తుల వికాసముచే నిండిపోయినది.

వట్టి లింగమూర్తి పూజతో తృప్తిపడిన చాళుక్యశిల్పి శైవలీలావినోది అయినాడు. రాష్ట్రకూట వంశాచరణంలో కాకతీయ రసపూర్ణ జీవిత ప్రాబల్యాన ఆంధ్రశిల్పి నృత్య విన్యాసకుడు, దివ్యసౌందర్య లీలావిలాసుడు, అలంకార పూరితాత్ముడు అయెను.

మొగలిచర్ల కాకతమ్మగుడి శ్రీ కాకతీయ ప్రోలమహారాజు ప్రథమ తనయుడయిన శ్రీ రుద్రచక్రవర్తి కట్టించినాడు. ప్రసిద్ధాంధ్ర శిల్పి ఎఱ్ఱయఒజ్జ నిర్మించినది. ఆచార్య ఎఱ్ఱయఒజ్జ ప్రసిద్ధ ఆంధ్రశిల్పి బ్రాహ్మణవంశమువాడు; సకలాగమశాస్త్రవేత్త, వేదవేదాంగ పారంగతుడు. అతని శిల్పికౌశలము అనుమకొండ రుద్రేశ్వరాలయంలో ఆకాశచుంబియయినది. ఆ ఎఱ్ఱయఒజ్జ తండ్రి కామయఒజ్జ ప్రోలమహారాజు కాలంలో శైవాలయాలు, జైనాలయాలు నిర్మించినాడు. కామయఒజ్జ తండ్రి రాజమహేంద్ర పురనివాసి. అతని పూర్వీకులు ద్రక్షారామ, భీమారామ, సోమారామ దేవాలయాలు నిర్మించారు. షట్సహస్ర దేశవాసి అయిన మహాచార్య భీమఒజ్జకు ఎఱ్ఱయఒజ్జ మేనల్లుడు.

ఎఱ్ఱయఒజ్జ ముఖమండపంలో నిర్మించిన ఎనిమిది స్తంభాలకు నాలుగు పైపుల ముప్పదిరెండు విధాల అలంకారశిల్పము విన్యసించినాడు. అంగుష్ఠ ప్రదేశంలో కేశసదృశమయిన శిల్పము చూపరకు హృదయస్పంద మగునట్లు అద్భుతముగా విన్యసించినాడు.

దేవీ గర్భాలయద్వార సౌందర్యము వర్ణించ నలవికానిది. ద్వారఫలకముపై దేవీనాట్యము విన్యసించెను. ద్వారమున ఎనిమిది ఫలకములలో ఒక ఫలకము లతాయుక్తము, ఆ లతల రెండుపైపులా రెండురథాలు, పైన ఇంకొక వాద్యవిశేష ఫలకము లతాఫలకంనుండి ఉబ్బెత్తుగా ముందుకు వచ్చింది. శంఖ కాహళ వేణువులు, నాదస్వరాది ముఖ్యవాద్యాలు, డమరుమర్దళ మృదంగాది చర్మవాద్యాలు, రావణహస్తాది తంత్రీవాద్యాలు అనేకులు వాయించుచు నాట్యం చేస్తున్నారు. ఆఫలకానికి ముందు మరల లతాఫలకము. ఆ లతా ఫలక మీవల ద్వారపాలక ఫలకము. ద్వారపాలక ఫలక మీవల భక్తఫలకము; మరల లతాఫలకము.

ఏకవీరాదేవి విగ్రహవిన్యాసంలో ఎఱ్ఱయఒజ్జ చూపిన శిల్పసౌందర్యము అలౌకికము. ఏకవీరావాహనమయిన సింహంలో ఎఱ్ఱయఒజ్జ బ్రహ్మదేవునే ఓడించినాడు.

ఎఱ్ఱయఒజ్జ పనితనం గమనిస్తూ పూజానంతరం రుద్రదేవి అన్నాంబికతో చర్చ సాగించింది.

రుద్ర : చెల్లీ, మా పెద్దతాతగారి ఆస్థానశిల్పి ఎఱ్ఱయఒజ్జ ఈ ఏకవీరాదేవి గుడిని నిర్మించాడు. అనుమకొండ రుద్రేశ్వరమునూ ఆయనే నిర్మించాడు.

అన్నాంబిక: అక్కగారూ! ఈ శిల్పి ప్రతిభ అనన్యంగా కనిపిస్తున్నది. ఈయన దేవాంశసంభూతుడై ఉండాలి అక్కగారూ. ఆ లతలు మొలిచినట్లున్నవే గాని మలిచినట్లు లేవు.

రుద్ర: ద్వారఫలకం పైన దేవీనాట్యం ప్రత్యక్షమవుతుంది.

అన్నాం: ఆ నాట్యసౌందర్యం శరత్పూర్ణిమలా లోకాలు ఆవరిస్తున్నది.

రుద్ర: అమృతగంగ శివుని జటలలో అవతరించినట్లుంది.

అన్నాం: సృష్టిమూలమైన త్రిభంగములో ఆ దేవి చిరునవ్వు నవ్వుతున్నది.

రుద్ర: దేవీభాగవతంలో దేవిని నాట్యకళోద్భవ అన్నాడు వేదవ్యాసుడు.

అన్నాం: ఆమె నవ్వు వెన్నెలగా, ఆమె చూపు వెలుగుగా....

రుద్ర: ఆమెమోము ఆకాశముగా, నంగిననడుము త్రిభువనాలుగా....

అన్నాం: ఆమె స్తనములు సర్వకళలుగా, కంఠము భక్తిగా....

రుద్ర; ఆమె భుజములు శాస్త్రాలుగా, ఆమె చేతులు విజ్ఞానవిచారణగా ....

అన్నాం: ఆమె నాభి మాయావర్తంగా....

రుద్ర: ఆమె పెదవులు సర్వరసాలై....

అన్నాం: ఆమె కటి సర్వప్రేమలై, ఆమె ఊరువులు సకలాధారాలై....

రుద్ర: జంఘలు జీవమై....

అన్నాం: ఆమె సర్వవిశ్వమై....

రుద్ర: ఆమె నాట్యమే సృష్టి స్థితి లయాలై....

అన్నాం: జయ! జయ! సకల భావరూపా!

రుద్ర: జయ! జయ! లాస్య నాట్య తాండవమూర్తీ!
జయ జయ ఏకవీర! మా అనుగుతల్లీ!
జయ మమ్మా నీకు మేము బిడ్డలమమ్మా!

జేగంటలు మ్రోగునవి. వా రిరువురు నిమీలితనేత్ర లైనారు. త్రిభంగాకార యైన ఏకవీర తప్తజాంబూనదాభయై, కాంచనారుణపరిధానయై, జ్వలితాగ్ని శిఖాభ సర్వభూషణ భూషితయై రుద్రాంబకు ప్రత్యక్షమైనది. ఆమె విశ్వనాట్యము చేస్తున్నది. ఆమె లలితపదగతులకు వేణుగానాలవలె, చిగురు జొంపాలువలె హస్తములు ఆడుతున్నవి. ఆ మూర్తి కన్నులనుండి ఒక మహాతేజం రుద్రాంబ హృదయంలో ప్రవేశించి లయించినట్లయింది. రుద్రదేవి సర్వ విశ్వమధ్యస్థయై పులకరించిపోయి, ఏదో దివ్యమత్తతలో ఒక లిప్తమాత్రము చైతన్యరహితయైనది.

సర్వమాధుర్యాలు ఉత్తుంగతరంగాలై సుడులు తిరిగి, ఆ సుళ్ళమధ్య లయాత్మకమై వేయిరాగాలు సంశ్లేషింప, సర్వవర్ణపూరితయై ఏకవీరాదేవి నాట్యం చేస్తున్నది. ఆ పరమపవిత్రదర్శనమున పరవశయైన అన్నాంబిక హృదయాన కంఠమాలనుండి ఒక పుష్పము ఎగిరివచ్చి వ్రాలి కరిగి హృదయంలో లీనమైనట్లుతోచి అన్నాంబిక చైతన్యరహితురాలైనది. ఇనుపుకు ఒక్కసారి కనుల ఆనందబిందువులునిండ రెప్పలు తెరిచినారు.

౪

ఏకవీరాదేవి పూజలు పూర్తిచేసుకొని రుద్రదేవి, అన్నాంబికా, ముమ్మడాంబలతో మొగలిచర్లనుండి సాయంకాలమున బయలుదేరెను. రుద్రదేవి, ముమ్మడమ్మ, అన్నాంబిత నాలుగు అశ్వములుపూన్చిన రథముపై అధివసించి ముందు వెనుకల అశ్వికులు కొలిచిరా ప్రయాణము సాగించిరి. రేచర్ల రుద్రారెడ్డినాయుడు అంగరక్షకులకు నాయకుడై అప్రమత్తుడై ఉండెను.

ఆ వానకారున సస్యశ్యామలమై దేశం పచ్చని క్రొత్తవస్త్రము కట్టుకొన్న యిల్లాలులా కలకలలాడుచున్నది. వాన కురియబోయె ఉక్కపోతలతో ప్రజలందరకు చెమటలు పోస్తున్నవి. పొలాలలో రైతులు వ్యవసాయమనే దివ్యయజ్ఞాలు ప్రారంభించారు. వానకోయిల అరుపులు, ఆలమందల అంభారవాలు, రైతులు అదలింపు కేకలు మందరశ్రుతిజనిత కాంభోజరాగమై ఆ సాయంకాలాకాశవలయమున నిండినది.

ముమ్మక్కదేవి, అన్నాంబిక, రుద్రదేవి—యాదవమహాదేవునివల్ల సంభవించబోయే దారుణ యుద్ధము, భయంకర రక్తపాతము, ప్రాణనాశము, ప్రజా సంక్షోభములనుగూర్చి మాట్లాడుకొనుచుండిరి.

రుద్రా: చెల్లీ! యుద్ధాన విజయం తెచ్చేవి రెండు. ఒకటి ఎదుటివాడిబలం సంపూర్ణంగా అవగాహన చేసుకోవడం. రెండవది ఎదిరి బలాన్నిబట్టి మనం వ్యూహరచన చేసుకోవటం.

అన్నాం: అక్కగారూ, వ్యూహరచనలో భేదము లుంటాయనా మీ ఉద్దేశము.

రుద్రా: అవునమ్మా చెల్లీ! యెదుటివాడిబలం ఎక్కువయితే ఆత్మరక్షణ కొరకు వ్యూహాన్ని రచించుకొని, యెదుటివాడిబలం మనలను తాకినకొలదీ నానాటికి హీనమయ్యేటట్లు చూడాలి. నీరసించినాడని తెలియగానే శత్రువుపై విజృంభించి నాశనం చేయాలి.

ముమ్మక్క: అక్కగారూ! శత్రువుయొక్క బలమే తక్కువగా ఉండి మన బలం ఎక్కువగా ఉంటుంది; శత్రువు దుర్భేద్యమైన వ్యూహం రచించుకొని వుంటాడు. అప్పుడు శత్రువుమీదికి వెళ్ళడము మనకు నష్టమే కదా!

రుద్ర: నిజమే. అప్పుడు సర్వకవచభేదకమైన యుద్ధవిజృంభణ సాగించి శత్రునాశనం చేయాలి, ఈ రెండు యుద్ధాలలో గన్నారెడ్డి అసమాన ప్రజ్ఞావంతుడు.

అన్నాం: గన్నారెడ్డిది దొంగపోటుగాదా, అక్కగారూ!

రుద్ర: గన్నారెడ్డిని యెవరైనా గజదొంగ అంటే చీల్చేసేదానివి, ఇప్పుడు ఇలా అంటవేమి చెల్లీ!

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు. రుద్రదేవి ప్రేమతో అన్నాంబికను, ముమ్మక్కను కౌగలించుకొని, 'చెల్లీ! మనుష్యునిజ్ఞానం ఎంత సంకుచితమైనది! మూడడుగులు ముందుకు, వేయి అడుగులు వెనుక్కు చూడలేని అజ్ఞానంతో నిండి ఉంటాడు సర్వవిశ్వమూ ఆవరించిఉన్న పరమ రహస్యాల ఛాయలన్నా మనకు తెలియవుసుమీ.

రుద్రాంబికాదేవి నిట్టూర్పు విడిచింది. తమ పరితాపాలన్నీ మరచి పోయి ఏవో ఆలోచనలలో అన్యమనస్కలైఉన్న వారి ముప్పురకు ఒక్క సారిగా వేయి పిడుగులు విరిగిపడినట్లు గగ్గోలు వినబడింది. నాలుగువేలమంది సైనికులు రుద్ర దేవి రథమును, అంగరక్షకులను చుట్టుముట్టారు. అంగరక్షకులను ఇనుప గోడలా చేసి, రుద్రసేనాని రథాన్ని ఆపుచేసి ముందు నుంచున్నాడు. హరిహరదేవ, మురారి దేవులు రుద్రసేనాని ముందర ఆగినారు.

మహావీరుడును, యువకుడు అయిన రుద్రసేనాని హరిహర మురారి దేవుల ఉద్దేశము కనిపెట్టి, తానెన్నడూ పొందని భయముచే గజగజ వణకిపోయినాడు. 'శ్రీశ్రీ రుద్రదేవి చక్రవర్తికి ఎలాంటి ఆపద కలుగుతుందో! ఎప్పుడూ ఊహించ లేని విధంగా ఈ ఆపద వచ్చిపడిం'దని రుద్రసేనాని కళవళ పడుచున్నాడు.

హరిహరదేవుడు ఉచ్చైస్స్వనంతో—రేచర్ల రుద్రదేవుల వైపు చూస్తూ, 'ఓయి రేచర్లరుద్రుడా! నువ్వేమిచేయగలవు? మేమిరువు రన్నదమ్ములము ప్రాణాలకు తెగించినవారము. మృత్యుదేవతాస్వరూపులు మా నాలుగువేల మంది సైనికులు. కాబట్టి నీవు నీ ప్రాణం దక్కించికొని వెళ్ళిపో. మేము మా చెల్లెలు రుద్ర దేవిని మా కోటకు బందీగా తీసుకొనిపోతున్నాము' అని తెలిపినాడు.

రుద్రదేవికి, అన్నాంబికకు, రేచర్ల రుద్రునికి—ఎవరికీ నోట మాట రాలేదు. మురారిదేవుడు వెడనవ్వు నవ్వుచు 'సకల జంబూద్వీపానికి మకుటమయిన ఆంధ్రదేశాన ఆడది రాజ్యం చేయడానికి ధర్మం ఒప్పుకోదు. రుద్రచక్రవర్తి వెనుక సింహాసనం అధివసించవలసినది మా తండ్రిదారు. దొంగలై, అధర్మపూర్ణులై మహాదేవరాజూ, గణపతిదేవుడూ సింహాసనా లెక్కినారు. అయినా ధర్మస్వరూపులు, అపరజినదేవులు అయిన మా తండ్రిగారు మాటలాడక, లెక్కచేయక ఊరుకొన్నారు.

ఆ యధర్మానికి మకుటాయమానంగా రాచగద్దెమీద ఆడదా నెక్కించటమా!' అన్నాడు.

అప్పుడు ముమ్మక్క రథంమీద లేచి నిలుచుండి, 'హరిహరదేవ మహా రాజా! తాము ఈ విషయం శ్రీ గణపతిదేవ చక్రవర్తులనే అడిగి ధర్మ నిర్ణయం ఎందుకు చెసుకోలేదు?' అని ప్రశ్నించింది.

మురా: మాకు ఆడవాళ్ళతో మాటలు పనికిరావు. రేచర్లరుద్రుడా! ఏమం టావు? నీ సైన్యాలన్నీ ఆయుధవిసర్జనం చేస్తాయా, ఎక్కడివారి నక్కడే హతమార్చమా?

హరి: మీరు ఆయుధాలు విసర్జించి, గుఱ్ఱాలు దిగి నడచిపోండి. లేదా, రుద్ర దేవీ, ముమ్మక్క... ఆ ముద్దో అమ్మాయిల ప్రాణాలు దక్కగలవని మేము చెప్పలేము.

౫

తన ఉత్తమాశ్వంపై ప్రళయ ఝంఝులా, ధనుర్వినిర్ముక్త శరంలా, భక్తుని కాంక్షలా శ్రీచాళుక్య వీరభద్ర మహారాజు మహాఫ్లుతగతిని పోవుచుండెను. ఆయన ఆలోచనలు లోకాలంతటా పరువిడుచున్నవి. రక్షకసేనా పరివేష్టితయై యున్న సామ్రాజ్ఞికి భయమేమిటి? ఇది తనలో ఉన్న కోర్కెలవల్ల ఉద్భవించిన భయముకాబోలు! అయినా ఇప్పుడు అక్కడక్కడ సామంతులలో ఉన్న దుష్టత్వాలు, యాదవుల దుండగీడుతనం తలచుకొనగా, మనస్సు పరిపరివిధాల పోవుచున్నది. తీరా, తాను రుద్రాంబికను కలుసుకొన్నప్పుడు ఏ ఆపదా లేకపోయినచో తన యత్నము నవ్వులపాలగును. అంతకంటె ఆపద ఏమీ సంభవించదుకద! ఒక వేళ ఏమూలనో ఒదిగిఉన్న ఆపద విజృంభిస్తే, తనరాక ఆ ఆపత్తును అరికట్టగలిగితే తాను వెళ్ళకపోయి ఉండడము ఈ భూమి ఉన్నంతకాలము మరువరాని భయంకర సంఘటనగా పరిణమించవచ్చునుగదా?

రాజసేవలో ఛాందసమున్నా క్షమించవచ్చునుగాని ప్రమత్తతఉంటే కోటి జన్మలకైనా క్షమార్హముకాదు. ప్రేమసేవ అంతే! ఒక రేమను కొందరో యని ధర్మాచరణం ఉపేక్షించుట అధర్మమే అవుతుంది. ధర్మాచరణం లోకాభిప్రాయ సంబంధము కలది కానేకాదు.

చాళుక్య వీరభద్రుడు వడ్డపల్లెకు జాముప్రొద్దెక్కినప్పటికి చేరినాడు. వడ్డ పల్లె పురవాసులు చాళుక్య వీరభద్రమహారాజు ఒంటిగా రావడంచూచి ఆశ్చర్య మందినారు. గ్రామాధిపతీ, పెద్దలూ వీరభద్ర మహారాజునకు గౌరవాలన్నీ జరిపి నారు. మహారాజు స్నానాదికాలన్నీ నెరవేర్చి బుద్ధగణపతికి సహస్రనామ పూజాది అర్చనలు అర్పించి, అచ్చట ఒక సేనాపతి ఇంట భోజనమాచరించి, విశ్రయించి మొగలిచర్లకు ఏకవీరాదేవిని అర్పింప తన ఉత్తమ అశ్వము నెక్కి ప్రయాణ మాయెను. వడ్డపల్లెనుండి నూర్గురు అశ్వికులు మహారాజునను సరించారు.

మొగలిచర్లకు చేరినవెంటనే అచ్చట దేవికి వీరభద్ర మహారాజు పేర అర్చనలు జరిగినవి, వడ్డపల్లిలో, మొగలిచర్లలో మహారాణి పూజలు చేయించిన వైనము తెలియవచ్చెను.

పూజలు పూర్తిచేసుకొని మొగలిచర్ల నుంచి తన్ననుసరించిన ఆశ్వికులతో శ్రీ చాళుక్య వీరభద్రమహారాజు ప్రయాణము సాగించెను. మూడు గవ్యూతుల దూరము వచ్చేసరికి దూరముగా ఒక చిన్న సేన అగిఉన్నట్లు వీరభద్రమహారాజు నకు పొడగట్టెను. వెంటనే తన సైనికుల కందరికీ ఉత్సాహపూరిత వచనాలు పలికి, తన చిన్నసేనను అర్ధచంద్రవ్యూహంగా రచించి ముందుకు చొచ్చుకొని పోయినాడు వీరభద్రమహారాజు.

హరిహరదేవ మురారిదేవులకూ, రుద్రమకూ దూరంగా ఏదోచిన్న సైన్యం వచ్చుచున్నట్లు కనబడినది. ఆ సేనవచ్చేలోపలనే రుద్రదేవిని హతమార్చాలని హరిహర మురారిదేవులును; తన సైన్యమూ తన ప్రాణమూ బలియిచ్చి అయినా ఆ సేన వచ్చేవరకూ చక్రవర్తిని రక్షించితీరాలని రేచర్ల రుద్రప్రభువును సిద్ధమై ఉండిరి.

రేచర్ల రుద్రుడు హరిహరదేవుని చూచి 'ఓయి వెట్టిమహిరాజా ! మీరు శ్రీరుద్రచక్రవర్తిని హతమార్చి లాభం పొందాలని చూస్తున్నారు. కాని చక్రవర్తిని హతమార్చడానికి ప్రయత్నించేలోగా మీ ప్రాణాలు మీకు దక్కాలేకద ? ఇది నేను హస్యంగాగాని, బడాయిగాగాని అనుటలేదు' అనెను.

రుద్రదేవి హరిహరదేవునిచూచి 'హరిహరదేవప్రభూ ! నువ్వుగానీ, నీ తమ్ముడుగానీ నన్ను పట్టుకోలేరు. నాలువేలమంది సైనికులతో, గజములతో దారికి అడ్డంరావడానికి నువ్వు సాహసించావు. నలభైవేలసేనతో, గజాలతో వచ్చినా నీకు విజయంకాదు. నీ ప్రాణం కోల్పోవడమే అవుతుంది' అని తెలిపినది.

అన్నాంబిక లేచి రథముమీద నిలుచుండి 'ఓయి అవినీతిపరుడా ! దొంగ తనంవల్ల రాజ్యాలు నిర్మాణంకావు. మగటిమి కలవాడవయితే ఇదివరకే నీ రాజ్యం నువ్వు నిర్మించుకొనే ఉందువు. మా ప్రాణాలు పోవుగాని మీప్రాణాలు మాత్రం బలి అవుతాయి' అని కేకవేసి బాణం ఎక్కుపెట్టి హరిహరదేవునిపై గురిపెట్టింది.

ఆ వెంటనే మురారిదేవుని బాణంవచ్చి అన్నాంబిక ధనుస్సును రెండు తుండెములు చేసెను. మురారిదేవుడు మరల బాణం సంధించే లోపుగా, ఒక నిశితభల్లె మెక్కడినుండియో మహవేగమున వచ్చి అతని కంఠాన సువ్వున లోతుగా నాటుకొన్నది.

ఇది ఏమి అని ఆశ్చర్యపడి అటు చూచేసరికి ఆ ప్రక్క ఎత్తయిన రాళ్ళ గుట్టమీద శ్రీ చాళుక్య వీరభద్రుడు ఇరువదిమంది విలుకాండ్రతో నిలచి యున్నాడు. ఆవిలుకాండ్రమధ్య వీరభద్రుడు ప్రమథులమధ్య కుమారస్వామిలా ఉన్నాడు. వీరభద్రుని ధనుస్సు త్రిపురాసులపై నెత్తిన పాశుపతంలా ఉన్నది.

మురారిదేవుడు మరల ధనుస్సునెత్తి రుద్రమవైపు గురిచూచినాడు. అమ రుక్షణంలో అతడు మృత్యుదంష్ట్రవంటి బాణము గుండెను దూసుకొని పోగా ఏనుగుపై విగతజీవుడై పడిపోయినాడు.

హరిహరదేవుడు రౌద్రాన జేవురించి అంగరక్షకుడు ఫలకము నడ్డుపెట్టగా తన మహా ధనుస్సును ఎక్కుబెట్టి చాళుక్య వీరభద్రునిపై పది బాణాలు వదలెను. ఆప దిబాణాలు పదిరెట్లు పెరిగితిరిగి అతనినే తాకినవా అన్నట్లు ఆ ఏనుగు అంబారీని నూరుబాణాలు కప్పినాయి. హరిహరదేవుని ఫలకధారి ప్రాణము వదలి ఏనుగుపై పడిపోయినాడు.

వీరభద్రుడు ప్రళయకాలరుద్రుడై కదలికలేక ఎడతెరపిలేని క్రూరభల్లాల ప్రవాహము కట్టించి హరిహరదేవుని కవచము, శిరస్త్రాణము చీల్చివేసినాడు. ధనుస్సు ఎత్తుకొనే వీలులేక ఏనుగుపై హరిహరదేవుడు మూర్ఛితుడైనాడు.

రేచర్ల రుద్రప్రభువు ఎలుగెత్తి 'చక్రవర్తిపై కత్తియెత్త సాహసించగల పిరికిపంద లెవ'రని భూనభోంతరాలు పగుల కేకవేసి తన చిన్నసైన్యాన్ని హరిహరదేవుని సైన్యాన్ని తాకుమని కొమ్ము ఊదినాడు.

ఆజ్ఞ యిచ్చుట తరువాయిగా ఉద్దండులైన ఆ అంగరక్షకులు హరిహర దేవుని సైన్యంపై విరుచుకొనిపడిరి. శ్రీ చాళుక్యవీరభద్రుడు ఆ రాళ్ళగుట్టమీద నుండి పిడుగు ప్రవాహం దొర్లుకు వచ్చినట్లు హరిహరదేవుని సైన్యం జొరబడ గానే ఆయన ధాటికి నిలువలేక సైన్యాలు వీరిగిపోయినవి. వీరభద్రునితో గ్రామ వీరభద్రుడు, వీరముష్టులు 'ఆశ్వరభ శరభా' అనుచు ఒళ్ల తెలియని ఆవేశముతో హరిహరదేవుని సైన్యముపై బడినారు.

ఈ రెండు అగ్నులమధ్యపడి హరిహరదేవుని సైన్యము నుగ్గునుగ్గయి పోయినది. హతశేషులు తెగిన హారములోని పూసలుడా దెసల చెదరిపోయారు. వీరభద్రులు మహా వేగముతో త్రిశూలాలతో హరిహరుని గజాన్ని పొదివి ఎంత మంది పిండియైనను లెక్కసేయక పరశులతో, భల్లాలతో ఆ ఉత్తమగజాన్ని ముక్కలుగా చీల్చి, అంబారీలో క్రిందపడిన హరిహర దేవుని చిన్న చిన్న కండలుగా నఱికివేసిరి.

చాళుక్యవీరభద్రుడు అత్యంత వీరావేశంతో రుద్రదేవుని రథం సమీపించి 'చక్రవర్తిని క్షేమమా' అని అడినాడు.

రుద్రసేనాని హరిహరుని చిత్రవధ చూడలేక మోముతిప్పుకొనియుండి వీరభద్రుని మాట వినగానే ఆ ప్రభువువంక చూచి చిరునవ్వు నవ్వినది. చాళుక్య వీరభద్రునికోపము పాలు విరిగినట్లు విరిగిపోయినది.

౬

చాళుక్యవీరభద్రుడు రుద్రదేవ చక్రవర్తిని, అన్నాంబికను, ముమ్మడాంబికను రాత్రికి ఓరుగల్లు గొనిపోవుసరికి హరిహరమురారిదేవుల రాజద్రోహ సంఘటన, వీరభద్ర మహారాజు వారిని నాశనముచేయుట నగరమంతట ప్రాకిపోయినది. శివదేవయ్య దేశికులు వెంటనే రాచనగరుకువచ్చి చక్రవర్తిని క్షేమమడిగి 'ఈ దేశములో పరిపూర్ణశాంతి వచ్చేవరకు చక్రవర్తిని సరియైన అంగరక్షక బలము వెంట రాకుండ ప్రయాణం చేయకూడ' దని మనవిచేసిరి.

రుద్ర: బాబయ్యగారూ! ఎంతకాలం జాగ్రత్తతో భయపెట్టి సైన్యాల పెంచి, రాజ్యం పాలించగలం? రాజ్యపాలన ధర్మరక్షణకోసం. అధర్మ బలంతో రాజ్యాలు నిలబెట్టగలమూ?

శివ: ధర్మరక్షణకు అధర్మమార్గం పనికిరాదు భయంచేత రాజును తన్ను రక్షించుకొమ్మని ధర్మశాస్త్రాలు చెప్పవు. మానవహృదయంలో కాంక్ష కుములుతూ ఉంటుంది. రాజ్యం చేయవలెననే దురాశతో ఎవరైనా నిరాయుధుడైన రాజుపై విరుచుకు పడవచ్చును.; సుదుర్లభుడైన ఉత్తమ ప్రభువు తన్ను దా నేమరకూడదు.

రుద్ర: కవులు, గాయకులు, పండితులు, మహర్షులు నిరాయుధులై, నిర్భయులై ఏలా జీవిస్తున్నారో రాజులుకూడా ఒక్కధర్మమే బలంగా రాజ్యం చేయవద్దా గురుదేవా? దైవబలంకాక రాజ్యాలు పశుబలం మీద ఆధారపడి ఉన్నంత కాలం భగవంతుడే జగత్తునుండి మాయమై పోయినట్లుకాదా?

శివ: రుద్రప్రభూ! మానవుడు ధర్మపథం తప్పినప్పుడే రాజ్యాల అవసరం కలుగుతుంది. ప్రపంచం ధర్మక్షేత్రమైనప్పుడు, రాజ్యాలూ, రాజులూ, చతురంగ బలాలూ, కోటలూ, కందకాలూ, రక్షకభటులూ, వారులూ. ఆయుధాలూ అస్త్రాలూ అవసరమేమిటి?

రుద్ర: ఆస్థితి ప్రపంచానికి ఎప్పుడయినా లభిస్తుందా బాబయ్యగారూ?

శివ: అలాంటిస్థితి లోకానికి ఒక్కసారే సాధ్యము!

రుద్ర: కృతయుగంలోనా?

శివ: కృతయుగంలోనూ కాదు! కృతయుగంలో మానవజీవితము శైశవావస్థలో ఉన్నది. శిశువులు దేవతాస్వరూపులు. వారికి ప్రభువులు దేవతలే! కాబట్టే శిబి, దధీచి మొదలయినవారు; వేనుడు, నహుషుడు, దక్షుడు మొదలయినవారు అప్పుడు ఉండేవారు.

రుద్ర: ఇంక ఎప్పుడా దివ్యయుగం అవతరించడం?

శివ: మహారాజా! అనేకచోట్ల కృతయుగాలలో ఒక్క మహాపవిత్ర కృతయుగం ఉద్భవిస్తుంది. ఆ కాలంలో శైవ, బౌద్ధ, జైన, వైష్ణవ మతాలుండవు. మ్లేచ్ఛులు, ఆర్యులు, దస్యులు, అసురులు అనే భేదాలుండవు. బీదలూ, ధనవంతులూ ఉండరు. పాలించేవారూ, ప్రజలూ అనే వర్గాలుండవు. అభిమానం, గర్వం, అహంకారము, ఆశ, క్రోధము, కామం, లోభం, మోహం, మదం, మాత్సర్యం, ఏమీ ఉండవు. మానవులప్పుడు దేవతలై పరతత్వం చేరుతారు ప్రభూ!

రుద్ర: ఈలోగా ఈలా మనుష్యులు సర్వబాధలు అనుభవిస్తూ ఉండవలసిందేనా?

శివ: అప్పుడప్పుడు ప్రతిమనుష్యుడూ ఏదో మహత్తర సన్నివేశమందు భగవత్సమాను డవుతూ ఉంటాడు. కొందరు మనుష్యులు బ్రతికివున్నంతకాలమూ దేవతలుగా ఉండి అవతారం చాలిస్తారు. భక్తులు ఉద్భవించి తమ తమ వుత్తమ కర్మలద్వారా లోకానికి దారి చూపిస్తూ ఉంటారు.

ఈ ధర్మరక్షణార్థం స్త్రీ అయ్యీ తాను ఎన్ని భయంకర మృత్యునాట్యాలు చూడవలసిఉంటుందో అని రుద్రదేవి అనుకొనుచు దేశికులకు వీడుకోలు ఇచ్చి అభ్యంతర గృహాలలోనికి పోయినది.

శ్రీ చాళుక్య వీరభద్ర మహారాజునకు ఏదో ఆవేదన జనించి తనకై అరుదెంచినారా? ఎంత విచిత్ర సంఘటన! సైన్యములేక ఒక్కరు వచ్చినారా? అది ఎంత అవివేకము! వడ్డపల్లినుండీ, మొగలిచర్లనుండీ వీరముష్టులనూ, వీరభద్రులనూ, ఆ మహారాజు వెంటబెట్టుకురావడము విచిత్రమైన విషయమే.

హరిహరదేవులు తన్ను హతమార్చియుందురు. ఆరీతిగా తన ప్రాణము పోయి ఉన్నట్లయితే, కాకతీయ సింహాసనంకోసం ఈ దారుణసంగ్రామాలన్నీ ఉద్భవించకుండా ఉండునుకదా!

చాళుక్య వీరభద్ర మహారాజు యుద్ధం జరుగుతున్నంకాలం దుర్నిరీక్ష్య తేజులైరి, యుద్ధం కాగానే చంటిబిడ్డవలె 'తాము క్షేమంగాఉన్నారా?' అని అడిగినారు. ఆ ఉత్తమ చాళుక్యునకు అంత భయంకర క్రోధం ఉద్భవించడానికి కారణం, తన కప్పుడు సంభవించిన ఆపదేకాబోలు? ఆ సమయంలో తాను మాటే మరచిపోయి ఆడుపులిలా, తన పురుషుడు శత్రువుల నాశనం చేస్తూంటే చూచి ఆనందంతో ఉప్పొంగిపోయినదేమి!

ప్రతి స్త్రీ తన పురుషుడు బలంతో విజృంభించి శత్రువుల నాశనం చేస్తూ ఉంటే, చూస్తూ ఉప్పొంగిపోతుంది కాబోలు. అదేకాబోలు గురుదేవులు వచించిన మానవపశుత్వము? రాజుల కందుకే వేట అన్నా, కోడి, గుఱ్ఱం, ఏనుగు, పెద్దపులి పందేలన్నా ఇష్టము.

ఇంతలో ముమ్మక్క అన్నాంబలు స్నానాలాచరించి, వస్త్రాలు ధరించి దేవకన్యలులా వచ్చారు రుద్రమ అదివరకే స్నానమాచరించి చీనీ చీనాంబరాలు ధరించిఉన్నది. వారిద్దరూ వచ్చుటచూచి 'పాపం! వీ రిరువురూ సంపూర్ణ యౌవన వతులైన కన్యలై, తనవలనకదా పెళ్ళికాక ఉన్నారు' అనుకున్నది.

తానే పెళ్ళికాని కన్యయై ఉన్నదే! స్త్రీలకు పెళ్ళి అయితీరాలన్న ధర్మశాస్త్ర ప్రమాణ మున్నది. పురుషులు పెళ్ళికాకుండా ఉన్నా పతితులు కాకపోవడమేమి? పురుషుడు పరస్త్రీగతుడైనా, అతడు భార్యతో దాంపత్య ధర్మము నెరవేర్చడానికి అర్హుడు స్త్రీ ఒకసారి పరపురుషరతయైతే భర్తతో దాంపత్యం నెరవేర్చడానికి అర్హురాలుకాదు. ఈ ధర్మనిర్ణయాలు రావడానికి సహస్రకారణా లుండవచ్చు.

ఇంతలో ముమ్మక్క రుద్రమదేవికడకువచ్చి "అక్కగారూ! చాళుక్య వీర భద్ర మహారాజు అంత చిన్నబాలునిలా అయిపోయినారేమిటి? అని అన్నాంబిక నన్ను మూడుసార్లు లడిగింది" అని చిరునవ్వుతో తెలిపింది.

"అల్లరిపిల్లా! పెద్దలంటే భక్తిలేకుండా వేళాకోళాలుచేస్తావా?" అంటూ రుద్రాంబ తరుముకువచ్చింది. ముమ్మక్క పారిపోయి అన్నాంబిక వెనుక దాగెను.

అన్నాం: ఉండండి అక్కగారూ! నాకు నిజంగానే అనుమానం కలిగింది ఏమి చేయమంటారు? (పక పక నవ్వును)

రుద్ర: అల్లాగా! నిజమైన అనుమానం కలిగిందే! దానికి నిజమైన ప్రత్యుత్తరం గోన గన్నారెడ్డిని అడిగి తెలుసుకోవాలి.

ముమ్మక్క: (అన్నాంబిక వెనుకనుంచి ముందుకువచ్చి) అమ్మయ్యో, ఓ తాయిలంగారికి మా చక్కని ప్రత్యుత్తరం వచ్చింది. అనుమానాలన్నీ పటాపంచలయ్యాయి.

అన్నాం: ఓ చాళుక్య మహాదేవరాజు నడిగితే అనుమానాలు గినుమానాలూ ఏమీ వుండవనే అంటాను.

రుద్ర: మహాదేవరాజేమిటి చెల్లీ?

అన్నాం: ఏమీలేదు అక్కగారూ! మొన్న మనం వడ్లపల్లెకు వెళ్ళకముందు ఓ తాయిలంగారు తదేకదీక్షతో మీ సభలోవున్న ఒక మహాపురుషుని తెరల వెన కాలనుంచి చూస్తున్నారు. ఇది మొదటిసారికాదు. మీరు సేనానాయకుల సభ చేసిన దినాన, మీ ఆలోచనామందిరంలో అవరోధ జనంవుండే చోటనుంచి గవాక్షం గుండా ఆతాయిలంగారే ఆ మహాపురుషుని చూస్తుంటే నేను దొంగలా కనిపెట్టుతున్నాను.

ముమ్మక్క: అమ్మ దొంగా!

అన్నాం: నేను దొంగనే అని ఒప్పుకొన్నానుగా!

రుద్ర: తర్వాత ఏమయింది?

అన్నాం: ఆ తాయిలంగారు నిట్టూర్పు విడవడం, శ్రీవారికి కళ్ళు అరమూతలవడం, చెంపలు ఎరుపెక్కడం చూచానులెండి! ఇంకేం భార్యా భర్తలూ' తల్లీ కూతుళ్ళూ, అక్కా చెల్లెళ్ళూ అయిన ఓ యిద్దరు రాజ కుమార్తెలు తోడికోడళ్ళవుతారు కాబోలు అనుకున్నాను.

రుద్ర: ఆసిదొంగా! నన్నుకూడా కలిపావూ, నీపని చెబుతా!

అన్నాం: గుమ్మడికాయ దొంగలు.

అంతరు పక పక నవ్వుకొనిరి.

# దశమగాథ

## యాదవులు

### ౧

యాదవమహారాజు తనసైన్యంతో పది గవ్యూతులన్నా ప్రతిష్ఠాన నగరం దాటి రాలేకపోతున్నాడు. గోన గన్నారెడ్డి, మహాదేవరాజు ఆరు లక్షల సైన్యాన్ని అడుగు కదలనీయడు. అంతగా శత్రువుల ఒత్తిడి ఎక్కువైతే పదిఅడుగులు వెనక్కు వేస్తాడు. ఇరువాగులవారికి ఒక్క గౌతమీదేవి కాపుకాస్తున్నది. అన్ని కొండలు, గుట్టలు, అరణ్యాలూ, ప్రతిగుట్టా, ప్రతికొండా, ప్రతిసెలయేరూ, ప్రతిఅడవీ గన్నారెడ్డికి కాపుదలగా ఉన్నవి. జగన్నాథరథంలా సాగిపోవలసిన యాదవసైన్యం అడుగడుక్కు విఘ్నం. అయ్యో చేసేదేమిరా అన్నట్లుగా ఉన్నది.

మహాదేవరాజు కోపం మిన్నుముట్టుతూవుంది. తా నిలా జైత్రయాత్ర సాగిస్తే ఎన్నాళ్ళకు ఓరుగల్లుపోవడం? యుద్ధవ్యూహాధ్యక్షుడు, సేనను చొప్పించుకు పోయే మగటిమి కలవాడు, ఎదిరించే శత్రువు మనస్సు తెలిసికొని యుద్ధం నడిపే భయంకర ప్రతిభాశాలి అతడు. కాని అతన్ని ప్రతివిద్యలోనూ త్రోసి రాజనిపించ గల గండరగండడు గోన గన్నారెడ్డి అతని మహాసైన్య పురోగమనానికి ఆనకట్ట అయిపోయినాడు.

కొండలమీదనుంచి రాళ్లు దొర్లుకువచ్చి లోయలలోపోయే సైన్యాలు నాశనం అవుతూవుంటాయి. ఎంత నెమ్మదిగా నడచినా అశ్వికసైన్యాలు పైకి సాధారణ భూమివలె కనబడే సమతలముపై నడచుచుండగా చటుక్కున గోతులలో పడి పోవుచుండెను. సెలయేరులలో నీరు తాగినవారు మత్తుచే పడిపోవుచుండిరి. నిర్జనంగా కనబడే చిట్టడవివి సమీపించే సైన్యాలమీద అఖండ బాణవర్షం కురిసి వేలకొలది సైనికులు ప్రాణరహితులై పడిపోవుచుండిరి.

గ్రామములలో జనంలేరు. పంటలులేవు. పశువులులేవు, పాలులేవు. గ్రామాలు మొండిగోడలతో, పళ్ళులేని చెట్లతో నిండివున్నాయి.

మహాదేవరాజుకు, అతని సేనానాయకులకు, మంత్రులకు ఈ విచిత్రయాత్ర అర్థమగుటలేదు.

మూడుసారులు గన్నారెడ్డి మహాదేవరాజు సైన్యాలకు వెనుకభాగముతో వచ్చి తాకినాడు. సైన్యాలు నిలబడి యుద్ధం చేసేసరికి గన్నారెడ్డి సైన్యాలతో

మాయమైనాడు. ముందుకు సాగకుండా విఠలధరణీశుడు, సబ్బిప్రభువు, సూరన్న రెడ్డి, చిన అక్కినప్రగడ, రేచర్ల చినదామా నాయుడు, చిన మల్యాల ప్రభువు రక్కసులలాంటి సైన్యాలతో అడ్డుపడుతున్నారు.

గన్నారెడ్డి మొదటిసారి మహాదేవుణ్ణి తాకినప్పుడు సైన్యం వెనుకనే వచ్చే వర్తకసంఘమూ, పశుసంఘమూ చటాపంచలై పోయినాయి. గన్నారెడ్డి తృప్తితీర మహాదేవరాజు ధాన్యాదులను, పశువులను దోచుకున్నాడు. ఆ వెంటనే మాయమైనాడు. తరుముకువచ్చిన సైన్యాలను హతమార్చినాడు.

ప్రళయకాలరుద్రుడై మహాదేవరాజు గోన గన్నయ్యను చేతులతో నలిపి వేయుద మనుకున్నాడు. ఖడ్గముతో కండకండలుచేసి గద్దలకు, కాకులకు ఎగుర వేయవలె ననుకున్నాడు. దేవగిరికి నలభై గవ్యూతుల దూరంలో ఉన్న మంజుల గ్రామం దగ్గర విడిదిచేసినాడు. ఇప్పటికే అతని సేనలో గోన గన్నారెడ్డి ముష్కర క్రియవల్ల దెబ్బదివేలు పడసైన. ఆరు నెలలకు తెచ్చుకొన్న ఆహార పదార్థాలలో రెండు నెలల పదార్థాలు గన్నారెడ్డి దోచుకపోయాడు.

అతని సైన్యం మంజుల గ్రామానికి మూడు గవ్యూతులు ఉన్న గోదావరి కడనుండి పది గవ్యూతుల దూరములో ఉన్న ధారునగరంవరకూ విస్తరించి ఉన్నది.

ఆహారపదార్థాలు సైన్యం మధ్యఉండేటందుకు ఏర్పాటుచేసి, ఈ మహా సైన్యంచుట్టూ అశ్వికసైన్యాలు, విలుకాండ్ర దళాలు సర్వకాలమూ యుద్ధసన్నద్ధులై ఉండ ఏర్పాటుచేసినాడు మహాదేవరాజు. అనేక చారదళాలు విరోధిసైన్యాల రాక తెలియ జేయ ఏర్పాటు చేసినాడు.

రక్తాక్షి సంవత్సర జ్యేష్ఠ శుక్ల దశమినాడు దేవగిరిలో బయలుదేరి యీ జ్యేష్ఠబహుళ దశమికి ఇంకా మంజుల గ్రామంలోనే ఉన్నాడు మహాదేవరాజు. ఆరాత్రి మహారాజు ఆలోచనాశిబిరంలో, సర్వసైన్యాధ్యక్షులూ, మంత్రులూ చేరినారు.

మహారాజు సింహాసనంపై అధివసించి ఉన్నాడు.

ముఖ్యసేనాపతి సింగదేవప్రభువు (మహాదేవరాజు దాయాది) "మహారాజా! మన ఎనిమిదిలక్షల సైన్యాలలో రెండు లక్షల సైన్యాన్ని గన్నయ్యను తరమడానికి విడదీశాం, ఆ సైన్యం మంజీరానది తీరాలకు నైరుతిగా అతని సైన్యాలను తరుముతూనే ఉంది. ఇంతట్లో ఎక్కడనుండి వచ్చాడో 'గోన గన్నయ్య' అని మన సేనాపతులందరూ చికాకుపడుతున్నారు.

మహా : వీడు బ్రహ్మరాక్షసా, పిశాచా ?

భవానీభట్టు (మహామంత్రి) : మహాప్రభూ! ఈ గోన గన్నయ్యకు గజదొంగ అని పేరుపడింది అంతామాయ. వీడు రుద్రమదేవికి సహాయంగా ఏర్పడిన దొంగసైన్యాలకు నాయకుడు.

సింగ : లేకపోతే సాధారణ గజదొంగతనం ఒకటి చేయకుండా, రుద్రమ్మపై తిరగబడిన సామంతుణ్ణల్లా పట్టి హతమారుస్తాడా ?

భవా : వీడు మన జైత్రయాత్రకు అడ్డం అనికాదు. కాని నేనుపెట్టిన ముహూర్తానికి ఓరుగల్లుకోట ముట్టడించలేకపోయాము.

జైతుగి (అశ్విక సైన్యాధ్యక్షుడు) : రేపు మనం మంజీర ఎలాగు దాటడం ?

సింగ : నిర్మలనుండి మల్యాల చౌండయ్య సైన్యాలతో అడ్డుపడేట్టు ఉన్నాడు.

మహా : సింగదేవప్రభూ! మన రెండులక్షల సైన్యాన్ని వెనక్కు రమ్మనండి. ఆ సైన్యం ఏభైవేల నావలమీద మంజీర గోదావరీ సంగమం దగ్గర కాకుండా దక్షిణంగా గిరికోటదగ్గర దాట ఆజ్ఞ ఇవ్వండి. ఆ దాటింపవలసిన బాధ్యత జైతుగి దేవ ప్రభువుది. .

భవా : ఆ సైన్యాన్ని దాటనీయకుండా గన్నారెడ్డి ఒక ప్రక్కనుంచీ మల్యాల చౌండయ్య గోదావరి అవలిప్రక్కనుంచీ తాకవచ్చునుకాదా చక్రవర్తీ ?

మహా : అవన్నీ ఆలోచించాము భట్టోజీ! దాటే సైన్యాన్ని మేము మొదట తెలియజేసిన కోటల విధానంతో తాత్కాలికపు కంపకోటలు ఏర్పాటు చేసుకొని శత్రువు వెనుకనుంచి మీదబడకుండా చూచుకొనండి.

జైతు : చిత్తం మహారాజా !

మహా : తక్కిన ఏభైవేల నావలలో మేము సంగమానికి ఎగువ బోధన గిరికడ దాటగలము.

సింగ : ఈలోగా మనదేశంనుండి ఆహారపదార్థాలను తీసుకొనివచ్చే టందుకు వెళ్ళిన రెండులక్షల సైన్యం వచ్చి కలుసుకుంటుంది.

మహా : మంజీర దాటగానే మన సైన్యాలను ఆరు సైన్యాలుగా విభజిస్తాను. ఒక్కొక్క సైన్యం అయిదారు గవ్యూతుల దూరంలో యాత్ర సాగించాలి. శత్రువు ఎదురుబడితే లెక్కచేయక ముందుకు సాగిపోయి శత్రువును చుట్టుముట్టి నాశనం చేయాలి.

శంకరదేవ (గజసైన్యాధ్యక్షు) : శత్రువుల సైన్యాలు తక్కువగా ఉన్నాయి అవి కనా మనకు వేగువచ్చింది. ఆంధ్రసామంతులు కొందరైనా మనవైపు చేరక పోయినా ఆ రుద్రమ్మకు సాయంవెళ్ళరు. అంతవరకు లాభం మహారాజా !

౨

మంజీరానది దాటడం బ్రహ్మప్రళయమే అయినది యాదవునికి. లక్షల బలంతో నేర్పుతో మంజీరానదినిదాటి, కాకతీయుల నెగ్గినంత సంతోషము

పొందెను. మంజీర దాటడంలో చౌండసేనాని ఏటి అవలనుంచి, ఏటి ఈవలనుంచి గోనగన్నయ్య శౌణదేశవాహినులను చీల్చి చెండాడిరి. ఏటిలో యాదవుల పడవలను వందలకొలది ముంచినారు. గట్టుకు దిగకుండ గట్టుపైన చౌండసేనాని బలాలు మహాదేవరాజు మూకలను శకలాలుగా ఖండించివేసెను.

ఏరు దాటి చూచుకొనేసరికి దాదాపు ఎనభై వేలమంది మనుష్యులు. డెబ్బది రెండు ఏనుగులు, రెండువేలచిల్లర గుఱ్ఱాలు యాదవులకు నష్టమయ్యెను. గాయ పడినవారు లక్షకుపైగా ఉన్నారు. చాలా ఆహారపదార్థాలు నష్టమాయెను.

ఏరుదాటగానే చౌండసేనాని సేనలు వెన్కకు తగ్గిపోయాయి. గన్నారెడ్డి గన్నారెడ్డి గజదొంగలు రెండుభాగాలై ఒకటి గన్నారెడ్డి నాయకత్వాన మరొకటి విఠలధరణీశుని నాయకత్వాన శౌణమహాదేవుని వెన్నాడించడము, అడ్డు తగలడము మొదలిడెను.

ఒక బలాన్ని నాశనంజేయవలెనని సాగినచో మహదేవునికి ఆ బలం కనబడదు. సరేనని నిర్భయంగా సాగితే రెండవ గన్నారెడ్డి ధ్వజం అడ్డం. వెనుక నుంచి చౌండసేనాని చమువులు నిరంతరపుతాకిడి.

ఇంతలో వానలు ప్రారంభించాయి. వానలో గన్నారెడ్డికి బలం ఎక్కువా అన్నట్టు అతడు ప్రచండంగా విజృంభించి అడుగడుగునకు నాశన దేవతను ప్రయోగం చేస్తున్నాడు. చిన్నచిన్న ఏళ్ళు, బలాలు ఉండడానికి తగిన వీల్లు లేకపోవడం, రోగాలు జ్వరాలు అన్నియు నిరోధాలే!

మహాదేవరాజునకు వచ్చేది వానాకాలమని తెలియును. అందుకు తగిన సన్నాహాలతోనే యుద్ధయాత్ర ప్రారంభించినాడు. కోట్లకొలది చాపలను, వెదురు ఊచలనుకూడా పట్టించుకొని వచ్చినాడు. దానితో లక్షలకొలది నివేశాలు నిర్మించడం, వానలు వెలిసిన వెనుక ముందుకు సాగడం, ఈ రీతిగా అంచెలుగా యుద్ధయాత్ర సాగుచున్నది. గోన గన్నారెడ్డి బలాలు, చౌండుని బలాలు యాదవుని వాహినులను నాశనం చేస్తున్నవి.

ఎప్పుడు ఓరుగల్లు చేరుదుమా, ఎప్పుడా మహానగరం చుట్టూఉన్న పాశెము లన్నీ ఆక్రమించుకొని, తాను నిశ్చయించుకొన్న వ్యూహం ప్రకారము ముట్టడి సాగించడమా అని తహతహ జనించినది మహదేవరాజునకు! నెల ముట్టడి సాగేసరికి ఆంధ్రులు కాళ్ళబేరానికి వత్తురు. ఆడదాని రాజ్యం అంటే అసహ్యము కొలది తనతో కలిసిపోదురు.

ఈలాంటి ఆశతో ఏమాత్రమూ పట్టుదల, యుద్ధపుబిగి సడలకుండా మహా దేవరాజు ప్రయాణం చేస్తున్నాడు మహావాహినులతో.

గన్నారెడ్డి అంతకన్నా పట్టుదలతో, మాయతో, అఖండవేగంతో పిడుగులా రాం మహాదేవరాజు సైన్యాన్ని తాకుతాడు; కొంత సైన్యం నాశనంచేస్తాడు: ఆ వెంటనే మాయమవుతాడు.

గన్నారెడ్డి విధానం అర్థంచేసుకొని మహాదేవరాజు, కొన్ని క్రొత్త రక్షణలు సృష్టించాడు. రాళ్ళచక్రాలున్న కొండల్లాంటి బళ్లు కట్టించాడు. ఆ బళ్ళపైన చిన్న చిన్న కఱ్ఱకోటలు, ఎనిమండుగురు పదిమంది పట్టేవి కట్టించాడు. ఆ రథాలను ఎని మిది ఎద్దుల జతలు లాగుతూఉంటాయి.

బండిమీద చిన్న కఱ్ఱకోట గోడలలో ఉన్న వీరులు బాణాలు వేయడానికి పెద్ద రంధ్రాలు చేయించినాడు వీరిని సేనలచుట్టూ మహాదేవరాజు ఉంచినాడు. విరోధి కనపడగానే, శత్రువునుచూచి కోటలబండ్లు ఆపు చేయించి వానిని కోట గోడలలా చేశాడు. ఈ ఏర్పాటు గన్నారెడ్డి బాగా అర్థంచేసుకున్నాడు. యుద్ధ చమత్కృతి అంతా ఎత్తుకు పైఎత్తులు వేయుటలోనే ఉంది.

గన్నారెడ్డి అక్కినప్రగడనుచూచి, "బావగారూ! ఇంతవరకు మన సైన్యాలు నాశనం కాకుండా విరోధి నాశనం అయేటట్టు చూస్తున్నాము. ఇప్పుడు ఈ యాద వుడు మంచిఎత్తే వేసినాడు" అని ఆలోచన చేసెను. గన్నారెడ్డి ఆ మాటలు అన గానే అక్కినప్రగడ నవ్వి "బావగారూ! మీకు గజదొంగలని పేరు ఊరికే వచ్చిందా? ఆలోచించండి ఒక కొత్తఎత్తు" అన్నాడు.

మహాదేవరాజు ఆరులక్షలమహావాహిని వేములవాడదగ్గర విడసి యున్నది. రెండులక్షలసేన ఇంతవరకు నాశనమయినది. వేములవాడ చుట్టుప్రక్కల గ్రామా లన్నియు మహాదేవరాజు సైన్యాలు ఆక్రమించాయి. వేములవాడకు ఉత్తరంగా పన్నెండు గవ్యూతుల దూరములో జగతపురిలో మల్యాల చౌండసేనాపతివున్న శిబిరంలోనికి అక్కినప్రగడకూడరా చౌండమహారాజుతో మాటలాడటానికి గన్నా రెడ్డి యేగెను.

## 8

చౌడసేనాని ఎనుబదిఏళ్ళ వృద్ధమహారాజు. కాకతీయ గణపతిదేవ చక్రవర్తి రాజ్యభారంపూని విజృంభించి, ఆంధ్రమహాదేశం అంతా కాకతీయ సామ్రాజ్యము వ్యాపింపచేసే సంవత్సరాలలో కొలని రాజ్యభారము వహించి ఉత్తరాంధ్రభాగము లలో గోదావరి రెండుతీరాలలో శౌణ యాదవులు, గోండులు మొదలగువారు దాడులు వెడలకుండా రక్షిస్తూ, తన చక్రవర్తితో దక్షిణదేశ యుద్ధయాత్రకు, కమ్మనాటి యుద్ధయాత్రకు వెళ్ళి, యుద్ధక్రియా దక్షుడై చక్రవర్తి కుడిభుజమై, సంకిసపురరిపుతిమిరమార్తాండ, సమరదేవేంద్ర, పెదముత్తుగండ, కోటగెలవట, దీపలుంఠక, దుష్టతురగరేఖారేవంత, గణపతిదేవ ప్రసాదోత్తర రాజ్యాలక్ష్మీ సమాశ్లిష్ట, రుద్రేశ్వర దేవశ్రీ పాదపద్మా రాధక, నిఖిల శత్రురాజమస్తక విదారణ, సకలాయుధప్రయోగకుశల, శౌణ దేశాధీశాది భుజబల గర్వాపహరణ మొద లయిన

బిరుదాలు పొంది ముసలి తనంలోకూడా ఏమాత్రమూ శక్తిసడలని మహావీరుడై భీష్మునివలె శత్రుజన భీకరుడై రాజ్యము చేయుచుండెను.

చౌండసేనాని కుమారుడు కాటయచమూపతి, తండ్రిప్రక్కనే నిలిచి వున్నాడు. గోన గన్నయ్య అక్కిన ప్రగడలు మందిరములోనికి రాగానే చౌండ సేనపతి లేచి, త్వరితగతి గన్నయ్యదగ్గరకు వచ్చి, ఆత డిచ్చు నమస్కృతు లందుకొనుచు, గాఢముగా కౌగలించుకున్నాడు. అక్కిన చౌండసేనానికి జయం పలిపి వేదాశీర్వాదాలు ఒసగినాడు. వాలందరు ఉచితాసనా లధివసించిరి.

చౌండ: గన్నయ్యమహారాజా; మీ తండ్రిగారు నేనంటే ప్రాణం యిచ్చే వారు. వారికి మల్యాలవంశం అంటేనే ప్రాణం. అందుకనేగా మాజ్ఞాతి గుండయ్య ప్రభువుకు తమ అమ్మాయిని ఇచ్చి ఉద్వాహం చేశారు.

గన్నయ్య: మహారాజా! తాము ఇంతవృద్ధులయ్యీ మా కందరికీ సిగ్గు కల్గే విధానంగా యుద్ధం చేస్తున్నారు.

కాటయ; గన్నయ్యప్రభూ! మా నాయనగారికి వృద్ధులమైతిమే అనే విచారం పట్టుకొన్నది. చిన్నవారుగాఉంటే, శౌణయాదవుణ్ణి గోదావరి దాట నిద్దుమా అంటారు;

అక్కిన; అది నిజం కాటయమహారాజా! దేవగిరి యాదవులు, చౌండమహా రాజులు యవ్వనంలో ఉన్నప్పుడు దేవగిరిప్రాంతాలు దాటి ఆంధ్రదేశం వయిపు కన్నెత్తి చూశారా ఎప్పుడయినా?

కాటయ:ఇంతకూ యాదవుల్ని మంజీర దాటకుండా చేయలేకపోయామని బాధపడుతున్నారు.

గన్నయ్య: ప్రభూ! తాతయ్యగారూ, అలా ఆలోచిస్తే ఎట్లా? మహాదేవ రాజు నేలయీనినట్లు దండుతో వచ్చాడు. ఆంధ్రయుద్ధవిధానం బాగా గ్రహించి ఎత్తుపైఎత్తులు వేసుకువచ్చాడు.

అక్కిన: కాబట్టి మనం చేయగలిగినదల్లా యాదవుల సైన్యాలు ఎన్ని నాశనం చేయగలిగితే అన్నీ చేయడమే!

గన్నయ్య: అప్పుడు చక్రవర్తి తక్కిన యాదవసైన్యాలను పిండి గొట్ట వచ్చునుగదా!

చౌండ: గన్నయ్యమహారాజా! మీరు గజదొంగలై ఆంధ్రదేశానికి చేసిన మేలు సకల ఆంధ్రావని యెప్పుడూ మరచిపోదు. మా మనుమరాలు మల్లాంబికా దేవిని మీ తమ్ములకు చేసికోవలసిందని ప్రార్థిస్తున్నాను. మా చిన్న మనుమరాలిని సూరనరెడ్డి ప్రభువుకు అర్పించదలచుకున్నాను.

కాటయ: మేమూ మీతోపాటు దొంగలమే గన్నప్రభూ! మా అబ్బాయిలు యిద్దరు, మీతో వచ్చిచేరారు.

గన్నయ్య : మా బావగార్లిరువురూ ప్రతియుద్ధంలోనూ అప్రతిమాన శౌర్యమూ, యుద్ధనిర్వహణదక్షతా చూపించారు.

చౌండ : వారిద్దరూ మొన్న మమ్మల్ని కలుసుకొన్నప్పుడు మిమ్మల్ని, మీ తమ్ములను, చినఅక్కన మంత్రులవారిని ఎంత మెచ్చుకొన్నారో ?

గన్నయ్య : మహాప్రభూ ! అవి అన్నీ వట్టి పొగడ్తలు. లేక బావగార్లు వేళంకోళము చేసి ఉంటారు.

కాటయ : అవి పొగడ్తకాలూ వు, వేళంకోళాలుకావు. వారిద్దరినీ చూచి నప్పుడు నాకు నా శైశవదశనాటి మా తండ్రిగారి అద్భుత శక్తి జ్ఞాపకం వచ్చించి మహారాజా !

అక్కన , ఆ మహారాజు మనుమలూ, తమ పుత్రులూ ! తమ పరాక్రమం లోకవిదితం కాదా అండి.

చౌండ : చిత్తం, ఇక మన కర్తవ్యము ?

గన్నయ్య : ప్రభూ ! ఆంధ్రచక్రవర్తుల చల్లనిపాలనంలో ఆంధ్రప్రజలు కాటకాలు ఎరుగరు · ఈతిబాధలు ఎరుగరు. ఎప్పుడయితే యుద్ధాలు వస్తాయో అప్పుడే కాటకాలూ వెన్నంటుతాయి. యుద్ధం దావానలం వంటిది. ఆ దావానలం చెలరేగకుండా ఎక్కడ మంటలు అక్కడ ఆర్పివేయుడం ఈ గణదొంగ కర్తవ్యం అనుకున్నా, ప్రజల సహకారంలేక రాజ్యాలు సాగవు. ప్రజలు విరోధిసైన్యాలు వస్తున్నాయంటే వారికి ఏవిధమైన సహకారం లేకుండా చేయాలి. తమ అభిప్రాయం సెలవియ్యాలి.

చౌండ : ఈ నూతనాయుధం ఎలా భావించగలిగారు ప్రభూ ?

అక్కన : బావగారు శత్రువుల నాశనంచేసే ఎత్తులు వేయడంలో కృష్ణునికే పాఠాలు నేర్పుతారులెండి !

గన్నయ్య : ఇంక యాదవుని బళ్ళకోట భస్మం చేయాలి. నూనెతో తడిసిన గుడ్డలు, ఎండిన చితుకులు నింపి, కాడులులేని బళ్ళు ఇరవై వేలయినా తాము సిద్ధము చేయించి విరోధి వచ్చే దారిలో నేలపెకి ఆ బండ్లు నలుమూలల నుంచీ దొర్లుకువచ్చే ప్రదేశాలలో సిద్ధంచేసి ఉంచాలి. దారులలో రాళ్ళూ రప్పలూ లేకుండా ఉండాలి.

కాటయ : విరోధివారలు ఈ బళ్ళను కనిపెట్టరా మహారాజా ?

గన్నయ్య : ఈ బళ్ళు సిద్ధంగా ఉంచిన లోయలకు ఒక గవ్యూతి దూరంలో మన అశ్విక సైన్యాలు కొన్ని, విరోధుల్ని తలపడి ఘోరయుద్ధం చేస్తూ వెనక్కు అడుగులు వేస్తూ. వేగంగా బళ్ళవెనక్కు మాయంకావాలి. బళ్ళకు మంచి బరువు కట్టాలి. మన అశ్వికసైన్యాలను తరుముకువచ్చేవారి సైన్యాలమీద ఈ బళ్ళు దూసతాయి. బళ్ళ వెనుకనుంచి మన అన్నిబలాలు దూకుతవి. ఈబళ్ళు అన్ని వేపులనుంచీ వచ్చిపడాలి.

చౌండ: బాగుంది మహారాజా! బాగుంది. అందుకనే మీరుగజదొంగలలోమేటి.

## ౪

ఆ శకటాగ్నిమహాస్త్ర ప్రయోగంవల్ల యాదవుని సైన్యాలు ఏబదివేల వరకు నాశనం అయిపోయాయి. యాదవుడు కాలాగ్నిరుద్రుడై ఆంధ్రులను కాలి క్రింద పురుగులుగా రాచివేద్దామన్నంత కోపం పొందినాడు. అయితే ఏమి చేయగలడు? ఇన్ని లక్షల సైన్యాలతో బాయలుదేరికూడా ఆంధ్రుల ప్రతాపం ముందర అడుగడుక్కు పరాభవం పొందుతూనే ఉన్నాడు. అయినా పట్టుదలతో ముందుకు సాగుతూనే ఉన్నాడు

ఆంధ్రులతో యుద్ధం నల్లేరుమీద బండిపోకడ అని అతడు ఎప్పుడూ అనుకోలేదు. అందుకనే ఏడెనిమిది వర్షాలు నిరంతరకృషిచేసి ఎనిమిది లక్షల సైన్యము, ఇరువదికోట్ల ధనము ప్రోగుచేసినాడు. ఆంధ్రులు చక్రవర్తులు, యాదవులు మహారాజులు మాత్రము. అనేక నదీనద ప్రవాహసహితమై సస్యపూరితయై రత్నగర్భయైన ఆంధ్రమహాభూమి, చుట్టుప్రక్కల నున్న రాజుల కెప్పుడూ కన్నెఱ్ఱకు కారణమవుతూనే ఉండెను.

కాని ఆంధ్రులు మొక్కవోని మగటిమికల వీరులు. వాయువునైన అరచేత బట్టగల పరాక్రమవంతులు, శేముషీసంపన్నులు, విద్యాపూర్ణులు, యుగయుగాలనుండీ ఆంధ్రులు సర్వదేశాలకు మకుటాయమానులై ఉన్నారు.

పరరాజ్యాలవారు ఆంధ్రదేశం ఆక్రమించుకొందామని ఎన్నిమార్లు ప్రయత్నం చేయలేదు? తొలుత వారు విజయాలు సాధించినా, తర్వాత ఆంధ్రులచే పరాభవం పొందారు.

తాను మాత్రం రాష్ట్రకూటులకన్న, హొయసలులకన్న, ఛల్లాణుల కన్న గొప్పవాడా? తన తాతలు యుద్ధాలు చేశారు, నెగ్గారు, ఓడిపోయారు. యుద్ధం చేయడమే రాచబిడ్డలవృత్తి. యుద్ధవిజయమే రాచవారి గౌరవము. యుద్ధము పెద్ద వేట. వేటలేనినాడు నరమాంస భక్షకములూ, ద్వాదశ కాటకములలో ఒకటి అయిన అరణ్య మృగములు, మానవులకు భరింపలేనట్లే ఎక్కువయుద్ధాలు లేనినాడు మానవధర్మము కాలకూటవిషంలా పెరిగిపోతుంది అని మహాదేవరాజు అనుకున్నాడు.

తన తండ్రి కృష్ణభూపతి దేవగిరి యాదవులకు తలవంపులు తెచ్చాడు. గణపతిదేవునకు భయపడి స్నేహమని తన రాజ్యం ఎల్లాగో దక్కించుకొన్నాడు. తాను యాదవుల ప్రతిభ శ్రీ మాధవుని కాలంలోవలె అప్రతిమాన కాంతితో వెలిగింపజేయలేనినాడు, తాను యాదవుడైతే నేమి, గాదవుడైతేనేమి? ఇంతకన్న అదను తన కెలా దొరుకుతుంది? ఆడది రాజ్యానికి రావడమా అని సామంతులంతా తిరగబడుచున్నారు. ఆంధ్ర

రాజ్యం చాలాభాగం కబళించవచ్చు, తనకు లోకువ అయినవాని నొక్కాని ఓరుగల్లు సింహాసనం ఎక్కించి తాను నాటకం ఆడించవచ్చు, ఓరుగల్లులో మూడులక్షల సైన్యం, నాశనంకాగా మిగిలినది తనకు ఆరులక్షలుంటుంది. ఇక ఓరుగల్లుదగ్గర కలుసుకొనే విరోధి సామంతులు రెండు మూడు లక్షలైనా ఉంటారు. ఇప్పటికే తనతో కందూరి కేశనాయని బందుగులు కల్యాణి చోడోదయుని బందుగులు, మేడిపల్లి కాచయ బందుగులు రెండులక్షలవరకు సైన్యాలను తీసుకువచ్చి చేరారు. ఇంతకన్న యుద్ధవిజయసమయం తనకు కుదరదన్నమాట నిశ్చయం. నిశ్చయం.

అగ్నిశకట ప్రళయానంతరము సైన్యము సడలకుండా కూడదీసుకొని నూతనంగా సూచీవ్యూహాలు మూడు రచించి, తన వాహినులనన్నీ ముందుకు నడిపించసాగినాడు. సేనలను తరిమి తరిమి నడుపుచున్నాడు. ఏలాంటి అడ్డం వచ్చినా, దారిలోంచి తుడిచివెయ్యమన్నాడు. అత్యంతవేగంగా చైత్రయాత్ర సాగించే సేనల దారిలో పెద్ద అనీకాలైనా అడ్డగించలేవన్నాడు.

ఆనాటినుంచి మహాదేవరాజు సైన్యవేగం అడ్డగించడానికి భయపడ్డారు గోన గన్నారెడ్డి, చౌండసేనాపతి మొదలైన వీరులు.

వేగవంతమైన నదికి ఆనకట్ట ఎవరుకట్టగలరు ?

గన్నారెడ్డి మహాదేవరాజు సైన్యాలకు ముందుండడం మానివేసి, మళ్ళీ వెనుకనుండే తాకుట కారంభించాడు. అందు కొంత బలం ఏర్పాటుచేసి తానూ, చౌండసేనాపతి కుమారుడు కాటచమూపతీ కలసి అశ్వికదళాలను మాత్రం అపరిమితవేగంగా ముందుకు పదిహేను గవ్యూతుల దూరం తీసుకుపోయారు. ఈ వచ్చే వేగంతో మహాదేవరాజు రెండుదినాలకు ఆ ప్రాంతాలకు చేరగలడు. ఆ రెండు దినాలలో గోన గన్నారెడ్డి అగ్నికోట ఒకటి కట్టించాడు. గంధకపు ధాతువులతో అగ్ని స్తంభాలు సిద్ధంచేయించి, అవి అక్కడక్కడ మూడు గవ్యూతుల పొడుగునా అర్ధగవ్యూతి మందమున పాతివేయించినాడు. ఆ అగ్నికోటకు ఈవలావల తానూ, కాటయసేనాపతి అశ్వికదళాలతో పొంచుండినారు.

మూడవనాడు విరోధుల బలాలు చేరువకు రాగానే, ఆ అగ్ని స్తంభాలు అంటించినారు, గన్నయ్య అశ్వికులు. పొగలు, మంటలు ఆకాశంకప్పినాయి. ఈ సందు దొరకని అగ్నికుడ్యాలూ, భరింపరాని వాసనగల పొగలులూచూచి, అతివేకంగా చొచ్చుకువచ్చే మహాదేవరాజు వాహినులు ఆగిపోయినవి. మహాదేవ రాజు తన భద్రగజంపై అధివసించి, ఆ దృశ్యంచూచి, విరోధిని మెచ్చుకుంటూ సేనలకు అగ్నిచక్రవ్యూహం రచించి నెమ్మదిగా వెనుకకు జరిపించినాడు.

అప్పుడు గోన గన్నారెడ్డి ఒకవైపునుంచీ, కాటయసేనాపతి ఒక వైపు నుంచీ ఆ వ్యూహ బంధాన్ని ఛేదించసాగినారు. ఇంతలో వెనుకనుంచి విరియాల ధరణీశుడు, చౌండసేనాని, సూరపరెడ్డి మహాదేవుని తాకినారు.

ఒక దినమంతా మహాయుద్ధం జరిగింది. సాయంకాలానికి అగ్నులు చల్లారెను. వెంటనే రాత్రయినాసరే సైన్యం ముందుకు సాగిపోందవి మహాదేవ దేవరాజు ఆజ్ఞయిచ్చాడు. సేనలలో ఏబదివేలమంది విగతజీవులయ్యారు.

ఆ వేగం వేగంతో మహాదేవరాజు నాలుగుదివాలలో వచ్చి, ఓరుగల్లు ముట్టడించినాడు. ఓరుగల్లుచుట్టు ఒక ఇల్లుగాని, గ్రామముగాని లేదు. మురికి గోతులూ, మందే ఊళ్ళూ వున్నవి. అనుమకొండ మట్టియవాడలు పూర్తిగా కద్యరక్షితములై శత్రువుల రాకకు సిద్ధముగా ఉన్నవి.

౫

"ఓరుగల్లు నగరం ముట్టడించిన మగవాడేడీ? ఎవరయ్యా. కన్నులు తెరచి కాకతీయమహాసామ్రాజ్య ముఖ్యనగరం తేరిపారచూడగలడా? యాదవుడా? వానికి దుర్యోగము మూడినది" అని మహదాంధ్ర ప్రజ లాడుకొనజొచ్చిరి.

గ్రామ గ్రామాలలో ఆంధ్ర రెడ్డివీరుల కందరికి రక్తము పొంగిపోయినది. చక్రవర్తి శ్రీ రుద్రదేవి వలదని అజ్ఞలు గ్రామాలలో సాటింపుచేయడంవల్ల, రైతు బిడ్డలు కత్తులు తీయలేదు. ఆంధ్రక్షత్రియులైన రెడ్లు, పంటవారు, మున్నూరు కాపులు, ముదిరాజువారు పళ్ళు పటపట కొరికి, తమ ఇళ్ళలో పూర్వకాలమునుంచి ఉన్న ఇరుమొనల ఖడ్గాలు. ఖడ్గమృగ చర్మపు డాళ్లు, భల్లాలు తీయవలసిందే, కాని అలా ఎవ్వరూ యుద్ధసన్నద్ధులు కావద్దని చక్రవర్తిని ఆజ్ఞ!

ఆంధ్రశూద్రులైన సాకలివారు, మంగలివారు, గొల్లలు, పుప్పరులు, కుమ్మరులు: ఆంధ్రారణ్యజులైన బోయలు, ఆనాదులు, కోదులు, చెంచులు, మాలలు, మాదిగలు: ఆంధ్ర వైశ్యులైన శ్రేష్ఠులు: ఆంధ్ర బ్రాహ్మణులైన మంత్రులు, వేదవేదాంగ పండితులు; ఆంధ్ర శిల్పబ్రాహ్మణులైన పంచానులు: ఆంధ్రమతముల గురువులు శైవులు, జంగములు, ఆరాధ్యులు, కాలాముఖాచార్యులు, వైష్ణవులు. బౌద్ధులు, జైనులు అందరూ ఆంధ్ర చక్రవర్తిని అయిన శ్రీ రుద్రదేవిపై కత్తికట్టివచ్చిన యాదవుని ఖండఖండాలుగాచేయ ఉగ్రులైపోయారు.

గ్రామాలలోకి యుద్ధం ఎప్పుడూ రాదు. ఆర్యనాగరికత: అసుర నాగరికత విజృంభించిన పూర్వయుగాలనుంచి ఎప్పుడూ యుద్ధానికీ, భారతీయ గ్రామానికీ సంబంధం కలుగలేదు. యుద్ధస్థలము ఇరువాగులవారు నిర్ణయించుకొని యుద్ధము చేయుదురు. కోటలచే రక్షింపబడే గ్రామాలను మాత్రము ముట్టడించుటకద్దు.

రుద్రమదేవి మహాదేవుని గోదావరీతీరంకడ ఎదురుకుందామని చూచింది కాని మహాదేవుడు ప్రతిష్ఠానపురంకడనే గోదావరి దాటడంచేత ఆ ప్రయత్నము

మానుకున్నది. యాదవుడు అఖండ బలాలు కూర్చుకొని వస్తున్నాడు. దారిలో ఎదుర్కొనుట కంటెను ఎదుర్కొనుటే అని శివాదేవయ్యమంత్రి ప్రయత్నము మాన్పినాడు.

గోన గన్నారెడ్డి తన సైన్యాలు చాలకపోవడంవల్ల శత్రువును కొలది కొలదిగా నాశనంచేస్తూ, చీకాకుపెట్టుచూ, ఆహారపదార్థాలు అందుబాటు లేకుండ చేస్తూ ముట్టడి వదలుకొని పారిపోయేటట్లు చేయాలని సంకల్పించుకొన్నాడు.

తన యావత్తు సైన్యముతో మహాదేవరాజును వెంటాడి గన్నారెడ్డి కలిగించిన నష్టము ఇంతంతకాదు. అతని సైన్యాలకు మల్యాలవారి సైన్యాలు తోడయ్యాయి.

ముట్టడి ప్రారంభించగానే, కంపకోటలోనుండి మహాదేవరాజును విశిత బాణవర్షము ఎదుర్కొన్నది. మహాదేవరాజు ఆ మహానగరపు కోట గోడలను చుట్టిచూచివచ్చెను. కంపకోటచుట్టు ఉన్న కందకము చిన్న ఏరులా ఉన్నది.

కంపకోటకు చిన్నచిన్న బురుజు లున్నాయి. కంపకోటకు అర్ధగవ్యూతి దూరాన మహాదేవరాజు సైన్యాలు ఆగినాయి. వెదురు, పేము, ముండ్లకంపలు, పేడతో, గంధకంతో ఆకోటగోడ నిర్మితమైనది.

వీరులు కంపకోట పైనుండ యుద్ధంచేయరు. కంపకోట వెనుకతట్టున ఉన్న బురుజులమీదనుండి మేటి విలుకాండ్రు శత్రువును చీకాకుపరుస్తారు. ఆ బురుజులూ కంపతోనే నిర్మిస్తారు.

శత్రువులకు కంపకోట అంటేనే భయము, కంపకోట గోడల వెనుకనుండి బురుజులమీదనుండీ శత్రువులను బాణాలచేతా, శిలాప్రయోగాలచేతా, అగ్నివర్షంచేతా చీకాకుపరుస్తూ వుంటారు. ఒకవేళ కంపకోట పట్టుబడుతుందని భయంకల్గితే ఆకోటను కాల్చి తమ నగరంలోనికి చేరుకుంటారు.

మహాదేవరాజు కంపకోటచుట్టు అర్ధగవ్యూతి దూరంలో ఇరువది చిన్న కోటల నిర్మాణానికి తలపెట్టి పని ప్రారంభించెను. ఈ ఇరువది కోటలను కలుపుచు ఒక చిన్నగోడ నిర్మాణం చేయించసాగాడు. ఆ గోడకు ముందు పెద్దగొయ్యి. ద్వారాలకు ముందుమాత్రం దారులు.

కోట ముట్టడి యంత్రాలు, దూలాలు, గొలుసులు మొదలయినవి బళ్ళమీద వచ్చినవి తీసి వానిని కూరుస్తున్నారు. వెదురుతో, పేముతో అల్లిన పెద్ద దడులను ఉప్పునీళ్ళలో ఊరవేసిన తోళ్ళు బిగిస్తున్నారు. ఆ దడులే యుద్ధం సాగినవెనుక కోటగోడలదగ్గరకు వెళ్ళేవారిని అగ్నిబాణాలనుండి, రాళ్ళవర్షమునుండి రక్షిస్తాయి. ఆ దడులు నిలబెట్టేందుకు సన్నదూలాలు సిద్ధమైనవి.

ఏనుగులకు కవాదాదులు సిద్ధమవుచుండెను. ఏనుగులమీద కోట అంబారీలు సమకూరుస్తున్నారు. గుఱ్ఱపు దళాలను రక్షించే పొడుగుడాళ్ళు బళ్ళలో నుంచి దింపుతున్నారు యుద్ధవీరులు, యుద్ధనాయకులు, దళపతులు, అశ్వపతులు, గజపతులు, మహాపతులు నివసించే శిబిరాలు సిద్ధమౌచున్నవి. నగరపుకోట చుట్టు కొలత పదిహేను గవ్యూతు లున్నది. ఆ కొలతచుట్టు అర్ధగవ్యూతి నుండి ఒక గవ్యూతి మందముగా మహాదేవరాజు సైన్యము విడిసినది.

సేనలకు సరిపోవు ఆహారసామగ్రి యుంచడానికి దండుమధ్య అక్కడక్కడ కోటగృహాలు నిర్మించారు. వానికి ఇరువది అంగల దూరములో అయిదువేల పచనగృహాలు నిర్మించారు. పచనగృహాలకు నూరు అంగల దూరములో వైద్యాలయా లున్నాయి: అశ్వికశాలలు, గజశాలలు వైద్యాలయాలకు నూరుఅంగల దూరములో వున్నవి. ఆ పైన సేవకుల పాకలు, పందిళ్ళు, ఆ పైన స్కంధావార రక్షణపు కంపకోటలు.

నాశన మైనంత నాశనంకాగా, మహాదేవరాజు సేనలలో అయిదు లక్షల వీరు లున్నారు. దేవగిరినుండి బయలుదేరినవారు ఎనిమిది లక్షలు.

సేవకులు, వర్తకులు, బండ్లుతోలువారు. దాసీలు, వైద్యులు, మాంత్రికులు, చాకలివారు, మంగలివారు, వంటచేయువారు, ఉప్పరులు, బోయీలు, బళ్ళుతోలువారు, సూతులు మొదలయినవారు మూడు లక్ష లున్నారు, ఈ మహాజనము నంతటిసీ చూచుకొని తాను వేసిన పథకమురీతిగా అన్నియు జరగడము చూచి మహాదేవరాజు జయము తనదేనని ఉప్పొంగిపోయినాడు.

తన స్కంధావారమంతా తిరుగుతూ అన్నివిషయాలు స్వయముగా మహారాజే కనుగొనుటచే వీరులకు, సేనాధిపులకు, సేవకులకు నిర్వచింపలేని సంతోషం కలిగింది.

మహాదేవరాజు వచ్చి మూడుదినా లయింది. ఇంతవరకు ఓరుగల్లులో అలికిడిలేదు. స్కంధావారం బయటా అలికిడి లేదు.

ఏ కా ద శ గా థ

# శివదేవయ్య

౧

వచ్చిపడ్డాడు మహాదేవుడు. అతని ముట్టడికి వేళకు ముహూర్తము కట్టి శివదేవయ్య విప్పారిన మోముతో, చిరునవ్వుతో తల పంకించాడు. శివదేవయ్య విశ్వేశ్వర శంభువునకు శిష్యుడు. గణపతి రుద్రదేవ చక్రవర్తి కూడా విశ్వేశ్వర శంభువునకు శిష్యుడు. విశ్వేశ్వర శంభువు గోళకీ మఠాధిపతి. వంగదేశమందలి దక్షిణ రాఢామండలంలోని పూర్వగ్రామ నివాసి. విశ్వేశ్వరశంభువు గోళకీ మఠాధిపతులలో నేడవవాడు. గోళకీమఠము లకులేశ్వర సంప్రదాయానికి చెందిన మఠము. లకులేశ్వరుడు మాళవుడు. ఆంధ్ర శైవాగమవేత్త అయిన అమరేశ్వరుని శిష్యుడు. అమరేశ్వరుడు క్రీస్తుశకారంభమునందు ధాన్యకటకమునకు అనతిదూరంలో కృష్ణాతీరంలో ఉన్న అమరేశ్వర మహాక్షేత్ర నివాసి. వీరియుభువురు సాక్షాత్తు శివుని అవతారులనే ప్రతీతి.

అమరేశ్వరము నిర్మించినది దూర్వాసమహర్షి యట. ఆ మహర్షి పాశుపతము, కాలాముఖము అని పేరు పొందిన అతి పురాతన శైవసంప్రదాయము ఆంధ్రదేశమునందు నిర్మించెను. ఈ సంప్రదాయము సింధునదీ తీరాన క్రీస్తుపూర్వం ఆరువేల సంవత్సరములపైనుండి వర్ధిల్లి ఉన్నది. అది వేదములంత ప్రాచీనమని మహర్షులంటారు. సింధుతీరవాసులు కృష్ణా గోదావరీ తీరాలకు వలసవచ్చినప్పుడు తమతో ఈ శైవసంప్రదాయాన్ని కూడా తీసుకొనివచ్చి కదలిపురంలో, కష్టపురంలో, కురంగపురంలో, శ్రీశైలంలో, అమరేశ్వరంలో ద్రాక్షారామంలో, మంత్రకూటేశ్వరంలో పట్టీస్వరంలో మఠాలు ఏర్పాటుచేసిరి.

అలాంటి మహోత్తమ సంప్రదాయానికి చెంది, గోళకీ మఠాచార్యుడైన శివదేవయ్యమంత్రి ఆంధ్రారాధ్య నియోగి బ్రాహ్మణుడు. ఈ గోళకీమఠం మొదట స్థాపించినది సద్భావశంభువు. ఈయన శిష్యుడు సోమశంభువు. ఈ మహాశైవుడు అనేక గ్రంథాలు రచించి ప్రఖ్యాతి కన్నాడు. ఈయన శిష్యుడు వామశంభువు. ఆయన శిష్యుడు శక్తిశంభువు. శక్తిశంభువు శిష్యుడు కీర్తిశంభువు. వీరి శిష్యుడు విమలశంభుడు. ఆయన శిష్యుడు ధర్మశంభువు. ధర్మశంభువు శిష్యుడు విశ్వేశ్వర శంభువు.

ఈ గోళకీ సంప్రదాయానికి మొదటి మఠము హిమాలయ పాదమైన గోమతీతీర త్రిపురి మహానగరము. ఈ మఠము త్రిపురికి దాపుననున్న గోళకి

కొండలపై ఉండేది. కాబట్టి గోళకి మఠము అని పేరు తెచ్చుకున్నది. ఈ పాశుపతమతము శుద్ధశైవము. శుద్ధశైవమతానికీ వీరశైవమతానికీ చాలా తేడాలుండేవి.

శివదేవయ్య దేశికులు మహాకవి. తెలుగు సుకీకారం అమృత ప్రవాహాలు కల్గే 'పురుషార్థసార' మను నీతిగ్రంధం రచించారు. ఈ మహాభాగుని గురించే తిక్కన మహాకవి,

"వసుమతీనాథ యాత డీశ్వరుడుగాని
మనుజమాత్రుడు గాడు పల్కులు వితవి
యనుమతంబున నీవు రాజ్యంబు నేలు"

అని పాడియున్నారు.

విశ్వేశ్వరశంభువు పరమశివునివలె గణపతిదేవ చక్రవర్తి మహానగరం దాపున నిర్మింపబడిన మఠమధ్యమందు అష్టస్తంభ మండపంలో బంగారు సింహాసనంపై వ్యాఘ్రాజనంపై అధివసించి జటామకుటకిరీటులై, రుద్రాక్షహారాలు ధరించి అపరశంభువై తేజస్సుతో వెలిగిపోతూ శైవవేదాంత రహస్యాలు శిష్యులకు సర్వకాలమూ ఉపదేశిస్తూ ఉండెను.

విశ్వేశ్వరశంభువు శివసాయుజ్యం పొందినప్పటినుండి గోళకీ మఠానికి ఎనిమిదవ గురువు శివశంభువు అయ్యేను. ఈయన ఎన్నో దానశాసనాలు త్రిపురాంతకాది దివ్యక్షేత్రాదులయందు వేయించినాడు.

మహాదేవరాజు సకల భారతావనికీ తలమానికమైన ఓరుగల్లు మహాపురాన్ని ముట్టడించినాడన్న మొదటివార్త తెలిపిన తన శిష్యునకు బంగారు తాపడం చేసిన నూటఎనిమిది పంచముఖ రుద్రాక్షలుగల తావళాన్ని శ్రీ శివదేవయ దేశికులవారు బహుమానమిచ్చినారు. ఇది శుభవార్తయా అని ఆ శిష్యుడు సందేహించాడు. ఆ శిష్యుని మోముపై ప్రత్యేకమైన ఆశ్చర్యకాంతులు పరిశీలిస్తూ శివదేవయ్య దేశికులు చిరునవ్వు నవ్వి.

"ఆశ్చర్యం ఎందుకోయీ! యాదవులు కాకతీయ సామ్రాజ్యంపై దండెత్త డానికి ఇదే తుది పర్యాయం. ఇంకొక్క నూరు సంవత్సరాలవరకు ఈ మహానగరంపై ఎవ్వరూ దాడిచేయలేరు" అన్నారు.

శిష్యుడు : మహాదేవరాజు దండెత్తకుండా ఉంటే ?

శివ : ఇంక వెవరో ఒకరు దండెత్తి తీరురు. ఈ పట్టు ఈ మహా నగరాన్ని ఇంకొకరు ముట్టడిస్తే ఈ నగరప్రాణం కడగట్టుతుంది.

శిష్యుడు : ఎన్నాళ్ళు జరగగలరు గురుదేవా ?

శివ : ఎన్నాళ్ళు జరిగినా భయంలేదు. విరోధికి ముట్టడి సాగినకొలదీ నష్టం.

శిష్య : అది అనుభవ విరుద్ధముకాదా దేవా ?

శివ: అనుభవ విరుద్ధం అంటావేమి? నీ కేముంది అనుభవము? ఎన్ని ముట్టడులు చూచావు?

శిష్యుడు: ముట్టడులనుగూర్చి విన్నాను గురుదేవా.

శివ: ఓయి వెర్రివాడా! ముట్టడించినవాడు, ముట్టడింపబడువానికి, లోకువ. అతని బలం ఎక్కువ నాశనం అవుతూ ఉంటుంది. అదిన్నీగాక తన దేశం వదలి ఎంతోదూరం వచ్చి ఉండడంచేత ఎక్కువనష్టానికి పాలవుతాడు. అలాంటివాణ్ణి ఓడించి తరమగలిగితే, వాడు మరెప్పుడూ తలెత్తుకోలేడు.

శిష్య: చిత్రం!

శివ: చిత్రమేమిటి వెర్రివాడా! రాజకీయాలు అతిగహనంగా ఉంటవి. మల్యాలగుండయ కాటయుల సేనలు అసాధారణాలు. అందరికన్న ప్రళయమే అయిన గోన గన్నారెడ్డి ధాటికి ఈ నీచుడు నిలువవద్దూ? అవన్నీ అల్లాఉంచి రుద్రమదేవి యుద్ధనిర్వహణశక్తి అప్రతిమానం. ఆమె అపరాజితా దేవి! ఆమె ధైర్యమూ, స్థైర్యమే కళ్ళారా చూడటము లేదటయ్యా!

శిష్య: చిత్రం మహాప్రభూ!

శివ: ఇంకో రహస్యం ఉంది. ఇదివరదాకా శ్రీ రుద్రదేవ చక్రవర్తి విరోధులను, ఇతరులను ఓడించి నాశనం చేశారు. ఇప్పుడు ఈ చక్రవర్తినియే స్వయంగా యుద్ధనాయకత్వం వహించి, లోకానికి స్త్రీ శక్తి అకుంఠితమని చాట బోతున్నది. ఇంతటితో స్త్రీలు ఎందుకూ పనికిరారు. వారికి రాజ్యార్హతలేదని వాదించే కుపక్షజీవుల మాట వ్యర్థం కాబోతున్నది.

శిష: గురుదేవా! మూర్ఖుణ్ణి నాఅపచారం మన్నించండి.

శివ: నీ అపచారానికి ప్రాయశ్చిత్తము, నువ్వు శివభక్తులైన గణాచారులలో చేరి, కోట వెలుపలి వార్తలు నాకు తెలియచేస్తూ ఉండడమే!

౨

శివదేవయ్యమంత్రి రథమెక్కి నగరరక్షణపు ఏర్పాట్లు ఎలాఉన్నాయో చూడడానికి వెళ్ళాడు. ఆయన భటులు, శిష్యులు, పండితులు, సేనాధికారులు కొలుస్తూఉండగా సరాసరిగ తూర్పుద్వారందగ్గరకు పోయినారు. అక్కడే పరాశక్తి అవతారమై పురుషవేషంతో, కవచాదులతో ఉత్తమాశ్వం ఎక్కి అంగరక్షకులు, ముఖ్య సేనాధికారులు, సచివులు కొలువ రుద్రదేవి దర్శనమైనది. అందరు తమ తమ వాహనాలు దిగి గురుదేవులకు నమస్కారంచేసి, ఆశీర్వాదాలు పొందారు. శ్రీ చక్రవర్తితో తంత్రపాలుడు ప్రోలరౌతు ఉన్నాడు. ప్రోలరౌతు కుమారులు ఎక్కినాయుడు, రుద్రినాయుడు, పినరుద్రినాయుడు, పోతినాయుడు అనే నలుగురు

అంగరక్షకులుగా ఉండిరి. వల్లయ నాయకుడు అశ్వరక్షకుడుగా ఉండెను. మారంరాజు, ప్రోలంరాజు, దారపనాయుడు, మారినాయుడు కవచ రక్షకులుగా ఉండిరి.

మొదటి కోటయైన కంపకోటను రక్షింప ప్రసాదాదిత్యనాయుడు తన వంతుగానూ, రెండవ మట్టికోటను రక్షింప చాళుక్య వీరభద్రుడు తన పైననూ వేసుకొన్నారు. మూడవ రాతికోటను రక్షింప జాయపసేనాని చక్రవర్తిని నియమించెను లోని సగరుకోట రక్షింప చాళుక్య మహాదేవరాజు నియమింపబడినాడు.

ప్రసాదాదిత్యుని పుత్రుడైన రుద్రసేనాని నగరపాలకుడుగా, తూర్పు ద్వారాల రక్షకుడుగా ఏర్పాటయ్యెను. నాగచమూపతి పడమటిద్వారాల రక్షకుడుగా, పెకిపోయే సేనల కధిపతిగా నియమితుడైనాడు. మున్నూరు కాపు కులజులు, సకల సేనాపతి పట్టసాహిణి, పడికము బొప్పదేవ మహారాజు ఉత్తరపు ద్వారాలకు కోటలలోని సైన్యాల కాయుధాలు అందీయడానికి ఏర్పాటయినారు. దక్షిణపు ద్వారాలకు, సేనల భోజనాదికాలకు బెండపూడి ప్రోలయమంత్రి నియమితుడైనాడు.

భూమికోటకు ఎనిమిదిగవనులు. ఒక్కొక్కదిక్కుకు రెండు రెండు గవనులున్నాయి. పదునెనిమిది దిడ్లు—మూలకు మూడు, దిక్కుకు ఒకటి, తూర్పునకు మాత్రం మూడు చొప్పున—ఏర్పాటు చేయించినది రుద్రమదేవి.

కంపకోటకు గవనులు నాలుగు, దిడ్లు ఎనిమిది ఉన్నవి. రాతికోటకు గవనులు నాలుగు దిడ్లు ఎనిమిది చేర్చిన దామె. రాతికోటకు లోతట్టున సోపానాలు పెట్టించినది. రాతికోట అలంగముమీద బంధువులైన వీరవరులు కాపున్నారు.

పిల్లలమర్రినుంచి వచ్చిన రేచెర్ల బేతయ బంధువులైన వెలమవీరులు కంపకోట కావలికాచుచుండిరి. వారికి బాసటగా గార్లనుంచి వచ్చి రేచర్లవీరు లుండిరి. బుక్క మాచయరెడ్డి గద్వాల సామంతుడు తన సైన్యాలతో మట్టికోట తూరుపు గోడపై ఉత్తరపుదిక్కున ఉండెను. గురుగుంట సోమప్ప నాయకుడు మాచయరెడ్డి దక్షిణంగా ఉండెను. గోపిరెడ్డి అమరచింతేశ్వరుడు ఆయనకు దక్షిణంగా ఉండెను. చక్రవర్తిచే అనుజ్ఞాతుడైన, వృద్ధుడయిన జన్నిగదేవసాహిణి తన రాజ్యం అంబయదేవునికి అప్పగించి వీరులతో మట్టికోట దక్షిణ పశ్చిమకుడ్యములపైన బురుజులపయిన నిలచినాడు.

కందనోలు ప్రభుపు ముప్పడిప్రభువు మట్టికోటకు ఈశాన్యదిశను బురుజులపై నిలిచినారు. రాతికోటకు లోతట్టున ఇటుకకోట కట్టించినాడు చాళుక్య వీరభద్రుడు.

కొమ్మ ఒక్కింటికి ఇద్దరు, బురుజుకు ఏబదిమంది, దిడ్డికి నూర్వురు, గవనులకు ఏనూర్వురు వీరులు నిలచిరి. అంగకు ఇద్దరు ముందువరసను, వారికి బాసటగా ఎనమండుగురు వెనుకను ఉన్నారు.

కోటద్వారాలన్నీ గడచి చక్రవర్తియు, శివదేవయ్యమంత్రి, చాళుక్య వీర భద్రుడూ, అంగరక్షకాదులూ, మట్టికోటకు పోయి. గోడఎక్కి విరోధుల పటాటోపాలన్నీ చూస్తూ సాయంకాలానికి తిరిగి నగరులు చేరినారు.

రుద్రదేవి, శివదేవయ్య పాదాలకు సాగిలబడి ఆశీర్వచనంపొంది నగరు లోనికి పోయినది. అన్నమదేవి మహారాజు నగరానికి పది గవ్యూతుల దూరంలో ఉన్నాడన్న సమయంలోనే రుద్రదేవి ఆలోచనమీద పురుషవేషం వేసికొని, మల్లికకు పురుషవేషంవేసి ఎక్కడికేని వెళ్ళిపోయెను.

ముమ్మడాంబికాదేవికూడా పురుషవేషం వేసికొని చక్రవర్తికి కుడిచేయిగా ఉండటానికి ఉబలాట పడుతున్నది. అందుకు చక్రవర్తి ఆజ్ఞ ఈయలేదు. ఆ కారణంవల్ల ముమ్మడమ్మకు ఎంతో కోపంగా ఉన్నది.

రుద్రదేవి లోపలికివెళ్ళి కవచాదులు. వస్త్రాదులు ఊడ్చి, స్త్రీ వస్త్రాదులు ధరించి పూజకు కూర్చున్నది. పూజ ముగించి 'ఈ యుద్ధ పర్యవసానం ఏమవుతుందా' అని ఆలోచనాధీనయై భోజనం చేస్తున్నది. ఆమె ప్రక్కనే భోజనంచేసే ముమ్మడాంబిక మూతి ముడుచుకొని భోజనం ఏలాగో చేస్తున్న విషయం కొంతసేపటికి కాని రుద్రదేవి గ్రహించలేకపోయింది.

రుద్ర : చెల్లీ! ఏమిటా భోజనం ?

ముమ్మ : నా చక్రవర్తి నన్ను ఆజ్ఞాపిస్తే నేను ఎక్కువ తినవచ్చును. కాని అది నాలో ఇమడగలదని అనుకోను.

రుద్ర : అంతకోపంవస్తే ఏమి చెప్పను ? నేను మగవీరునిలా తిరిగి తెచ్చుకొనే అపయశం చాలదూ ?

ముమ్మ : నన్నంచే అవండి, మిమ్ముల్ననుకొని అబద్ధమాడకండి.

రుద్ర ; సరే, నీకు అంతకోపమైతే నాతో రావచ్చును. కోటలు దాటివెళ్ళి యుద్ధం చేయవలసివస్తూ ఉంటుంది. అలాంటప్పుడు....

ముమ్మ : అన్నాంబికను ఎల్లా పంపించారు ?

రుద్ర , అన్నాంబిక విషయమూ, నీ విషయమూ ఒకటేనా చెప్పు ? అన్నాంబ గన్నారెడ్డిని ప్రేమించినది. ఆమెకు ఏది అడ్డమైనా లెక్కచేయదు.

ముమ్మ : నేను మిమ్మల్ని ఒకనాడు సర్వసృష్టికన్నా ఎక్కువగా ప్రేమించాను. మీరు ఆడవారు కావడం నాదా తప్పు ?

రుద్ర : సరే! సరే! నా కన్న తక్కువగా ప్రేమించేవ్యక్తి ఇక ఎవరు?

ముమ్మ : అప్పుడు మీతో ఉండాలనే కోరనుగదా!

రుద్ర : అయితే త్వరలో ఆలాంటి పెద్దమనిషిని వెదకాలి.

ముమ్మ : వెదకేవరకూ మీతోనే ఉండనియ్యండి!

రుద్ర : ఏమితంటా తెచ్చిపెట్టావు ?

ముమ్మ : నేను తంటా తెచ్చిపెట్టేదాన్నయితే నన్ను ఎందుకు తీసుకువచ్చి కొన్నారు మగవేషంతో ?

రుద్ర : నీ బాధ్యత నా ఒక్కరిదే కాదు చెల్లీ !

ముమ్మ : దేశంలో అందరిమనుష్యులదీ మీ బాధ్యతకాదా ? అయినా మీరు ఎందుకు యుద్ధంలో నాయకత్వం వహిస్తూన్నారు ?

రుద్ర : రాజు అల్లా వహిస్తుండాలి !

ముమ్మ : రాణులుమాత్రము బాధ్యత వహించనక్కరలేదు కాబోలు !

## 8

రుద్రదేవి తన సేనాపతుల నందరినీ, ఆ రాత్రి తన ఆలోచనామందిరానికి పిలిపించింది.

"మీరు ఆంధ్రవీరులు, పగలకు వెన్నిచ్చుని మేటిశూరులు, విరోధిని పూర్తిగా ఓడించడానికి నెల దినాలకన్న ఎక్కువకాలం పనికిరాదు. పది దినాల లోపుగా మనం విజయం పొందగలం అని నే నమ్ముకోను ?

"మన యుద్ధవిధానం మనకోటను రక్షించుకోటంకాదు అని మీరు విస్పందేహంగా నమ్మండి. శత్రువును సర్వనాశనం చేసి ఓడించడమే మన కర్తవ్యము. అది ఒక్కటే మన ధర్మము. మన కోటబలం అందుకే ఉపయోగపడాలి.

"ఒక్క నిమేషము శత్రువునకు విశ్రాంతి తీసికొనే వ్యవధి ఈయకూడదు. గవనులు వెడలి వారి పైబడి నాశనం చేస్తూ ఉండడము, వారి ఒత్తిడి ఎక్కువైతే కోటలోకి వచ్చివేయడము ! అన్ని గవనులనుండి ఒక్కసారి ముందుకు దుమికి వెనక్కు రావడం, ముందుకుపోతే జాగ్రత్తతో పోవాలి !

"ఈ నాటికి మూడవదినం శత్రువులను కంపకోటకడకు రానిచ్చి, పోరు మంచిపట్టుగా ఉన్న సమయంలో కంపకోట అంటించాలి. అంటించేముందు తక్కిన సైన్యము మట్టికోటలోనికి వచ్చివేయాలి ! అగ్నిహస్తులు మాత్రం అగ్ని ముట్టించి లోపలికి వచ్చివేయండి ! శత్రువు రక్షణకోసం వెనక్కు తగ్గగానే అగ్ని ఆరిపోయే సమయంలో అన్ని సింహద్వారాలనుంచి, దిడ్లనుంచీ లక్షమంది సైనికులు శత్రువును చీకాకుపరచండి, శత్రువుబలం ఎక్కువ అయ్యే విషయం మేము కోటగోడమీదనుంచి చూచి మహాకాహళాలు ఊదిస్తాము. కాహళాల ధ్వని విని నెమ్మదిగా వెనక్కు అడుగువేయండి. పైకివెళ్ళే సైనికులందరూ శిరస్త్రాణాల పైన ఎఱ్ఱతలపాగాలు చుట్టుకొనండి. మన సైనికులు గోడదగ్గరకు వస్తూవుంటే శత్రువు మా బాణపు వేటకు రాగానే బాణవర్షం కురిసి ఆపుతాము. మన సైన్యం నిలబాటుచేసి, శత్రువును రెండవసారి తలపడండి. అప్పుడు మహా భేరిలు

మేము ప్రయోగించగానే ప్రతి సైనికుడు లోపలికి వచ్చివేయవలసిందని మా ఆజ్ఞ. ఈలోగా ఆసమయంలోనే ఉభయమల్యాల సైన్యాలు గన్నారెడ్డి గజదొంగలు వెనుకనుండి శత్రువులపై ఒత్తిడి ఎక్కువ చేసేందుకు మా ఆజ్ఞ అక్కినాయక ప్రభువు మనవారికి అందిస్తాడుగాక !"

అని చక్రవర్తి గంభీరవచనాలతో సేనాపతులకు తెలియజేసి సభ చాలించినారు.

ఆ మరునాడు ముమ్మడమ్మను వీరోచితవేషం వేసికొమ్మని తనవెంట తీసుకొని శివదేవయ్యమంత్రిని దర్శించడానికి పోయి వారు తమ తపోమందిరంలో ఉండగా దర్శించి సాష్టాంగనమస్కారా లాచరించింది చక్రవర్తిని. అంగరక్షకులు ఆ దేశికుల నగరానికి సింహద్వారం కడనే ఉండిపోయినారు.

తపస్సు చాలించి ఆ పరమమాహేశ్వరుడు. పరమమాహేశ్వరి అయిన అయిన చక్రవర్తినిని, ముమ్మడమ్మను ఆశీర్వదించి "మహారాజా ! మీరు విశ్వసించిన ప్రథమయుద్ధ ప్రయోగము అమోఘమైనది. దానివల్ల శత్రువుకు కలుగబోయే నష్టము అపారము, మీరే దర్శింతురుగాక ! లోకంలో ఆడువారి కులపతిత్వం ఎందుకు మహర్షులు తీసివేశారో !" అన్నారు.

రుద్రదేవి : గురుదేవా ! స్త్రీకి కులపాలకత్వం మహర్షులు ఊరికేతీసి వేశారంటారా ? ఆలోచించే తీసివేశారు. ఎప్పుడు యుద్ధం జరుగుతోన్నదని విన్నా గజగజ వణికిపోతాను.

శివ : పిల్లవానికి ముల్లు గుచ్చుకుంటే తల్లి తీసివేయగలదా ?

రుద్ర : తప్పక తీసివేస్తుంది !

శివ : పిల్లవానికి బాధ అని ఊరుకోరాదూ ?

రుద్ర : కత్తిపుచ్చుకొని కుమారునకైనా శస్త్రచికిత్స చేయగలదా బాబయ్యగారు ?

శివ : పాము కరిస్తే, విషం పీల్చివేయవలసి ఉంటే తన ప్రాణనష్టాని కన్నా వెరవకుండా పీలుస్తుందికాదా తల్లి.

రుద్ర : తన ప్రాణాన్ని అర్పించడానికి, స్త్రీ ఎప్పుడూ సిద్ధమే !

శివ : తన కొడుకు ప్రాణం రక్షించడానికి, కొడుకును బాధపెట్టలేక, కొడుకును చంపివేసుకొంటుందా ?

రుద్ర : (మౌనం)

శివ : కాబట్టి దేశానికి తల్లి అయిన రాణి, తనబిడ్డలయిన దేశప్రజలను రక్షించడానికి, యుద్ధం చేయడానికి సందేహిస్తుందా ?

రుద్ర : కానే, ధర్మంగా రాజ్యంచేస్తాను అనుకోడం అహంభావంకాదా !

శివ : తన్ను ఓడించి రాబోయేవాడు రాక్షసుడు కాజాలడనీ, ప్రజలను రక్షిస్తాడనీ ఆ రాణికి నిర్ధారణగా తెలియునా ?

రుద్ర : ఇవన్నీ తలచుకుంటోంటేనే నాకు ఆవేదన కలుగుతో ఉంటుంది. పరమశివుడు మానవలోకాన్ని ఇన్ని కష్టాలతో ఎందుకు ఉద్భవింప జేశాడు ? ఒకరు రాజ్యాధిపతులా, ఒకరు గంగిరెద్దుదాసరులవంటి బిచ్చగాండ్లు !

శివ : బిచ్చగాండ్లు అయి పడేకష్టాలు ఎక్కువ ఏముంది ? రాజ్యాధికారులు పడని కష్టాలు ఏమున్నాయి ? మహారాజా ! సర్వవిశ్వంలో ఈ మనుష్యుడే జ్ఞాన ఉపాధి. అతడే 'ఏమి ?' అనే ప్రశ్న వేసుకొంటున్నాడు. భక్తులు, జ్ఞానులు, అవతారపురుషులు కష్టాలలో కుంగిపోయి మానవజాతిని ఉద్ధరించడానికి అనేక ఆవేదనలకు లోనవుతారు. బుద్ధుడు చావు, ముసలితనం, రోగం చూచి అవి లేకుండా చేయాలని ప్రయత్నించి ఓవరకు ప్రపంచంమాయ, అది తెలుసుకున్న వారిని కష్టాలు ఏమీ చేయవు అని తీర్మానించుకున్నాడు. బీదవారికే మోక్షం సుకరం అని తెల్పడానికి కాబోలు, రాముడు శబరి ఎంగిలి తిన్నాడు. శ్రీకృష్ణుడు కుచేలునికి ప్రాణ స్నేహితు డయ్యాడు. అయినా ఏదో మార్పులతో ప్రపంచం అలానే ఉంది.

రుద్ర : గురుదేవా ! మనుష్యుల గుంపులు ఎల్లాఉన్నా ప్రత్యేకవ్యక్తి పరమాత్మను తెలిసికొనడమే మహాకర్మ అవుతుందికాదా ?

శివ : నిజం తల్లీ ! అయినా నీ చుట్టుపక్కల ప్రపంచం చూచి దాని సంతోషాలలో, బాధలలో ఒకటౌతూ, నువ్వు ప్రేమిస్తూ. ప్రేమించబడుతూ ప్రపంచం నిజమనుకుంటూ, కాదనుకుంటూ, ఒక దివ్యనాటకంలో పాత్ర అవుతూ, చరించటం ఎంత విచిత్రమైన విషయం ?

రుద్ర : అందుకే 'నువ్వు నిష్కామంగా కర్మచేయి, ఫలం నాకు వదలు' అని శ్రీకృష్ణభగవాను డన్నది.

శివ : అదేగా పాశుపతం చెప్పేది తల్లీ ! ఇంతకూ జీవితమహాయుద్ధం ముందర, ఈ అఖండ ఆత్మయుద్ధం ముందర మనం ఒనరించే యుద్ధాలు దివ్వెటీ ముందర దీపాలవంటివి.

రుద్ర : చిత్రం.

శివ : చిత్రమని విస్పృహచెంది వెళ్ళకు ! మన పౌరుషాలు, మన జ్ఞానాలు, మన ఖ్యాతులు. మన ఆవేశాలు దేహయుద్ధానికీ, ఆత్మయుద్ధానికీ కూడా ఉపకరణాలు. ఏయుద్ధంలోనైనా మనమే విజయం పొందాలి. ఎవరికివారే నరులు, తక్కినవారు ఉపకరణాలు. ఎవరికివారే పరమశివులు, తక్కినవారు పాశుపతాస్త్రాలు, ఎవరికివారే పశుపతులు, తక్కినవారు పశువులు !

దేశికుని గంభీరవచనాలు విని ఉప్పొంగి, రుద్రదేవి దేశికునకు పాదాభి వందన మాచరించి వెడలిపోయినది.

ముమ్మడమ్మ గురువులకు నమస్కరించి 'చక్రవర్తికి కలిగిన అనుమాన మేమిటి? అది గురువుగా రెట్లా తీర్చారు? వారి సంభాషణ ఇంచుకంతయినా తనకు బోధపడకపోయినదేమి?' అనుకుంటూ రుద్రదేవి వెనుకనే తన గుఱ్ఱం నడిపించుకుంటూ వెళ్ళినది.

౪

గోనగన్నారెడ్డి యాదవుణ్ణి సంపూర్ణనాశనంచేసే ఎత్తులు ఆలోచిస్తూ తాను విడిదిచేసిఉన్న ఒకపల్లెటూళ్ళో గ్రామణి ఇంట్లో మండువాలో పచారుచేయుచూ ఉన్నాడు. అతని కోలమోము, సోగమీసాలు, విశాలమైన కన్నులు, వెడదనుదురు ఆలోచనారేఖలతో బిగిసివున్నవి.

అప్పుడే ద్వారపాలకుడువచ్చి "మహారాజా! విశాలాక్షప్రభువు వేంచేసినాడు" అని మనవిచేసినాడు.

"ఏమిటీ! విశాలాక్షప్రభువా? రానీ!" అన్నాడు గన్నారెడ్డి. అతని హృదయం సంతోషంతో ఉప్పొంగింది. ఈ బాలుడు తన హృదయం చూరగొన్నాడు. ఆ బాలకునియందు వాత్సల్యం, సౌందర్యం, మైత్రి అన్నీ కలిసిన ఏదో ఒక దివ్యానురాగం కలిగింది. తెలివైనవాడు, చదువుకొన్నవాడు, ఉత్తమ వీరుడు. కాని మాటలో, కంఠస్వరంలో కొన్ని కొన్ని విషయాలలో బాలికలా అయి ఊరుకుంటాడు. ఆ చిన్న చేతులు అంత మృదువులేమి? కాని కత్తి పట్టుటలో అఖండ ప్రజ్ఞ చూపిస్తాడు. మగవీరులులా కనబడే స్త్రీలు, మగరాయని పనులు చేసే స్త్రీలూ, బాలికలలా ఉండేబాలురు ఉంటారు కాబోలు.

అతని బాల్యమూ, అతని లేతదనమూ చూచి, తనకు ఆ బాలకుడంటే అంతప్రేమ కుదరడానికి కారణం అయింది.

ఇంతలో విశాలాక్షప్రభువు పటాటోపంగా లోపలికి ప్రవేశించి, "మహారాజా! నమస్కారము" అని గన్నారెడ్డి పాదాల కెరగినాడు. మహారాజు విశాలాక్షరెడ్డిని గ్రుచ్చిఎత్తి రెండుభుజాలమీద చేయివేసి సంతోషంతో "విశాలాక్షప్రభూ! నన్ను మరచిపోయావే అనుకున్నాను. కాని నీ రెండు కమ్మలూ నాకు చాలా ఆనందం చేకూర్చాయి. ఆ ఉత్తరాలలోవి మాటలు కాదుసుమా!"

విశా: మరి దేనికి మహారాజా!

గోన: నేను దేవుణ్ణనీ, దేవుని తమ్ముని కుమారుడననీ పొగడితే మాత్రం కష్టంగాఉంది ప్రభూ!

విశా : మరి ఎందుకు మీకు ఆనందం చేకూరింది ?

గోన : ఆ ఉత్తరాలకే.

మల్లికార్జునరెడ్డి (గుమ్మంకడనుండి) : మహాప్రభూ ! ఉత్తరాలు చిత్రలేఖనాలులా అందముగా ఉన్నాయనా ప్రభువునకు ఆనందం కలిగింది ?

గోన : చక్కని మొగలిరేకుల కమ్మలు, వ్రాలు ముత్యాలు, ఉత్తరం పెట్టినది దంతపు పేటిక. శిల్పవిన్యాసము మనోహరము, అంతవరకు నిజము.

విశా ; ఆదా, మీరు చూచి ఆనందించినది మహాప్రభూ !

గోన ; నే నట్లాఅంటినా ? ఆనందానికి మాకు వేరేకారణం కనబడక, అవి అయిఉంటాయని అను కొన్నాను.

విశా : నే నేమీ అనుకోలేదు. ప్రభువులు మర్యాదకు అంటున్నారు, అంతే.

గోన : ఓహోహో ! మర్యాదకు మనస్సులో కోపమున్నా పైకి పత్తు్వతారా ? నా తత్త్వం అదికాదు. నా మనస్సులో ఉన్నదే పైకివస్తుంది. నీ స్నేహానికే ఆనందించానయ్యా ప్రభూ !

విశా : మహారాజా ! ఎల్లాగు ఈ యాదవపిశాచాన్ని మనం వదలించడం?

గోన : దెబ్బకు దయ్యాలు గడగడ లాడుతవి. ఇక పిశాచాలు లెక్కా ? మహాదేవరాజు శిబిరాలు నిర్మాణం చేసుకోనిచ్చాను. శిబిరాలు నిర్మించినవాడు స్వపురంలో ఉన్నవానితో సమానమే ! ఓ పట్టున శిబిరాలు వదలలేడు. శిబిరాలు వదలలేనివాడు శిబిరాలు లేనివానికి లోకువకదా ?

విశా : నగరానికి కోటగోడలుంటాయి రక్షించడానికి. శిబిరాన్ని రక్షించడానికి గోడలుకూడా ఉండవుకదా ?

గోన ; ఈ మూర్ఖపు మహాదేవుడు కొన్ని సంవత్సరాలు ఇక్కడ ఉండేవాడివలెనే అక్కడక్కడ మట్టి బురుజులు, గోడలు కట్టిస్తున్నాడు.

విశా : తన సైన్యాలను రక్షించడానికి ఏదయినా చేయాలికదా మహారాజా.

గోన : అవును ప్రభూ ! అవును. కోటచుట్టూ విరోధులకోట ! చక్రవర్తికి విరోధిని జయించడం కష్టమే.

విశా : కాని....

గోన : కాని ఏమున్నది ! అతన్ని విజయాన్ని పొందనిచ్చే దెవరు ? నీ రాకవల్ల నాకు ఒక చక్కని ఆలోచన తట్టింది. ఈ దెబ్బతో మహాదేవరాజు తోక ముడుచుకొని దేవగిరికి పరుగెత్తాలి.

విశా : ఏమిటండీ అది ?

గోన ; చెప్తాను తర్వాత. ఈలోగా కొన్ని సంగతులు తెలుసుకోవాలి.

ఇంతలో చక్రవర్తినుండి ఆ మరునాడు మధ్యాహ్నము సూర్యుడు నెత్తి మీద ఉన్న వేళకు మహాదేవరాజు సైన్యాలపై ఒత్తిడి ఎక్కువ చేయవలసిందని ఆజ్ఞ వచ్చిందని మల్యాల కాచయప్రభువు గన్నారెడ్డికి వార్త పంపినాడు.

ఈ మూడు సైన్యాలు మూడువైపులా కాపలా కాచినారు. ఎక్కడో దూరాన నుండి అశ్వికసేనలు, గజాలు, రథాలు బయలుదేరి వేగంగా వచ్చి మహాదేవరాజు సైన్యాలకు వెనుకదెసతాకినవి. ఈ తాకిడి ప్రళయంలా ఉండడంవల్ల మహాదేవరాజు సైన్యాలు ఎన్నో వెనుకవైపునకు తిరిగి ఆ మహావర్గాన్ని ఎదుర్కొన్నాయి, గన్నారెడ్డి అశ్వికసైన్యాలు వేగంగా వచ్చి విరోధుల్ని తాకి బాణాలు వదలడం, మళ్ళీ అంతవేగంతోనే వెళ్ళిపోతుండడం అనే ఆవర్తయుద్ధవిధానం ఉత్తమమయిందని తెలియజేసినాడు. మహావేగంతో వెళ్ళేవాడు గురికి దొరకడు. అతడు ప్రయోగించే బాణాలుగాని, భల్లాలుగాని, తోమరాలుగాని నిలిచియున్న విరోధులకు తగిలి తీరుతాయి.

ఈ ఆవర్తవిధానం చూచి భ్రమసిపోయి శత్రువులు వేలకొలది కూలిపోతున్నారు.

సరిగా ఆ సమయంలో కంపకోట వదలి ప్రసాదాదిత్యప్రభువు లక్షమంది సైనికుల్ని విరోధిపై ప్రయోగించాడు. శత్రుసైన్యాలు ద్విముఖమై యుద్ధం చేస్తున్నాన్నాయి.

ప్రసాదాదిత్యప్రభువు, శత్రువు తాత్కాలికంగా నిర్మించుకొన్న గోడలను అనేకప్రదేశముల బద్దలుకొట్టించి లోనికి ప్రవేశించాడు. పోరు ఘోర మయ్యెను.

అసమయంలో వేయి మహాకాహళపు మ్రోతలు వినవైనాయి. కంపకోటకు ముందుకు రెండుపాయలుగా ఏనుగులువచ్చి ప్రసాదాదిత్యునికి బాసట అయినాయి. ప్రసాదాదిత్యుని సైన్యాలు నెమ్మదిగా వెనక్కు తగ్గుచు మళ్ళినవి; వారిమీద విరుచుకుపడేవారిని గజసైన్యాలు నిలుపరించినవి. గజసైన్యాల వెనుకకు ప్రసాదాదిత్యుని బలాలు మళ్ళగానే ఏనుగులు వెనుకకుమళ్ళి కంపకోటలోని దిడ్డివెంటలోని కేగినవి.

మహాదేవరాజు శత్రువులు ఓడినారనే తలచి ఒత్తిడి ఎక్కువ చేసినాడు. ఆసమయంలో మల్యాలవారు, గోన గన్నారెడ్డి ఆవర్తయుద్ధం మాని నిలచి పోరసాగిరి. కాలిబలగాలు ముందుకు జరిగాయి.

ఇటు మట్టికోటలోనివారు కంపకోటదగ్గరకు రాకుండ శత్రువును నిలువరించినారు. కంపకోటనుండి ఒత్తిడి తక్కువైనది. శత్రువులు తమ వేగం తాము ఆపుకోలేక, ఎదిరివారు కంపకోటను కాపాడుకోలేకుండా ఉన్నారని, కంపకోటపై విరుచుకుపడినారు.

ఇంతట ఫెళఫెళారవాలతో, నూనెలతో తడుపబడి గంధకాదులతో సిద్ధమై యున్న కంపకోట అంటుకొన్నది.

౫

కంపకోట అంటుకొన్న వెంటనే భుగభుగ మనే మంటలు ఆకాశంపై దుమికాయి ; మంటలతోపాటు నూనెపొగలు, గంధపు పొగలు నాసికారంధ్రాలలో దూరి వీరుల కళ్ళు మూసినవి. ఆపుకోలేని దగ్గు వచ్చినది.

వేగంతో ముందుకురికిన యాదవబలాలు వెనక్కు మళ్ళలేక మంటలలో పడిపోయినవి. హాహాకారాలు, గోలలు నభోంతరాళం నిండిపోయినవి.

సువ్వు సువ్వున వేగంతో మహావర్షపాతంవలె బాణాలు శత్రువుల ప్రాణాలు హరిస్తున్నాయి. రెండు గడియలకు శత్రువులు తెప్పరిల్లి వెనుకకు మరలిరి. మంటలు తగ్గెను. ఆంధ్రసైన్యాలు మంటల వెనుకనుండి ఉధృతంతో శత్రువులపై కురికెను. ఓరుగల్లు కోటగోడలు పగిలినట్లు ఆంధ్రసేనలు విరుచుకు పడినవి. చెక్కు చెదరకుండా, వ్యూహనిర్మాణం చెడకుండా, విధిలా, ఆ వాహినులు శత్రువుల నాశనం చేస్తున్నవి. తమ గోడలలోనికి పోయికూడా శత్రువులు రుద్రదేవి బలగాలను ఆపలేకపోయినారు. శత్రువుల తాత్కాలిక కుడ్యాలు కూల్చి శత్రుశిబిరాలలోనికి చేరి, రుద్రదేవే ముందుండినడిపే ఆ ఆంధ్రవాహినులు విరోధిబలగాలను నాశనం చేస్తున్నవి. మహారాజు తన యుద్ధకౌశల్యమూ, పౌరుషమూ, ఓడిపోతానన్నా భయముచేత కల్గిన కోపమూ మూడు త్రేతాగ్నులుగా విజృంభించి రాక్షసునిలా పోరాడినారు. యాదవసేనలు తమ నాయకుని మెప్పుపొందే భయంకర యుద్ధము చేసినవి.

వీరనష్టకాకుండా యుద్ధం చేయదలచుకున్న రుద్రదేవి ఆజ్ఞచొప్పున గోనగన్నారెడ్డి, మల్యాలనాయకులు ఆపలివైపునుండి భయంకరమైన యుద్ధం ప్రారంభించినారు. ఇటు రుద్రమ ఆజ్ఞచొప్పున భేరీలు మ్రోగినవి. రుద్రమదేవి సైన్యాలలో కొత్తసైన్యాలు వచ్చి పదాతులకు, అశ్వికులకు రక్షణ కల్పింపగానే ఆ యాబలాలన్నీ కోటలోనికి వెళ్ళిపోయినవి. ఏనుగు బలాలు కోటచేరినవి.

కోటదగ్గరకు యాదవసేనలు రావడానికి వీలులేదు. అటు గోన, మల్యాల సేనలు వెనుకకు జరిగి మాయమైనవి.

ఆ దినమందు యాదవసైన్యంలో ఒకలక్షఏబదివేలమంది వీరులు మరణించినారు. గాయాలు తగిలినవారు, ఆంధ్రులకు దొరికినవారూ పెక్కు వేలమంది.

ఆంధ్రసైన్యాలలో మృతులైనవారు, గాయాలు పడినవారు, విరోధులకు చిక్కినవారున్నూ ముప్పదివేలు.

యాదవమహాదేవరాజు గుండెలో రాయిపడింది.

కోటపైకి వెళ్ళకుండాఉంటే తనకు నష్టమే ! కోటపైకి వెళ్ళినచో తన సేనలకే నష్టం ఎక్కువ సంభవిస్తోంది. ఎలాగో ఉత్తమమైన విధానం అవలంబించి ఆంధ్రనగరం స్వాధీనం చేసుకోవాలి.

తాను కోట ముట్టడి వదలి ఇతర నగరాలమీదికి వెళ్ళితే మంచిదేమో ? కోటలోఉన్న ఆంధ్రులకు బలం ఎక్కువ అవుతున్నది. కోట ఈవలకు వచ్చిన ఆంధ్రులను యాదవులు నాశనం చేయగలరు.

అయినా తా నెందుకు తొందరపడడం ? చుట్టుప్రక్కల గ్రామాలవారంతా ఓరుగల్లుమహానగరంలోనే ఉన్నారని తనకువచ్చిన వార్తలే నిజమైతే నగరంలో పదునాలుగులక్షల జనం ఉన్నారు. ముట్టడి నిలబాటుచేసినట్లయితే ఇన్ని లక్షల మందీ, ఉన్న ఆహారపదార్థాలను ఒక నెలదినాలలో తినివేయగలరు. జాగ్రత్తగా ఉంటే ఇంకొక్క పదిహేను దినాలపాటు ఈడ్చుకురాగలరు. అంతవరకు తాను ముట్టడి నిలబాటు చేయగలిగితే, కోట తన స్వాధీనం అయి తీరుతుంది.

తనకు ఆంధ్రుల యుద్ధవిధానం యావత్తు విశదమైపోయింది. అందుకని తొందరపడక తనశక్తి ఆంధ్రులకు తెల్లమయ్యేటట్లు చేస్తాడుగాక, అనుకొనుచు మహాదేవరాజు, ఆ రాత్రి పనివారలచేత తన కోటగోడలు, బురుజులు బాగుచేయించాడు. వెనుకనుండి మల్యాలవారి సైన్యాలు, గోన గన్నారెడ్డి సైన్యాలు తన్ను పొడువకుండా ఆవైపు చిరుకందకాలు, కంపకోటలురెండు శ్రేణులుగా కట్టించాడు. తాను ముట్టడి నిలబాటు చేయదలచుకున్నాడు.

ఈ లోగా వేగులవారిని పంపి దేవగిరిలో ఉంచిన లక్షసైన్యంలో ఏబది వేలమందిని, ఆహారపదార్థములు తెప్పించుకొన సంకల్పించాడు.

కోటలోను, గన్నారెడ్డి శిబిరంలోను తమ మొదటివిజయానికి ఆంధ్రులు విజయోత్సవం చేసుకున్నారు. గన్నారెడ్డి తనతో సమముగా యుద్ధముచేసిన విశాలాక్ష ప్రభువును చూచి 'విశాలాక్షప్రభూ ! నువ్వు నాకు కుడిచేయివి సుమా' అని మెచ్చుకొన్నాడు. విశాలాక్షప్రభువు మోము ప్రఫుల్లమై వెలిగిపోయినది. 'మహారాజా ! మీకు కుడిచేయివిగాను. మీ పాదాలప్రోల ఉండదమునకు శక్తిమాత్రం సంపాదించుకొంటున్నాను' అనినాడు.

గోన : ప్రభూ ! మీరు, యుద్ధంచేసే సమయంలో సర్వకాలమూ నా రక్షణకొరకే చూస్తే ఎలాగు ?

విశా : లేకపోతే మీకు అంగరక్షకుణ్ణి ఎల్లా కాగలను ?

గోన : మరి మిమ్మల్ని రక్షించేవారు ?

విశా : నాకు మల్లికార్జునరెడ్డి ఉన్నాడుకదా ప్రభూ !

గోన : మల్లికార్జునరెడ్డి ?

విశా : ఇల్లా యుద్ధం చేసేవారందరికీ అంగరక్షకులు ఉండాలా మహారాజా ?

గోన : ఉండాలని నా ఉద్దేశంకాదు. ప్రతివీరుడూ తన్ను రక్షించుకొంటూనూ ఉండాలి. విరోధులను నాశనమూ చేయాలి.

విశా : నాయకునికిమాత్రమే అంగరక్షకులు ఉండాలి. ఆయన సర్వసైన్యానికీ ప్రాణంకాదా ప్రభూ !

విశాలాక్ష ప్రభువు కన్నులు మెరిసినవి. ఆయనమోము వెలిగిపోయినది. గోనగన్నారెడ్డి హృదయం ఎందుకో కొట్టుకొన్నది.

శివదేవయ్యమంత్రి గురుసింహాసనంపై కూర్చుండినారు, సన్నని పొడుగాటి మనిషి, కోలమోము, అతివిశాల ఫాలము, గరుడ నాసిక, ముక్కుకుదగ్గరలో ఉండే లోతుకళ్ళు, పెద్దచెవులు, వెడల్పాటి నోరు, పొడుగుగా పెరిగిన జటలపై రుద్రాక్షకిరీట మున్నది. ముత్యాలు పొదిగిన బంగారు అర్ధచంద్రాభరణ మా కిరీటముపై నున్నది.నల్లని కోలబొట్టు మూడవ నేత్రంలా ఫాలాన వెలుగుచున్నది. ఆయన మెళ్ళో రుద్రాక్షమాలలున్నవి. వజ్రాలు పొదిగిన లింగకాయ నాయక మణిలా, ఒక రుద్రాక్షమాలకు వేలాడుచున్నది. ఫాలంపై, చెవులపై, భుజాలపై, విశాలవక్షంపై, మెడపై, ముంజేతులపై, పొట్టపై, వీపుపై విభూతిరేఖలున్నవి.

కైలాసశిఖర హిమసానుపీఠముపై పరమశివునిలా శివదేవయ్యమంత్రి స్ఫటికాసనస్థుడై, భక్తజనపరివృతుడై కూర్చున్నాడు. శైవతత్త్వవిచార దక్షులు కొందరు, పరమత దూషణవాదులు కొందరు, భక్తులు, గురుపాద ద్వంద్వారాధకులు, రాజకీయవిచారణదక్షులు, ఉద్యోగులు, పండితులు, శాస్త్రజ్ఞులు, మహాకవులు, ఉభయభాషావేత్తలు, తాంత్రికులు, శిల్పులు, జ్యోతిష్కులు, సిద్ధాంతులు, ఆగమవేత్తలు, మొదలైనవా రెందరో ఆ మహామహుని సభలో నిండి ఉండిరి.

శివదేవయ్య అందరితో సహస్రావధానంలా ప్రశ్నోత్తరాలు జరుపుచున్నను ఆ సాయంకాలం జరిగిన మహాయుద్ధాన్నిగురించే ఆలోచిస్తున్నారు.

తాను రుద్రప్రభువుకు ఆలోచనలు చెప్పగూడదు. ఆ ఉత్తమురాలు తన రాజ్యము తానే రక్షించుకోవాలి. తన సార్వభౌమత్వము తానే నిర్మాణము చేసుకోవాలి. ఆమె గణపతిదేవుని కొమరిత. స్త్రీలలోని పరిపాలనాదక్షణ కళాపూర్ణము, శక్తియుతము. పురుషునిశక్తి అత్యంత బలయుతము. పురుషుడు విరోధుల లోబరచుకొన్నా. తన ప్రాభవం కోరుతాడు. స్త్రీ ఇతరులను జయించినా వారిపూజ ఆశిస్తుంది.

రెండు శక్తులూ క్షుద్రమూంటలో యమునా గంగా సంగమమయ్యాయి!

ఈతల్లి స్త్రీరాజ్య మెంత ఉత్కృష్టమో లోకానికి చాటగలదుగాక. పురుషుడు విభూతులను సంపాదింపగలడు. వాటిని ఉత్తమంగా కాపాడవలసింది స్త్రీగదా? పురుషుడు సృష్టికర్త స్త్రీ సంరక్షణకర్త్రి. ఇది మహాభావవిషయంలో, భౌతికంగా స్త్రీ బిడ్డలను కనాలి, పురుషుడు ఆ శిశువులను రక్షించాలి. ఈ భౌతిక సత్యంలో నుండే తాంత్రికవాద ముద్భవిల్లింది.

ప్రేమకు విముఖుడయిన శివుడు కాముని దహిస్తే దేవి ఏమవుతుంది? విశ్వసౌందర్యాన్ని ప్రేమించి భోగించగల ఆమె దివ్యరాగము పురుషునిలో లేకపోతే విశ్వానికే నాశనం! పరమేశుని ఇచ్ఛ సృష్టిస్థితిలయాలు. నాశనశక్తి ఖండాపురుడయినది. ఆ నాశనశక్తిని పురుషుడు నాశనం చేయలేకపోవుట విచిత్రము. దేవిని ధ్యానించినాడు పరమేశుడు. తాను ఏమీ చేయలేడు. దేవి ఎక్కడ? సర్వమూ ఆహుతి అయిపోయినది. తానే ఆహుతి అయినాడు. తన ఇచ్ఛ ఆహుతి అయినది.

ఆ దివ్యాగ్నిలోనుంచి దివ్యకామ అయిన దేవి కామేశ్వరిగా ఆవిర్భవించింది. ఉపాధిలేనిశక్తి ఎట్లు? పురుషుడే కామేశ్వరుడు. కామకామేశ్వరి, రాజరాజేశ్వరి అనే భావం విశ్వవిశ్వాలకు, అనంతకాలానికీ మూలమంత్రం, అ మంత్రానికి అధిదేవత కాముడే అయినాడు.

అలాంటి ఈ విశ్వంలో, విశ్వానికి మధ్యమయిన ఈ భూమిలో, రాజులు రాజ్యాలకోసం, మతకర్తలు ధర్మాలకోసం, పండితులు తమ వాదాలకోసం విజిగీషులై జైత్రయాత్రలు చేయడం ఎందుకు?

ధనం, భోగం, కీర్తి ఈ మూడూ బ్రతికివున్నన్నాళ్ళే ఉంటాయి. కీర్తి కొన్ని నూర్ల సంవత్సరాలు వుండవచ్చును. ఎంతమంది రాజులు దానశాసనాలు వ్రాయించలేదు. అవి జరుగుతున్నాయా? ఎంతమంది తాత్విక ధర్మస్థాపనలు జరుపలేదు? అవి ఏమయ్యాయి? పరమశివుడే లే దనలేదా బౌద్ధులూ, జైనులూ? ఈ దేశంలో స్త్రీ పురుషులు ఒకనాడు బౌద్ధులు; మరొకనాడు జైనులు; ఈనాడు శైవు లౌతున్నారు.

శైవంమాత్రం ఎన్నివిధాల రూపం పొందటంలేదు. అన్ని తత్వాలు తాత్కాలికమే. కాని వర్తమాన నాటకంమాత్రం తప్పదు.

మహాదేవరాజు ఓరుగంటికి వచ్చాడు. ఏమి కట్టుకుపోతాడు? ప్రాణాలా?

ఆతడు వచ్చాడని మనం రక్షించుకోవడం ఏమిటి? ఇదిఅంతా ప్రళయ నటేశ్వర మహాభావము. పులితోలో, ఏనుగుతోలో నడుమున కట్టుకొని, కంకాళాలు ధరించి, ముమ్మొనవాలు, డమరుకము, అగ్ని మూడు హస్తాల దాల్చి అభయహస్తంతో సృష్టి స్థితిలయాత్మకము లయిన కోటివేల కరణాలతో అంగ

హారాలతో నృత్యనృత్తాలతో, అభినయాదులతో, దివ్యగాంధర్వంతో, సర్వ విశ్వ భావంతో తాడవం చేస్తాడట. అన్నీ ఆ తాండవంలో భావమాత్రములే.

శివదేవయ్యమంత్రి చిరునవ్వు నవ్వుకొన్నాడు. శిష్యులంతా లోగొంతుక లతో ఏవేవో చర్చించుకొంటున్నారు.

అంతలో రుద్రదేవచక్రవర్తి హఠాత్తుగా లోనికి దయచేసి గురువునకు సాష్టాంగనమస్కారము చేసింది.

అచ్చటనున్న భక్తులంతా లేచారు. గురుదేవులు తమ ఆలోచనా పథంనుండి మరలి, చటుక్కున లేచి "మహారాజా! రండి అధివసించండి" అని కోరినారు. రుద్రమదేవిన్నీ, శివదేవయ్య దేశికులున్నూ తమ తమ ఆసనా లధివసించగానే భక్తులంతా తమ ఆసనా లధివసించి యుద్ధ విషయాలు వారిద్దరూ మాట్లాడుకొంటూ వుంటే విందామని కుతూహలం పడుతున్నారు.

రుద్ర : నాయనగారూ! ఇంతవరకూ మనదే జయం. మహాదేవరాజు చిందరవందర అయిపోయినాడు. విన్నారా?

శివ : విన్నాను మహారాజా! మీ మనస్సులో ద్వాదశార్కులు ప్రతిఫలింతురుగాక! మీ హస్తాలలో పాశుపతాది దివ్యాస్త్రాలు భాసించుగాక! మీ చూపులలో ఫాలనేత్రాగ్ని వెలిగిపోవుగాక! మీ శత్రువు పరాభూతుడగుగాక! మీకు శుభ మగుగాక!

ఆ సభలో ఉన్నవా రందరు ఉప్పొంగిపోయారు.

## ద్వాదశగాథ

# విజయధ్వానం

౧

వారముదినములు కాకతీయవీరులు, వీరభద్రులు, రెడ్డిభీములు, వెలమార్జునులు, మున్నూరు రాములు, బ్రాహ్మణ పరశురాములు, ముదిరాజు హనుమంతులు, బోయాంగదులు, గొల్ల బలరాములు ఎడతెరిపిలేకుండా, సర్వకాలాలయందు యాదవసైన్యాలపై విరుచుకుపడి నాశనం చేసిరి. ముక్కలుచేసి నుగ్గునుగ్గుగా భస్మము సలిపినారు. చాళుక్య వీరభద్రుడు యుద్ధంలో ప్రాణాలు మరచిపోయి ఉద్ధతసత్వుడై దుర్నిరీక్ష్యపరాక్రముడై యాదవులను ముక్కలు చేస్తున్నాడు.

వారముదినా లయినవెనుక రుద్రదేవి తన సర్వసైన్యాలకు రెండు దినాలు విశ్రాంతి అని ఆజ్ఞ దయచేసినది.

కోటలోనుంచి ఒత్తిడి లేకపోవడంవల్ల యాదవసైన్యాలకు కొంచెము 'అమ్మయ్యా' అని గాలి పీల్చుకునే అదను దొరకినది. ఈ పదిదినాల యుద్ధానికి యాదవులు మూడులక్షలమంది ముక్కలయిపోయినారు. రెండు లక్షలమంది మృతులయినారు. గాయాలు తగిలినవారు ఎనభైవే లున్నారు. తక్కినవారు శత్రువులకు బందీలయినారు.

గోన గన్నారెడ్డి యాదవులకు దేవగిరినుండి ఆహారసామాగ్రులు రానివ్వడు. దేవగిరికి మహాదేవరాజు పంపిన చారుల నందరినీ దారిలోనే బందీలుగా పట్టుకొని శత్రువుల వార్తలన్నీ అందిపుచ్చుకొని ఆనందిస్తూ మహాదేవరాజు సైన్యాలను చిందరవందర చేయుచుండెను.

మల్యాల కాటయచమూపతి బలగాలకు, మల్యాల గుండయ మహారాజు వాహినులకు గన్నారెడ్డే ముఖ్యనాయకుడైన ఆ పదిదినాలు అతడు నడిపిన యుద్ధవ్యూహవిధానము వర్ణనాతీతము.

ఒక దినాన బళ్ళను ముందుపెట్టి ఎద్దులు లేకుండా బళ్ళను తోసుకుంటూ అతడు సైన్యాలను నడుపుతూ వెళ్ళినాడు. విరోధులకు ఈ బళ్ళేమిటో ఆ చీకటిలో అర్థముకాలేదు. గన్నయ్య అధర్మయుద్ధం చేయలేడు. కాబట్టి తన సైన్యాలమంది 'గోన గన్నారెడ్డికి జై' అని కేకలు వేయించాడు.

ఆ కేకలతో యాదవమూకలు భయపడి ఆ చీకటిలో దొరికిన ఆయుధములతో గన్నారెడ్డిపై విరుచుకుపడవలెనని ప్రయత్నము చేసిరి. కాని చక్రములో

చక్రముగా వచ్చిన బళ్లు వారి కడ్డమయ్యాయి. గన్నారెడ్డి వీరులు హుమ్మని అగ్నిబాణాలు వర్షంలా శత్రువులపై కురిపించిరి. యాదవులలో కొందరు బళ్ళ అడుగున దూరి విరోధులను నాశనంచేయ ప్రయత్నం చేసిరి. కాని అదివరకే బళ్ళక్రింద గన్నారెడ్డిభటులు కాపలా ఉండుటచేత ఆ ప్రయత్నం చేసిన వారు నాశనం అయ్యారు.

బళ్ళు ముందుకు సాగుతున్నాయి. గన్నారెడ్డి వీరుల పరపిన అగ్నిబాణాలు యాదవసేనల శిబిరాలను అంటించాయి. ఆ మంటల వెలుగున ఇరు వాగులవారూ ఒకరికొకరు స్పష్టంగా కనబడినారు. మహాదేవుని బలాలు మంటల వెనుక దాగికొని మంట లార్పుచుండెను. యుద్ధము ఘోరముగా సాగుచున్నది.

తెల్లవారుగట్ల ఉదయం ఒకజాము ఉందనగా గన్నారెడ్డి బలగాలు మాయమై పోయాయి. వారు వెళ్ళేటప్పుడు బళ్ళను లాగుకుంటూనే వెళ్ళిపోయినారు.

ఆ రాత్రి గన్నారెడ్డి శత్రువులను ఏపదివేలమందినో హతమార్చినాడు. తన సైన్యంలో అయిదువేలమంది చనిపోయినారు.

ఆ రాత్రి యుద్ధముసంగతి గోంకప్రభువు, శ్రీ రుద్రమదేవి చక్రవర్తికి వార్త తెచ్చినాడు. చక్రవర్తి ఎంతో ఆనందించెను. అన్నాంబిక తను ప్రేమించిన వానికడకు పోయెను ఆమె ఏమి చేయుచుండెనో అని రుద్రదేవి అనుకున్నది. గన్నారెడ్డి ఇప్పటికి నాలుగేళ్ళనుండి ఆంధ్రకాకతీయ మహాసామ్రాజ్యానికి చేసిన సేవ అపారము. గజదొంగ అయిననేమి అనికదా లోకైకసుందరి అన్నాంబిక అతని ప్రేమించినది. అలాంటి బాలికను గన్నారెడ్డి ప్రేమించగలడా ?

ప్రేమకు కారణం వ్యక్తంగా కనబడదు. ఎందుకు ఎవరియందు ఎవరికి ప్రేమ కలుగుతుందో ఎవరు చెప్పగలరు ?

యుద్ధకాలమందే మానవహృదయంలో ప్రేమ పరవళ్ళెత్తుతుంది. యుద్ధాల నుంచి వచ్చిన వీరుడు ప్రియురాలి వక్షఃస్థలముపై తలవాల్చి ఆమె హృదయగతులు దివ్యగీతము ఆలాపించగా, ఆ జోలకు నిదురపోగోరుతాడు.

ఒక ప్రాణిని ఇంకొక ప్రాణి నాశనంచేసే సమయంలో అతడు రాక్షసుడే అవుతాడు. అలా రాక్షసుడైన మానవుని తిరిగి మానవునిగా చేయగలిగినది ప్రేమ. ప్రేమ ఎంత దివ్యమైనది ; స్త్రీయే రాక్షసి అయినప్పుడు పురుషునికన్న వేయిరెట్లు ఎక్కువగా ప్రేమను వాంఛిస్తుంది. ఆమెను దివ్యురాలిగా చేసే తల్లిప్రేమకు పురుషప్రేమయే ప్రాంగణము. ఆ ప్రాంగణములో తానువలచిన అతిలోకసుందరాకారుడు కర్కశురాలై, రాక్షసియై, మానవప్రాణాదనియైన తన్ను, మనుష్యులను గుర్తించలేని చూపులతోవచ్చే తన్ను ప్రపంచానికంతకు తానే సామ్రాజ్ఞిని అని వచ్చే తన్ను తననుండి రక్షించడానికి గాఢంగా హృదయానికి అదుముకొని తనలో

ప్రళయతాండవం చేసే రాక్షసత్వాన్ని ప్రేమామృతంతో నాశనం చేయగలడా ఆ మహాపురుషుడు !

చాళుక్య వీరభద్రుని తాను చూచినక్షణమే అతడు తన జీవితానికి జన్మ జన్మలకు ఈశ్వరు డెట్లా అయినాడు ? ఏమి విచిత్రమైనదీ ప్రేమ ? ఎంత తీయని బాధతో బ్రదుకుస్వరము నిండిపోతుంది ? ఆత్మ ఒక్కటే అగుగాక, ప్రత్యగాత్మత్వము పొందిన ఒక్కొక్క వ్యక్తి ప్రపంచానుభూతులను ఒక్కొక్క విధంగా పొందగలుగును.

అన్నాంబిక గన్నారెడ్డికై పొందిన ప్రేమపరమార్థము, చాళుక్య వీరభద్రునికై తాను పొందిన ప్రేమపరమార్థము ఒకటే అయినా వివిధ మూర్తులుగా ఉంటవి.

వీరభద్ర ప్రభువునకు ఆపదలేమియు రాకూడదని తన హృదయములో ఉన్నది. అయినా క్షత్రియవీరుడు ప్రాణాలకుతెగించి యుద్ధము చేయవలసేఉన్నది.

వీరభద్రుడు పరమస్వామిగానూ, పరమశివుడుగానూ తనకు కనబడుతాడు. ఆయన వీరవిక్రముడై, పురుషోత్తముడు కావాలనీ తాను కోరుతుంది. యుద్ధములో అనవసరపు హానికి లోబడకుండా, ఆయన తమ నగరులోనే ఉండాలని తాను కోరుతుంది.

ఓహో ప్రేమ అత్యద్భుతము ! ప్రేమయే ఒక వ్యక్తి ! ప్రేమే సర్వ సృష్టికీ మూలము.

"చాళుక్యప్రభూ ! మీరేమి ఆలోచించుచున్నారు ?"

రుద్రదేవి తన నగరులో దేహము వేడెక్కగా, ఏవో మాధుర్యాలు తన్ను పొదువుకొనగా, వక్షము లుప్పొంగగా సిగ్గుపడుతూ తన మంచముపై వాలిపోయినది.

౨

మహాదేవరాజు కాకతీయ మహానగరం ముట్టడించిన పదునాలుగవ నాటి ఉదయము మొదటిజామునుండి రుద్రదేవి సమస్తసైన్యాలతో కోటవిడిచి మహాదేవరాజు సైన్యాలపై ఉరికినది అన్ని గోపురద్వారాలు, దిడ్డిదారులు తెరవబడినవి. కోటగోడలమీదనుండి నిరంతర బాణవర్షము శత్రువులపై కురిపిస్తున్నాడు. చాళుక్య వీరభద్రమహారాజు.

ఇన్నాళ్ళనుండీ మహాదేవరాజు బలగాలు మట్టిగోడను బద్దలుకొట్టడానికి చేసిన ప్రయత్నాలన్నీ ఏనుగుపై కురిసినవానలా అయినవి. అక్కడక్కడ కొన్ని

పెళ్ళలు మాత్రం విరిగిపడ్డాయి. దిడ్డిదారులు, గవనులు దరికిచేదారవికి అనేక పర్యాయములు వంతెనలు వేసినా అవి అగ్నిబాణాలచేత దహింపబడినాయి. పడమటి ద్వారాన్ని పట్టుకోవాలని మహాదేవరాజు విశ్వప్రయత్నము చేస్తూనే ఉన్నాడు. బలగాల రక్షించే రక్షకచ్ఛత్రఫలకాలు సంతతధారగా కురియు శిలావర్షముచేత ముక్కలయినవి.

పదుమూడవ దినాన, మహదేవరాజు సర్వదుర్గచ్ఛేదకయంత్రాలను ఉపయోగించి తూర్పుద్వారముపై గవిసినాడు. గడకర్ర తెప్పలు వందలకొలది గవనుల కీవలావల వేయించినాడు. వానిని సంరక్షిస్తూ కోటబురుజుల మీదికి వీరులు రాకుండా రెండునూర్ల చక్రగొట్టాలు వెనుక నిలిపినాడు. ఆ కొట్టాలపైనుండి మహాపరాక్రమంతో వీరులు శిలాప్రయోగయంత్రాలు, శతఘ్నులు, మహాబాణాలు ప్రయోగించుచుండిరి. ఆ చక్రకొట్టాలకు బలంగా వేలకొలది ఏనుగులు కవచ రక్షితములై దుర్గాలవంటి అంబారీలతో నిలచినవి. అందుండి వీరులు సంతతముగా అగ్నిబాణాలు ప్రయోగిస్తున్నారు. చిన్ననావలు వందలకొలది విశాలమైన కందకంలో వేసిరి. ఆ నావలపై వంతెనగా వెదురుదళ్ళు వేసినారు. దడులపై మట్టి వేసినారు. వంతెన సిద్ధమైనది. ఈవలావలనున్న దిడ్డుదకడను గూడా ఈలాంటి వంతెనలను వేయించినాడు.

ఆ పదుమూడవ దినమంతా అన్ని గోపురాలకడ, దిడ్లకడ ఇరువాగులవారికి భయంకరయుద్ధము జరుగుచున్నది. రాత్రంతా యుద్ధము జరుగుచునే యున్నది. కరిగిన సీసము, సలసలకాగేనూనె వర్షము కురుస్తున్నది.

వంతెనమీదనుండి ఏనుగులు, వీరులు వస్తున్నారు. ద్వారచ్ఛేదానికై కుంభస్థలాలకు కట్టిన బ్రహ్మశూలాలతో ఏనుగులు తలుపులను బద్దలుకొట్టుతున్నాయి. ఏనుగులకు సహాయంగా వీరులు చక్రయంత్రాలపైనున్న పెద్దయినుప గుదియలతో తలుపులు బద్దలుకొట్టుచున్నారు. పైనుండి కురిసే అగ్ని శిలాబాణవర్షాలకు వేల కొలది వీరులు మడియుచున్నారు. పైన గోడలమీద, బురుజులమీద వీరుడు తల ఎత్తేసరికి చక్రకొట్టాలనుండి బాణవర్షం కురియుచున్నది.

నాటి రాత్రికూడా తూర్పుద్వారందగ్గర ఎడతెగనియుద్ధం జరుగుచూనేఉన్నది తక్కిన అన్ని ద్వారాలకడను మహాదేవరాజు అఖండమైన ఒత్తిడి కలుగజేయుచునే ఉన్నాడు.

పదునాల్గవ దినము ఉదయించినది. పడమట, ఉత్తర దక్షిణముల గవనులు, దిడ్లు ఒక్కసారిగా తెరచి, వేలకొలది బలములతో రుద్రదేవి పచ్చిపడెను. వంతెనలు కూలినవి.

ప్రసాదాదిత్యప్రభుడు, చాళుక్య వీరభద్రుడు, నాగమసీడు, బొప్పదేవుడు, సోమనాథమంత్రి ప్రమథగణాలులా పైకురికారు. ఆ సమయములో గోనగన్నారెడ్డి అకుంఠిత వేగముతో తన అన్ని సేనలను ప్రోగుచేసుకొని

పూర్వద్వారానికి సూటిగా యాదవ మహాదేవరాజు సైన్యాలను చీల్చుకుంటూ, పద్మవ్యూహము చొచ్చివచ్చే అర్జునునిలా చొచ్చి రాసాగెను.

ఆ సమయంలోనే ఉభయ మల్యాల మహారాజుల సేనలు దక్షిణపుద్వారానికి ఎదురుగా మహాదేవరాజు మూకలను చీల్చుచు కాటచమూపతి, గుండయ ప్రభువుల ఉభయ నాయకత్వాన చొచ్చుకు రాసాగెను.

ఆ సమయంలో గోన విఠలభూపతి, సూరపరెడ్డి ఉత్తరపు గవనుకు ఎదురుగా సేనలతో యాదవుని బలగాలలోనికి జొరబడినారు.

ఈ పథకమంతా ఆలోచించి, అపసర్పనాయక శిరోమణి గొంకప్రభువు వలన అందరు నాయకులకు ఆజ్ఞలంపి మహాదేవరాజు పన్నిన భయంకరపు ముట్టడిని రుద్రదేవి ఎదుర్కొన్నది.

ఆ దినమున ఆంధ్రవీరులు నెరపిన పరాక్రమము అప్రతిమానమైనది. సాయంకాలానికి యాదవ మహాదేవుని సేనలు నాలుగుభాగాలై కోటముట్టడి వీడి రెండు గవ్యూతులు వెనుకకు పోయినవి. కోటగోడనుండి యుద్ధముచేసి వీరులందరు కోటవెలుపలికి వచ్చివేసినారు.

తన అంగరక్షకులతో, చక్రరక్షకులతో, కవచరక్షకులతో రుద్రదేవి మహాశక్తిలా విజృంభించి యాదవ మహాదేవుని తెల్లవారునప్పటికి పది గవ్యూతులు తరిమినది. మహాదేవరాజు ప్రజ్ఞతో తన సేనలన్నిటిని కలుపుకొన ప్రయత్నిస్తూ ఉత్తరాభిముఖుడై, అతినష్టంలేకుండా దేవగిరి చేరడము ఎల్లాగా అన్న తీవ్ర సమస్యను ఎదుర్కొంటూ పారిపోవుచున్నాడు.

నాలుగు దినాలలో హతశేషులైన మూడులక్షల బలగము అయిదు ఖండాలుగా గోదావరి చేరింది. గోదావరి వరదతో గట్లు పొర్లి ప్రవహిస్తున్నది.

వెనుకనే రుద్రమదేవి తన అన్ని సైన్యాలను నడుపుకొంటూ మహాదేవరాజు సైన్యాలను నదీసంగమానికి దిగువ నాలుగు గవ్యూతుల దూరంలో తాకింది.

మల్యాల సైన్యాలను ముందు మంజీరదాటి ఆవలిఒడ్డున ఉండి మహాదేవరాజు నది దాటకుండా చేయుడని గోన గన్నారెడ్డి ఆలోచన చెప్పడంవల్ల ఉభయ మల్యాలసైన్యాలు, మంజీరకు ఎగువను నదిదాటి ఆవలిఒడ్డుననే మంజీరా గౌతమీ సంగమంవరకూ వచ్చి నిలబడినవి. గన్నారెడ్డి సంగమానికి ఇంకా దిగువనే రుద్రదేవి సైన్యాలను వదలి గౌతమినిదాటి ఈవలిఒడ్డుకు మహాదేవరాజును రాకుండా చేయాలని పోయింది.

కాని మహాదేవరాజు నాలుగుదినాల క్రిందటనే దేవగిరికి ప్రజ్ఞావంతులైన రహస్యచారులను పంపించిఉన్నారు. ప్రతిష్ఠానములో సిద్ధముగావున్న ఏబదివేల నావలు నడుపుకుంటూ దేవగిరి సేనలో సగము వచ్చినవి. ఆ రాత్రి మహాదేవరాజు తన సేనలను ఆవలకు దాటించినాడు.

తెల్లవారుసరికి రుద్రమదేవికి మహాదేవుని గౌతమీతీర శిబిరము నిర్మానుష్యమై దర్శనమిచ్చినది.

## 8

గన్నారెడ్డి గోదావరిని సేనలతో దాటేసరికే మహాదేవరాజు దాటి గోదావరి తీరాన్నే అతివేగంగా దేవగిరికి ప్రయాణం సాగించాడు.

గన్నారెడ్డి వచ్చి గౌతమిలో తేలిపోవు నావలను పట్టించియు, తన నావలను తెప్పించియు చక్రవర్తిని దాటింప ఏర్పాటుచేసి తాను ఇరువదివేల అశ్వికబలాలను తీసుకొని యాదవ మహాదేవప్రభువును ఆటంకపెట్టుటకు ముందుకు పోయినాడు. మల్యాల సేనలకు, గోదావరీతీరాన్నే ఎగువకువచ్చి గోదావరి దాటవలసిందని వేగు పంపి హుటాహుటి అతివేగంగా వెడలిపోయినాడు.

తెల్లని రూపసంపదచే ఉచ్చైశ్రవమునకు బిడ్డయనదగిన యవశన్వాముపై అశ్వినిదేవతవలె గన్నారెడ్డి పోవుచుండగా విరూపాక్షప్రభువు అతనికి జంటగా ఇంకొక తెల్లని కాంభోజాశ్వముపై వెన్నంటి యేగుచుండెను.

గన్నారెడ్డి, విశాలాక్షప్రభువు యువతి అని గ్రహించాడు. ఆమె అన్నాంబికాదేవి అని గ్రహించాడు. మొదటిసారి విశాలాక్షప్రభువు తనకడకు వచ్చినప్పుడే అనుమానము కలిగెను. రెండవసారి వచ్చినప్పుడు అనుమానముతీరి నిజము పూర్తిగా గోచరించినది.

ప్రేమ ఎంతపనిచేయును! ఈ బాలిక వరదారెడ్డిని ప్రేమింపనందున ఆదవోనినుండి పారిపోయివచ్చినది. తానును ఆమెను ఎత్తుకపోయి పెళ్ళియాడ సిద్ధముగానుండ 'రోగి పాలుగోరిదాడు, వైద్యుడు పాలుకోరినా' దన్నట్లు ఆమెయే తనకుతానై వచ్చినది. ప్రపంచములో ఇంతటి సుందరాంగి ఉండనే ఉండదు. దేశాలు సంచరించిన తన కది స్పష్టమే, సర్వవిద్యలయందు ఆరితేరిన ప్రౌఢ. భయమెరుగ దీ బాల. యుద్ధవిశారద. పురుషవేషమునగూడ ఈ బాలిక ఎంత దివ్య సౌందర్యముతో విరాజిల్లుచున్నది! ఆమె స్వారిచేయుట ఆకాశములో హంస ఏగురుచున్నట్లే. ప్రాణాలకు వెరువక యుద్ధములో అతిరథ శ్రేష్ఠునిలా తనకు కవచరక్షణ చేసే ఈ మనోహరాంగి బాలికయని తా నెగిరినట్లు ఆమెకు తెలియ కూడదని, ఆమెను చిన్నవయస్సనే వంకతో ఇంటికి వెళ్ళిపొమ్మని ఎంత బ్రతిమాలినను విన్నదికాదు. సరికదా కోపముతెచ్చుకొని బాధనంది విచారముతో క్రుంగి పోయినది. తా నది చూడలేక తన సేవచేయుటకు అనుమతి ఇచ్చినాడు. ఆమె ఖడ్గయుద్ధము, ధనుర్యుద్ధము అసదృశములు.

పురుషుడుకాని స్త్రీకాని మారువేషాలు వేసికొని కొన్నిదినాలు మాయపెట్ట గలరు. ఆమె తనకడకు వచ్చిన మూడవదినాన కృష్ణానదిలో ఈదుటకై తా నామె బాలకుడే యనుకొని. బుజముచుట్టు చేయివేసి నదివైపు లాగినప్పు డామె ముడుచుకొని పోయినది. చిరుమీసాలతో సొంపుగా ఉన్న ఆమె మోము కందిపోయినది. తన ఒళ్ళు ఝల్లుమన్నది. పురుషుని ముట్టినచో ఒళ్ళు ఝల్లుమనునా?

అప్పుడే అనుమానము తన హృదయములో కలిగినది.

పిమ్మట ఆతడు తనతో కృష్ణకు స్నానమునకు రాడు, ఎప్పుడు తన్ను చూడటానికి వచ్చినా సంపూర్ణకవచధారియై ఉండడము తన అనుమానానికి దోహదమిచ్చెను.

మరల తన్ను కలుసుకొన్నప్పుడు ఆ బాలునికి, ఆ జగదేకసుందరికి తలపై నొకరు ముసలప్రయోగము చేయటం సంభవించింది. ఆ బాలిక తూలి విశ్రేష్టయై గుఱ్ఱముమీద తూలి గుఱ్ఱము కంఠము గట్టిగా పట్టుకొన్నది. వెంటనే తాను, ఆ శత్రువును రెండు తుండెములుచేసి, విశాలాక్షప్రభువును ఎత్తుకొని అక్కినమంత్రికి యుద్ధము నడప ఆజ్ఞయిచ్చి, తన గుఱ్ఱంమీద రెండు గవ్యూతుల దూరములోవున్న గ్రామములో శిబిరానికి తీసుకొనిపోయినాడుకదా!

మల్లికార్జునరెడ్డి తన వెనుకనే గుఱ్ఱముపై వచ్చినాడు.

తాను ఆ బాలకుని శిరస్త్రాణము విప్పగా జానువులవరకు వ్రేలాడే ఆమె తలకట్టు ముడివైచి దృశ్యమయినది. తల పైభాగం కొంచెం నలిగి రక్తము నిండిపోయినది. నీటితో ఆ రక్తము కడిగి, ఔషధములు పులిమి తలకు కట్టుకట్టి తాను.........

'ఈ బాలిక అన్నాంబికాదేవి, నువ్వు మల్లికవుకాదా?' అని మల్లికార్జునరెడ్డిని అడిగినాడు. ఆమె ఒప్పుకొని, 'ప్రభూ! ఈమె అన్నాంబిక అని తెలిసినట్లు మీరు వ్యవహరించకండి. ఈమె సిగ్గుచే ఏపనినయినా చేయగలదు. మహారాజా! ఈ తల్లి మీపైన బద్ధానురాగ! మీ రామెకు భగవంతులు! ఈ జన్మలో ఆమె మిమ్ముమాత్రమే వివాహం కాగలదట. లేనట్లయితే తనప్రాణమే భైరవునికి అర్పించుకుంటానని ప్రతిజ్ఞ పట్టింది' అనిచెప్పెను.

౪

దేవగిరికోటకు ఎల్లోరాగుహకు మధ్య ఎత్తయిన కొండలు, కొండలపై జనపదాలు ఉన్నవి.

దేవగిరికోటకు ప్రతిష్ఠానానికి మధ్య కొన్ని చిన్న గిరులు ఉన్నాయి. యాదవ మహాదేవరాజు సైన్యాలతో ప్రతిష్ఠానం చేరకముందే మల్యాలవారిలో పదియేనువేల అశ్వికసైన్యం ముందు ప్రతిష్ఠానానికి ఎగువనే గోదావరినదిని దాటింది.

గోన గన్నారెడ్డి దేవగిరి దారిలో రెండు కొండలమధ్య సేనలను నిలిపినాడు. మల్యాల సైన్యాలను వెళ్ళి దేవగిరిని చుట్టుముట్టమన్నాడు.

ఎనుబది ఘటికలు మహాదేవరాజుకు ముందుకువచ్చిన గోన గన్నారెడ్డి సాహిణితన సేననుఅర్ధచంద్రవ్యూహంగా బండరాళ్ళవెనుక,చెట్లవెనుక,పొదలవెనుక

నిలిపి, సిద్ధంగా ఉంచెను. విశాలాక్షప్రభువు గన్నారెడ్డి వెనుకనే బాణ మెక్కుపెట్టి సిద్ధముగా ఉంచెను.

గోన : విశాలాక్షప్రభూ ! ఇంతవరకు మీరు జాగ్రత్తగా ఇతరుల ప్రాణాలను అత్యవసరమైనగాని బలిగొనలేదు. చేతులకు కాళ్ళకు బాణాలు నాటి వీరులిన్ని యుద్ధంనుంచి పరాఙ్ముఖులగా చేస్తున్నారు. నా మీదకు ఏ వీరుడన్నా తలపడితే సింహమైపోయి, వాణ్ణి నేలకూల్చడానికి వెరవరేమి ?

విశా : మహారాజా ! నేను తమకు అంగరక్షకుణ్ణి. అదే నా పరమధర్మం. తక్కిన యుద్ధంతో నాకు పనిలేదు.

గోన : తక్కిన యుద్ధంలోకూడా మీరు పాలు పుచ్చుకుంటే జయము నిశ్చయము అని మీకు తెలుసుననుకోండి. అప్పుడు ?

విశా : ప్రభూ ! మీరు యుద్ధములో ఉంచే ఆ పక్షానికి జయంతప్పదు. జయం తెచ్చేది మీరు, మీకు అంగరక్షకుణ్ణి నేను.

గోన: నావల్ల జయంరాక, జయంతెచ్చే విధానం మీకు తోస్తుందనుకోండి, అప్పుడు?

విశా: అనవసరంగా అనుకోడాలు ఎందుకండీ? అలా ఎన్నటికీ జరుగదు. నా ప్రభువు విషయంలో నకు అనుమానం కలగనే కలగదు. ఇక ఈ ప్రశ్నలన్నీ ఎందుకు?

గోన: నిన్ను ఓడించటం కష్టమేనయ్యా! ఏమంటావు మల్లికార్జునరెడ్డీ?

మల్లి: ముందు ముందు మీరు మా ప్రభువును ఓడించనే లేరని తెలుసుకొని తీరుతారు. చూస్తూ ఉండండి.

రెండు గడియల కొక దళము చెప్పున ఎక్కడఉన్నవారక్కడ నిలుచున్న ప్రదేశాలలో నిద్రపోయారు. పగలు గడచినది, రాత్రి గడచినది. ఎక్కడివారక్కడే అటుకులు భుజించువారు, నీరుత్రాగువారూనూ.

ప్రొద్దు ఉదయించిన ఆరుగడియలకు మహాదేవరాజు సేనలలో ముందువాహినులు, వాలిపోయిన శరీరాలతో, ఎల్లాగో నగరదుర్గం చేరుకుందామని నిర్భయంగా, నిస్సంశయంగా వచ్చారు.

ఇంతలో ఒక్కసారిగా వేయిశంఖాలు ఆకాశం అంటేటట్లు గుండెలు వ్రక్కలయ్యే మహాధ్వానం చేసెను.

చెమటలు గ్రమ్మ, కాళ్ళు వణకిపోవ నిశ్చేష్టములైపోయినవి మహాదేవుని సేనలు.

"మీరు మీ ఆయుధాలన్నీ క్రిందపడవేసి. ఒకరి వెనుక ఒకరు రండి. ఈ దారిని మీ యిచ్చవచ్చిన చోటికి మీరు వెళ్ళవచ్చును" అని కాహళకలు వెట్టినాడు ఆంధ్రపితుడు గోన గన్నారెడ్డి.

"అడుగు వెనక్కువేస్తే ప్రాణాలు దక్కవు" అని రెండవ కేక.

"ఈ ప్రక్కా, ఆ ప్రక్కా, ముందూ మేమున్నాము!" అని మూడవకేక.

"మేము గోన గన్నారెడ్డి సైనికులము. మా ప్రభువే ఇక్కడ స్వయంగా!" అని నాలుగవ కేక.

ఆ కేకలతో అదలి కత్తులు, బాకులు, ఛురియలు, శూలాలు, భల్లాలు, ధనుస్సులు, బాణాలు, డాళ్ళు క్రిందకు వదలి, పదివేలమంది వీరులు తలలు వంచుకొని ముందుకు సాగారు. అలా మూడు వాహినులు, ఆయుధాలు విసర్జించి ముందుకు సాగెను.

ఈ వార్త నెమ్మదిగా అక్కడికి మూడు గవ్యూతుల దూరములో ఉన్న మహాదేవరాజునకు తెలిపి తక్కిన రెండు లక్షల పైచిల్లర సేనలను ఆపివేసినాడు.

ఆ దారి తప్పితే కొంచెం చుట్టుదారిని దేవగిరి చేరవచ్చును. అటు తర్వాత చూచికోవచ్చునని, మహాదేవరాజు సైన్యాలను దారి మళ్ళించాడు. ఈలోగా కోటకు ఉన్న ఒకేద్వారాన్ని అరికట్టి మల్యాల గుండయ కాటయ ప్రభువులు నిలిచినారు.

మహాదేవరాజు సైన్యాలు మళ్ళినాయి అనగానే ఆ దారిలో రెండువేల మంది అశ్వికులను నిలిపి గన్నయ్య అతివేగంగా చుట్టుదారిని దేవగిరినిచేరే ఎల్లోరా మార్గపు కొండల పైకి ఎక్కిపోయినాడు.

అతివేగంగా నగర సమప్రదేశం గడచి ఎల్లోరా గుహలప్రక్కనే దిగి కైలాసేశ్వరుని మ్రొక్కి ఆ కొండపాదందగ్గర ఉన్న సెలయేటికడ మహాదేవరాజు సైన్యాలను నిలిపినాడు.

ఎల్లోరా గ్రామముప్రక్క తన సైన్యాలను నిలిపి మహాదేవరాజు ఈ గజదొంగను హతమార్చే సమయం ఇదేనని తన ఏబదివేల అశ్వికబలమును మిగిలిన వేయి ఏనుగులను గరుడవ్యూహం రచించి గన్నారెడ్డిపై తాకినాడు. అక్కడ గన్నారెడ్డి బలగంలో ఒక్కడూలేడు! గన్నారెడ్డి ఆ కొండ దారిలో ఇంకను వెనుకకు పోయిఉన్నాడు. మహాదేవుడు ఆ వ్యూహం చెదరిపోకుండా వేగముగా రాలేదు. ఇంతలో రాత్రి అయినది.

మహాదేవుడు తన సేనల నన్నిటినీ ఆపి, చారుల వార్తలకొరకు నిరీక్షించుచుండగా అతని ముఖ్య అపసర్పనాయకుడు వచ్చి 'మహాప్రభూ! రుద్రమ్మ సేనలతో కోట ముట్టడివేసి సగంబలగాలను మనవేపు గన్నారెడ్డికి సహాయంగా పంపుతున్నది' అని వార్త తెచ్చినాడు.

౫

మహాదేవరాజు నిరుత్తరుడైనాడు. తనసేనల నాశనం తప్పదనుకున్నాడు. వ్యవధిలేదు. తాను కోటలోనికి వెళ్ళుటకు వీలులేదు. కోటలో

వారు తనకు సహాయం చేయడానికి వీలులేదు. భోజనసామగ్రి అయిపోయినది. లక్షలకొలది క్షతగాత్రులైన బలగాలతో ఈ రాక్షసి ఆంధ్ర మాతలతో పోరాడుట ఎట్లు?

కవుల మాటలు అన్నీ పొగడ్తలే! తనకు భయపడి, ఆంధ్రులు ఆడదాన్ని సింహాసనం ఎక్కించారట. ఆడదాన్ని తానేమీ చేయనని వారికి ధైర్యమట! అలాంటివాడు తాను ఆడదానిమీదకే మహావీరుణ్ణని వెళ్ళినాడే! అబ్బ! రాజ్యాతృష్ణ! రుద్రమ్మ ఆడదా? బ్రహ్మరాక్షసి! మహామారి! కాళరాత్రి! చీల్చిచెండాడి వెంట తరుముకు వచ్చింది ఆంధ్ర రుద్రమ్మ! ఏమి యుద్ధం! ఏమి పరాక్రమం! ఎంత నిర్వహణశక్తి! ఎంత వ్యూహరచనా చమత్కృతి! తన బలగాలు నాశనం కాకూడదు. విరోధి బలగాలు నుగ్గయి పోవాలి. చాలు; ఇక తనకు బుద్ధి వచ్చినది. కంది రీగలపుట్ట, ఆంధ్రులకు కోపం తెప్పించకు తండ్రీ! అని తండ్రీ చెప్పితే తాను విన్నాడా? వినక, తెచ్చుకున్న దీ విపరీతమయిన పరాభవం. ఇంతవరకు ఎన్నడైనా తాను కూర్చుకొని వెళ్ళిన మహాసేనలవంటి సేన కూర్చుకొని ఎత్తిపోయిన వీరులున్నారా?

తాను రుద్రమ్మ కెదురుపడక తనసైన్యాలతో ఏకొండలలోకో వెళ్ళిపోతే తనంటే ప్రజలకు గౌరవమూ, భక్తీ పూర్తిగా నశించిపోవును. మరి రెండు మూడు దినాల ప్రయత్నించుద మనుకుంటే, ఇంకా కొన్ని వేలమంది నాశనం అయిపోతారు.

మహాదేవరాజునకు మతిపోయినది; గౌరవం నాశనమయింది. పదిమందిలో తలయెత్తుకోలేడు, అందుకు తగినట్లు తాను రుద్రమదేవికి లోబడిపోతే ఇంకా తన్ను ఆమె ఏలాటి అగౌరవాలకు లోనుచేస్తుందో?

ఆయన, తనకు నమ్మకమయిన భవానీభట్టును, రుద్రదేవి సకలసేనాపతి అయిన చాళుక్య వీరభద్రునికడకు పంపినాడు.

ఆ రాయబారితో కలసి శ్రీ చాళుక్య వీరభద్రమహారాజు రుద్రదేవచక్రవర్తి దర్శనము చేసినారు. రాయబారి భవానీభట్టు మహాదేవరాజు ప్రతినిధిగా ఆంధ్ర చక్రవర్తియెదుట మోకరిల్లి "మహారాజాధిరాజా! మహాదేవప్రభువు తమ తప్పునకు విచారిస్తున్నాడు. విధిదుర్విపాకంవల్ల కన్నుగానక, ఆంధ్ర మహాసామ్రాజ్యము ఇట్టె వశమయిపోతుందనే ఆశతో. పెద్ద ఎత్తున జైత్రయాత్రకు వచ్చినారు. తమ పాదాలవ్రాలి క్షమార్పణ వేడి, శిక్షవిధించమని కోరుతున్నారు" అనివిన్నవించేసినాడు.

రుద్ర: భవానీభట్టుమంత్రీ! పాములను, దుష్టజంతువులను, రాక్షసులను క్షమించి లాభంలేదు. ఎప్పటికప్పుడు నాశనం చేయవలసిందే! అయినా తోటి దేశపాలకుడు, మా తండ్రిగారికి మిత్రుడయిన కృష్ణభూపతి కొమరుడు — అందుకని మేము మీరాజును ప్రాణంతో విడుస్తున్నాము.

భవానీ: చక్రవర్తీ! మేమందరము మహాప్రభువులకు యెంతోకృతజ్ఞులము.

రుద్ర: సరేనయ్యా! మాకు కోపంలేదు. క్షత్రియులకూ, బ్రాహ్మణులకూ కోపం నాశనహేతువు. మేము వైద్యులము. మీ రాజుకు కలిగిన రాజ్యకాంక్ష రోగాన్ని మేము నివారణచేస్తాము. మీ రాజు మాకు కోటి సువర్ణాలు, మా సేవకులకు కోటి సువర్ణాలు, మా సేనలలో హతమారినవారి కుటుంబాల పోషణకై కోటి హొన్నుఫణాలు అపరాధము చెల్లించాలి. గోదావరీ మంజీరా సంగమంవరకు ఉత్తరపుగట్టు శౌణరాజ్యపు సరిహద్దు. అక్కడనుండి మా శాసనంఉన్న మహోపల విజయస్తంభాల గురుతున తెలుగుగ్రామాలన్నీ మా రాజ్యంలో భాగాలవుతాయి.

భవానీ: చిత్తం సుహోప్రభూ!

భవానీభట్టు వెళ్ళి మహాదేవరాజు కీ సంధి నియమాలు వర్ణించగానే, ఇంతటితో బయపడినామని, కాలిచెప్పులు వదలి కిరీటం చేతులలో నుంచుకొని పాదచారియై నడచివచ్చి రుద్రమహాచక్రవర్తి పాదాల తన కిరీటముంచి, రుద్రదేవిఎదుట సమాలింగితభూతలుడై "అష్టమ చక్రవర్తీ క్షంతవ్యుడ" నని సన్నని ఎలుగున వచించెను.

రుద్రదేవి చాళుక్య వీరభద్రమహారాజువైపు సాభిప్రాయంగా చూడగానే, ఆయన వచ్చి శౌణమహాదేవరాజును లేవనెత్తి, దాపుననున్న పీఠాన కూర్చుండబెట్టినాడు.

ఈవరకే సంధినియమాల వడుపున దేవగిరికోటనుండి కోశాధికారులు ఏనుగులపై మూడుకోట్ల సువర్ణాలు, రత్నాలు బంగారు పళ్ళెరాలకొనివచ్చి రుద్రమచక్రవర్తి పాదాలకడ ఉంచినారు.

చక్రవర్తి అనుజ్ఞాతుడై, మహాదేవరాజును ఒక సింహాసనంమీద కూర్చుండబెట్టినారు వీరభద్రమహారాజు. చక్రవర్తి పాదాలకడనున్న కిరీటంతీసి మహాదేవరాజు తలపై నుంచినాడు పెదఅక్కనమంత్రి.

అప్పుడు వందిమాగధులు సభామధ్యమునకు వచ్చి,

'జయ జయ శ్రీ శ్రీసమధిగపంచమహాశబ్ద! జయ జయ మహామండలేశ్వర! జయ జయ పరమమాహేశ్వర! జయ జయ వినయభూషణ! జయ జయ శౌణదేశ కటక చూరకార! జయ జయ మహాదేవరాయ గర్వాపహారణ! జయ జయ అనుమకొండ పురవరాధీశ్వర! జయ జయ చలమర్తిగండ! జయ జయ పరబలసాధక! జయ జయ చతుస్సముద్రవలయపరిస్ఫురితకీర్తి! జయ జయ రాజరాజేశ్వర! జయ జయ మూరురాయజగదాళ! జయ జయ శ్రీస్వయంభూదేవర శ్రీపాదపద్మారాధక! జయ జయ శ్రీ అష్టమచక్రవర్తీ!'

అని జయధ్వానాలు చేసిరి. సైనికులు, దళవాహినీముఖసేనాపతులు, ప్రజలు, మంత్రులు, సభికులు జయధ్వానాలు చేసినారు.

ఆ స్కంధావారమంతా విజయధ్వానాలతో నిండిపోయెను.

# ఆ నం ద వ ల్లి

## సా మ్రా జ్యా భి షే క ము

### ౧

ఓరుగల్లులో, రాజనగరిలో, మహాసభాభవనంలో స్వస్తి. శ్రీ రక్తాక్షి సంవత్సర శ్రావణశుద్ధ పంచమీ గురువారంనాడు లగ్నమందు రవిశుక్రులూ, ద్వితీయమందు బుధుడూ, గురువు దశమమందుండగా, శని అష్టమమందు కుజుడు భాగ్యమందుండగా శ్రీ శ్రీ శ్రీ రుద్రదేవ చక్రవర్తి సామ్రాజ్య సింహాసనాభిషేకమహోత్సవం జరిగింది,

దేశదేశాలనుండి ఉత్సాహంతో మహామండలేశ్వరులు, రాజప్రతినిధులు, మహాసేనాధిపతులు, సామంతులు, రాజబంధువులు, ఇతరదేశాల రాజప్రతినిధులు, శివగురువులు, వైష్ణవ, అద్వైత, జైన, బౌద్ధ మఠాధిపతులు, మహామంత్రులు, మహాపండితులు, మహాకవులు, రాజోద్యోగులు, వణిక్ శ్రేష్ఠులైన కోటీశ్వరులు, గ్రామపెద్దలు మొదలయినవారు ఆ పట్టాభిషేకానికి దయచేసినారు.

ఆషాఢ పూర్ణిమ ముందుగనే రుద్రదేవి, వరాహ నందిధ్వజాలు ఆకాశమూ, దేశదేశాలూ తమ కాంతులతో నింపుతూ ఎగురుతూఉండగా తన మహానగరమునకు తిరిగి వేంచేసినారు. రాగానే మహాసభ చేసిం దామె.

ఆ మహాసభలో తన కుడీవైపు శ్రీ శివదేవయ్య దేశికులతో చాళుక్య వీరభద్రుని, గోన గన్నయ్యను అధివసింపచేసింది. ఎడమప్రక్క ప్రసాదాదిత్య ప్రభువు, చాళుక్య మహాదేవరాజు, మల్యాల గుండయ, మల్యాల కాటయ అధివసించి ఉన్నారు. తంత్రపాల మల్లినాయకులు, నాగమనీడు, బాప్పదేవుడు, విఠలధరణీశుడు, సూరసరెడ్డి మొదలయినవారందరు యథోచితస్థానములందు ఉన్నారు. చినఅక్కినప్రగడ శివదేవయ్యామంత్రి వెనుకనే కూర్చుండెను. ఎదురుగా ఆసనాల అధివసించి లకుమయారెడ్డి ఆదవోని ప్రభువు, వరదారెడ్డి, ఇతరులూ ఉన్నారు.

భూసురశ్రేష్ఠుల వేదాశీర్వాదాలు సభికులపై అమృతము కురిసెను.

శ్రీ శివదేవయ్యా దేశికులు ఆ మహాసభను చూచి చిరునవ్వుతో ఈలా సెలవిచ్చినారు:: "ఈ మహాసభలో నేను ఒక ముఖ్యవిషయం ముందుగా చెప్పాలి. మీరంతా చాళుక్య వీరభద్రమహారాజు ప్రక్కనే ఉన్న శ్రీ గోన గన్నారెడ్డి మహారాజును చూస్తున్నారుకదా! ఆయన గజదొంగ! మహాప్రభువైన శ్రీ గణపతి చక్రవర్తులవారినీ, శ్రీ రుద్రదేవ చక్రవర్తులను వ్యతిరేకించి అనేకమంది బాలకులను వెంటబెట్టుకొని ఈ మహానగరంనుంచి వెళ్ళిపోయినాడు.

"అలాంటి ఆ పురుషుడు శ్రీ కాకతీయ దివ్యచ్ఛత్రంక్రింద ఉండే అనేకమంది సామంతులను నాశనం చేశాడు. మనదేశానికి స్నేహితులయిన చోళుల్ని, పాండ్యుల్ని, కటకాధీశుల్ని, భల్లాణులను, యాదవులను, గాంగులను నానా చిక్కులూ పెట్టాడు. పినతండ్రిని బందీ చేశాడు.

"కాని ఈ మహావీరుడు ఈ ఉత్తమకార్యాలన్నీ శ్రీ చక్రవర్తి అనుమతి మీదనే చేశాడు.

"ఈయన గజదొంగ కావడం శ్రీ చక్రవర్తి అనుమతిమీదనే.

"ఈ మహావీరుడు జన్మించకపోతే కాకతీయసామ్రాజ్యం విచ్ఛిన్నమై ఉండును. 'ఆడది రాజ్యము చేయడమా' అని సామంతు లెందరో కుట్రచేశారు. అందులో ముఖ్యులు ఆ ఎదుట ఉన్న లకుమయారెడ్డి, అందరికి వెనకాలఉండి ఏమీ తెలియనట్లు నటిస్తూ అత్యంత రాజభక్తి వెల్లడిస్తూ ఉన్న వృద్ధులైన జన్నిగ దేవమహారాజూ, మేము కనిపెట్టనేలేకపోయాము. ఆయన మొన్నవచ్చి నా పాదాల వ్రాలి తన్ను క్షమించమని ప్రార్థించారు. శ్రీ చక్రవర్తుల ఎదుటపడడానికి సిగ్గుపడిపోతున్నాడు. ఆ రహస్యము మాకు బయటబెట్టినది గోన గన్నారెడ్డి మహారాజే!"

అని శ్రీ శివదేవయ్య దేశికులవారు ముగించగానే. ఒక్కసారి ఆ మహాసభలో ఉన్నవారంతా జయజయధ్వానాలు చేశారు.

అప్పుడు వైతాళికులు "జయజయ శ్రీ సమస్తగుణాకర జయ! శ్రీ కాకతీయ కటకసన్నాహ జయ! శ్రీ రుద్రదేవ దక్షిణభుజదండ జయ! శ్రీ కడుపులూరి పురపరాధీశ్వర జయ! శ్రీ అరిగండభైరవ జయ! సాహసోత్తుంగ జయ! శ్రీ వీరవితరణోత్సాహ జయ! శ్రీ వీరలక్ష్మీనిజేశ్వర జయ! శ్రీ మనుమకుల మార్తాండ జయ! మీసరగండజయ! శ్రీ ఉభయబలగండజయ! శ్రీ గండరగండజయ! శ్రీ అభంగ గండభేరుండ జయ! శ్రీ హన్నిబ్బరగండ జయ! శ్రీ హరిముప్వరగండ జయ! శ్రీ లాడవకువరపెండార జయ! శ్రీ గిళమౌళిసంతర్పితశశిమౌళి జయ! శ్రీ కామినీజయంత జయ! శ్రీ దుష్టతురగరేఖారేవంత జయ! శ్రీ దుర్వార వీరావతార జయ! శ్రీ కోసగిమైలితలగొండుగండ జయ! శ్రీ ఉప్పలసోముని తలగొండుగండ జయ! శ్రీ వందిభూపాలుని తలగొండుగండ జయ! శ్రీ అక్కానాయకుని తలగొండుగండ జయ! శ్రీ మేడిపల్లి కాచయనాయకుని ఉరిశిరకుండ జయ! శ్రీ కందూరి కేశినాయని తలగొండుగండ జయ! శ్రీ రాపాక భీమ విద్ధామధామ జయ! శ్రీ నిరుపమసంగ్రామరామ జయ! శ్రీ తెకాల కాటమదికాటపట్ట జయ! శ్రీ ఏఱువ తొండగోధూమఘట్టనఘరట్ట జయ! శ్రీబేడ చెఱకి నాయని నిస్సాహణాపహరణ జయ! శ్రీ సహజకార్యాభరణ జయ! శ్రీ కోట

పెర్మాడిరాయకంఠాభరణచూరకార జయ ! శ్రీ చోడోదయపట్టసూత్ర తురంగాపహార జయ ! శ్రీ నిజకీర్తిపూరితబ్రహ్మాండకరండ జయ ! శ్రీ వత్సబలోద్దండ జయ ! శ్రీ పరబలసాధక జయ ! శ్రీ సోమనాథదేవ దివ్య శ్రీపాదపద్మారాధక జయ ! శ్రీ వర్ధమానపురవరేశ్వర జయ !" అని వందులు గన్నారెడ్డిని కీర్తించిరి. సభ అంతా హర్షధ్వనులతో పొంగిపోయింది.

అప్పుడే అనేకులకు గన్నారెడ్డి నిజతత్వం గోచరించింది. కొందరు ఇదేమి గజదొంగ అని ఆశ్చర్య మందినారు. కొందరు గన్నారెడ్డి నూతన సామ్రాజ్యము స్థాపిస్తాడు కాబోలు అనుకున్నవారు రిచ్చపడి చూడసాగిరి.

గన్నారెడ్డి తల కొంచెం వంచి ఏమీ కదలక నిశ్చలవదనంతో నిలిచి ఉన్నాడు. ఆయన మోమున రాజభక్తి దివ్యకాంతి ప్రసరిల్లుచున్నది.

శ్రీ రుద్రదేవి చిరునవ్వుతో గన్నారెడ్డివైపు చూచి 'శ్రీ గన్నారెడ్డి మహారాజా ! నువ్వు నాలుగేళ్ళనాడు మాకడకూ, శ్రీ గురుదేవులకడకూ వచ్చినప్పుడు ప్రతిజ్ఞలు అన్నీ నెరవేర్చలేదేమో అని అనుమానించినందుకు మీ ప్రభువును మీరు....'

గన్నారెడ్డి చేతులు జోడించి మనవిచేసెను. 'మహారాజాధిరాజా ! అష్టమ చక్రవర్తీ ! భక్తునిబలం భగవంతునిదే అన్నట్లు, నా చక్రవర్తికి నేను బంటును. హనుమంతుని బలం రామునిలోనుండేకదా వచ్చింది.'

ఓరుగల్లు మహానగరమూ, కాకతీయ సామ్రాజ్యమూ సామ్రాజ్ఞి పట్టాభిషేకకాలంవరకూ చేసిన ఉత్సవాలు వర్ణనాతీతం. దేశం అంతట దినదిన తోరణాలు, దినదిన పండుగలు. నాట్యాలు, భగవత్కథా కాలక్షేపాలు, నాటకాలు.

సుంకాలు అన్నీ తీసివేసినారు. అన్ని మతసంస్థలకు చక్రవర్తి, మాండలికులు, రాజోద్యోగులు దానశాసనాలతో గ్రామాలు, భూములు, దేవాలయాలు నెలకొల్పినారు. చెరువులు, కాలువలు త్రవ్వించినారు.

నగరమంతా పార్వతీదేవి కల్యాణంనాటి కైలాసంలా, లక్ష్మీదేవి వివాహంనాటి వైకుంఠంలా అలంకరించినారు.

దేశంలో ప్రసిద్ధికెక్కిన నర్తకులు. గాయకులు వచ్చినారు. పండితులు కవులు వేంచేసినారు. దేశదేశాల రత్నాలవర్తకులు తమ నిధులలో ఉన్న ఉత్తమ రత్నాల సేకరించి ఓరుగల్లుకు తరలించుకు వచ్చినారు. సామ్రాట్టుకు బహుమతులు ఇవ్వడానికి, తాము భూషణాలు చేయించుకోవడానికి సామంతులు, ధనికులు రత్నాలు కొంటున్నారు.

శుభముహూర్తం కొలదిదినాలలో ఉన్నది. అటు నతనాటి సీమనుంచి మాధవ నృపతియు, వారి రాణి మహాదేవినీన్నీ, వారి సోదరులు, వారి తల్లులున్నూ శ్రీ రుద్రచక్రవర్తి తల్లులూ అయిన మైళమ్మయున్నూ, కుందాంబయున్నూ వేంచేసినారు.

గణపవరంనుండి తెలుగు నాయక సామంతులు. స్వామినాయకుడు మల్లా ప్రెగ్గడతో వేంచేసినారు. (తెలుగు నాయకులు తెలగాలయ్యారు) గణపతిదేవ చక్రవర్తి దేవేరులయిన వారాంబ పేరాంబల మేనల్లుడు, జాయపసేనాని అన్నకొమరుడైన చినవారపనాయకుడు (కమ్మనాటి ప్రభువు) తన దేవేరులతో, బిడ్డలతో, తమ్ములయిన చోడమహారాజుతో వేంచేసినారు. (వీరు కమ్మవారు)

వేంగి దేశాధిపతి అయిన తెలుగురెడ్డి (తెలగా) నాయకుడు గణపతి రుద్రదేవుని సేనాపతి కాలపయనాయకుని కొమరుడు కాలపనాయకుడు వేంచేసినాడు.

నిరవద్యపురంనుంచి చాళుక్యవృద్ధులు ఇందుశేఖరమహారాజు వేంచేసినారు: ధరణికోటనుండి కోట భేతమహారాజు గణపాంబతో కలిసి వేంచేసినారు. కోనసీమ నుండి హైహయ మహారాజులు, భీమవల్లభ నృపాలుడు తన దేవి అన్నమాంబతో కలిసి వేంచేసినారు.

జన్నిగదేవుడు వృద్ధుడై తన సంపూర్ణరాజ్యప్రతినిధిత్వము అంబయదేవ త్రిపురాంతక దేవుల కప్పగించి, తాను పట్టాభిషేకానంతరము శ్రీశైలాన తపస్సు చేసుకొన సంకల్పించాడు. సిందవాడనుండి, మార్జవాడినుండి అంబయదేవ త్రిపురాంతక దేవులు వేంచేసినారు.

ఈలా సకల బంధువులు, సామంతులు, ఉద్యోగులు కొలుస్తూఉండగా శ్రీ శివదేవయ్యమంత్రి, శివగురువులు, మహర్షులు, బ్రాహ్మణోత్తములు, పండితులు, ఆశీర్వాదం చేస్తూఉండగా శ్రీ రుద్రదేవ ప్రభువునకు సామ్రాజ్యాభిషేకం జరిగినది.

సంతోషముతో దేశాలన్నీ పాలసముద్రమై విరుచుకుపడినాయి.

పట్టాభిషేకమహోత్సవం అయినరాత్రి తన నగరికి రుద్రచక్రవర్తి చేరి, మహాతల్పంపై మేనువాల్చింది. అలసట పడినందుకు సొమ్మసిల్లి నిద్రరాదు.

పరికత్తెలు మహాప్రభువునకు అన్నీ సమకూర్చి తాము వెడలిపోయినారు.

నగరి మోసాలకొట్టే ఘటికాఘంటలు మ్రోగుతునే ఉన్నాయి కాబోలు. అవి ఆ మహాకోలాహలంలో ఎలా వినబడతాయి?

ఊరంతా జరిగే ఉత్సవాలు జరుగుతున్నాయి. తా మా ఉత్సవ మహాసభలో పీఠం అధివసించి ఉండవలసిందే!

అయినా రెండుఘటికలు విశ్రాంతి తీసుకోవడానికి, దృష్టి మొదలయినవి తీయడానికి లోనికి రావలసివచ్చింది. ఇప్పుడే దాసీలువచ్చి తన వస్త్రాదికాలు, ఆభరణాలు మార్చి మళ్ళీ సభకు తీసుకొనిపోతారు.

తానొక్కతే సింహాసనంపై కూర్చుండవలసివచ్చింది.

చాళుక్య వీరభద్రమహారాజు తన వైపు చూస్తేదాలు! తాను చక్రవర్తి అన్న మాట మరచిపోతున్నది.

వెంటనే పర్యంకమునుండి దిగ్గనురికి రుద్రదేవి ప్రక్కనున్న జేగంట వాయించినది. వెంటనే ఆ దివ్యమందిరం బైటనుండి పలువురు దాసదాసీలు పరు గెత్తుకొని వచ్చినారు.

"సిద్ధం చేయండి, త్వరపడండి."

సామ్రాట్టు వాక్కులు విని ఆ పరిచారికలు పదిలిప్తలలో మహారాణిని విష్ణువి కైసేసినట్లు అలంకరించారు.

"ముమ్మడాంబికను అలంకరించి తీసుకొనిరండి" అని చక్రవర్తి ఆజ్ఞా పించినారు.

సభలో అవరోధ స్థలంలో అన్నాంబికాది యువతులతో హాస్యపు మాటలు చెప్పుకుంటూ, నవ్వుకుంటూఉన్న ముమ్మడాంబిక చక్రవర్తి ఆజ్ఞ విని గుండె దడ దడలాడ చెలికత్తెలవెంట అంతిపురికి పోయినది. అందు చెలికత్తెలామెను రతీ దేవివలె అలంకరించారు.

అంతవరకు తమ అభ్యంతర సభామందిరంలోనే చక్రవర్తి కూరుచుండెను.

ముమ్మడాంబిక అలంకృతయై దగ్గరకు రాగానే రుద్రదేవి చిరునవ్వుతో "ముమ్మడాంబికరాణీ! నేను విన్నా మూడేమాట లడుగుతాను. వానికి 'ఏమీ సందే హించకుండా ప్రత్యుత్తరం చెప్పు' అని అడిగింది. తెల్లబోతూ 'అల్లాగే' నని ముమ్మక్క జవాబు చెప్పినది.

రుద్రదేవి ముమ్మక్కచెవిలో గుసగుసలాడింది.ముమ్మక్క తెల్లబోతూ సిగ్గు పడుతూ అవునంటూ తలఊచింది.

రుద్రదేవి ఆనందంతో నవ్వి ముమ్మక్క చేయి పట్టుకొని చెలులు, మంత్రులు, అంగరక్షకులు దారిచూపిస్తూ ఉండగా మంగళవాద్యాలు ముందు మ్రోగుతుండగా దయచేసి. సభికులందరూలేచి జయ జయ ధ్వానాలు చేస్తూ ఉండగా సింహాసనం ఠీవిగాఎక్కి ముమ్మక్కను ప్రక్కన కూర్చుండబెట్టుకొన్నది.

చక్రవర్తి, అందరూ ఆశీనులయిన వెనుక, శివదేవయ్య దేశికులతో "గురు దేవా! ఈ విందుసభలో మేము ఒకవిషయము మహారాజులకు, సామంతులకు తెలియ చేయ దలచుకొన్నాము" అనిరి. శివదేవయ్య దేశికులు ముఖ్య వందికి సైగచేసిరి.

ఆ వంది వెంటనే తన శంఖమెత్తి సింహాసనం మ్రోలనుండి భోం భోం! అని ఊదినాడు. సభ విశ్శబ్దమైనది. నాట్య మాగినది.

రుద్రచక్రవర్తి ముమ్మక్క సహాయంతో సింహాసనం దిగింది.

సభఎల్ల వెంటనే నిలుచుండెను. గురుదేవు లొక్కరే కూర్చుండి యుండిరి.

చక్రవర్తి తన మెడలోని హారం తీసి, మందహాసంతో, సిగ్గుతో మోము ఎఱ్ఱవార, చాళుక్య వీరభద్రునికడకు వెళ్ళి, కొంచెమువణికే కంఠంతో 'మహారాజా! కాకతీయ సామ్రాజ్యంతో ఈ దాసురాలిని స్వీకరించ ప్రార్థన!' అని తల వంచు కొన్నది. 'హా ముమ్మక్క మహారాణి చాళుక్య మహాదేవ మహారాజును వరించు చున్నది' అనెను.

౨

లకుమయారెడ్డి తానుచేసిన తప్పులన్నీ ఒప్పుకొని, చక్రవర్తి క్షమాపణ అడిగి కుమారుడైన వారదారెడ్డిని వారి పాదాలకు అప్పగించినాడు. గన్నారెడ్డిని దర్శించి, 'ప్రభూ! నేను మీ పినతండ్రిని కావడానికి తగనివాణ్ణి. అన్నగారి ఆజ్ఞ నిలబెట్టలేని మూర్ఖుణ్ణి. ఎట్టి శిక్షకైనా తగినవాణ్ణి' అని మనవిచేసెను.

గోన గన్నారెడ్డి: బాబయ్యగారూ! స్త్రీలు, రాజ్యాలు మనుష్యుల మనస్సులను పాడుచేస్తవి. విధిదుర్విపాకం అటువంటిది. మీరు ఆజ్ఞ ఇస్తే పాలిస్తాను.

లకు: తండ్రీ! పైత్యరోగికి అన్నీ పచ్చగా కనబడినట్లు, నా కా రోజుల్లో అధర్మపూరితాలయినవన్నీ ధర్మపూర్ణములైనట్లు తోచాయి. ఈ రాజ్యం నీది. నీ ప్రతిభ అసమానం. భారతగాథల్ని మరపించేసే మీ చరిత్ర సువర్ణాక్షరాలతో శాసనాలుగా లిఖింపబడవలసినది. ఈ మహా సామ్రాజ్యాన్ని రక్షించిన అర్జునుడవు. నీ పాదాల వరవణ్ణి నే నొస్తున్నాను. నేను శ్రీ కాలాముఖమఠం చేరి తపస్సు చేసుకుంటూ ఈ చరమకాలం గడుపు తాను.

గన్నా: బాబయ్యగారూ! వరదయ్య నాకు విఠలయ్యతో సమానం. అతడే భువనగిరిని ఏలుకొంటాడు.

లకు: నాయనా! ఆదవోనివారి అమ్మాయిని నువ్వు చేసుకో! వరదయ్యకు మంచి సంబంధము చూడు. అతడు నీ బిడ్డసుమా తండ్రీ! నీ ఈడును మా అన్నగారు మూడుమూర్తులా నీ పోలికే. నీ తండ్రిని మరపించే శక్తిమంతుడవయ్యావు. ఆయన సుగుణాలన్నీ నీలో కాంతించాయి. ఇంక నేను వెడుతున్నా!

పినతండ్రి తన ప్రస్థానానికి అన్నీ సిద్ధంచేసుకొని ప్రయాణం సాగించాడు.

వరదారెడ్డి, విఠలధరణీశుడు, గన్నారెడ్డి మంత్రులతో, సేనాపతులతో కూడా ఓరుగల్లునుండి శ్రీశైలంవరకూ వారిని సాగనంపి తిరిగివచ్చారు.

కుష్మాండికాదేవి కొమారితను వరదారెడ్డికి ఇచ్చుటకు ఒప్పందంచేసి గన్నారెడ్డి తిరిగి ఓరుగల్లు వేంచేసినాడు.

వరదారెడ్డి విఠలయ్యను వదలడు. చిన్నన్నగారితో పెద్దన్నగారి వివాహం అయితేగాని తాను వివాహం చేసుకోనంటాడు. విఠలయ్య అన్నగారితో మాటలాడడు. అక్కినప్రగడకూ ధైర్యం చాలదు.

చక్రవర్తి ఆజ్ఞ అయినా గన్నారెడ్డి వర్ధమానపురం వెళ్ళనే వెళ్ళడు. పట్టాభిషేకం మాట తలపెట్టితే ప్రతివచన మివ్వడు.

ఆ దినము చినఅక్కినప్రగడ, విఠలయ్య, సూరనరెడ్డి, వరదారెడ్డి, విఠలయ్య నగరిలో ఆసీనులై ఉన్నారు.

విఠ: ఏమిటి అన్నయ్యగారి ఉద్దేశం?

సూరన్న: నాకు యుద్ధంఅంటే ఏమిటో తెలుసును. ఇలా మౌనవ్రతం పూనడం అంటే భయం కలుగుతుంది. ఎందుకు మన ప్రభువు అలా గుఱ్ఱమెక్కి దినదినమూ ఓరుగల్లు చుట్టుప్రక్కల గ్రామాలన్నీ తిరిగివస్తూ ఉంటారు?

అక్కిన: ప్రేమ అనేది ఒక రోగం. అది సోకితే జ్వరం, తల తిరగటం, మతిపోవడం మొదలయిన లక్షణాలన్నీ కలుగుతాయి.

సూరన్న: వచ్చిందీ ఆ ప్రేమవిషయం? నాకుమాత్రం ఆ విషయాలేమీ తెలియవు. మల్యాల కాటయసేనాపతుల అమ్మాయిని ఇస్తామని మా తండ్రిగారు వార్తపంపారు. మానాయకులు ఒప్పుకుంటే నా కభ్యంతరం లేదన్నాను.

విఠ: ఆ విషయంలోనూ నాయకుల ఆజ్ఞే?

సూరన్న: భోజనవిషయాలలోనూ నాయకుల ఆజ్ఞే?

విఠ: బావా! త్వరగా నువ్వే వైద్యం చెయ్యాలి. వర్ధమానపురం ఎప్పుడు వెళ్ళేది?

అక్కినప్రగడకూ గన్నారెడ్డి ఆవేదన అర్థంకాలేదు. అన్నాంబికాదేవిని తలదండ్రులు ఆదవోనికి తీసుకుపోయారు. ఆమె పురుషవేషంతో గన్నారెడ్డిని ఛాయలా అనుసరించింది మా ప్రభువుకు యుద్ధతప్ప ఇంకేమీ సూచించదేమో!

మొన్న చక్రవర్తి దేవగిరిలో ఉన్నప్పుడు జాపాక భీముడు బలగాలు కూర్చుకొని తాను స్వతంత్రుడననిన్నీ, శ్రీ సామ్రాజ్యమున ఉన్న పురుషుడంత హీనుడింకొకడుండడనీ తన రాజ్యం అంతా చాటించినప్పుడు పట్టపిడుగులా బావగారు తమందరను నడుపుకుంటూ జాపాక చేరి, ఆ వెట్టివాగుల భీముణ్ణి నిర్ధూమధామం చేశారు.

యుద్ధవ్యూహా లెరిగినవాళ్ళకు ప్రణయవ్యూహరచన తెలియదేమో?

ఈ ఆలోచనలతో అక్కినప్రగడ తన ఇంటికి చేరినాడు.

ఇంటికివెళ్ళి, ఆ సాయంకాలం స్నానంచేసి సంధ్యానుష్ఠానాలు తీర్చి తండ్రితో, తాతగారితో భోజనం చేసినాడు.

తాతగారు పెదఅక్కినప్రగడ, మనుమని విషయమంతా తెలిసికొన్నప్పుడు తన తెలివితక్కువకు ఎంతైనా చింతపడుతూ ఉండగా, చినఅక్కిన తాతగారిని చూచి "తాతయ్యగారూ ! మీరేకాదు, ఎంతమందైనా మేము నిజంగా దొంగలము అయిపోయామనే భయపడినారు. తరువాత మేముకాకతీయ రాజ్యానికి వీరోధుల్ని హతమారుస్తూవుండడముచూచి మాచరిత్ర అర్థం కాక ఆశ్చర్యపడుతూ ఉండేవారు" అని నవ్వుతూ అన్నాడు.

తాత : నాయనా ! పెద్దవాడిని, లోకంలో తెల్లగాఉన్నవి పాలు నల్లగా ఉన్నవి నీరు అని నమ్మేవాణ్ణి. అందుచేత అలా బాధపడ్డాను.

ఆ రాత్రి శయనమందిరమునకు చినఅక్కిన భార్య సౌందర్యనిధిలా వచ్చింది. దంపతుల అన్యోన్యసల్లాపాలలో అక్కిన "రాచకార్యాలేమిటి చెప్పవూ?" అని నవ్వుచూ ప్రశ్నించెను.

భార్య : మా అన్నగారు అలా దిగాలుపడి ఉంటున్నారు. అన్నాంబికా దేవి తండ్రితో ఆదవోని వెళ్ళలేక వెళ్ళింది. నాకూ ఆ రాజకుమారికి ఎంతో స్నేహం కలిసింది.

భర్త : అంటే నీ ఉద్దేశం ?

భార్య : ఏమిటా? మీ ఉద్దేశమేమిటో నాతో చెప్పారుగనుకనా ? నా ఉద్దేశం మీతో చెప్పటానికి ? అనుచు ఆమె పకపక నవ్వింది.

అక్కిన "దొంగపిల్లా! నాతో వేళాకోళం చేస్తావా ? నీ పని పడతా ఉండు" అనుచుండగా ఆమె పకపకమంటూ పరుగెత్తింది. అత డామె వెనుక పరుగిడినాడు.

## 8

రుద్రదేవి తన భర్తను తానే వరించెను. ముమ్మడమ్మకు చాళుక్య ప్రభువు అంటే ప్రేమ కుదిరిఉండాలి. భార్యాభర్తలిద్దరూ తోడికోడళ్ళయినారు. చాళుక్య వీరభద్రుడు చక్రవర్తి అవుతాడా ? ఇకముందుకూడా రుద్రదేవి పురుషవేషంతోనే ఉంటుందా ? ఈలా లోకమంతా విచిత్రముగా చెప్పుకుంటున్నది.

ఒక శుభముహూర్తమున పేరోలగంలో శివదేవయ్యామంత్రి సభ్యు లందరితోనూ "శ్రీ రుద్రదేవితప్ప ఈ కాకతీయ మహారాజ్యానికి చక్రవర్తులు ఇంకొకరు కారు. వారికి పుత్రులు ఉద్భవించి రాజ్యార్హత పొందేవరకు రుద్రదేవ చక్రవర్తులే రాజ్యం చేస్తారు. చాళుక్య వీరభద్రమహారాజు ఈ విషయం అంతకూ తమ అనుమతిని దయచేయించారు. వివాహముహూర్తము కార్తాంతికులు పెట్టు

తున్నారు. ముమ్మడాంబికా వివాహముహూర్తమూ. ఆ ముహూర్తం దగ్గరనే ఏర్పాటవుతవి" అని తెలియజేసిరి.

ఈ వార్త వినగానే సభలో విజయధ్వానాలు మిన్నుముట్టినవి.

ఆ సామ్రాజ్యాభిషేకమహోత్సవ సందర్భంలో రుద్రదేవి స్వయంవర మహోత్సవము జరుగుతుందని శివదేవయ్య దేశికులు అనుకొనలేదు. చాళుక్య వీరభద్రమహారాజుకూడ ఆ సమయంలో అలాంటి సంఘటన సంభవిస్తుందని తలచిఉండలేదు.

రుద్రదేవి మాటలు ఆయనవీనులకు శారదవీణానిస్వనములై వినిపించాయి. అమృతప్రవాహాలు తనపై విరుచుకుపడినట్లయినది. ఆయన ప్రాన్పడి నిలు చుండిపోయినాడు. ఆయన కన్నులు తళతళలాడిపోయినవి. ఆయన మోము ద్వాదశార్కులవలె వెలిగిపోయినవి. ఆయన ఆ దేవి కన్నులలో పవిత్రనృత్యం చేసే ప్రేమ కాంతులూ, ఆ సుందరాంగి పెదవులలో సురభిళమయ్యే ప్రణయ మాధుర్యాలూ గమనించి, లోకలోకా లావరించిపోయినట్లు, అమృతకలశము చేతుల కందినట్లు పులకరించి. తల వంచినాడు.

రుద్రదేవి, ఆయన మెడలో చెలికత్తె లందిచ్చిన పూలహారము వేసింది.

బంగారు కవచము ధరించి రత్నస్థగిత కిరీట కేయూర కుండలాది సార్వభౌమలాంఛనాలతో, దివ్యపురుషునిలా ఎదుట వెలుగు మూర్తి మాయమై, చాళుక్య వీరభద్రమహారాజు మనోనేత్రాలకు ఆనాడు క్రీడోద్యాన వనాన చివురు టాకులప్రోపై, కరడుకట్టిన అమృతధారయై, ప్రోగుపడిన వెన్నెలకిరణాలై తోచిన దివ్యసుందరరూపం తిరిగి ప్రత్యక్షమైనది.

ఆ దండవేసే రుద్రమహారాణీ కరస్పర్శచే, ఆయన పరవశుడై సర్వమూ మరచిపోయినాడు.

వివాహములోపల చాళుక్య వీరభద్రుడు రాచకార్యాలు మాట్లాడడానికి చక్రవర్తి అంతఃపురానికి వెళ్ళవలసి వచ్చెడిది. అక్కడ చెలికత్తెలు పరివేష్టించి ఉండగా రుద్రమ ఆయనకు దర్శనమిచ్చేది. ఇద్దరూ రాజ్య వ్యవహారములు ఎన్నో సమాలోచన చేసేవారు. చెలికత్తెలు ఏదేని పనిమీద ఇక్కడకూ అక్కడకూ వెళ్ళిపోయేవారు. ఆ సుందరమందిరంలో వారిద్దరే ఉండేవారు. ఆ విషయం కొంతసేపటివరకూ వారిద్దరికీ తెలిసేదికాదు.

ఆ విషయం గుర్తించగానే ఇద్దరూ చటుక్కున మౌనం వహించేవారు.

ఒకరి నొకరు చూచి నవ్వుకొనేవారు.

ఆయన సంశయము నామె గ్రహించి,

"ప్రభూ ! రండి. నా గానమందిరానికి పోదాము" అని ఆహ్వానించేది.

రుద్రదేవి గానమందిరంలో చాళుక్య వీరభద్రుడు దంతపీఠాలపై ఉన్న వివిధదేశ విపంచులు చూచినాడు.

అప్పుడు దేవి నవవధువులా సిగ్గుపడుతూ అక్కడ ఉన్న ఆంధ్రవీణ శ్రుతిచూచి, వేగవాహినీరాగానికి మెట్టు సవరించి, "స రి గ ప ధ ప" అని ఆరోహణమూ, "సధప గరిస" అని అవరోహణమూ అయిన మధుర మోహనరాగాన్ని ఆలాపించినది. వేగవాహిత మిశ్రరాగము.

ఆ రాగము హిమాలయాలలో ప్రవహించే మందాకిని.

నవయౌవన హృదయంలోని ఆవేగము ఏలాంటిదో వేగవాహినీరాగ మట్టిది. ఔడవ షాడవ రాగజన్య మవడంచేత దేవతలకు; మనుష్యులకు ఉద్భవించిన విద్యాధరివంటి దా రాగము.

మంచు కరగినది ; అతిశీతలాలైన ఆ నిర్మలప్రవాహ నీరాలు జలజల ప్రవహించాయి. రాళ్ళపై విరిగినాయి ; సుళ్ళతిరిగినాయి. అతివేగంగా పారిజాత కుసుమపరిమళ పూరితమైన ఆ ఎత్తైన దేవభూమి లోయలలో పతనాలతో ప్రవహించాయి. వేగవాహినీ రాగస్వరాలా నీరాలు !

చాళుక్య వీరభద్రుడా రాగసౌందర్యంలో కరగిపోయి, ఆ దేవి రూప సౌందర్యంలో లయమౌతాడు.

సిగ్గుపడుతూ చిన్న బాలికలా రుద్రదేవి దీర్ఘ పక్ష్మల నెత్తి, ఒకలిప్త మాత్రం చాళుక్య వీరభద్రుణ్ణి గమనిస్తుంది. ఆమెను చూచి అతడు, అతని చూచి ఆమె సిగ్గుపడతారు. కన్నులు నిమీలితాలు చేసుకుంటారు.

ఆమె తన తీయని కంఠమెత్తి ఆ వీణకు మేళవించి, అన్నాంబిక రచించి తనకు నేర్పిన పాటను వేగవాహినీ రాగంలో పాడింది.

"ఎవరున్నారు, ఈ నీలకాదంబినీమాలలో ఎవరున్నారు చంచలా !
తళుకుమనిపోయావు దశదిశలు వెలిగించి
బిలుకుమని కనులు మూతలుపడెను చంచలా
ఎవరున్నారు ?
గంభీరమై ఏవో గళమాధురులు గురిసె
గరళకంఠుని దివ్య గాంధర్వమా ఏమి ?
ఎవరున్నారు ?"

౪

విజయదశమికి శ్రీగోన గన్నారెడ్డి పట్టాభిషేకమహోత్సవం వర్ధమాన పురంలో జరుగవలసిఉన్నది. గన్నారెడ్డిని ఎంతమంది వేడినా అవునని కాదని తెలుపడు.

చిన అక్కినప్రగడ ఎన్నిసారులు మనవిచేసినా గన్నయ్య నవ్వుతాడు. శుభముహూర్తంలో శ్రీ రుద్రదేవికీ శ్రీ చాళుక్య వీరభద్ర మహారాజుకు,

శ్రీ ముమ్మడాంబికా రాజకుమారికి శ్రీ చాళుక్య మహాదేవరాజుకు లోకాతీతమైన ఉత్సవాలతో వివాహ లయ్యాయి. ఇవన్నీ శ్రావణమాసంలోనే జరిగాయి.

సార్వభౌమ పట్టాభిషేకానికి వచ్చిన చుట్టాలందరు వివాహాలకు ఉండి పోయినారు. రుద్రదేవి చెల్లెలయిన శ్రీ కోట గణపాంబాదేవి అక్కగారి ఆనందము చూచి, తానూ ఆనందముతో ఉప్పొంగిపోయినది. అక్కగారిని కౌగలించుకొని "అక్కగారూ! ఇన్నాళ్ళకు మీ మోము శరత్కాల పూర్ణిమలా వెలిగిపోతున్నది. ప్రేమ అలాంటిది. కాదంబరి కథ ఎరుగరా! ప్రేమపూరితజీవి తన విధానం మరుగైనచో ప్రాణాన్నికూడా పోగొట్టుకొంటుంది. మా బావగారు ఉత్తమపురుషులు, తమకు చక్రవర్తిత్వం అక్కరలేదు, శ్రీ రుద్రదేవీనాథులుగా మాత్రం ఉంటామనీ అనడం ఎంతో ఉదారంగా ఉంది."

"చెల్లీ! మీ భార్యాభర్త లిద్దరి ప్రేమమయ జీవితము, ఆదర్శరూపం సుమా! మా మరదిగారు రాజ్యపరిపాలక సగం నీకే వదిలారనీ, నువ్వు స్త్రీలకు ప్రసూతి వైద్యాలయాలు, ఓడవర్తకులకు యవ సువర్ణాది ద్వీపాలలో వైద్యాలయాలు, పశువైద్యాలయాలు, సత్రాలు, విద్యాశాలలు, ఆశ్రమాలు ఏర్పాటు చేస్తున్నావనీ, దేశంలో మరణదండన రద్దుచేశావనీ, ప్రతిగ్రామానికీ వ్యవసాయాభివృద్ధికి చెరువులు తవ్విస్తున్నావనీ నాకు ఎప్పటికప్పుడు వార్తలు వస్తూనే ఉన్నాయి."

గణ : అక్కగారూ మీకుగన్నారెడ్డి కుడిభుజం కావడం మా కందరకూ మహాభాగ్యమయింది. మమ్మల్ని మా రాజ్యాన్నికూడా కోట పేర్మాడిరాయని దౌష్ట్యన్నుండి ఎంత ప్రజ్ఞతో రక్షించా రాయన!

రుద్ర : అవును చెల్లీ! మొన్న మేమంతా దేవగిరిలో ఉన్నప్పుడు గొంక ప్రభువు కుమారుడు సుబ్బనాయకుడు తెచ్చినవార్తవిని వెంటనే రాపాక భీముని పై ఉరికాడు. భీముడు గోదావరితీరంలో దుర్గమస్థలంలో ఉండి అజేయు డనుకున్నాడు.

గణపాంబ : గన్నయ్య పట్టాభిషేకం ఎప్పుడు జరుగుతుంది? మావారు రవ్వలతో వెలిగే ఒరతోనూ, రత్నపు పిడితోనూఉన్న మహాకరవాలం ఒకటి గన్నయ్యకు బహుమాన మిద్దామని సంకల్పించుకున్నారు.

రుద్ర : గజదొంగల జట్టంతా విడిపోయారుగాని గన్నయ్య ఓరుగల్లు వదలివెళ్ళడు.

గణ : అక్కగారూ! ఎంత విచిత్రం చేశారు మీరు! శ్రీ శివదేవయ్య దేశికులవారూ ఒప్పుకొన్నారటగాదా వారంతా గజదొంగజట్టు కావడానికి?

రుద్ర : ఊరకే ఒప్పుకోడం కాదు చెల్లీ! మేమంతా యువకులం, ఆ జట్టుకు పురుషవేషంలో ఉన్ననేను నాయకుణ్ణి; నా కెప్పుడూ కుడిచేయి గన్నారెడ్డి ప్రభువే. గన్నయ్య, చినఅక్కినమంత్రి వేసే ఎత్తులు నాకు మహా ఆనందం కలిగిస్తూ ఉండేవి.

గణ : ఇంతకూ మీరు వేసిన ఎత్తులన్నీ ఫలించినవి.

రుద్ర: అన్నింటికన్నా ఆశ్చర్యమేమిటంటే చిన్నతనంలో గన్నభూపతి నాయకుడు కాగలడని అనుకున్నానుగాని ఇంతటి అతిరథుడవుతాడని అనుకోలేదు. ఏమి వ్యూహాలు! ఏమి యుద్ధం! అర్జునుడు పాఠాలు నేర్చుకోవాలి.

గణ: ఆ బలం, ఆ బుద్ధి, ఆ రూపం! మనకు అన్నగారులేని లోపం ఆయనవల్ల తీరింది.

రుద్ర: అవునుతల్లీ! మనకాయనే అన్నగారు,

తన్నుగురించి ఈలాంటి సంభాషణ జరుగుచున్నదని గన్నారెడ్డికి ఏమి తెలియును? తన నగరిలో రాత్రి భోజనానంతరము ఆయన పర్యంకముపై అధివసించి కనులు మూసుకొని పండుకొని ఉన్నాడు.

ఇంతలో అక్కిన అక్కడకు వచ్చెను.

అక్కి: మహారాజా! కనులు తెరవండి. కనులుమూసికొని పగటి కలలు కనుటకంటె గంధర్వాశ్వాలను అధివసించి ఈ వెన్నెలలో తిరిగివద్దాం రండి.

గన్న: అందుకనే నేనూ నీకు వార్త పంపానయ్యా బావగారూ!

ఇద్దరూ ఉత్తమాజానేయాల నధిష్ఠించి ఆ వెన్నెలలో ఓరుగల్లునగరందాటి, వేగం ఎక్కువచేసి ఉత్తరాభిముఖులై మాటలాడకుండా వెళ్ళుచున్నారు.

నాలుగైదు గవ్యూతులదూరం వెళ్ళగానే గుఱ్ఱాలవేగము కుదించి, ఏమ్మట ఆపినారు. అక్కడ మామిడితోపులు, ఒక పెద్ద చెరువు, ఒక చిన్న గ్రామం, గ్రామమధ్యమందు దేవాలయం కనబడుచున్నవి.

ఇద్దరు గుఱ్ఱాలపై వెన్నెల్లో ఆ చెరువును, తోటలను, ఆకాశాన్ని నీటిలో ప్రతిఫలాలను, చిరుమేఘాలను, తనచుట్టూ ఆవరించిఉన్న వెన్నెలను గమనిస్తూ వెన్నెల్లో అప్లావితులౌతూ, అలా కదలక మెదలక బొమ్మలులా అయిపోయారు.

అలా వారు నాలుగైదు ముహూర్తములకాల మున్నారు. ఆ వెనుక నిట్టూర్పు విడుస్తూ గోన గన్నారెడ్డి గుఱ్ఱమునుండి దిగి, కళ్ళెము గుఱ్ఱపుమెడపై విసరివేసి గుఱ్ఱాన్ని బుజంతట్టి, 'గజదొంగల ఏకిమీడా! తిన్నగా ఆహారం మేసుకో, ఆ గడ్డిలో నీకడుపు నిండినంత; వెన్నెలతో నిండిఉంటుంది, దాని రుచి నీకే తెలుస్తుంది' అని వదలినాడు.

"నా గుఱ్ఱానికి వెన్నెల అక్కరలేదయ్యా. ఇంత పచ్చదనం ఇంత రసపూర్ణత ఉన్నగడ్డి కావాలిగాని!"

గన్నా: అవును. నా గుఱ్ఱం గంధర్వాశ్వమే!

అక్కి: రెక్కలేవి?

గన్నా: నీబోటి మానవులకు అవి కనపడవు!

అక్కి: ఈ గంధర్వాశ్వం ఎక్కి ఏ గంధర్వలోకమో వెళదామని మా బావ గారి ఉద్దేశం।

గన్నా: ఎందుకు బావా గంధర్వలోకం? ఇక్కడి వివాహము చాలకనా?

అక్కి: ఏం? చంద్రాపీడునివలె ఏకాదంబరినో దర్శింపవచ్చునుగా?

గన్నా: తాము పుండరీకులు కాబోలు. అయితే నీకు విరహవేదన లేదు కాబట్టి బ్రతికిపోయినావు।

అక్కి: అమ్మయ్యో దొరికినాడయ్యో దొంగ। కాదంబరికోసమా విరహం?

గన్నా: కాబోయే మామగారితో, చంద్రాపీడునికి విరోధము।

అక్కి: విరోధమేమి? ఒక వేళ ఆ గంధర్వరాజు హృదయంలో వెనకటి ఆలోచనలన్నీ ఉన్నాయే అనుకొందాము. కాని రెక్కలు తెగినపక్షిలా ఉన్న ఆ గంధర్వపతి ఏమి చేయగలడు?

గన్నా: అదేనయ్యో చంద్రాపీడుని ఆవేదనకు కారణం. మహాకవివి, ఆమాత్రం గ్రహించలేవా?

అక్కి: ఓహో। ఆ చంద్రాపీడు డెంత నిర్దయుడు। ఆవల మహాపతి వ్రత అయిన కాదంబరి జీవితమంతా వ్యధలపాలయి, చివరకు ప్రాణాలు కోలు పోవలసిందేకాబోలు।

గన్నా: హృదయధర్మ మలాంటిది బావా।

అక్కి: యువతీ యువకుల ప్రేమధర్మముకంటే ఇతర ధర్మాలు ఎక్కువవా బావగారూ।

గన్నా: మానమర్యాదలేకాదు బావగారూ। ఒక్కొక్కనిహృదయం అలాంటిది. రాచపౌరుషము అలాంటిది. రాజ్యగౌరవము, మర్యాద, దివ్యమైన ప్రేమము ముళ్ళకంచెలులా చుట్టి ఉంటాయి.

అక్కి: ప్రభూ। ఆదవోని ప్రభువును, విరలధరణీశ మహారాజు యాదవుని కలవాలని వెళ్ళుతూన్నప్పుడు ఓడించారు, వదలినారు. శ్రీ అన్నాంబికాదేవికి ఆయన తండ్రి అగుటే అందుకు కారణం.

గన్నా: నా హృదయం, నా ఆత్మ సంపూర్ణంగా ఎరిగిఉన్న బావగారికి తెలియదా?

అక్కి: బావగారూ। అయితే రాజ్యలక్ష్మిని జయించి చేబట్టినట్లు శ్రీ అన్నాం బికాదేవిని చేపట్టండి।

గన్నా: బావగారూ। ఎంతవెఱ్ఱివాడవయ్యో। నే నెరుగని యువతి అయితే శత్రువును జయించి, బాలికను చేబట్టి ఉందును కాని నా జీవితంకన్న, నాఆత్మ ఎక్కువకాదా?

అక్కినప్రగడ కంటినీరు చెమరించింది.

ప్రేమ ఎన్ని విచిత్ర మనోగతులను ఉద్భవింపచేస్తుంది! తన ఆత్మకన్న ఎక్కువగా ప్రేమించిన బాలిక నామె తండ్రి తన్ను ఆదరించి ఈయవలె. లేకున్న తన ప్రాణాన్ని, ఆబాలిక ప్రాణాన్ని ద్వేషానికి బలి యీయడానికి ఈ మహా పురుషుడు వెరవడు.

పోనీ, తల్లిదండ్రుల విడచి ఆ బాలిక వచ్చినా, ఆమె నడిచేందుకు తన ఆత్మను రత్నకంబళివలె పరుస్తాడేగాని తన మహారాజు వివాహానికిమాత్రం ఒప్పుకోడు.

ఇక ఏదిదారి?

౫

# ఏడిదారి

అన్నాంబికాదేవి ఆదవోని వెళ్ళింది. తలిదండ్రులు అమ్మాయిని ప్రేమతో ముంచెత్తారు. వారిద్దరు వెనుకటి గొడవలే ఎత్తరు. ఆమె మనస్సు ఏమీ నొవ్వకుండా పువ్వులలో పెట్టినట్లు చూచుకొంటున్నారు.

కాని అన్నాంబికాకుమారి మనస్సులో ఉన్న బాధ ఎవరు గ్రహించగలరు? ఆమె తనకు తానై తల్లికిగాని, తండ్రికిగాని తన హృదయం తెలుపదలచుకోలేదు. తన హృదయం తెలిసిన చెలి మల్లికకుకూడా తల్లిదగ్గరగాని, ఇంకఎవ్వరి దగ్గరగాని ఆ ప్రస్తావన తీసుకురావద్దని స్పష్టముగా తెలిపెను.

తక్కిన చెలులకుగాని, దాసీలకుగాని, స్నేహితురాండ్రకుగాని, అన్నాంబిక పురుషవేషం వేసికొని యుద్ధము చేసెనన్న విషయమే తెలియదు. అలా పురుష వేషము వేసికొని గన్నారెడ్డికి కవచరక్షకురాలిగా వెళ్ళినది అన్న సంగతి అంతకంటే తెలియదు ఎవ్వరికీ.

ఆ మహాపురుషునికి ఎంత సేవచేస్తే తన జన్మ సార్థకమవుతుంది? తన అక్క, లోకానికి మహారాణి, సకల సద్గుణపుంజము రుద్రదేవి సామ్రాజ్ఞి, గర్వానికికాక, యశానికికాక, శుద్ధధర్మమూర్తియై రాజ్యము కాపాడిన మహాపురుషుడు లోకోత్తరుడుకాడా?

ఏశుభముహూర్తమున ఆ దివ్యపురుషుని తన రెండుకన్నులా చూచిందో అప్పుడే తన్నా పురుషునకు సమర్పణ చేసుకుంది. అందరూ తన్ను అనన్య సౌందర్యవతి అంటారు. ఆ వీరోత్తమునకు అర్పించుకొనడానికి తన సౌందర్యము ఒక అణుమాత్రం!

సౌందర్యము క్షణికము: ధర్మము శాశ్వతము. గోన గన్నారెడ్డి ప్రభువు ధర్మపురుషుడు.

ఇంక తానా దేవతామూర్తిని ఎలా దర్శించగలదు? దర్శించడానికి వీలుండి దర్శనము చేయకపోయినా మనస్సుకు ఆరాటం ఉండదు. దర్శనముకాదు అన్న నిరాశ జీవితాన్ని మూలముంటా కదల్చివేస్తుంది.

"బాలకుణ్ణయి పది దినాలు నీకు చేసినే సేవ నాకు పదిజన్మలకు సరిపోయే సుకృతాన్ని సముపార్జించి పెట్టింది ప్రభూ!"

ఇంక ఆ స్వామికి తాను సేవ చెయనే వీలుండదా?

సేవమాట అలావుంచి ప్రాపంచకంగా ఆలోచించినా, తన కాతడు నాయకుడు. తా నాతనికి నాయిక. ప్రేమ ఎరుగని విహారాలూ, కలయికలూ

వెండి బంగారాల కలయికలు! ప్రేమమూర్తులయిన భార్యాభర్తల కలయిక మేలిమి బంగారము మేలిమి బంగారము కలిసిపోయినట్లే!

ప్రేమించిన పురుషుడు ఉన్నాడనుటే ఆనందము. అతడు కనిపించిన నాడు మహదానందము. ప్రేమించిన పురుషుడు భర్తయగుట బ్రహ్మానందము. ఇంక ఆ భర్త భార్యను ప్రేమించుట బ్రహ్మానందాతీతమైన పరమేశ్వరత్వమే.

ఈ మహాపురుషుడు తన్ను ప్రేమిస్తున్నాడా! ప్రేమించకపోయిన పోనీ! తాను వైరాగ్యంతో ఆయన నామమే జపం చేసుకొనుచు కాలము గడుపగలదు.

తమ కుమారిత హృదయం కోటారెడ్డి మహారాజుకుగాని, మహారాణికి గాని ఏమి అర్థమవుతుంది!

ఇంక వరదారెడ్డికి ఆమెనిచ్చి వివాహం చేయడు. అయితే ఇక ఎవరి కిచ్చుట? బిడ్డ అందముచూస్తే దృష్టి తగులుతుందని తన మహారాణే పలుమారులు అంటుంది. అసదృశమైన తన కొమరిత అందానికి తగిన వరు డెవ్వరు?

కోటారెడ్డి ఆలోచనకు గోన గన్నారెడ్డి స్ఫురించనేలేదు. గన్నారెడ్డి విచిత్ర పురుషుడు. అతడు ఇంకను గజదొంగగానే కోటారెడ్డి మనోనయనాలకు కన్పించు చున్నాడు. ఆయన రుద్రదేవికి కుడిచేయిగా ఉన్నాడని రుద్రదేవి నిండుసభలో అన వచ్చుగాక! అబల అయిన ఆడది కాబట్టి అతడు చేసిన పనులు ఆమెకు ఉపకారా లయ్యాయి కాబట్టి అతన్ని పొగడింది. అతడు తాను దొంగతనంచేసి నాశనం చేసినవాడు చక్రవర్తికి విరోధులయితే మరీ మంచిదని ఆలోచించాడు. అంతకన్న అతని గొప్పలేదు. ఏదో తన అక్కగారిని తీసుకొనివచ్చి, నగరినుండి పారిపోయిన మా అమ్మాయిని అప్పగించాడు. అది కొంత నయం! ఇంతకు తనకూతు రలా కోటనుండి పారిపోయేటట్లు చేయించడం ఎంత తలవంపుపని!

ఏదో, తన బిడ్డను ఎవరో ఉత్తముని కొకనికి ఇచ్చి....

ఇంతలో పరిజనపరివేష్టితయై మహారాణి మహారాజు అభ్యంతరమందిరాలకు వేంచేసినది. మహారాజు లేచి, ఎదుర్కొని తీసుకొనివచ్చి ఒక పీఠికపై తన ప్రక్కనే కూర్చుండ బెట్టుకున్నారు.

రాజు: దేవీ! ఈలాగు దయచేశారు?

రాణి: మహాప్రభూ! అమ్మాయి వివాహం మాట ఏంచేశారు?

రాజు: నేను అదే ఆలోచిస్తున్నాను దేవీ! వందిభూపాలుని తనయుడు కంద వోలు మహారాజు ఒకడు నాకు కనబడుతున్నాడు.

రాణి: తన గురువైన గోన గన్నారెడ్డి మహారాజు వివాహం చేసుకుంటేగాని వివాహంచేసుకోననికదా ఆయన పంతంపట్టినట్లు మనమువింటిమి!

రాజు: అవును మహారాణీ! ప్రయత్నముచేసి చూడవలెగదా?

రాణి: ప్రభూ! ఒక్కతే మనకు బిడ్డ! సర్వవిద్యలలోనూ సరస్వతినీ మించేటట్లు పెంచారు. బాలుడయినా బాలిక అయినా ఆ ఒక్కతేగద మనకు? అమ్మాయి హృదయం ఏమిటో తెలుసుకోవద్దా?

రాజు: రాచకులాలలో వివాహాలంటే రాజనీతికి సంబంధించి ఉంటాయి. అక్కడ మన యిష్టము అయిష్టము ఎలా పనికివస్తుంది దేవీ!

రాణి: ఊలాంటి రాజనీతి పాటించే, వరదారెడ్డికిచ్చి చేయాలని పట్టు పట్టారు. అంతా వ్యతిరేకమయిపోయింది'

రాజు: మహారాణీ! ఏమిటి నీ ఆలోచన?

రాణి: ఆలోచనేకాదు, నా దృఢనిశ్చయంకూడా, అమ్మాయి ఉద్దేశం తెలుసుకొనడం మంచిదని!

ఆ మరునాడు మహారాణి కొమరితదగ్గర కేగెను. అన్నాంబిక ఎంత కాలమో విషజ్వరపీడితఅయి అప్పుడే విముక్త అయిన బాలికలా చిక్కిపోయి, ఉత్సాహరహితయై ఉన్నది. ఆమె పెద్దకళ్లు ఇంకా పెద్దవాయెను. ఆమె నునుచెంపలు కాంతి కల్గిన బంగారు ఫలకాలులా ఊరుకున్నాయి. ఏదో నిస్పృహ! ఎప్పుడూ నిట్టూర్పు!

రాణి; తల్లీ! ఏమి అలా ఉన్నావు. వంట్లో బాగుండలేదా?

అన్నా: ఏమీ జబ్బులేదు. ఏదో దేశం మారడంచేత కాస్త నలతగా ఉంది, అంతే!

రాణి: మల్లికా, ఏమిటి అమ్మాయిగారివంట్లో? రాజవైద్యులు వచ్చి చూచారా? దాదిని పిలు.

ముసలిదాది తిప్పక్క త్వరత్వరగా మహారాణికడకు వచ్చింది.

తిప్పక్క: అమ్మాయిగారికి దృష్టులు తీసివేశానండి. కులదేవతకు బలులు ఇప్పించానండి. సోది అడుగించానండి. వైద్యులచేత పరీక్ష చేయించానండి.

ఇంతల్లో అతి తొందరగా ద్వారపాలిక ఒక దాసీని వెంటబెట్టుకొని లోపలికి వచ్చి "మహారాణీ జయము! మహారాజులంవారు ఈ దాసిని తమ కడకు ఒక ముఖ్యవార్తతో పంపినారు" అని మనవి చేసెను.

రాణి: ఏమి టా వార్త?

దాసి: మహారాణీ జయము జయము! మహరాణివారికడకు శ్రీ చక్రవర్తి కడనుండి ఒక సేనాపతి తమ దళముతో విచ్చేసినారండి. శ్రీ చక్రవర్తిగారూ, వారి భర్త శ్రీ చాళుక్య వీరభద్రమహరాజులంవారూ వారం దినాలలో సంగమేశ్వరం దర్శించుకొని, అక్కడనుండి ఇక్కడకువిచ్చేస్తారట అని వార్త తెచ్చినారు! మహారాజులంవారు ఈవారం దినాలలో అంతఃపురంసిద్ధం చేయించవలసిందని కోరుతూ మహారాణిగారికి చెప్పవలసిందని నన్ను పంపించారండి.

ఆ వార్త వినటంతోటే అన్నాంబిక మోము కలకలలాడి పోయింది. వాన కురిసిన వెనుక ఏరు పొంగినట్లాబాల ఉప్పొంగిపోయింది. సంపూర్ణ జ్యోత్స్నలు విశ్వము విండినట్లు ఆమె మనస్సున శాంతి నిండినది.

"ఏమిటి మా అక్క వస్తూంట ! ఒహో ! ఏమి అదృష్టము ! అమ్మగారూ ! మనదేశం కన్నుల కైలాసం కావాలి ! మన ఆదవోని సౌందర్యరాశి అభిషించాలి ! నేను మీ అంతఃపురంలో ఉంటాను. నా నగరు చక్రవర్తికోసం అలంకరిస్తాను ! అమ్మగారూ ! నా నగరుప్రక్క తోట అవలఉన్న అతిథి నగరు, మహారాజుగారికి విడిది ! ఈ రెండూ నేను అలంకరింపిస్తాను. నాకు అనుజ్ఞ దయచేయండి !" అని దివ్యానందగీతంలా ఆమె తన తల్లిని వేడుకొన్నది.

తన బంగారుతల్లి ఆనందముతో ఆకాశగంగలో బంగారు కమలంలా వికసించడంచూచి మహారాణికూడా ఆనందపూర్ణ అయింది.

"అల్లాగే నాతల్లీ! అంతా నీ యిష్టం. నీ ఆనందం నా ఆనందంకాదా కన్నతల్లీ !" అని మహారాణి ప్రియమార కూతును కౌగలించుకొని మూర్థము ముద్దాడి తన నగరుకు వెళ్ళిపోయెను.

అది మొదలు దాసీజనులు ఎడతెరిపి లేకుండా అన్నాంబికాదేవి ఆజ్ఞను ఆ రెండు నగళ్లు సౌందర్యపరమావధులుగా అలంకరించారు.

నగరంలోని రాజకుటుంబాల బాలికలు నాట్యంచేయడం, రాచకన్నెలు సంగీత ప్రదర్శనాలు చేయడం, సంగీత కళాభిజ్ఞులయిన వారకాంతలు కొందరు మేలుకొలుపుల గీతాలు పాడుట అన్నాంబియే రచించి వారికి నేర్పింది.

అన్నాంబిక తల్లిగారి నగరులో ఒక భాగంలో తాను విడిదిచేసెను.

నగరం అంతా అలంకరించారు. ఆదవోని రాజ్యమంతయు అలంకరించినారు. రాజపథం పొడుగునా పందిళ్లు. సత్రాలు, పశువైద్యశాలలు, అశ్వవైద్యశాలలు, నరవైద్యశాలలు, తోలుబొమ్మల నాటకాలు, వీధినాటకాలు, నృత్య ప్రదర్శనాలు ఏర్పాటయినవి.

ఇంక మూడుదినాలకు రుద్రదేవ చక్రవర్తి ఆదవోని వస్తుందనగా, రుద్రదేవి ఒక పరిచారికకు కమ్మ ఇచ్చి అన్నాంబికకు పంపెను.

చెల్లీ ! నువ్వూ నేను కవలపిల్లలము. నాకు అందరాని జీవితానందఫలాలు నీవి. నిన్ను కౌగలించుకొని, నీ మోముచూచి, ఇప్పుడు నాజన్మసర్వస్వమూ తీరిన నా ఆనందాన్ని నీకు అర్పించడానికి వస్తున్నా! ప్రేమమయీ! నీ అక్క రుద్రమ!" అని ఆ యుత్తరము !"

## ౬

# నాయికానాయకులు

చక్రవర్తి శ్రీ రుద్రదేవి భర్తతో ఆదవోని వచ్చుట సాక్షాత్తు పార్వతీదేవి పరమశివునితో కలసివచ్చుట, ఆదవోని రాజ్యమంతయు పండుగలతో మహానంద పూరితమైపోయినది.

చక్రవర్తి, భర్త అయిన శ్రీ చాళుక్య వీరభద్రమహారాజుతో పురవీధుల వెంట విడిదికి వెళ్ళడం అద్భుతమైన ఊరేగింపే అయినది. చక్రవర్తికి కందవోలు ఇచ్చిన స్వాగతం వర్ణనాతీతమైతే అంతకు మించిపోయింది ఆదవోనివారి స్వాగతం శ్రీ కోటారెడ్డిమహారాజుతేరు, చక్రవర్తితేరు వెనుకనే వెళ్ళుచున్నది.

చక్రవర్తి రథానిక ముందు అంగరక్షకోత్తముడైన ఒక యువకనాయకుడు ఉత్తమోత్తమ జాతికి చెందినదిన్నీ, ముప్పదిరెండు మహావాజి లక్షణాలు కలదిన్నీ, మూర్తీభవించిన వేగమయినదిన్నీ, ధవళాతిధవళమైన వర్ణము కలదిన్నీ అయిన ఒక దివ్యాశ్వమునెక్కి స్వారీచేస్తూ ఉండెను. ఆ గుఱ్ఱానికి చేసిన అలంకారములే కొన్నిలక్షల బంగారు కర్షఫణాలు మూల్యము చేయునవి. ఆ ఉత్తమాశ్వముపై జితమన్మథుడు, ఉన్నతాకారుడు, సొబగుమీసాలవాడు, దీర్ఘనయనాలవాడు, సమనాస వాడు, వేలాడే పెద్దచెవులు, ఆ చెవులకు హంసకుండలాలవాడు, నుదురు, కన్నులు, ముక్కు, నోరు, చెంపలు, చెవులు నారదవీణా గానంలా శ్రుతి కలిసిన వాడు, వీరనాయక శిరోరత్నమైనవాడు—ఆ యువకుడు విలాసంగా వెళ్ళుచున్నాడు.

సాధువైన గుఱ్ఱాన్ని స్వారీచేయవచ్చును, శక్తిచే గుఱ్ఱాన్ని లోబరచు కోవచ్చును. కాని చూపుతో, మాటతో, చేయితట్టుటతో అశ్వప్రేమను చూఱగొనే వాడే అశ్వహృదయజ్ఞుడు, ప్రౌఢతురగరేఖావంతుడు.

ఆ ఉత్తమాశ్వము, తనపై అధివసించిన పురుషుని సర్వవిశ్వంకన్న ఎక్కువగా ప్రేమిస్తున్నదన్న సత్య మా అశ్వచక్రవర్తి చూపులలో, తల త్రిప్పులలో. నడకలో, చక్రాకారంగా వంచిన కంధరపు మడతలో ప్రత్యక్ష మగుచున్నది.

ఎలాంటి పొగరు గుఱ్ఱమైనా, ఎలాంటి రాక్షసాశ్వమైనా ఆ యువకుని స్పర్శచే సాధువైపోవునని అతని ధృతాశ్వతసూత్రముష్టి చెప్పుచున్నది.

ఎవ్వరి సొబగులాడు! ఎక్కడో చూచినట్లున్నది. ఆదవోని సేనపతులు, ఆదవోని రాచకుటుంబాలవారు, ఆదవోని ఉద్యోగులు అందరూ ఆ యువకుని ఎక్కడో చూచితిమనే అనుకుంటున్నారు.

ఎవరయ్యా ఈ ఉద్ధతసత్వుడు! ఆయన ధరించిన కిరీట కేయూరాది లాంఛ నాలున్నూ ఇదివరకు చూచినవే. నవ్వులు పూర్ణజ్యోత్స్నలులా వెదజెల్లే అతని మోము పరిచితమైనదే! ఎవరోహో ఈ సుందరకుమారుడు!

అంతలో ఎవరో "అతడు గోన గన్నారెడ్డి" అన్నారు. "గోన గన్నారెడ్డి చక్రవర్తి ముఖ్యాంగరక్షకుడుగా వచ్చాడు. గోన గన్నారెడ్డి, గోన గన్నారెడ్డి గజ దొంగ!" అన్న గుసగుసలు పట్టణమంతట ప్రాకిపోయెను.

"గోన గన్నయ్యే" ఆ మాట విద్యుల్లతలా వాడవాడలూ, భవనాలు, సౌధాలు, నగరులు, అంతఃపురాలు ప్రాకిపోయింది.

తన అంతఃపురప్రాంగణంలో అన్ని ఉత్సవవిధానాలు సంసిద్ధం చేసుకొని సముచితాలంకారదివ్యశోభనమూర్తియై, అర్ధచంద్రాభిఫాలయై, తిలపుష్పసమానా సయై, దీర్ఘవినీలపక్ష్మచ్ఛాదితవిశాలనయనయై, నర్తిత మందహాసచంచలమధుర పక్వబింబాధరోష్ఠియై, వేగంతో పరువులెత్తే గుండెలతో నిలుచునిఉన్న అన్నాం బికకడకు ఒక రాకుమారి వేగపునడకలతో వచ్చి 'వదినా, గోన గన్నా రెడ్డి వచ్చి నాడట' అని చెప్పినది.

"ఏమిటీ! గోన గన్నారెడ్డి.... గోన.... గో.... గో.... న గన్నారెడ్డి!" అనే మాటలు ఆమె నోటినుండి వచ్చినవాయెను.

ఆమె ఒక్కసారిగా వివశత్వం పొందెను. ఆమెకాళ్ళలో బలము కరగి పోయెను. ఆమె గుండె కొట్టుకొనుట ఒక్కనిమేషము ఆగిపోయినది.

ఏలావచ్చా డా దివ్యపురుషుడు? ఎందుకు వచ్చా డా ఉత్తమ నాయకుడు? అయ్యో! ఏమహారాజు కోపానికి గురి అయ్యాడో, ఆ మహారాజు నగరానికే ఎందుకు వచ్చాడు?

తన గురువు, తన హృదయసింహాసనాధినేత, తన స్వప్నాంకిత మధుర నాయకుడు, తన దైవము తనకడకే వచ్చినాడా?

గంభీర మృదుమధుర కంఠస్వరాలతో తన్ను 'విశాలాక్షప్రభూ' అని పిలి చిన వన్నెకాడు!

మేటి సింహాల పూలచెండులా నాడగల పోటుమానిసి, సింహావలోకనంతో ఆంధ్రదేశం పాదాక్రాంతం చేసుకోగల వీరుడు, సర్వధర్మవిరాజిత ధీరోదాత్తుడు, కుమారస్వామి సన్నిభ సుందరుడు!

గోనవంశకలశాంబోధిరాకాసుధాకరుడు, శ్రీకృష్ణ నామాంకితుడు తన్ను వెతుక్కుంటూ వచ్చినాడా?

ఆమె మోము, అరుణరాగాలతో నింగి ఉదయించే చంద్రబింబంలా ఉన్నది.

ఆమె మోము, ఆనందవీచికారాశిలా ఉన్నది.

ఆమె, ఒక్కసారి విరిసిన కలువల గుచ్ఛంలా ఉన్నది.

ఆమె ఆనందం ఆ వార్త తెచ్చిన రాకుమారి కనిపెట్టి 'వదినా! నీ కెంత సంతోషము' అన్నది.

ఇంతలో చక్రవర్తి నగర ముఖద్వారం దాటారన్ని వార్త. ఇంతలో వివిధ మంగళవాద్య మేళ గీతాల తీయదనాలు పన్నీరు జల్లుచుండగా నగర ప్రాంగణంలో రథము ఆగింది.

అన్నాంబిక మంద్రమలయానిలంవలె చక్రవర్తి రథంకడకు పరువెత్తింది.

భర్తను వారి విడిదికడ దింపివచ్చిన చక్రవర్తి, రథంనుండి వేగాన ఉరికి అన్నాంబికను గాఢమైన కౌగిలింతలో అదిమికొన్నది.

## ౭

## ప్రేమాంభోధి

రుద్రమదేవి పీఠం అధివసించగానే గోన గన్నారెడ్డిని చూచి 'మహారాజా! ఈ బాలుణ్ణి మీరు ఎరుగుదురటకాదా?' అని ప్రశ్నించెను.

గోన: మహాప్రభూ! ఈ యువకప్రభువును ఎరుగుదును. వీరు నాకు అంగరక్షకుల్లుగా ఉండిరి.

రుద్ర: ఈ బాలుడు మీ సేవచేయడమే తనకు తారకమనిన్నీ, అందుకు మేము మిమ్ము ఒప్పించాలనీ చాలా ప్రాధేయపడినాడు. మాకు ఈ బాలునియందు చాలా కరుణ కలిగింది కాబట్టి మీకు వెంటనే వార్త పంపినాము.

గోన: చి....చిత్తము మహా ప్రభూ!

రుద్ర: చక్రవర్తులమైన మాకు సేవచేయక ఇంకొకరికి సేవచేయాలనే పట్టు ఎందుకయ్యా. అని నేను చాలా కోపగించాను. కాని తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లని తగవులాడుతున్నాడు.

గోన: మహారాజా! తమరు సెలవిచ్చినట్టే నేను ఈ రాజకుమారునికు చెబుతున్నాను.

రుద్ర: కాని మన ఆలోచన తీయనకు రుచించుటలేదు. ఈ బాలుడు మీ కొలువు చేయడానికి ఈయన తండ్రిగారు శ్రీ కోటారెడ్డి మహారాజు

మేము చెప్పిన విషయాలన్నీ గ్రహించి ఒప్పుకున్నారు. ఒప్పుకోవడమే కాకుండా తాము స్వయంగా వచ్చి మిమ్మ్మ ప్రార్థిస్తారట.

గోన ; మహాప్రభూ !

రుద్ర : సరే ! సరే ! విశాలాక్షప్రభూ ! మీరు ఇక వెళ్ళవచ్చును. గన్నారెడ్డిప్రభూ ! మిమ్మ్మ మా మహారాజుగారు కలుసుకోవా లనుకుంటున్నారు.

గోన : చిత్తం మహాప్రభూ !

విశాలాక్షప్రభువు ఒకవైపునకూ, గన్నారెడ్డిప్రభువు ఒకవైపునకూ చక్రవర్తికి మ్రొక్కి వెడలిపోయినారు. గన్నారెడ్డి తిన్నగా చాళుక్యవీరభద్ర మహారాజుకడకు వెళ్ళి వారి దర్శనం చేసుకొన్నారు. వీరభద్రమహారాజు గన్నారెడ్డిని చూచి, "ప్రభూ ! నన్ను మీరు అపార్థం చేసుకోకుండా ఉంచే ఒక విషయం మనవి చేస్తాను. శుభకాలంలో పవిత్రసంఘటనలు మనకు కొన్ని సంభవిస్తాయి. అవి నిష్కల్మషభావంతో, పవిత్రహృదయంతో గ్రహించాలని కోరుకున్నాను. తమకు దేశికులు స్వహస్తనామాంకితమైన ఉత్తరం వ్రాశారు. ఆ ఉత్తరం స్వయంగా తమ కీయాలని నేను తమవిడిదికి రావాలని సంకల్పించుకొని ఉండగా, తామే చక్రవర్తి గారి విడిదికి వచ్చారని తెలిసి తమ్ము కలుసుకోగోరి వార్తపంపాను" అని తెలిపినారు.

గన్నారెడ్డి సంతోషముతోలేచి, ఆ ఉత్తరమందుకొని కనుల కద్దుకొని మహారాజువారివద్ద సెలవుతీసుకొని, తన విడిదికి చేరినాడు. అక్కడ పేటిక తెరచి, కమ్మతీయగా అందులో "శ్రీ శ్రీ గన్నారెడ్డి మహారాజులను ఆశీర్వదించి—

"ప్రభూ, మీరు ఈ ప్రపంచంలో ఉన్న కొంతమంది మహోత్తమ జాతిపురుషులలో ఒకరు. మీకై చిరంజీవి సౌభాగ్యవతి అన్నాంబికా కుమారి వెలసింది; ఆమెకై మీరు వెలసినారు. ఇది పరమ శివప్రీతికరం. పార్వతిని పరమేశ్వరుడు పొందకపోవడము ఎలాంటిదో, మీరుఅన్నాంబికా కుమారిని ఉద్వాహము కాకపోవడము అలాంటిది. ప్రాపంచకమైనవేవీ మీకు అడ్డం రాకూడదు. పరమధర్మమట్టిది. మేము స్వయంగా శ్రీ చక్రవర్తితో వచ్చి మీకు వివాహము, పట్టాభిషేకము జరిపిస్తాము. మిమ్మ్మ ఆయురారోగ్యవంతులుగా, మహారాజ్యాభిషిక్తులుగా, పుత్రపౌత్రవంతులుగా శ్రీ సోమనాథదేవ దివ్యశ్రీపాద పద్మారాధకులుగా ఆశీర్వదిస్తూ శివదేవయ్య" అని చదివినాడు.

ఏమిటి ? శివదేవయ్యదేశికులు ! ఈ విషయంలో ఈలా చక్రవర్తి, మహారాజులు, దేశికులు అందరూ చేయిచేసుకొన్నారేమి ? అనుకొంటూ

అన్నాంబికాదేవిని తలపోసుకొంటూ ఆ బాలికను రత్నఖచిత సువర్ణ సింహాసనంపై కూర్చుండబెట్టి సర్వస్వము ఆ బాలికకు పూర్ణార్పణ చేయడానికి తానే సిద్ధం అయి ఉన్నప్పుడు, ఈ పూజ్యులందరూ అంతమధురాతి మధురకార్యము తనకు ఇష్టము లేదని అనుకొనుట ఎలా కలిగినది!

ఇంతలో శ్రీకోటారెడ్డి మహారాజులంగారు మంత్రితోకలసి తమరాక తెలియజేసి లోనికి విచ్చేసినారు. కోటారెడ్డి ప్రభువుకు గన్నారెడ్డి ఎదురేగి వారిరువురకు నమస్కరించి, సగౌరవముగా కొనివచ్చి ఉచితపీఠాల అధివసింపచేసి, తానున్నూ ఒక పీఠం అధివసించాడు.

కోట : ప్రభూ! తమకు సౌకర్యాలన్నీ జరుగుతున్నవో, లేదో?

గన్నా : చిత్తం ప్రభూ! మా ఇంటిలో జరిగినవాటికన్న ఎక్కువగా సౌకర్యాలు ఏర్పాటు చేసినారు.

కోట : ప్రభూ! తమచరిత్ర అంతా శ్రీ చక్రవర్తులు, మహారాజులంవారు మాకు తెలియజేసినారు. నాకు ముఖ్యస్నేహితులై మా తండ్రిగారిని ఆదవోని సింహాసనం అధివసింపజేసిన శ్రీ బుద్ధారెడ్డి మహారాజుల కుమారులు, మిమ్ము గూర్చి అన్యథాగా ఆలోచించాను మందమతినై.

గన్నా : మహాప్రభూ! మీ రిలా ఆలోచించితే మేమంతా వేసినఎత్తు పారిందనటానికి ప్రబలసాక్ష్యం ఒక్క చక్రవర్తికి, శ్రీ రుద్రదేవ మహారాజులకు, శ్రీ శివదేవయ్య దేశికులవారికి తక్క, మా కుట్ర ఇంకొకరికి తెలియదు. ఇందులో తమరు ఒక్కరేకాదు పొరపడింది.

మంత్రి : గన్నారెడ్డిప్రభూ! తమశౌర్యము అర్జునునికే పాఠాలు నేర్పుతుంది. ఇంతవరకు ఈలాంటి పరమాద్భుత విక్రమచరిత్ర వినలేదు మా మహాప్రభువుగారికి విచారము అంతమైనది.

గోన : మంత్రిగారూ! మీ రెవ్వరూ ఏమీ అనుకోవద్దు. ఆ దినాలలో కాకతీయసామ్రాజ్యాన్ని విచ్ఛిన్నంచేసే శక్తులు విజృంభించాయి. రహస్యముగా జన్నిగదేవుల రుద్రదేవ చక్రవర్తిపై కత్తికట్టినారు. అందుకు ప్రతీ అస్త్రంగా మేమాపని చేసినాము. మా పినతండ్రిగారి మాటలకులోనై మీ మహారాజు కొన్ని నెలలుతటపటాయించారు. అంతకన్న వేరులేదు. మాతండ్రిగారియందున్న ప్రేమ కొద్దీమహారాజుగారు నాయందు వాత్సల్యము ముంచవలసిందని మనవి.

మంత్రి : ప్రభూ : మారాజకుమారి సౌభాగ్యవతి అన్నాంబికాదేవి సకలసద్గుణగరిష్ఠ, అప్రతిమాన సౌందర్యఖని, అపర విద్యాశారద. ఆ దేవిని తమకు వధువుగా అర్పించ మా మహారాజులవారు సంకల్పించి తమ్ము ప్రార్థిస్తున్నారు.

గోన గన్నారెడ్డి మోము వికసించినది. ఆయన కన్నుల అమృతసీలాలు తిరిగినవి. గొంతుక అమృతబిందువులతో నిండిపోయి డగ్గుత్తికతో "మహామంత్రీ! మహారాజులు నన్ను ఈవిధంగా ధన్యుని చేస్తున్నారు" అన్నాడు.

ఆసమయంలో గోన గన్నారెడ్డి ప్రభువు, కోటారెడ్డిప్రభువుకు శ్రీరామ చంద్రమూర్తిలా తోచినాడు. గన్నారెడ్డిమాటలు ముగుస్తుండగానే మంత్రిలేచి "తథాస్తు" అన్నాడు. వెంటనే రాజపురోహితులు, కవులు ఆమందిరం లోనికి పరిజనులతో వేంచేసినారు. బేడ చెలుకినాయనిప్రభువు లోనికివచ్చి బంగారు పళ్ళెరాన కొబ్బరిబొండం, సర్వఫలాలు, పుష్పాలు, తాంబూలాలు, విలువగల వస్త్రాదులు గన్నారెడ్డి పీఠముముం దుంచినారు. గన్నారెడ్డి ఆశ్చర్యం పొందుచూ లేచి, కాబోవు మామగారు కోటారెడ్డి ప్రభువుకూ, పెళ్ళికూతురు మేనమామ బేడ చెలుకినాయనికీ పాదాభివందన మాచరించగా వారు గన్నారెడ్డిని ఎత్తి తమ హృదయాలకు గాఢంగా అదుముకొంటూ ఆలింగనం చేసినారు.

శుభవాద్యాలు, మంగళగీతాలు మ్రోగుచున్నవి.

౮

# జయాభవ

## చిన్నకుట్ర

ఆ తోటలో అక్కడే గోన గన్నారెడ్డి అన్నాంబికను కలసికొన్నాడు.

అందాలప్రోవైన అన్నాంబిక, అలంకారాలకే అందం దిద్దింది.

ఆమె వనవిహారం చేసింది. ఆ సాయంకాలం పూవుల వాసనలు తోటంతా కల్లోలాలు. ఆ పరిమళవాహినిలో హంసలులా, రుద్రదేవి అన్నాంబికలు నడయాడినారు.

"చెల్లీ! నేను దాక్కుంటాను. ఇక్కడే కళ్లు మూసుకుఉండు" అని రుద్రాంబికాదేవి మాయమయింది.

అక్కడే గన్నారెడ్డిని తాను కలుసుకొన్నది అని ఇదివరకే అన్నాంబిక రుద్రాంబతో చెప్పిఉండడంచేత అక్కడే ఆమె కనులు మూసుకొని, రుద్రాంబిక దాగికొనినపిమ్మట కనులు తెరచి వెదకి పట్టుకొనవలెనని మహారాశి ఏర్పాటుచేసినది;

ఆ ఉదయం చక్రవర్తి, గోన గన్నారెడ్డిప్రభువును రప్పించి "ప్రభూః ఈ సాయంకాలం రాచనగరి మోసాలలో పదునాల్గవ మహూర్తము కొట్టు వచ్చి టికి మీరు మా ప్రతీహారి చూపించిన స్థలమునకు పోయి, అక్కడ నేను కలుసు కొనడానికి నియమించిన వ్యక్తిని కలుసుకొని, నా యాజ్ఞగా మీరు ఆ వ్యక్తి కళ్ళకు కట్టిన చీనాంబరము విప్పవలెను. ఆ వ్యక్తి నా ఆజ్ఞ మీకు తెలియజేయగలదు."

గోన గన్నయ్య జయ వాక్యాలు పలికి సెలవంది వెడలిపోయెను. ఏమిటి చక్రవర్తి ఆజ్ఞః ఇంత రహస్యమేమి? ఒకవేళ కోటారెడ్డి మహారాజు వేరే ఏమీ కుట్ర సలుపడము లేదుకదా? అయితే ఈ వివాహాది సన్నాహమేమిటి?

# అక్కినేపల్లి

చినఅక్కినమంత్రి శ్రీ కోటారెడ్డిప్రభుపులతో సంప్రదించి, వారిమంత్రి పురోహితులతో ఆలోచించి ముహూర్తము నిశ్చయముచేసిరి. గన్నారెడ్డి వివాహము కాగానే ఇంకో శుభముహూర్తంలో తన రాణితో కలసి పశ్చిమాంధ్రరాజ్య ప్రతి నిధి మహామండలేశ్వర సింహాసనం, వర్ధమానపురంలో అధివసించే ఏర్పాటు చేసెను, అక్కిన.

చక్రవర్తి, గోన గన్నయ్య, కోటారెడ్డి ప్రభువులు అక్కినప్రగడను ఒక మండలానికి రాజును చేసినారు. అక్కినప్రగడ తన రాజ్యంలో అక్కినేశ్వరము కట్టించి(ఇది తర్వాత అక్కినేపల్లి అయినది) అచ్చట అక్కినేశ్వర, సోమేశ్వర, కేశవదేవతలను ప్రతిష్ఠించినాడు. అక్కినను గోన గన్నయ్యకు ముఖ్యమంత్రిగా గోన గన్నయ్యమహారాజు ప్రార్థించినాడు. చినఅక్కినప్రగడ "బావగారూః మిమ్ము వదలి నేను ఉండలేను. నేనే మీ ఆస్థానమందుండబోకోరుతున్నాను" అన్నాడు.

"ఓ మహామంత్రీః మహాకవీః చక్రవర్తి ఆస్థాన శిరోరత్నంగా ఉండవలసిన మీరు నాకు మంత్రిత్వం చేయ నంగీకరించటం నాకు వరమివ్వడమే."

అక్కిన లేచి గోన గన్నయ్యదగ్గరకు వెళ్ళగా మహారాజు లేచి, అక్కినను గాఢంగా హృదయానికి అదుముకొన్నాడు.

.... .... .... ....

# ఆనందాలింగనం

కన్నులకుకట్టిన చీనాంబరము తడవికొనుచు చిరునవ్వు నవ్వుకొనుచు అన్నాంబిక కూరుచుండెను.

ఏలనో హృదయాన తేలె మధురామృతము
పూలు పూవులు ఒలికి సోలించె నాత్రితుకు
తారకల వెలుగులో పారిజాతసుమాలు
చేరినవి ప్రేమకై చేయి జాపిన నన్ను

అని పాడుకొనుచున్నది. ఇంతలో మన్మథమూర్తిలా, పోతపోసిన మనోహరత్వంలా గన్నారెడ్డి అక్కడకు వేంచేసినాడు.

అన్నాంబికను చూడగానే అతని అడుగు ఆగిపోయినది. అతనిహృదయము గతులు తప్పినది. అతన జీవితము పులకరించి ఆతని కన్నులలో పరమ పవిత్రాంబువులు గిఱ్ఱున తిరిగినవి.

ఈ త్రిలోకమోహనమూర్తికదకా చక్రవర్తి తన్నువంపినది ?

పూవుల పుటములు నేలవాలినట్లు పదములిడుచు గన్నయ్య అన్నాంబికను సమీపించి ఆమె కన్నుల వస్త్రము విప్పుచుండగా. అన్నాంబిక దొరికావు అక్కా ! అని ఒక్కగంతున లేచి. గన్నారెడ్డిని కౌగలించుకొన్నది. ఇంతలో కళ్ళకుగట్టిన చీనాంబరము ఊడి క్రిందపడినది. కౌగలించుకొన్నది రుద్రాంబికాదేవిని కాదు.

అసీగాక గన్నయ్య పడపోయిన ఆ యువతిని గట్టిగా హృదయానికి అదుముకొన్నాడు. అప్పు డామె 'ఎవరు ?' అంటూ కళ్ళుతెరచి చూచింది. ఆమె మోము ఎఱ్ఱకలువపూవులా కెంపువారింది.

ఏకారణంవల్లనో ఇరువురు కౌగిలి వదలరు. ఇరువురూ త్రపాపూర్ణు లవుతారు. తాను కౌగిలి విడిచిన రెండవవా రేమనుకొందురో అని ఇరువురూ అనుకొని ఇరువురూ సెలవులువార నవ్వుకొన్నారు.

ఇరువురూ కౌగిళ్ళు వదిలారు. అన్నాంబిక 'చక్రవర్తి !' అని కాకలీస్వనంతో పలికి లోనికి పారిపోయినది. గన్నయ్య ఉలికిపడి ఇటునటుచూచి 'దొంగ విశాలాక్షప్రభూ !' అంటూ అన్నాంబికవెంట పరుగిడినాడు. అన్నాంబిక తూలి ఒక పూపొదపై పడిపోయినది. గన్నయ్య అక్కడకువచ్చి ' దెబ్బ తగిలినదా !' అంటూ ఆమెను తనచేతులలోకి పూలచెండులా ఎత్తి హృదయాని కదుముకొని,

"మహారాణీ ! ఇన్నియుగాలు నిన్ను విడిచి ఉన్న నాదోషము నువ్వు క్షమించలేవా ?" అని పెదవులు వణక పలికినాడు.